## ఇందులో ...

## జి.వి. కృష్ణరావు రచనలు

| | | |
|---|---|---|
| ఒకటో సంపుటం | : | సాహిత్య విమర్శ (కావ్యజగత్తు, ఇతర వ్యాసాలు) |
| రెండో సంపుటం | : | **Studies in Kalapurnodayam** |
| మూడో సంపుటం | : | నవలలు : పాపికొండలు |
| నాలుగో సంపుటం | : | నవలలు : కీలుబొమ్మలు, జఘనసుందరి, రాగరేఖలు |
| ఐదో సంపుటం | : | నాటికలు – నాటకాలు (ఆదర్శ శిఖరాలు, ప్రతిమ, బొమ్మ ఏడ్చింది.) |
| ఆరో సంపుటం | : | పద్యాలు, కథలు, ఇతరాలు |
| ఏడో సంపుటం | : | తాత్త్వికం – విగ్రహ వ్యావర్తని, ప్లేటో, కాంట్ ఇతర తాత్త్విక వ్యాసాలు |

# నవతోరణం

## (ఇతర సాహిత్యవ్యాసాలు)

జి. వి. కృష్ణరావు

సంపాదకుడు
అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

A GIFT FROM A DAUGHTER
IN MEMORY OF HER FATHER, THE WRITER

ప్రభాస పబ్లికేషన్స్
బోస్‌రోడ్ - తెనాలి

నవతోరణం
(ఇతర సాహిత్య వ్యాసాలు)



ప్రభాస పబ్లికేషన్స్
బోస్‌రోడ్ - తెనాలి

ద్వితీయ ముద్రణ : జనవరి - 1999

వెల : రూ - 100/-

ప్రతులకు : పల్లవి పబ్లికేషన్స్
దుర్గయ్య వీధి, గవర్నరుపేట,
విజయవాడ - 520 002

గ్రాఫిక్స్ & ప్రింటర్స్ : కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్.
ఆర్. టి. సి. క్రాస్‌రోడ్స్, ముషీరాబాద్
హైదరాబాద్ - 500 020

# సంపాదకుని మాట

ఒక రచయిత తన రచనల ద్వారానే ఎల్లకాలం సజీవంగా జనాళిలో ఉండగలడు. అదెప్పుడు? ఆయన రచనలో గ్రంథరూపంలోనో, మరో రూపంలోనో అందుబాటులో ఉన్నప్పుడే. కాని దురదృష్టవశాత్తు కృష్ణరావుగారి రచనలు చాలా కాలంగా లభ్యంకావడం లేదు. ఆయన సాహిత్యం మీద పరిశోధనలు చేసే వారంతా, నేను ఆయనకు సన్నిహిత మిత్రుణ్ణి కావడంతో, నన్ను కలిసి, ఆయనను గురించి, వారి గ్రంథాలు లభ్యమయ్యే విధం గురించి అడుగుతూ ఉంటారు. గ్రంథాలు లేక పోవడంతో నేనూ వారికి ఏమి చేయలేని వాడినయ్యాను.

కృష్ణరావుగారి కొమరితలిద్దరూ – ఉమాదేవి, శోభాదేవి – ఎప్పుడు అమెరికానుంచి తెనాలి వచ్చినా, వారిదగ్గర వారి తండ్రిగారి గ్రంథాల ప్రచురణ గురించి ఈ అవసరంతో ప్రస్తావిస్తూ ఉండేవాణ్ణి. వారు ఎప్పుడూ సుముఖతనే వ్యక్తం చేశారు. కాని అది కార్యం రూపం ఆమధ్య జనవరి **1998**న వారు తెనాలి వచ్చినప్పుడు, దాల్చింది. ప్రచురణ బాధ్యతలు నేను స్వీకరిస్తానంటే వారు 'సరే' అన్నారు. నేను దానికి, కృష్ణరావుగారిమీద నాకున్న ఎనలేని గౌరవాభిమానాలను పురస్కరించుకొని, వెంటనే అంగీకరించాను.

ఈ కార్యంలో నేను చాలా మందికి కృతజ్ఞతలు చెప్పుకోవలసి ఉంది.

తొలుదొల్తగా, తమ అమూల్యమైన సలహాలిచ్చి, జి.వి.కె.ని స్థూలంగా పరిచయంచేసే వ్యాసాన్ని వ్రాసి ఇచ్చిన హితశ్రీ గారికి, కృష్ణరావుగారి గ్రంథాలనూ, వ్యాసాలనూ, అందించిన విజయవాడ సిద్ధార్థ సైన్స్ అండ ఆర్ట్స్ కాలేజి సిద్ధార్థ కళాపీఠం సంచాలకులు నాగళ్ళ గురుప్రసాద రావుగారికి, అలాగే డి.టి.పి. ప్రింటింగ్, ప్రూఫ్ రీడింగ్ విషయాలలో అడుగడుగునా నాకు కుడిభుజమై నిలిచిన సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్న ప్రముఖ సాహితీ విమర్శకులు బి. తిరుపతిరావుగారికి, జి.వి. కృష్ణరావుపై పరిశోధన చేసి. పిహెచ్.డి. పొందిన, తెలుగు అకాడమీ లో పనిచేస్తున్న, మాణిక్య లక్ష్మిగారు కృష్ణరావు గారి వివిధ రచనల కాలాలను తెలియ జేశారు – వారికి, గ్రంథాకృతిని గురించి సలహాలు ఇచ్చిన డా. పి.వి. రమణ గారికి, గ్రంథ సేకరణలో అత్యంతంగా సహాయసహకారాలందించిన డా. వెలగా వెంకటప్పయ్య గారికి, అందంగా ముద్రించి ఇచ్చిన కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్ హైదరాబాద్ వారికి నేను హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

– సంపాదకుడు

# ప్రకాశకుల మాట

మా నాన్నగారు జీవించి ఉన్నప్పుడే ఆయన రచనలకు మలికూర్పు రాక పోవడం వల్ల అవి దొరకడం దుర్లభంగా ఉండేది. ఆయనమీద పరిశోధనలు సాగించేవారు గ్రంథాలు దొరకక చాల ఇబ్బందులకు గురయ్యారు. ఏ హితశ్రీగారో, రెడ్డిగారో తమ వద్ద ఉన్న మానాన్నగారి రచనలను వారికి ఇచ్చి వారి అవసరాలు తీర్చేవారు ఆవిధంగా వారి దగ్గర కూడా గ్రంథాలు లేకుండా పోయాయి.

తరువాత మానాన్నగారు గతించి నప్పటినుంచి, ఆయన రచనలన్నీ ఒకమారు అచ్చొత్తించాలని రెడ్డిగారు మాకు సూచిస్తూనే ఉన్నారు. మాకూ అదే తలంపు ఉంది. చూస్తుండగానే చాలకాలం గడిచింది.

**1998** జనవరిలో మేము భారతదేశానికి వచ్చినప్పుడు శ్రీఅన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి గారు మళ్ళీ ఆప్రస్తావన తీసుకొచ్చారు. మేము 'సరే' అన్నాం. రెడ్డిగారిని అచ్చుపని చూడవలసిందిగా అభ్యర్థించాం. వారికి మానాన్నగారితో ఉన్న స్నేహ సంబంధాలను పురస్కరించుకొని, సంతోషంతో 'సరే' అన్నారు. ఎంతో శ్రమించి, ఎక్కడెక్కడో వెతికి, దొరకని రచనలను దొరికించుకొని, ఏడు సంపుటాలలో ముద్రణా నిర్వహణను విజయవంతంగా నిర్వహించినందుకు వారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

అలాగే ఈ గ్రంధాలు వెలికి రావడంలో చేయూతనిచ్చిన వారందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

జి. ఉమాదేవి.<br>
జి. శోభాదేవి.

# జీవితం, రచనలు

– హితశ్రీ

ఒక రచయితను అంచనా వేయడానికి, అతడు నిశ్వసించింది ఉచ్ఛ్వసించింది ఏమిటో తెలియాలి. అతడు నిశ్వసించింది – అతడు చదివిన చదువు, పొందిన శిక్షణ. అతడు ఉచ్ఛ్వసించింది అతడు కావించిన సృష్టి, రాసిన రాతలు

ఆయన ఎంతో చదివారు. చదవక రాయడం కుదిరేపనికాదు. ప్రాక్పశ్చిమ రససిద్ధాంతాలను, సాహిత్యాన్ని, దర్శనాలను లోతుగా చదివారు.

ప్రాక్పశ్చిమ రస సిద్ధాంతాలను ఆస్వాదించారు. అంటే అటు అరిస్టటిల్ కావ్యాను శాసనం, ప్లేటో రామణీయకతనుంచి కాంట్ పరతత్వవాదం వరకు, ఇటు భరతుని నాట్య శాస్త్రంతో మొదలెట్టి భామహ, ఉద్భట, బట్టనాయక, భట్టలోల్లట, ఆనందవర్ధన, ఇందు రాజ, అభినవగుప్త, క్షేమేంద్ర, మహిమభట్ట, మమ్మటుల దాకా భారతీయ రస సిద్ధాంతాలను ఔపోశన పట్టారు.

అర్ధరాహిత్య రంగస్థలిని (Theatre of the Absurd) అర్థం చేసుకొన్నారు. ''సప్తభంగుల అస్పష్టత'' (Seven Types of Ambignity) లోని స్పష్టతను ఎరిగారు. పాక్పశ్చిమ దర్శనాలను మధించారు. ఆర్య నాగార్జును నిసాపేక్ష వాదంలో జెనో "Flying arrow is at rest" (ఎగురుతున్న బాణం నిశ్చల స్థితిలో ఉంది) ను చూశారు.

మార్క్సు గతి తర్కం గతిని పరిశీలించి యన్ యమ్ రాయ్ మానవత్వాన్ని (Humanness) గుర్తించారు.

మార్క్సు, హెగెల్‌ల వ్యవస్థలలో (దర్శనాలలో) వ్యక్తిలుప్తమైనాడని, సార్త్ర్ అస్తిత్వంలోని మనిషి అస్తిత్వ వేదనను పట్టుకొన్నారు. ఫ్రాయిడ్ స్వప్న శిల్పాన్ని భారతీయ ధ్వని సిద్ధాంతంతో ముడిపెట్టారు. ప్రవర్తన వాదాన్ని, గెస్టాల్ట్ సిద్ధాంతాన్ని సాహిత్యానికి అన్వయించారు.

ఇదీ క్లుప్తంగా ఆయన విస్తృత కాన్వాస్. దీని మీద ఆయన ఉలితో ఉల్లేఖించారు.

సాహితీ మేరువు డాక్టర్ జీ.వి. కృష్ణరావు పూర్తిపేరు గవిని వెంకటకృష్ణరావు. వారి స్వస్థలం తెనాలి తాలూకా కూచిపూడి గ్రామం. నివాసస్థలం తెనాలి. వారు కూచిపూడిలో 1914లో జన్మించారు. వ్యవసాయ కుటుంబం. తురుమెళ్ళ, కొల్లూరు హైస్కూళ్ళలో పాఠశాల విద్య అభ్యసించారు. యస్. యస్. ఎల్. సి నాటికే ఒక చిన్న నవల, ఒక శతకం రచించారు. గుంటూరు. ఏ.సి. కాలేజిలో బి.ఏ. వరకు చదివారు. కాలేజిలో చదివేరోజుల్లోనే ''వరూధిని''

ఖండకావ్యం రచించారు. 1937లో బి. ఏ. డిగ్రీ పొందారు. గుంటూరులో పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారి దగ్గర సంస్కృతం చదువుకొన్నారు.

తెనాలి ఆ రోజుల్లో ఒక సాహితీకేంద్రం. చక్రపాణి, కొడవటిగంటి కుటుంబరావు, త్రిపురనేని గోపీచంద్ మొదలైన రచయితలెందరో తెనాలిలో ఉండేవారు. వారితో కృష్ణరావుకి పరిచయం ఏర్పడింది. సాహిత్యచర్చలు జరుగుతుండేవి. గోపీచంద్ సాంగత్యం వల్ల కృష్ణరావుకి పాశ్చాత్య సాహిత్యాభిలాష, ఎం. ఎన్. రాయ్ రచనలపట్ల ఆకర్షణ, మార్క్సిస్ట్ దృక్పథం అలవడ్డాయి. కొన్నికథలు, నాటికలు రాశారు.

డిగ్రీ అందిన తరువాత కృష్ణరావుకి నిరుద్యోగం ఎదురైంది. నిరాశా నిస్పృహల అనుభవాలతో ''భిక్షాపాత్ర'' నాటిక రాశారు. ఇతివృత్తం కాశీనుంచి వ్యాస నిష్కాసనం. మార్క్సిస్టు దృక్పథంతో రాసిన ఈ నాటిక పదహారు భారతీయ భాషల్లోకి అనువదింపబడి ఆకాశవాణి నుంచి ప్రసారితమైంది. నిరుద్యోగంతో విసుగెత్తి కృష్ణరావు బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. ఇంగ్లీషు లిటరేచర్‌లో చేరారు. ఆంగ్ల సాహిత్యాధ్యయనంలో మునిగి తేలారు. ఎం. ఏ. చదువుతున్న రోజుల్లోనే ''కావ్య జగత్తు'' సాహిత్య విమర్శనా గ్రంథం రచించారు. దేశ కాల పరిస్థితుల్ని అనుసరించి కావ్యాల్లో వస్తువు రూపం ఎలా మార్పు చెందుతుందో ఇందులో మార్క్సిస్టు దృక్పథంతో వివరించారు. ఇది చాలా ప్రసిద్ధమై విశ్వవిద్యాలయాల్లో పాఠ్యపుస్తకమైంది. పరిస్థితులు అనుకూలించక కృష్ణరావు ఎం. ఏ. పరీక్షలు రాయకుండానే 1941లో తిరిగి వచ్చారు.

కాశీ నుంచి తిరిగి వచ్చింతరువాత కృష్ణరావు జర్నలిజంలోకి అడుగు పెట్టారు. కొంతకాలం మిత్రులతో కలిసి ఓ ప్రెస్, ఓ ఫర్నీచర్ షాపు నడిపారు. అవేవీ విజయవంతం కాలేదు. ఇంతలో ''ఆంధ్రప్రభ''లో సబ్ ఎడిటర్ పదవి లభించింది. నార్ల, శ్రీశ్రీలతో పాటు '' ఆంధ్ర ప్రభ'' సంపాదక వర్గంలో పనిచేశారు. ఆ కాలంలో ''జఘనసుందరి'' నవల రాశారు. ఇది ఫ్రాయిడ్ సిద్ధాంతాల్ని తార్కికంగా బేరీజు వేసే ప్రసిద్ధ నవల. ఆ తరవాత సంపాదకవర్గ నిర్ణయానుసారం కృష్ణరావు ''ఆంధ్రప్రభ'' నుండి వైదొలగారు. దేశాభిమాని, విజయప్రభ పత్రికల్లో కొంత కాలం పని చేసి విరమించుకొన్నారు.

పత్రికారంగానికి ఉద్వాసన పలికి కృష్ణరావు పిహెచ్.డి. డిగ్రీ కోసం మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోధనకు పూనుకొన్నారు. పింగళి సూరన ''కళాపూర్ణోదయం'' వారి దృష్టిని ఆకట్టుకొంది "Studies in Kalapoornodayam" అనే ఆంగ్ల గ్రంథాన్ని డాక్టరేట్ కోసం రాయాలని సంకల్పించి ఆ పరిశోధనలో నిమగ్నులయ్యారు. ఈలోగా వారికి వ్యక్తి స్వాతంత్ర్యం మీద జిజ్ఞాస కలిగి తత్వ శాస్త్ర గ్రంథాల్ని తిరిగేశారు. జేగంటలు–కాంట్ పరతత్వవాదం, ప్లేటో–ప్రచురించారు. తాత్విక చింతన స్వంతంత్ర విచారానికి దారి తీసింది.

తత్ఫలితమే 1951లో ''కీలుబొమ్మలు'' నవలా రచన. ఇది కృష్ణరావుకి ఎంతో పేరు తెచ్చిపెట్టిన విఖ్యాత నవల. ఇటీవల ఇది ఆంగ్లంలోకి అనువదించబడి మాక్మిలన్ కంపెనీచే ప్రచురింపబడింది. వ్యక్తిలో కర్తవ్య జిజ్ఞాసని రేకెత్తించటమే ఈ నవల లక్ష్యం.

అప్పుడప్పుడు రాసిన నాటికల్ని గుదిగుచ్చి ''ఆదర్శ శిఖరాలు.'' నాటికల సంపుటి ప్రచురించారు. ఇది విలువల కాణాచి.

మద్రాసు విశ్వవిద్యాలయం “Studies in Kalapurnodayam” ఆంగ్ల వ్యాసానికి కృష్ణరావుకి 1955లో పిహెచ్. డి డిగ్రీ ప్రధానం చేసింది. ''కళాపూర్ణోదయం''లో కళ ఎలా పూర్ణోదయం చెందిందో ఈ గ్రంధంలో కృష్ణరావు పింగళి సూరనని ప్రపంచ కవుల సరసన నిలబెట్టారు. 1952లో కృష్ణరావు తెనాలిలో వి.యస్.ఆర్ కాలేజిలో అధ్యాపకునిగా చేరారు. ఈ రోజుల్లో మాధ్యమిక వాదంలో కుతూహలం కలిగి ఆర్యనాగార్జుని గ్రంధాలను కొన్నిటిని పద్యాలుగా అనువదించారు. అవి పోయాయి. ''విగ్రహవ్యావర్తని'' నిమాత్రం తిరిగి అనువదించి విపుల భూమికతో ప్రచురించారు. కేంద్ర సాహిత్య అకాడమీ తరుపున ప్లేటో 'రిపబ్లిక్' గ్రంధాన్ని ''ఆదర్శరాజ్యం'' పేరుతో తెలుగు చేశారు. ''రాగరేఖలు'' నవలరాశారు.

1962లో పరిస్థితులతో రాజీపడలేక కాలేజి ఉద్యోగానికి తిలోదకమిచ్చారు. మళ్ళీ నిరుద్యోగం. ఈ సమయంలో ''పాపికొండలు'' నవల ప్రారంభించారు. అది దిన పత్రికలో సీరియల్‌గా వచ్చింది. అధికారం మనుషుల్ని ఎలా మత్తుల్ని చేస్తుందో వివరించటం ఈ నవల ఇతివృత్తం. ఇందులో కృష్ణరావు తన ఆలోచనా రీతులను వ్యంగ్య వైభవంతో నిక్షేపించారు. ఇది ఒక రసగంగ. స్వల్ప కాలం పొన్నూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపల్‌గా పనిచేసి, కృష్ణరావు 1963లో ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంలో స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసర్‌గా పదవి నధిష్టించారు. ఈసారి మాత్రం 1973లో పదవీ విరమణచేసేవరకు ఉద్యోగంలో కొనసాగారు. రేడియో ఉద్యోగంలో ఉన్ననాడే భాస మహాకవి సంస్కృత నాటకం ప్రతిమ నాటకాన్ని తెలుగు చేశారు. కొన్ని కవితలు, కధలు, సాహిత్య వ్యాసాలు చేర్చి ''ఉద బిందువులు'' సంపుటి ప్రచురించారు.

రేడియో ఉద్యోగంతో కుంటుపడిన ''పాపికొండలు'' రచన కృష్ణరావు అనారోగ్య కారణాలవల్ల అర్థంతరంగా ఆగిపోయింది. ఇది తెలుగువారి దురదృష్టం. 1979లో ''బొమ్మ ఏడ్చింది'' నాటకం వెలువడింది. ఇది ఆర్యనాగార్జునునికీ, అప్పటి పాలకుడు గౌతమీ పుత్ర శాతకర్ణి, అతని తల్లి గౌతమీ బాలశ్రీకి సంబంధించిన ఇతివృత్తంతో రాసిన నాటకం.. రాజ్యపాలకులు మత నిరపేక్షంగా రాజ్యం చేయాలని ఇందులో సందేశం.

తెనాలిలోని శ్రీ అరవింద సాహిత్య సేవా సమితి ఆధ్వర్యంలో డాక్టర్ జి.వి. కృష్ణరావుకి తెనాలిలో మార్చి 30, 1979 తేదీన అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారి అధ్యక్షతన ఘన సన్మానం కన్నుల పండువగా జరిగింది. తరవాత వారు ఎక్కువ కాలం జీవించలేదు. కృష్ణరావు ఆగష్టు 23, 1979 తేదీన తుది శ్వాస విడిచారు.

## రచనల వైశిష్ట్యం

కృష్ణరావు సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషల్లో విద్వాంసులు. ఆయా భాషా సాహిత్యాల్లో నిష్ణాతులు. వ్యాకరణ సూత్రాల్ని, అలంకార శాస్త్రాన్ని లోతుగా తరచి ఆకళింపు చేసుకొన్నవారు. ప్రాచ్య పాశ్చాత్య తత్వ శాస్త్రాల్ని మధించిన వారు. సామాజిక, రాజకీయనైతిక, మనోవైజ్ఞానిక శాస్త్రాల్ని అవలోడించిన వారు. ప్రాక్ పశ్చిమ దేశాల విభిన్న సంస్కృతుల్ని అవగాహన చేసుకొన్నవారు. అనన్య ప్రతిభావ్యుత్పత్తులతో, బహుముఖ పరిజ్ఞానంతో, సునిశిత ఆలోచనలతో కృష్ణరావు ఉత్తమ కవితల్ని, నాటక నాటికల్నీ, కధల్నీ, నవలల్ని, సాహిత్య విమర్శనా వ్యాసాల్నీ రచించి తమ సాహితీ చైత్ర రధాన్ని 1963 శోభాయమానం చేశారు. ఆ పూదోట సర్వాంగ సుందరం, పరిమళభరితం.

కృష్ణరావు జీవితాన్ని, రచనల్ని పరిశీలిస్తే వారి జీవితంలో, రచనల్లో అంతర్వాహినిగా భారతీయత ప్రవహించటం గోచరిస్తుంది. ఎర్రగా, సన్నగా, పొడుగ్గా, గరుడనాసికతో, తీక్షణమయిన కనుదోయితో ఎప్పుడూ తెల్లని లాల్చీ, గ్లాస్కో ధోవతి ధరించి అచ్చం భారతీయుడుగా, ఆంధ్రుడుగా కృష్ణరావు కనపడేవారు. వివిధ సంస్కృతుల్ని పరిశీలించి వారు చివరకి భారతీయ సంస్కృతి వైపే మొగ్గు చూపారు. ఆంగ్లంతో పాటు సంస్కృతాంధ్రాలను చక్కగా చదువుకొన్నారు. ప్రాచీన సంస్కృతాంధ్ర కవుల రచనల్ని సమీకరించారు. మన సామాన్య ప్రజానీకం విలువలన్ని రామాయణ భారతాల నుంచి వారసత్వంగా వచ్చినవేనని అభిభాషించారు. అలంకార శాస్త్రంలో భారతీయ ధ్వని సిద్ధాంతమే పరమ శిరోధార్యంగా భావించారు. వారినాటికల్లో అనేకం భారతీయ సాంస్కృతిక ఇతివృత్తంలో కలవే. నాగార్జున మాధ్యమిక వాదాన్ని అభిమానించారు. భాస ప్రతిమ నాటకాన్ని అనువదించారు. కళాపూర్ణోదయం మీద థీసిస్ రాశారు. సృజనాత్మకరచన సద్యః పర నిర్వృతి నివ్వాలని భారతీయ లాక్షణికులతో ఏకీభవించారు. అయితే భారతీయమంతా ఆమోదయోగ్యమని కృష్ణరావు భావించేవాడు. ఏ విషయాన్నయినా కార్యకారణాలతో తర్కించి నిగ్గు తేల్చే హేతువాది కృష్ణరావు. తన పరీక్షకి నిలబడిన వాటినే స్వీకరించారు. మొదట మార్క్సిస్టు ప్రభావానికి లోనయ్యారు. త్వరలోనే ఆ ప్రభావంనుంచి బయట పడ్డారు. ''డమడమాలబండి'' నాటిక వారి కనువిప్పుకి రూపకల్పన. వ్యష్టిలో సమిష్టినీ, సమిష్టిలో వ్యష్టిని గుర్తించినప్పుడే ఏ రాజకీయ

వ్యవస్థ అయినా అభ్యుదయం సాధిస్తుందని కృష్ణరావు భావించారు. లేకపోతే అది వట్టి నినాదాల డమడమాలబండే. అలాగే ''కార్యజగత్తు''లోని మార్క్సిస్టు దృష్టిమారి వారి సాహిత్య విమర్శనా ప్రతిభ కళాపూర్ణోదయ సిద్ధాంత గ్రంథంలో వెల్లి విరుస్తుంది.

కృష్ణరావు ఆదర్శం ధర్మం. ఆశయం వ్యక్తి స్వాతంత్ర్యం. ''ధర్మం'' ధర్మం కోసమే, ఆధర్మమే మానవ జీవితం అంటారు కృష్ణరావు ''కీలుబొమ్మలు'' నవలలో. ధర్మానుష్ఠానంలోనే ఆనందం ఉన్నదనుకొని చేసినప్పుడే వ్యక్తికీ, తద్వారా సమాజానికీ అభ్యుదయం సిద్ధిస్తుందని కృష్ణరావు విశ్వాసం. వ్యక్తులకి స్వతంత్ర విచారం ఉండాలి. వ్యక్తికి అంతఃకరణం ఉంటుంది. అది వివేక చోదితం. పరిస్థితులు చుట్టు ముట్టినప్పుడు ప్రతి వ్యక్తీ స్వతంత్రాలోచనతో తన అంతఃకరణం సాక్షిగా ప్రవర్తించి తన ధర్మాన్ని తాను నిర్వర్తించాలి. లేనినాడు అధర్మం ప్రవర్తిల్లి సమాజం సంక్షోభం చెందుతుంది. ఇదే ''కీలుబొమ్మలు'' నవల సందేశం. అంతేకాని వ్యక్తులు పరిస్థితుల కీలుబొమ్మలని కాదు. వ్యక్తి ధర్మం లుప్తమై తేనే దేశం శప్తమవుతుంది. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఉద్దీప్తం చేయటం రచయిత బాధ్యత అని కృష్ణరావు తలచారు. ఈ వ్యక్తి స్వాతంత్ర్య చేతనే ''పాపికొండలు'' నవలలో మరింత స్పష్టమవుతుంది. ఇందులోని కొన్ని పాత్రలు పరిస్థితులకు ఎదురునిలచి తాము నమ్మిన ధర్మాన్ని అనుసరించి తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొంటాయి. ''బొమ్మ ఏడ్చింది'' నాటకంలో ఆర్య నాగుర్జునల పాత్ర అలాంటిదే.

కృష్ణరావు దృష్టిలో జీవితం, కళా వేరువేరు కావు. అవి రెండూ ఒకటే. జీవిత ప్రవాహానికి ఆద్యంతాలు లేవు. అది అనంతం. దాన్ని అర్థం చేసుకోటానికి ఉపకరించే ఆద్యంత సహిత జీవిత శకలమే కళ – అంటారు వారు.

కళాత్మకమైన రచన జీవితపు విలువల్ని నిర్దేశించి వెలుగునివ్వాలని కృష్ణరావు తాత్పర్యం. విలువ అంటే ఏ వస్తువులో నయినా మన మెప్పుకి పాత్రమైన గుణం.జీవితపు విలువలనేకం. వాటిని ఆర్థిక, నైతిక, సామాజిక, తాత్విక విలువలుగా వర్గీకరించవచ్చు. విలువలకి ఆధిక్యతా క్రమం ఉంటుంది. తాత్విక విలువలు పై విలువ లైతే ఆర్థిక విలువలు కిందివి. సామాజిక నైతిక విలువలది మధ్యస్థానం. భారతీయ సంస్కృతి తాత్విక విలువల్ని జీవిత ధ్యేయాలుగా ఆదరించి జీవితావశ్యకాలైనా ఆర్థిక విలువల్ని విస్మరించింది. ఇది దారిద్ర్యానికి దారితీసిందనే అభియోగం ఉంది. ఇది కృష్ణరావుని కలవర పెట్టింది. డిగ్రీ పుచ్చుకొన్నతరువాత నిరుద్యోగం కర్కశ నిజమై చికాకు పరచింది వ్యాసుడు గుండెల్లోంచి పైకి వచ్చి శాపజలం అందుకొన్న దృశ్యం తళుక్కుమంది. ''భిక్షాపాత్ర'' నాటిక ఆవిర్భవించింది. అది ఆకలి పోలికేక. మార్క్సిస్టు దృక్పథంతో ఆర్థిక విలువల్ని హైలైట్ చేసిన రచన. కృష్ణరావు నిజ జీవితంలో విలువల్ని అపారంగా గౌరవించారు. నమ్మిన విలువల కోసం ఉద్యోగాల్ని తృణప్రాయంగా చూశారు. కృష్ణరావు

దృష్టిలో విలువలన్నీ సమాదరణీయాలే. వారి ''ఆదర్శ శిఖరాలు'' నాటికల సంపుటిలో నాటికలన్నీ విలువల దీప్తి రేఖలే. ఈ సంపుటిలో మొదటిది ''భిక్షాపాత్ర''. చివరిది తాత్విక విలువల్ని ప్రతిపాదించే ''ఆదర్శ శిఖరాలు''. ఇది మహాశిల్పి జక్కణచార్యుల కథ. మధ్యలో వన్ని ఇతర విలువల్ని ప్రతిపాదించేవి. ఇవన్నీ వ్యక్తి ధర్మాన్ని ప్రబోధించే విలువల వెలుగులు. ఆర్థిక, నైతిక, సామాజిక, తాత్విక విలువల సమాహారాన్ని అనుభూతిలోకి తెచ్చుకొని మానవ వ్యక్తి సంపూర్ణ సమగ్ర చరతార్థత సంతరించుకోవాలని కృష్ణరావు ధ్వని.

''బొమ్మ ఏడ్చింది'' నాటకం మతానికి విలవలకి సంబంధించిన కొన్ని మౌలిక దార్శనిక విషయాలను స్పృశిస్తుంది. మతం అంతిమ విలువ. అది కొంత వైయక్తికం, కొంత నైతికం. నైతిక విలువలూ ఒక విధంగా సామాజికాలే. అందువల్ల సామాజికస్పర్శ ఉన్న మేరకు ప్రభుత్వం మతంతో ప్రమేయం కల్పించుకోవచ్చు. ఆ పరిధిని దాటి రాజ్యం వాటి విలువలతో సంబంధం పెట్టుకోరాదు. ''బొమ్మ ఏడ్చింది'' నాటకంలో రాజు గౌతమీ పుత్రశాతకర్ణి హిందూ మతాను యాయి. బౌద్ధుల్ని బాధిస్తాడు. ఆర్య నాగార్జునల ఉపదేశం పెడచెవిని పెడతాడు. నాగార్జునులకు దేశ బహిష్కరణ శిక్ష విధిస్తాడు. ఈ అధర్మానికి బొమ్మ ఏడుస్తుంది. ఈ బొమ్మ బౌద్ధుల ఆరాధ్య దేవత షట్పారమితాదేవి. ఓ పాత్ర ద్వారా ''ఆ బొమ్మ మానవుల మనస్సుల్లో మెదిలిన నాడే లోకకళ్యాణం'' అంటారు కృష్ణరావు. ఇది ప్రస్తుత సమాజానికి అన్యాప దేశమైన కర్తవ్య బోధ.

కృష్ణరావు కొన్ని సాహిత్య వ్యాసాల్ని, సాహిత్య విమర్శనా వ్యాసాల్ని, తాత్విక వ్యాసాల్నీ రచించారు. వాటిలో వారి నిశిత మేధాశక్తి, సహేతుకత, అంతర్ దృష్టి అంతర్లీనంగా ద్యోతకమవుతుంది. కృష్ణరావు శైలి తెలుగు నుడికారపు ఇంపుసొంపులకి పట్టు కొమ్మ.

జీవితం నిరంతర స్రవంతి. సమాజం నిత్య పరిణామ శీలం గలది. వ్యక్తి యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం కలవాడు. భావజీవి. సంస్కృతి పరంపరా గతమైంది. సాహిత్యం సౌందర్య సంబంధి. సౌందర్యం వస్తుగతం, హృదయ గతం కూడా. ఇవన్నీ పరస్పర ఆశ్రితాలు. కృష్ణరావు సాహిత్యం మానవసంబంధాల్ని పరామర్శించి వాటిలోని అంతరార్థాన్ని వెలుగులోకి తెస్తూ, పాఠకుడిలో సమాధ్యవస్థ కల్పిస్తుంది. ఆనందమిస్తుంది. ఆలోచన రేకెత్తిస్తుంది. లోకకల్యాణ మార్గం సూచిస్తుంది. ఇది సహృదయ హృదయైక వేద్యం.

సుప్రాపే దేశే ఫల
భరేణ నతనవరసాల జాతోఽసి
సముద్గతే తు, జోషం
బాలై రుపలహతి సహస్వ.

# 1. చిన్నయ్య సూత్రాలు : పౌర్వాపర్యాలు

ఆంధ్ర వ్యాకరణ చరిత్రలో చిన్నయ్యసూరి కున్న స్థానం అపరిహరణీయం. తెలుగు సూత్రాలు అనగానే సూరి జ్ఞప్తికి రాకమానడు. ఆయన చూపు నిశితం. వాక్కు గంభీరము. తెలుగు భాషాసమిష్టికి దిఙ్మాత్రంగానైనా లక్షణం సమకూర్చాలని ఆయన ప్రయత్నం. ''శ్రేయః ప్రమేయ విజ్ఞాన'' మన్న తలంపుతో ఆయన లభ్యమయినంతవరకు లక్ష్య గ్రంథాలను పరిశీలించి ఆంధ్రశబ్దశాసనం, శబ్దలక్షణసంగ్రహం, పద్యాంధ్రవ్యాకరణం, సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణం, బాలవ్యాకరణం రచించాడు. ఆయన జీవిత కాలంలోనే శబ్ద లక్షణసంగ్రహం (1853), బాలవ్యాకరణం (1858) ముద్రితాలయ్యాయి.

సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణాన్ని సూరి పూర్తిచేయలేదని 1865 డిశంబరు నెల సుజనరంజనీ పత్రికలో బహుజనపల్లి సీతారామాచార్యులవారు మున్నైనవారు వ్రాశారు. ఆంధ్రశబ్దశాసనం సంగతి వారు ప్రస్తావించలేదు. అయినా వారు వినికిడిని బట్టి అలా వ్రాశారేమోనని శంకించవలసివస్తున్నది. సమగ్రమని తాము పేర్కొన్న శబ్దలక్షణసంగ్రహాన్ని గూడ వారు చూచినట్లు కనబడదు. చూచివుంటే ప్రౌఢ వ్యాకరణంలోని సర్వనామాదులు ప్రక్రియ మరొక తీరుగా వుండేది.

ఏది ఎలా ఉన్నా శబ్దలక్షణసంగ్రహం 1902 లో ద్వితీయ ముద్రణ పొందింది. 1931 లో ఆంధ్రసాహిత్యపరిషత్తువారు తొలిసారిగా ''సూత్రాంధ్ర వ్యాకరణములు'' అన్న పేర చిన్నయసూరి సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణం, ఆంధ్ర శబ్దశాసనం, పద్యాంధ్రవ్యాకరణం చేర్చి ఒక సంపుటి ప్రకటించారు.

విశ్వవిద్యాలయాలలో బాలవ్యాకరణానికి పఠనపాఠనాలు ఏర్పడి ప్రామాణ్యం ఏర్పడింది. ఇంతవరకూ పేర్కొనదగిన వ్యాఖ్యలు అయిదు వచ్చాయి. ఆంధ్ర కావ్యాల ముద్రిత పాఠాలు కొంత మారాయి. వీటిని బట్టి బాల వ్యాకరణ ప్రశస్తి ప్రభావా లెట్టివో ఊహించుకోవచ్చును.

నిజానికి బాలవ్యాకరణ హృదయం అర్థం చేసుకోవాలంటే సూరి వ్యాకృతి రచనల పౌర్వాపర్య పరిశీలనం ముఖ్యం. ఈ విషయం విమర్శకులుగాని, వ్యాఖ్యాతలుగాని అంతగా పట్టించుకొన్నట్లు కనబడదు. కాకపోతే ఒకరు సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం సూరిగారి మొదట రచననీ, చజలదంత్యతాలవ్యతానిర్దేశమూ ''ముచ్చటలు'' అన్న రూపం సాధించుకొనకపోవటం ఆంధ్రశబ్దశాసనపుటనంతర రచితత్వాన్ని చాటుతున్నదని అన్నారు. ఇంకొకరు సూరి మొదట సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణం, తరువాత ఆంధ్ర శబ్దశాసనం, ఆ తరువాత పద్యాంధ్రవ్యాకరణం, ఆ మీద శబ్దలక్షణ సంగ్రహం, కడపట బాలవ్యాకరణం వ్రాసినట్లు పేర్కొన్నారు. వేరొకరు '' అది సరికాదు. పద్యాంధ్రవ్యాకరణం 1840 నాటి రచన, సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం 1842 నాటిది, ఆంధ్రశబ్దశాసనం 1844 నాటి కృతి, శబ్దలక్షణసంగ్రహం నాల్గవ రచన, బాలవ్యాకరణం

కడపటి వ్యాకృతి'' అన్నారు. వేరొకరు రచనాకాలం ప్రస్తావించక, పద్యాంధ్రవ్యాకరణం ఆంధ్రశబ్దశాసనానికి పద్యరూపగ్రంథమనీ, సంస్కృతసూత్రాలనే సూరి శబ్దలక్షణసంగ్రహంలో అనువదించాడనీ వ్రాశారు. ఇలా తలకొకరీతిగా చెప్పినవారేకాని ఎవరూ ఈ పౌర్వాపర్య విషయాన్ని క్షోదక్షమంగా పరిశీలించి నిర్ణయించినవారు కారు.

సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం క్రీ.శ. 1842 నాటి రచన అని తత్సంజ్ఞా పరిచ్ఛేదాంతగద్య చెబుతున్నది. శబ్దలక్షణసంగ్రహం తొలికూర్పు 1853 లో వెలువడింది. ముద్రణనుబట్టి అది ఆ సంవత్సరమందే వ్రాయబడిందని అనుకోవటానికి అవకాశం లేకపోలేదు. అంతమాత్రాన అది పూర్వ రచన కారాదా అంటే అ ప్రశ్నను త్రోసివేయలేము.

ఈ విధంగా సూరి రచనాకాలంగాని, పౌర్వాపర్యాలు గాని, బాహ్యప్రమాణం వల్ల తేలటంలేదు. ఇంక అంతరంగిక విషయాలు కాలనిర్ణయానికి తోడ్పడుతవేమో పరిశీలించవలసి వుంటుంది.

సూరి ప్రకృత రచనలన్నీ వ్యాకృతులు, వీటిముందు వెనుకల నిశ్చితికి విషయ విభాగమూ, ప్రతిపాదితార్థాలూ, వాటిని చెప్పే తీరుతెన్నులూ ఎంతైనా తోడ్పడుతవి.

ఏ వ్యాకరణమైనా భాషాతత్వాన్ని పురస్కరించుకొని సంప్రదాయ క్షుణ్ణమార్గాన బయలుదేరుతుంది. ప్రకృతి ప్రత్యయవివేచనంతో సాధుశబ్దనిర్దేశనమే వ్యాకరణ లక్ష్యమైతే తద్విషయ విభాగం ప్రత్యయం మీద ఆధారపడక తప్పదు. ఈ ప్రత్యయం ఆరు విధాలంటారు. (1) సుప్రత్యయం, (2) తిఙ్ప్రత్యయం, (3) కృత్ప్రత్యయం (4) తద్ధిత ప్రత్యయం (5) ధాతు ప్రత్యయం (6) స్త్రీ ప్రత్యయం. తెలుగు ధాతు ప్రత్యయం, స్త్రీ ప్రత్యయం లేనట్లే లెక్క. ఈ పక్షాన సంజ్ఞ, సంధి, సుబంతం, తద్ధితాంతం, తిఙంతం, కృదంతం అన్న విభాగం తెలుగు సముచితమే అవుతుంది.

కాని సూరి నాటికి నెలకొనివున్న వ్యాకృతులు–అంటే ఆంధ్ర శబ్దచింతామణి, వికృతివివేకం ఈ మార్గం అనుసరించలేదు. దీనికి కారణం ఉన్నది. కృత్ప్రత్యయాలను అవి నిర్దేశించి చెప్పక ''యథాశాస్త్రం, యథాశక్తి, యథాశ్రోత్రానురంజనం, యథా ప్రసిద్ధి '' గా పొమ్మన్నవి. ఇంక తద్ధిత విషయాలలో తన, క, కా, కత్తియ, ఈ, ఆ, ఆడి, ఎఁడు, ఏసి, బంటి, కొలది, గారు, వారు, అయి, ఇ అన్న వర్ణ కాలను మాత్రమే పేర్కొన్నది. వీటి కోసం ప్రత్యేక పరిచ్ఛేదం అనావశ్యకం, ఈ పక్షాన నాలుగు పరిచ్ఛేదాలలో తెలుగు వ్యాకరణం వ్రాయవచ్చు. కాని ఏ కారణం వల్లనో చింతామణి వికృతి వివేకాలు శబ్దపరిచ్ఛేదాన్ని అజంతపరిచ్ఛేదం, హలంతపరిచ్ఛేదం అని రెండుగా విభజించి, సంజ్ఞ, సంధి, అజంతము, హలంతము, క్రియ అన్న అయిదు పరిచ్ఛేదాలను స్వీకరించాయి. వీటి రచనాకాలానికి సిద్ధాంతకౌముది ప్రచారంలో ఉంటే ఈ పరిచ్ఛేదం మరొక రీతిగా ఉండేదేమో. అయినా యిది ఊహాగానం ; విశేషించి అప్రస్తుతం.

సంస్కృత ప్రాకృత వ్యాకరణాలలో పుట్టి పెరిగిన సూరిని తెలుగు వ్యాకృతులలో చింతామణి వికృతి వివేకాలు విశేషంగా ఆకర్షించుట వింత కాదు. ఆ రెండు కృతులూ నన్నయ్యాథర్వణీయాలని

అతని గాఢవిశ్వాసం. అయినా సంస్కృత వ్యాకరణ వాసనవల్ల అతని వివేచనాశక్తి జాగృతంగానే ఉన్నది కాని భక్తితో వివశమైపోలేదు. కనుకనే పంచ పరిచ్ఛేద పద్ధతిని మొదట అతడు స్వీకరించినా అజంత హలంత విభాగం సముచితం కాదన్న దృష్టితో రెంటినీ కలిపి శబ్ద పరిచ్ఛేదంగా చేసి అదనంగా ప్రకీర్ణకపరిచ్ఛేదం కల్పించుకున్నాడు.

ఈ పంచ పరిచ్ఛేదపూర్వకరచనావిధానానికి మరొకటి గూడా కారణం కావచ్చు. తెలుగు లక్ష్యలక్షణగ్రంథాలను పరిశీలించి వ్యాకృతి రచనకు దిగేనాటికి సూరి కృత్తద్ధితప్రత్యయాలను విశేషంగా సంపాదించివుండకపోవచ్చును.

ఏది ఎలావున్నా అతని రచనలలో పంచపరిచ్ఛేదులు మొదటి రచనలనీ, తతోధికపరిచ్ఛేదులు తరువాత రచనలనీ ఊహించవచ్చును.

ఈ దృష్టితో చూచినపుడు ఆంధ్రశబ్దశాసనం, శబ్ద లక్షణసంగ్రహం తొలి రచనలు కావాలి. ఎందుకంటే సంజ్ఞ, సంధి, శబ్దపరిచ్ఛేదంలో కడపటి భాగం, ప్రకీర్ణకం, తుదిపాలు లోపించిన క్రియాపరిచ్ఛేదం శబ్దశాసనంలో కనిపిస్తున్నవి. వీనికితోడు తద్భవలక్షణం పేర విభిన్నపరిచ్ఛేదాలకు సంబంధించిన మరికొన్ని సూత్రాలున్నవి. ఇవి వెనుకటి పరిచ్ఛేదాలకు సంబంధించినవే కాని క్రొత్తవి కావు. కనుక ఆంధ్రశబ్దశాసనం పంచ పరి చ్ఛేద పరిమితమే.

శబ్దలక్షణసంగ్రహంలో అయిదు పరిచ్ఛేదాలు సమగ్రంగా కనిపిస్తున్నవి. కనుక యీ రెండు, కృతులు తొలి రచనలు కావచ్చును. ఇంక పద్యాంధ్రవ్యాకరణ మంటేనో సంజ్ఞాపరిచ్ఛేద మొకటిమాత్రమే లభిస్తున్నది. ప్రకృతి దృష్టివల్ల దీని ముందువెనుకలు తేలవు.

ఇంక సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణంలోను, బాల వ్యాకరణంలోను ఉన్న విషయవిభాగం భిన్నం, సిద్ధాంత కౌముదిని జ్ఞప్తికి తెస్తూ బాల వ్యాకరణంలో సంజ్ఞ, సంధి, తత్సమం, ఆచ్ఛికం, కారకం, సమాసం, తద్ధితం, క్రియ, కృదంతం, ప్రకీర్ణకం అన్న పరిచ్ఛేదాలున్నవి. మనకు లభిస్తున్న సూత్రాంధ్ర వ్యాకరణం అసమగ్రంగా, వ్యత్యస్త సూత్రానుక్రమణికంగా, దోషమయంగా ఉన్నా విషయ విభాగం స్పష్టంగానే కనిపిస్తున్నది. సంజ్ఞ, సంధి, తత్సమాచ్ఛికకారకసమాసతద్ధిత పరిచ్ఛేదాలు బాలవ్యాకరణ విభాగాన్ని సూచిస్తున్నవి. కనుక ఈ రెండూ మలుదశలోని రచన అనవచ్చును.

సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం తొలి రచనయే అయితే అందలి విషయవిభాగాన్ని తన తరువాతి రచనలలో సూరి మార్చుకోవలసిన ఆవశ్యకతను వివరించవలసివుంటుంది. లేదా బాలవ్యాకరణంలోని విషయవిభజనం అసముచితమని చెప్పవలసివుంటుంది. చింతామణి వికృతివివేకాలను పరమ ప్రమాణాలనుగా భావించినవారుగూడ బాలవ్యాకరణ పరిచ్ఛేద పద్ధతి ఆమోదించారు. కనుక బాలవ్యాకృతిలోని విభజనం అసముచితం కాదు.

ఈ విషయవిభాగమేకాక ప్రతిపాదితార్థాలు గూడ సూరి రచనల కాలనిర్ణయానికి తోడ్పడుతవి. ముఖ్యంగా ద్రుతస్వరూపం, చజలదంత్యతాలవ్యతానిర్దేశం, విభక్తులు కొన్ని పదాలు, ఔపవిభక్తికాలు, కారకసామాజికవిశేషాలు, తద్ధిత ప్రత్యయాలు, సంజ్ఞలు మిక్కిలిగా ఉపకరిస్తవి.

జి. వి. కృష్ణరావు

ద్రుతస్వరూప విషయములలో చిన్నయ్యసూరి మొదట చింతామణి వికృతివివేకాల మార్గం తొక్కినవాడైనా తరువాత తరువాత తన పరిశోధన ఫలితాలనుబట్టి వ్యవస్థాలాఘవాలకోసం మరొక మార్గం త్రొక్కినట్లు కనిపిస్తున్నది.

చింతామణి 'ద్రుతాఖ్యోనః' అని సూత్రించి తరువాత 'తిజ్మధ్య శేష షష్ఠీ' అన్న సూత్రంలో కళలను చెప్పి అన్యాలు ద్రుతప్రకృతికాలని ఉపదేశిస్తున్నది. ఈ త్రోవనే 'నకారంబు ద్రుతంబు' అని ఆంధ్ర శబ్దశాసనము, శబ్దలక్షణసంగ్రహమూ పేర్కొంటున్నవి. ''పదంబు నాంతంబు ద్రుతప్రకృతికము'' అని మొదటిది సూత్రించగా ''పదంబు ద్రుతాంతంబు ద్రుతప్రకృతికంబు'' అని రెండవది చెబుతున్నది. ఈ రెండు రచనలు చింతామణివలెగాక ద్రుతప్రకృతికాలు కాని పదాలు కళలని నిర్వచిస్తున్నవి.

నకారపుపొల్లునే ద్రుతంగా స్వీకరించి శబ్దశాసనమూ, శబ్దలక్షణసంగ్రహమూ ప్రక్రియను నిర్వహిస్తున్నవి. '' ఆగామి కర్మానుబంధ తుమాద్యర్థంబుల (తుమర్థంబుల-శ.ల.సం.) ద్రుతంబు నగు'', అని ఈ రెండూ నకారపుపొల్లునే విధిస్తున్నవి. మరి బాలవ్యాకరణమో, నకారం ద్రుతమని చెప్పినా ను వర్ణాన్ని ద్రుతంగా పరిగణించి ప్రక్రియ నడుపుతున్నది. ఈ కారణం వల్లనే పై సూత్రార్థాన్ని ప్రతిపాదించవలసివచ్చినపుడు ''కలజపడుజులు పరంబగునపుడు నుగాగమం బగు. తుమర్థ భావలక్షణంబులందు నుజ యగు'' అని బాలవ్యాకరణము ఉత్వవిశిష్ట నకారం విధించుకొన్నది.

సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణం ''విభక్త్యాగమ చార్థోనుః ద్రుతః'' అన్న వ్యవస్థ కల్పించి ప్రక్రియను నిర్వహిస్తున్నది. పద్యాంధ్ర వ్యాకరణమతంలో పొల్లు నకారమే ద్రుతం.

ద్రుతకార్యాలు విధించే సందర్భాన పూర్వులు చెప్పని విషయం ఒకటి సూరి తన సూత్రాంధ్రవ్యాకరణంలో పేర్కొన్నాడు. ''నచయశ్చరి వికృతిః'' అని ''కచటతపశషస– లు గూడిన పరుషములకు సరళములు రావు'' అని నిషేధించాడు. సూత్రాంధ్రవ్యాకరణం తొలి రచనే అయితే యీ అంశాన్ని అతడు తన తక్కిన రచనలో సంగ్రహించి వుండవలసింది. కాని ఇది కనిపించుటలేదు. కనుక సూత్రాంధ్ర వ్యాకరణం శబ్ద శాసన శబ్దలక్షణసంగ్రహ పద్యాంధ్రవ్యాకరణాలకు తరువాత వచ్చిన రచన యని భావించవలసి వస్తున్నది. అయితే, ''బాలవ్యాకరణంలోగూడ ఈ విషయం ఎందుకు పేర్కొనబడలేదు?'' అన్న ప్రశ్న కలుగుతుంది. దీనికి బాల వ్యాకరణాంతమందలి పద్యార్థమే సమాధానమని భావించవలసివుంటుంది.

ఇంక చ జ–ల దంత్యతాలవ్యతలు ''అద్దంత్యస్తాలవ్యశ్చుర్వ్రక్రస్త్యాత్'' అని చింతామణి సూత్రించగా ''చ జ–ల సాంస్కృతికంబులు దంత్యంబులు, ఇ ఈ ఎ ఏ–లం గూడినవి తాలవ్యంబులు'' అని శబ్దలక్షణసంగ్రహమూ, '' ఇ ఈ ఎ ఏ–లం గూడిన చ జ–లు తాలవ్యంబులు. పెఱలు దంత్యంబులు'' అని ఆంధ్రశబ్దశాసనమూ సూత్రించి తత్సమపదాలతో దంత్య చ జ–లు లేవని పై మతాన్ని బలపరుస్తున్నవి. పద్యాంధ్ర వ్యాకరణం–

''అత్వ మాత్వ ముత్వం బూత్వ మొత్వ మోత్వ

మౌత్వ మెనసిన చ జ- లు దంత్యములు పె ఆ లు

తాలుజములు.......''

అని వ్రాసి చింతామణి పేర్కొనని సంహితా చ జ-ల ఉచ్చారణనుగూర్చి ప్రస్తావిస్తూ ''తొలియచ్చు దార్కొనంగ బహుళమగుఁ బూర్వ వృత్తంబు వడయు'' అని చెప్పింది. ఈ విషయాన్ని ''పదాదిస్వరయోగంబునం దొంటి యట్లొండెనగు'' యని శబ్దశాసనమూ, ''కొందరు పదాది స్వరయోగంబునం దొంటి యట్లుండు నం(డ్రు'' అని శబ్దలక్షణసంగ్రహమూ సంగ్రహించాయి. సూరి కడపటి రచనయైన బాలవ్యాకరణం ఈ అంశాన్ని ప్రస్తావించలేదు. దీనికి కారణం వున్నది. ఈ కారణాన్ని తరువాత పరిశీలించవచ్చును.

చింతామణి వికృతి వివేకాలు తత్సమాలలో దంత్యచజలను సంభావించలేదు. ఈమతాన్ని సూరి మొదటి రచనలైన ఆంధ్రశబ్దశాసనం, శబ్దలక్షణసంగ్రహం గౌరవించాయి. కాని పద్యాంధ్ర వ్యాకరణం

''తత్సమముల నొకానొక తావునందు

దంత్య చ జ లర్థబిందువు దనరు''

అని వ్రాస్తున్నది. బాలవ్యాకరణం ఈ విషయాన్ని వివరిస్తూ 'సంస్కృత సమంబులం దికారాంతము లయిన శబ్దముల యుపథా చ జ లు బహువచనంబు పరంబగునపుడు దంత్యములగు'. ''మఱియు రాజు శబ్దం బొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి'' అని పేర్కొన్నది. సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణం కూడ ఈవిషయమే

''రాజస్యు విభక్తౌచే:

ఇతో బహువచనే సంస్కృత సమస్యోపధాచో:

(ఇత ఉదన్తస్య ఉపధా తాలవ్యేనస్యాతామ్)''

అని ఉద్ఘోషిస్తున్నది. అంతే కాదు. ''అక్కజాదిష్యకంచంత – కాచాకు – పచ్చాక్స్యిత్యాదీనా మక్క జాదిత్వాత్పాదుత్వ మవగన్తవ్యమ్'' అని అదనంగా పేర్కొంటున్నది.

ఇంతకూ తత్సమాలలో దంత్య చ జ లను ఆమోదించే సూరి రచనలు సూరి తొలి కాన్పులో, మలి కాన్పులా? తొలి రచనలే అయితే బాలవ్యాకరణం కడపటిరచన కాజాలదు. కాని బాలవ్యాకరణం సూరి కడపటి రచన అని అందరూ ఆమోదిస్తూనే యున్నారు. కాక సూత్రాంధ్ర వ్యాకరణం, పద్యాంధ్ర వ్యాకరణం మొదటి రచనలు అంటే సూరి తొలుత భ్రమ ప్రమాదాలకు లోనై ఆ విధంగా వ్రాశాడనీ, తరువాత చింతామణి మున్నైనవాటిని చూచుకొని తన తప్పును ఆంధ్రశబ్దలక్షణ సంగ్రహాలలో దిద్దుకొన్నాడనీ చెప్పుకోవాలి. ఈ పక్షంలో తాను మొదట ప్రతిపాదించి జారవిడచిన విషయాన్ని తిరిగి బాలవ్యాకరణంలో సూరి ఎందుకు ప్రస్తావించినట్లు? ఈ ఎగుడుదిగుళ్లను వివరించాలంటే రెండే మార్గాలు (1) సూరి ఒక నిర్ణయానికి రాలేని చపల

చిప్తుడనాలి. లేదా (2) తత్సమాలలో దంత్య చ జ ఝ లేవని చెప్పే సూరి రచనలు తొలి రచనలనీ, ఉన్నవని చెప్పే రచనలు తరువాతి రచనలనీ చెప్పాలి. రెండవమార్గం సముచితమంటే, సూరి తన తొల్లిటి అభిప్రాయం ఎందుకు మార్చుకున్నాడో చెప్పాలి.

చింతామణ్యాదులు చూచి సూరి తత్సమాలలో దంత్యచజలు లేవని మొదట చెప్పాడు. కాని లక్ష్యగ్రంథాలు తిరుగ వేయగా తత్సమాలలో అలాంటివి కనిపించి వుంటవి. ఉదాహరణకు వసు చరిత్రలోని

''తలిరుఁ బ్రాయము వాని నలరాజు వలరాజు

నలరాజు దెగడు సోయగము వాని''

అన్న పాదము తీసుకోవచ్చును. ఇందు వలరాజు అన్న పదములోని జకారం దంత్యమని అందరూ ఆమోదించినదే. అప్పుడు నలరాజు అలరాజు అన్న పదాలలోని జకారం దంత్యం కావటమే కవి కభిమతమని స్పష్టపడుతున్నది. కాదంటే కవిత్వం వ్యాకరణానికి నమస్కరించి వైదొలగాలి. ఇలాగే తత్సమాలందు దంత్యాలుగా మారిన యుపధా చజలు అను ప్రాసగతాలు సూరికి కనిపించి వుండవచ్చును. అందువల్ల తత్సమాలలో అతడు దంత్య చజల స్థితిని నిర్దేశించాడు.

ఈ సందర్భాన సంధిగత చజలను గూర్చి క్రొత్తగా తాను చెప్పుకొన్న విషయాన్ని
6 బాలవ్యాకరణంలో సూరి ఎందుకు విడిచిపెట్టేడన్న ప్రశ్న వస్తుంది. పచ్చి+ ఆకు, కాచి+ ఆకు, కంచి+అంత ఇత్యాదులందు ఇత్వసంధిని బాల వ్యాకరణం విధించలేదు. ఉదంత చజలకు సంధిజరిగినపుడు పరస్పరానుగుణంగా ఉచ్చారణ ఏర్పడుతుంది. ''పదాదిస్వర యోగంబున తొంటి యట్లొండెనగు'' అని సూత్రించక వదలి నందువల్ల అనిష్టోచ్చారణకు దారి ఏర్పడదు. కాకపోతే సమ్మతమైన ఉచ్చారణ రూపం ఒకటి అసంగృహీత మవుతుంది.

ఇంక సూత్రాంధ్రవ్యాకరణంలో ఉన్న స్థితి వేరు. '' ఆ కొ'' అన్న సూత్రం సంధిని ప్రాయికంగా విధిస్తున్నది. అప్పుడుపచ్చాకు కాచాకు అన్న రూపా లేర్పడుతవి. '' పదాది స్వరయోగంబున తొంటి యట్లొండెనగు'' అన్న సూత్రాన్ని అన్వయించుకుంటే ఈ పదాలలోని చకారము అటు దంత్యమూ ఇటు తాలవ్యమూ కావలసివస్తుంది. తాలవ్యమే అర్థ స్ఫోరకమై ఆదరణీయ మౌతుందికాని దంత్యం ఆదరణీయం కాదు. అందువల్ల వేరేమార్గం తొక్కవలసివస్తుంది. దీనికై ''అక్కజాదిషు'' అన్న సూత్రం కల్పించుకొని సూరి కంచంతాదులకు తాలవ్యతను విధించాడు. అయితే మొదటనే పదాదిస్వర యోగంబున అన్న సూత్రం పరిహరించుకోవచ్చు గదా. ముందు బురదలో దిగటం తరువాత కాళ్లుకడుక్కోటం దేనికి అనవచ్చును. ''పదాది స్వరయోగంబున'' అన్న విషయం పూర్వు లెవరో చెప్పి ఉంటారు. అది సముచితమనిపించి సూరి తన మొదటి రచనలో పేర్కొన్నాడు. కాని ఆలోచించినకొలది చిక్కులు కనిపించాయి. అందుకనే పద్యాంధ్రవ్యాకరణంలో, ''బహుళముగ బూర్వ వృత్తంబు వడయు'' అని బహుళశబ్దాన్ని వాడాడు. దానివల్ల సంతృప్తి కలుగక సూత్రాంధ్రవ్యాకరణంలో మరొక మార్గం తొక్కవలసివచ్చింది. బాల వ్యాకరణానికి అవివాదాస్పదాలైన ప్రధానాంశాలు బోధించటమే లక్ష్యం కనుక అందులో ఈ ప్రస్తావన తేలేదు.

కాగా చజల దంత్యతాలవ్యతా నిర్దేశాన్ని బట్టి ఆంధ్రశబ్దశాసనమూ శబ్దలక్షణసంగ్రహమూ మొదటి రచనలనీ, ఆ తరువాత పద్యాంధ్ర వ్యాకరణమూ, దాని వెనుక సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణమూ, కడపట బాలవ్యాకరణమూ రచించబడి యుండవచ్చునన్న భావం కలుగుతున్నది.

గసడదవాదేశం విషయంలో చింతామణి ఇలా అంటున్నది:-

ప్రథమామాత్రముకంటె పరుషములకు గసడదవలగు.

తెలుగులమీది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు. ద్వంద్వమున నిత్యము.

వికృతివివేకం ఇలా సవరిస్తున్నది:-

ప్రథమమీది పరుషములకు గసడదవలు వికల్పము. తెనుగులమీది సాంస్కృతిక పరుషములకును కర్మధారయమునగాని, ప్రథమేతరముపై గాని గసడదవలు రావు.

దీనికి తోడు మరికొన్ని విషయాలను అది పేర్కొన్నది.

ఈగసడదవాదేశ విషయంలో ఆంధ్రశబ్ద శాసనం ఇలా విధిస్తున్నది:-

ప్రథమ మీది పరుషములకు గసడదవ లగు.

క్రియాపదంబుల మీదను

సంస్కృతంబులమీదనే సాంస్కృతికంబులకు కాకు సంబోధన జడావ్యయంబులపై నెల్లెడల

బహుళంబు

ప్రాసంబునందు

కర్మధారయంబునందు

ద్వంద్వంబున నిత్యంబు

మరి శబ్దలక్షణసంగ్రహమందలి సూత్రాలు:-

ప్రథమ మీది పరుషములకు గసడదవలగు.

క్రియాపదంబు మీదం బ్రాయికంబు.

పదంబు మీద ద్వంద్వంబునందు నిత్యము.

వికృతి పదంబులమీది సాంస్కృతికంబులకు గలుగవు.

ప్రాసంబుల కెల్లవానికి బహుళంబు.

సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణమందలి విధానము:-

ప్రథమామాత్రాత్పరుషాణాం బహుళం గసడదవాః

నాచ్చికా దప్రాసే సాంస్కృతికానామ్.

జడసంబోధన కాకుభ్యోవా

నిత్యంద్వంద్వే

దీర్ఘాద్బహుళమ్

జి. వి. కృష్ణరావు

వీచికాపత్రికాభ్యాం సర్వత్రోత్తరపదే

పడుగొమ్మలిత్యాదిషు నప్రతిషేధః

బాలవ్యాకరణ విధానం:–

ప్రథమమీది పరుషంబులకు గసడదవలు బహుళంబుగానగు.

తెలుగులమీది సాంస్కృతిక పరుషంబులకు గసడదవలు రావు.

ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు.

పై సూత్రాలనుబట్టి శబ్దశాసనమూ, శబ్దలక్షణసంగ్రహమూ చింతామణి వికృతివివేకాలకు సన్నిహితంగా ఉన్నవని చెప్పవచ్చును.

సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం తెలుగులమీది సాంస్కృతిక పరుషాలకు ప్రాసలోనే గసడదవాదేశ బాహుళకాన్ని గూడ పేర్కొంటే బాల వ్యాకరణం మౌనం వహించక పోగా ప్రత్యాఖ్యానిస్తున్నది. దీనికి కారణం ఒకటే. అవి క్వాచిత్కాలు. ఆక్వాచిత్కాలను బాలురకు బోధించుటలో ఔచిత్యం లేదని సూరి తాత్పర్యమైనట్లుతోస్తున్నది.

## 8 నుడి తొలి హ్రస్వంమీది ఖండ బిందువు

''నఖణ్డః ప్రథమాద్ధ్రస్వాత్'' అని వికృతివివేకం సూత్రించింది. అంటే నుడి తొలి హ్రస్వంమీద అరసున్న ఉండదన్నది. అహోబలపతి అట, ఇంక శబ్దాలలోని అర్ధానుస్వారాన్ని గమనించి సూత్రానికి వ్యాహతి పరిహరించే నిమిత్తం నుడి తొలి హ్రస్వమంటే హ్రస్వాచ్చు పరమందుగల హల్లని వ్యాఖ్యానించేడు. ఇవన్నీ చూచిన సూరికి అట, ఇక, ఇగ వంటి శబ్దాలు మరికొన్ని వుండవచ్చునేమో అన్న శంక మొదట కలిగివుంటుంది. కనుగలిగి మెలగటం మేలన్న ఉద్దేశ్యంతో ఆంధ్రశబ్దానుశాసనంలో:

హ్రస్వంబునకుమీద ఖండంబునకు బూర్ణం బొండెనగు.

ఇకాదులందు

ప్రథమంబునందు నిత్యంబు

ద్రుతంబునకు లోప ఖండంబులు గలుగవు. అనీ;

శబ్దలక్షణసంగ్రహంలో:–

(ద్రుతంబునకు లోపము) నుడి తొలి కుఱుచమీద నంతటం గలుగదు.

ఇకాదులు ద్రిక్క ఖండబిందువు లేదు.

అనీ పేర్కొన్నాడు. పద్యాంధ్రవ్యాకరణంలో అహోబలపండితీయాన్ని అనువదిస్తూ,

అట యనుకిలార్థ శబ్దంబునం దిక నిగ

నను నిత: పరార్థములగునట్టి పదము
లందు దొలి కుఱుచకుమీద నర్ధబిందు
వార్యసమ్మత మండ్రు......

అని చెప్పాడు. అటు, ఇక, చుడు శబ్దాలలోమాత్రమే తొలి హ్రస్వంమీద ఖండబిందు వుంటుందని, ఆంధ్రశబ్దశాసన శబ్దలక్షణసంగ్రహాల రచనా కాలంనాటికి సూరి తేల్చుకొని ఉంటే ''ఇకాదులదు'' అనీ. ''ఇకాదులు ద్రిక్కు'' అనీ అతడు ఆదిశబ్దం చేర్చి సూత్రం రచించి ఉండడు. సూత్ర కారునకు లాఘవం ఎంత ముఖ్యమో సమగ్రతా అంత ముఖ్యం. రెండేసి అచ్చులు గల మరి రెండుపదాలు పేర్కొనక ఆది శబ్దంతో సూత్రరచనాకుశలుడు సంగ్రహించడు. సూరి సూత్రరచనాదక్షుడని అందరూ అంగీకరించిన విషయమే. కనుక ఆంధ్రశబ్దశాసనం, శబ్దలక్షణసంగ్రహం రచించేనాటికి తొలి హ్రస్వంమీద ఖండబిందువు గల పదావళి సూరికి సమగ్రంగా తేలకపోవాలి. కనుక ఆంధ్రశబ్దశాసనం, శబ్దలక్షణసంగ్రహం, పద్యాంధ్రవ్యాకరణం తొలి రచనలని భావించవలసివస్తున్నది.

సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణంలోను, ఆ తరువాతిదయిన బాలవ్యాకరణంలోను, ''ఇకాటచుడుషు'' అనీ, 'అట యిక చుడు శబ్దంబులం దప్ప'' అనీ సూరి పేర్కొన్నాడు. కనుక సూత్రాంధ్రవ్యాకరణం తొలి రచనకాక, ఆంధ్రశబ్దశాసన శబ్దలక్షణసంగ్రహ పద్యాంధ్రవ్యాకరణాలకు తరువాతి రచన అవుతుంది. ఈ సందర్భంలో మరొక విషయం. ''ఇకాఁటచుఁడుషు'' సూత్రించిన సూరి 'అఁట యిక చుడు శబ్దంబులం దప్ప'' అని వ్రాస్తూ ''తప్ప?'' అని ప్రశ్నిస్తున్నాడు.

విభక్తుల విషయంలో సూరి వ్యాకృతులన్నీ ఒకే మార్గం అనుసరించటం లేదు. ఆంధ్రశబ్దశాసన ముద్రిత ప్రతిలో ఈ భాగం లుప్తం. పద్యాంధ్ర వ్యాకరణం సంజ్ఞాపరిచ్ఛేద పరిమితం. ఇంక మిగిలినవి శబ్దలక్షణ సంగ్రహం, సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం, బాలవ్యాకరణం. వీటిలో మొదటిదొక త్రోవ, తక్కినవి మరొక త్రోవ చిత్తగిస్తున్నవి. శబ్దలక్షణసంగ్రహం చింతామణికి సన్నిహితమై ''ని, ను, ల ద్వితీయ; కి, కు, యొక్క, లోపల షష్ఠి'' అని సూత్రించింది. సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం ''అసోను:, కు, యొక్క లోపల జమ:'' అనీ, బాలవ్యాకరణం ''నువర్ణంబు ద్వితీయ, కు, యొక్క, లోపల షష్ఠి'' అనీ పేర్కొంటున్నవి.

సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణంసూరి తొలి రచనమో, మలి రచనమో అయి, శబ్దలక్షణసంగ్రహం తదనంతర రచనమైతే మొదటి విధానాన్ని తరువాతి కృతిలో ఎందుకు మార్చుకోవలసివచ్చింది? ప్రక్రియాలాఘవమో మరొక ప్రయోజనమో అర్థించి సూరి యీ మార్పు ప్రవేశపెట్టాడంటే, తుది రచనమైన బాలవ్యాకరణంలో తిరిగి సూత్రాంధ్ర వ్యాకరణ ప్రణాలికనే ఎందుకు ఆశ్రయించవలసి వచ్చింది? శబ్దలక్షణ సంగ్రహం కంటె సంస్కృతాంధ్ర వ్యాకరణం పూర్వపు రచన అంటే ఈ ప్రశ్నకు సమాధానం లభించదు. కనుక శబ్దలక్షణసంగ్రహం తరువాతనే సూత్రాంధ్ర వ్యాకరణం రచితమని ఊహించవలసివస్తున్నది.

జి. వి. కృష్ణరావు

ఒక వ్యాకర్త రచనల పౌర్వాపర్య నిర్ణయానికి అతడు క్రొత్తగా సాధించిన పదాలూ, ఇతర విశేషాలూ ఎంతగానో తోడ్పడుతవి. స్వయంగా కష్టపడి సంపాదించిన అర్థాన్ని జాగ్రత్తతో కాపాడుకోవటం మానవునకు సహజం. వ్యాకర్తకూడా తాను పరిశీలించి కనిపెట్టిన విశేషాలను తన రచనలలో భద్రపరుచుకుంటాడు. ఒక రచనలో లేని విశేషాలు మరొక రచనలో ఉన్నవంటే ఆ మరొక రచన తరువాతి రచన కాకతప్పదు. కనుక ప్రాచీన వ్యాకర్తలు పేర్కోని క్రొత్త విశేషాలు వేటిని ఏయే రచనలలో సూరి పేర్కొన్నాడో చూడటం అవసరం.

ఋత్విగాదులను, వెనుకటివారు, గుణవర్గణంలో చేర్చుకొన్నారు. పురోధసు డన్నరూపం వారు సాధించుకోలేదు. సూరి ఋత్విగాదిని ప్రత్యేక గణంగా పరిగణించి శబ్దలక్షణ సంగ్రహంలోను, సూత్రాంధ్రవ్యాకరణంలోను అరుంత తుల్యత్వం వికల్పమని సూత్రించి ఋత్విజుడు, ఋత్విక్కు అన్న రీతిగా రూ పద్వైవిధ్యం సాధించాడు. ఈ అంశం ఆంధ్ర శబ్దశాసనంలో కనిపించటం లేదు. దీనికి కారణం గ్రంథపాతమో, రచనా ప్రాథమికత్వమో కావాలి.

''భగవదాదులకు ప్రథమాంతతుల్యతయు నుత్వడుజ్ఞులు నగునని కొందఱార్యులు'' అని సూరి ఆంధ్రశబ్దశాసనంలో సూత్రించాడు. అంటే ఈ విషయం ప్రాచీనులలో కొందరు. చెపుతున్నారని సూచిస్తున్నాడు. ఈసూచనను అతడు తన యితర రచనలలో జారవిడిచాడు.
10 కనుక శబ్దశాసనం అతని తొలి రచన అన్న అనుమతికి అవకాశం ఏర్పడుతున్నది. అయితే కొందరు భగవానుని ఆమోదించమంటున్నారు. కాని కేతనవలె సూరి ఆస్తికుడు.

''పురోధసుడు'' ఆంధ్రశబ్దానుశాసన శబ్దలక్షణసంగ్రహ రచనాకాలం వరకూ చిన్నయసూరికి లభించలేదు. సంస్కృత సూత్ర బాలవ్యాకరణాల రచనాకాలంలో ''వేధ పురోధ పురోధసుడు'' వచ్చి కూర్చున్నారు. (పురోధసః (అనుపసర్జనస్యడనా) వేధసః (నిత్యమనుపసర్జనస్యడః) అయితే ''లోకమంతా వెదకినా నీ రూపే పొడకట్టలేదు. నీకు యోగ్యతాపత్ర మిచ్చి పంపిందెవరు?'' అని అసలే రోజులు చాలకుండా ఉన్న పురోధసుని కొందరు నిగ్గదీస్తున్నారు.

అది అలా ఉంచి ఉపోత్తమేత్వం సంగతి చూదాము. ఉపోత్తమ ఇత్వానికికూడా ఉత్వం వస్తుందని చింతామణి చెబుతున్నది. కలిమి అన్న శబ్దానికి బహువచనం పరమైతే లకారానికిగూడ ఉత్వం వచ్చి కలుములు అన్న రూపం ఏర్పడుతుంది. ఈ లెక్కలో ప్రణిధి అన్నదానికి బహువచనం పరమైతే ణకారానికిగూడ ఉత్వం వస్తుందా? తత్సమాలకు రాదు. ఈ అంశాన్నిగూడ చేర్చి సూరి శబ్దలక్షణసంగ్రహంలో సూత్రిస్తూ

''ఉత్వంబు బహువచనంబు రా నగు

వికృతి నుపోత్తమంబునకు సహితము''

అని వ్రాశాడు. అయితే దీనితో అతివ్యాప్తిదోషం పోలేదు. బహువచనం పరమగుతున్నపుడు దోసిలి దోసిళ్లు అవుతున్నదే కాని దోసుళ్లు కావటం లేదు. కనుక అందులో ''అది దోసిల్యాదులకుం

గలుగదు'' అన్న సూత్రం చేర్చాడు. దీనితోనైనా చిక్కు తీరలేదు. దోసిల్యాదు లేవో అనిర్దిష్టంగానే నిలిచిపోయాయి. కనుకనే తరువాతి రచనయైన సూత్రాంధ్రవ్యాకరణంలో

''బహువచనే నిత్య మిత ఉః

ఆచ్చికస్యోపోత్తమన్య చేతః

నరలడోపధాష్టార్థాదీనామ్.''

అన్న సూత్రాలు వ్రాశాడు.

ఇక్కడ మరొక విషయం సూరికి తోచివుంటుంది. ఎన్మిది ఎన్మిదులు అన్నవి వ్యవహారంలోనే ఉన్నవి. ఎన్మదులు అన్నరూపం ఉండదని అందరికీ తెలిసిందే. సందేహం పొడమనిచోట ఉపదేశించేకంటే పొడమేచోట ఉపదేశించటం మేలుకాదా? తొమ్మిది అన్నది నిత్యవ్యవహారంలో వున్నది. దీని బహువచనరూపం తొమ్మిదులా, తొమ్ముదులా? ఇలాంటి సందేహం తీర్చటం ముఖ్యమన్న భావంతో ''రలడోపధనవార్థాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబు కలుగదు'' అని బాలవ్యాకరణంలోసూరి మెరుగుపెట్టాడు. ఈ క్రమాన్ని బట్టి సూరి రచనలలోని ముందువెనుక లేవో వేరే చెప్పనక్కరలేదు.

సూరి రచనల పౌర్వాపర్య పరిశీలనకు తోడ్పడేవాటిలో ఔపవిభక్తికప్రకరణం ఒకటి. ఈ ప్రకరణం చింతామణి వికృతివివేకలలో ఇలా ఉన్నది:-

1. టింవ్యాదులు ఔపవిభక్తికములు.
2. రుల్వాది వర్ణాంతనామములకు విభక్తి సమాసములం దగు.
3. విభక్తిసమాసములందు ఇతర ఔపవిభక్తికములాదేశాగమంబు లగు.
4. ఇవి ప్రయోగ వేద్యములు.
5. ఉపవిభక్తులు కొన్ని యెడల వికల్పముగా, కొన్ని యెడల నిత్యముగా నగు. కొన్ని యెడల నిత్యముగా రావు.
6. ఆంధ్రమున ఈ ఔపవిభక్తికములు అనేకములు.
7. వీని ప్రవృత్త్యాదులు ప్రయోగైక శరణములు.
8. ఔపవిభక్తికసంజ్ఞ వానిని బొందు నామములకును వర్తించును.
9. నవర్ణంబు పరంబగునపుడు ఉకారాంతములైన కొన్ని యౌపవిభక్తికనామముల '' ఉన్ ''నకు లోపము బహుళము.
10. కొన్నింటికి తృతీయాసప్తములం దత్వంబగు.

శబ్దలక్షణసంగ్రహం ఈ ప్రకరణాన్ని ఇలా సంగ్రహించుచున్నది :-

టింవ్యాదు లౌపవిభక్తికంబులు.

నామంబుల రుల్వాదులకు విభక్తి సమాసంబుల బహుప్రకారంబుల జూపడియెడి.

టింటుల కిత్తులుం గలవు.

అల్లు లోనగువానికి తిగాగమంబు జడ్డ లోపంబుతోనగు.

మేన్వాదుల కిత్వంబగు.

టింటిక్కులు రాఁ బగల్వాదులకు

తేవు ప్రభృతుల కత్వంబగు

సంఖ్యమీది టింటిక్కుల కిడాగమంబగు.

చేఁదు తుది వ్రాయి తి వర్ణంబగు నంద్రు.

నేయి ప్రభృతులకు బహువచనంబు రా సయితము

ఒకానొక్కనికిం బెక్కు లార్య ప్రయోగంబుల నెఱుంగునది.

(తృతీయాసప్తమ్యర్థంబులందు) ఔపవిభక్తికంబులత్వంబగు.

పై సూత్రాలను పరిశీలిస్తే ఔపవిభక్తికాలు అనేకాలు అన్న విషయంతప్ప చింతామణి వికృతివివేకాలు పేర్కొన్నతక్కిన విషయాలను శబ్దలక్షణసంగ్రహం అనువదిస్తున్నది. విశేషించి ఇ, టి, ంటి, అన్న ఉపవిభక్తులు స్థూలంగా ఏయే గణాలకు వస్తవో సూచిస్తున్నది.



శబ్దశాసనం టింట్యాదులు ఉపవిభక్తులని చెపుతూ, ఇ, టి, ఇంటి, ంటి, తి, ప, పజ్, త అను వాటిని గూడా సంగ్రహించింది. టి గాగమమూ, నామముల కప్పుడు గలుగు మార్పులు, టి వర్ణాదేశ సందర్భాలు, ఇ వర్ణము కలుగుపట్లు, పజ్ప వర్ణాలను పొందు శబ్దాలు, టి వర్ణంబు బిందుపూర్వమగునట్లు తివర్ణము కలుగు నామములూ వివరించింది. శబ్దలక్షణ సంగ్రహంకంటె ఇందులో ఎక్కువ విశేషాలున్న పజ్పవర్ణాలనుగూడ ఉపవిభక్తులని చింతామణ్యాదుల మతానుసారంగా ఇది చెప్పింది. కనుక ఆంధ్రశబ్దశాసనం మొదటిదనీ, శబ్దలక్షణ సంగ్రహం తరువాతిదనీ భావించటానికి ఆస్కారమేర్పడుతున్నది.

సూత్రాంధ్రవ్యాకరణం శబ్దలక్షణసంగ్రహంవలెనే పజ్ప వర్ణాదులను ఔపవిభక్తిక పట్టికనుంచి తొలగించింది. అంతే కాదు; ఇ టి తి వర్ణములు మాత్రమే ఉపవిభక్తులని పేర్కొన్నది. (ఇకటితయ ఉపవిభక్తయః అసావేక వచనమ్ బహుళమ్,)

బాలవ్యాకరణం ఈ ప్రణాళికనే అనుసరిస్తూ, '' ఇ టి తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు, ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగా నగు'' అని సూత్రిస్తున్నది.

ఔపవిభక్తిక ప్రకరణాన్ని బట్టి చూచినపుడు ఆంధ్రశబ్దశాసనం మొదటి రచనమనీ, శబ్దలక్షణసంగ్రహం తరువాతిదనీ, సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం ఆమీదటిదనీ, బాలవ్యాకరణం కడపటిదని భావించవలసివస్తున్నది.

వికృతివివేకం అమహత్ స్త్రీలింగాల విశేషణాలను గూర్చి ప్రస్తావిస్తూ ''అప్రాణివాచినా మత్రభవే దమహతీ స్త్రీయాంద్విధా విశేషణమ్'' అని విధిస్తున్నది, అంటే హృద్యమగు విద్య, హృద్యయగు విద్య అనవచ్చు కాని మొదవులలో కపిలవరిష్ఠము అనరాదు – కపిలవరిష్ఠ అనే అనాలి,

ఈ విశేషాన్ని ఆంధ్రశబ్దశాసనం ''అప్రాణివాచిస్త్రీ లింగంబుల భేదకం బుభయవిధంబగు'' అని అనువదించింది, తరువాత కవిప్రయోగాలు పరిశీలించి సూరి అది సరిగాదని ''అమహతి భేదకంబు క్లీబంబు నగు'' నని శబ్దలక్షణసంగ్రహంలో సూత్రించాడు. ఈ విషయాన్నే ''మహతీతరంబులగు స్త్రీలింగబుల విశేషణంబులకు క్లీబత్వంబు విభాషనగు'' అని బాలవ్యాకరణంలో విస్పష్టంగా సూత్రించాడు. దీని ప్రకారం మొదవులలో కపిలవరిష్ఠము అనవచ్చును, కపిల వరిష్ఠ అనిగూడ అనవచ్చును, ఈ అంశం సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణంలో ఇలా ఉన్నది; –

స్త్రీప్రత్యయ విషయస్య స్త్రీయాంవా

స్త్రీ ప్రత్యయం యథానుశాసనమ్

విశేష్య నిష్ఫుశ్చపుంసి.

ఇక్కడ బాలవ్యాకరణ మతమే కనిపిస్తున్నది.

కాగా ఆంధ్రశబ్దశాసనం మొదటిదనీ, శబ్దలక్షణసంగ్రహం తరువాతిదనీ, సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం ఆమీది రచనమనీ బోధపడుచున్నది.

ఇంక కారకవిశేషాలు పరిశీలనార్హాలు.

1. ఉపయోగంబున నాఖ్యాతకు దోడువర్ణకంబగు.

2. కంటె వర్ణకం బన్యార్థయోగజంబగు పంచమికగు.

3. కంటె వర్ణకంబు నిర్ధారణ పంచమికగు.

4. కాలాధ్వంబులకు బ్రాయికంబుగా బ్రథమయగు.

5. సర్వనామ సంఖ్యాభిధాన తద్వి శేషణంబులం దెయ్యది ముందు ప్రయోగింపబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగానగు.

6. ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాషనగు.

బాలవ్యాకరణ ప్రోక్తాలైన ఈ సూత్రార్థాలు చింతామణి వికృతివివేకాలు పేర్కొన్నవి కావు.

ఆంధ్రశబ్దశాసనంలో ఈభాగం లోపించింది, శబ్దలక్షణ సంగ్రహంలో:

కంటెనన్యాదియోగంబునం దగు.

సర్వనామభేద్యంబులలో బూర్వప్రయుక్తంబునకు ప్రథమ బహుళంబుగా నగు,

విశేషణంబుల షష్ఠికి.

జి. వి. కృష్ణరావు

అన్న సూత్రాలు కనిపిస్తున్నవి, అంటే బాలవ్యాకరణం సూత్రాలలోని 1, 3, 4 అంశాలు లేవు, సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణం ఈ విషయాలన్నీ పేర్కొన్నది, ( ఆఖ్యాతురుపయోగే, నాప్రథనాద్యేత్యయోగే; కంటె నన్యర్థానాంయోగే నిర్ధారణే; కాలాధ్వనోః (ప్రథమా); సంఖ్యాప్రమాణ సర్వనామ తత్సమానాధికరణేషు యత్పూర్వం, ప్రయుజ్యతే తతః ప్రథమా; తస్యాషష్ఠీబహుళమ్) ఈ విషయాలనుబట్టి శబ్ద లక్షణసంగ్రహానికి సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణం తరువాతి దవుతున్నది.

సామాసిక విశేషాలు కొన్నిగూడ ఈ అభిప్రాయానికి దోహదమిస్తున్నవి. చింతామణి వికృతివివేకాలు కర్మధారయంలో పూర్వపద సామర్థ్యాన్ని వివరించక పరిమితమైన ఆంధ్రపదం సంస్కృతపదంతో కర్మధారయాన సమసిస్తుందని పేర్కొన్నవి. రాజాదిశబ్దం పరమగునపుడు చతుర్వర్ణ పరిమిత జననామముల డాదివర్ణములకు లోపమూ, ఒకానొకచోట అత్వం వేరొకానొకచోట ఆత్వం, మరొకానొక చోట మత్వం వస్తవని వికృతివివేకం చెబుతున్నది.

శబ్దశాసనం చింతామణి వికృతి వివేకాలను అనుసరించి ''పరిమితం బాంధ్రపదంబు సంస్కృత విశేష్యంబుతో సమసించు'' జన నామంబులకు రాజాదులు రానత్వం బాత్వం బిత్వంబును గానంబడియెడు'' అని సూత్రించింది. ''పరిమతం బాంధ్రపదంబు సంస్కృత విశేష్యంబుతో సమసించు'' అని సూత్రించి శబ్ద లక్షణ సంగ్రహం తక్కిన విషయాలను విడిచిపెట్టింది. ఏ పదం
14 సమానాధికరణంతో సమసిస్తుందో సూత్రాంధ్ర వ్యాకరణం వివరిస్తున్నది.

జక సర్వనామమ్వంతం సమానాధికరణేన సమస్యతా

అమహత్సంఖ్యా

స్త్రీ సమః

అంటే దాతుజవి శేషణం, సర్వనామం, మ్వంతము, అమహత్సంఖ్యావాచకం, స్త్రీసమం సమానాధికరణంతో సమసిస్తవన్నమాట.

బాలవ్యాకరణం దీనిని ''కర్మధారయంబు త్రికస్త్రీ సమముగంత ధాతుజవిశేషణ పూర్వపదం బయి యుండు'' అన్న సూత్రంతో సంగ్రహించింది. అయితే మ్వంత మనబోయి ముగంత మన్నది.

ముజ్జగములు ముల్లోకములు ఇత్యాది ద్విగువును చింతామణి వికృతివివేకాలు నేరుగా సాధించుకోలేదు. దీనిని శబ్దశాసనం, శబ్దలక్షణ సంగ్రహం వదిలిపెట్టాయి. సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం ఈ పట్టున ఇలా సూత్రించింది:-

మూఁడోర్డజ్ నిత్యమ్ (లోపః)

తతోహలోద్వే,

బాలవ్యాకరణమో ''సమానాధికరణంబగు నుత్తర పదంబు పరంబగునప్పుడు మూఁడు శబ్దంబు డువర్ణకంబునకు లోపంబును మీది హల్లునకు ద్విత్వంబు నగు'' అని సూత్రించింది.

ఈ విషయాలనుబట్టి ఆంధ్రశబ్దశాసన శబ్దలక్షణసంగ్రహాలు మొదటివనీ సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణం వాటి పిమ్మటదనీ భావించవలసి వస్తున్నది.

తద్ధితప్రత్యయాలు కూడా ఈ అభిప్రాయాన్నే సమర్థిస్తున్నవి. చింతామణి, వికృతివివేకం పేర్కొన్న తద్ధిత ప్రత్యయాలు చాలా తక్కువ. ఆంధ్రశబ్దానుశాసనం తన, న, అది, ఇ, ఇడి, త, కా, కత్తియ, ఆ, ఆఁడి, మాఁడి,మారి, పోతు, అఱక్, ఉఱక్, క, ఉక, ఈ, ఱిక, ఇక, అయి, ఇ, ఏసి, ఎండు, ఇ (మంజి మార్గాదులందు), గారు అన్న ప్రత్యయాలను చెప్పటమేకాక, రూపరి, కాలువురు, చూపఱ్ఱు, పగతుడు, పగఱు, అంపఱ, చెలికారము, కోమలికము, మోఱకము, పసర, పసరిక, చిలిమిరి, చలిమిడి, చలువ అన్న పదాలను నిపతించింది. శబ్ద లక్షణ సంగ్రహంలో పదిహేడు ప్రత్యయాల వరకు కనిపిస్తున్నవి. సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణంలో, శబ్ద శాసనంలోని అయి, ఇ, గారు, ఏసి, అన్న వర్ణకాలు తక్క తక్కినవన్నీ ఉన్నవి, వీనికిదోడు తు, టిమిజ్, అది, అరజ్, టుచ్, టిచ్, పుడుచ్, తజ్, నిచ్, వడి అన్న ప్రత్యయాలుకూడా విహితాలు, బాలవ్యాకరణం మొత్తం 23 ప్రత్యయాలను పేర్కొన్నది.

తద్ధిత ప్రత్యయాలనుబట్టి చూస్తే శబ్ద లక్షణ సంగ్రహం మొదటిదనీ ఆంధ్రశబ్దశాసనం తరువాతిదనీ సూత్రాంధ్రవ్యాకరణం ఆ పిమ్మటిదనీ అనిపిస్తున్నది.

ఈ పేర్కొన్నవాటన్నిటికంటె చిన్నయసూరి వాడుకొన్న సంజ్ఞలు అతని రచనల పౌర్వాపర్య నిర్ణయానికి ఎక్కువగాతోడ్పడుతవి. అతడు వాడిన సంజ్ఞలను రెండు విభాగాలుగా చేయవచ్చును.

(1) చింతామణి వికృతి వివేకాలనుంచి స్వీకరించి కొన్ని రచనలలో వాడుకొని మరికొన్ని రచనలలో వాడుకొనక విడిచిపెట్టిన సంజ్ఞలు. (2) సూరి స్వయంగా కల్పించుకొన్న సంజ్ఞలు, సమాసకము, లుక్కు, మిత్తు, డిత్తు, అన్నవి మొదటిరాశికి చెందినవి, వర్గయుక్కులు, అచ్చు, త్రికము, సర్వనామము, దుమంతము, తుల్యము, సమము, జిత్తు, ముజ్జు అన్నవి రెండవ రాశికి చెందినవి.

మొదటిరాశి సంజ్ఞలున్న రచనలు, తొలి రచనలని నిస్సందేహంగా చెప్పుకోవచ్చును, సమాసకము, లుక్కు, మిత్తు, డిత్తు, ఆంధ్రశబ్ద శాసనంలోను, శబ్ద లక్షణ సంగ్రహంలోను కనిపిస్తున్నవే, కాని బాలవ్యాకరణ సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణాలలో కనిపించుట లేదు, (డిత్తు మాత్రం సూత్రాంధ్రా వ్యాకరణాలలో ఉన్నది.) కనుక ఆంధ్రశబ్దాను శాసన శబ్దలక్షణ సంగ్రహాలు తొలి రచనలని నిస్సంశయంగా చెప్పుకోవచ్చును.

ఇంక రెండవరాశి సంజ్ఞలన్నీ సూరి కల్పించుకొన్నవే కాని ఇతరులనుంచి ఎరువు తెచ్చుకొన్నవి కావు, ప్రయోజనం కోసం లెస్సగా ఆలోచించి కల్పించుకొన్నవి, కనుక వీటిని కొన్ని రచనలలో వాడుకొని మరికొన్నిట పరిహరించటం జరుగదు, అలా పరిహరించినవేవైనా ఉంటే అవి తరువాత కల్పించు కొన్నవని వూహించవచ్చు. అలా వాడుకొన్న రచనలు ఉత్తర కాలంలో వెలువడిన రచనలని నిశ్చయించుకోవచ్చును.

వర్గయుక్కులు, సర్వనామము అన్న సంజ్ఞలు సూరి రచన లన్నిట కనిపిస్తున్నవి. దుమంత మన్న సంజ్ఞ శబ్దం కనిపిస్తున్నది, అయితే శబ్దశాసనంలో దీనికి సంబంధించిన భాగం లోపించింది, పద్యాంధ్ర వ్యాకరణం సంజ్ఞతోనే ఆగిపోయింది.

జి. వి. కృష్ణరావు

సమతుల్య శబ్దాలు శబ్దశాసన శబ్ద లక్షణ సంగ్రహాలలో కనిపిస్తున్నవి. కాని ఇవి సంజ్ఞలుగా ప్రయుక్తాలు గావు. ''దూతాదులు స్త్రీతుల్యంబులు, కంధరాదులు క్లీబసమంబులు నగు'' అని శబ్ద లక్షణసంగ్రహం సూత్రిస్తున్నది, సంస్కృత సూత్ర బాలవ్యాకరణాలలో తుల్యాలు–తత్సమాలు; సమాలు ఆచ్ఛికాలు, అందుకనే

'' ఆచ్ఛికా బహవః స్త్రీసమాః

కేచన క్లీ బసమాః

బల్లి దాదయః సంస్కృతతుల్యాః''

అని సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణమూ;

''సంస్కృత ప్రాకృతతుల్యంబగు భాష తత్సమంబు,

క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు

విభాషం బుంలింగ తుల్యంబులగు.

సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దంబు వైకల్పికముగా స్త్రీతుల్యంబులగు.

కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు,

ఆచ్ఛిక శబ్దంబులెల్లందఱచుగా స్త్రీసమంబులుంగ్లీ బసమంబులయి యుండు,

16 బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు''

అని బాలవ్యాకరణమూ సూత్రించాయి.

మిగిలిన అచ్చు, త్రికము, ముజ్జు, జిత్తు అన్న సంజ్ఞలు సంస్కృత సూత్ర బాలవ్యాకరణాలలో మాత్రమే కనిపిస్తున్నవి. శబ్దానుశాసన శబ్దలక్షణ సంగ్రహాలకు, అచ్చు, త్రికము అన్న సంజ్ఞలు ఆవశ్యకమే అయినా వీటిని వాడుకొనక వికృతి, ఆ ఈ ఏ అన్న వాటిల్తో పబ్బము గడుపుకొన్నవి. సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణం అలాకాక నాలుగు సంజ్ఞలను వాడుకొన్నది. దీనికి యీక్రింది సూత్రాలే నిదర్శనం:–

''అచ్చా సంస్కృత సమేతరా

తదాద్యాస్త్రయ స్త్రికః

నుజేర్వా,

షిరవ్యయోధాతుసామ్యే మిజనా

సర్వత్రామ్రేడితే ముజః

బాలవ్యాకరణంలో వీటి వినియోగం ప్రఖ్యాతమే కనుక ఈ సంజ్ఞలనుబట్టి చూచినా సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణం ఆంధ్ర శబ్దశాసన శబ్దలక్షణసంగ్రహ పద్యాంధ్ర వ్యాకరణాలకు తరువాతనే బాలవ్యాకరణానికి ముందు వ్రాయబడి వుంటుందని ఉపపన్న మవుతున్నది.

విషయ విభజన మేమి, ప్రతిపాదిత విశేషాలేమి, సంజ్ఞలేమి, యీ అభిప్రాయాన్నే సమర్థిస్తున్నవి, పైగా సూరే బాలవ్యాకరణాంతంలో

మును మదుపజ్ఞంబగుచుం
దనరిన వ్యాకృతిని సూత్రతతి యొక కొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధమగు భంగిఁదగన్.
తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్కనందిన వారల్
దనరగ నీ వ్యాకరణం
బున మూలంబయిన కృతిని బోలంగనదగున్.''

అని చెప్పుకున్నాడు. సూత్రాంధ్ర వ్యాకరణం మొదటి రచనమే అయి శబ్దశాసన శబ్దలక్షణ సంగ్రహాలు తరువాతి రచనలే అయితే యీ తరువాతి రచనలను వదలి మొదటి రచనను జూడవలసినదని ఎందుకు చెప్పవలసివచ్చినది? సమగ్రమూ నిజహృదయాభివ్యంజకమూ అయిన రచనను మొట్టమొదటనే వ్రాసినప్పుడు తరువాతివైనా బాలవ్యాకరణేతర రచనల ప్రయోజన మేమిటి?

బాలవ్యాకరణ పీఠికలో సూరి మరియొక విషయం వ్రాశాడు:- ''పెక్కు లక్ష్యములు పలుమాఱు సావధానముగాఁ బరిశీలించి రచనాప్రణాళిక నిర్ణయించుకొని నా నేర్పు కొలఁదిని సంస్కృతభాషలో సూత్రగ్రంథ మొకటి కావించితిని. ఆ గ్రంథము బాలురకు సుసాధము గాకుండుటవలన దాని యందలి సూత్రములు కొన్ని తెనిగించి ప్రకృతగ్రంథరూపముగా రచించినాడ.'' ఈ వాక్యాలనుబట్టి సంస్కృత వ్యాకరణంలోని కొన్ని విషయాలనుమాత్రమే తెనిగించిందనీ స్పష్టమవుతున్నది.

ఇంతవరకూ సాగిన పరిశీలనంకూడ సంస్కృత సూత్రబాలవ్యాకరణాల ప్రణాళికలు ఒకటేనని నిరూపిస్తున్నది, శబ్ద శాసన శబ్ద లక్షణ సంగ్రహాల ప్రణాళికలు బాలవ్యాకరణ ప్రణాళికకంటె చింతామణి వికృతి వివేకాల ప్రణాళికలకు ఎక్కువ సన్నిహితాలు, ఎప్పుడైనా సమప్రణాళికాలైనా రచనలకంటె అసమప్రణాళికాలైనా రచనలకు కాలవ్యవధానం మెండుగా ఉండక తప్పదు, కనుక సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణం బాలవ్యాకరణానికి పూర్వమూ, ఆంధ్రశబ్దశాసన శబ్దలక్షణ సంగ్రహ పద్యాంధ్ర వ్యాకరణాలకు తరువాతా వ్రాయబడి ఉండాలి, అంతే కాదు, ముద్రణ పొంది ఉండాలి. ఎందుకంటే అచ్చుకాక వ్రాతప్రతిగానే ఉండిపోయిన కృతిని ''కనదగు'' ననటంలో అర్థంలేదు. ముఖ్యంగా సూరి అలా చెప్పేవాడు కాదు. పూర్వులు చెప్పక తాను స్వయంగా పరిశీలించక ఏ అర్థాన్నీ అతడు చెప్పడు. అట్టి సూరి ఎప్పుడో మొదట అరగొరలుగా వ్రాసి వదలిన వ్రాతప్రతిని ప్రమాణీకరించడు, దురదృష్టంవల్ల ముద్రితమైన సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణము మనకు దక్కలేదు. జీర్ణమూ భ్రష్టమూ అయిన చిత్తు ప్రతిమాత్రమే ఇప్పుడు మనకు లభిస్తున్నది.

ఈ లభిస్తున్న భాగాన్నైనా పెద్దలు సంస్కరించి వ్యాఖ్యతో ప్రకటించటం ముఖ్యం, సూరి తన యితర రచనలలో పేర్కొని బాలవ్యాకరణంలో సంగ్రహించని విశేషాలను సవిమర్శకంగా సేకరించటం అవసరం.

జి. వి. కృష్ణరావు

# 2.'ఛందశ్శిల్ప' సమీక్ష

ఆకృష్టేన మతిమతా
తత్త్వార్థ విచారణే మతిః కార్యా:
యది సత్యం కః కోపః?
స్యా దనృతం కిన్ను కోపేన!

శాస్త్రార్థాలు ఎంత ముందుకు పోయినా సామాన్య లోకం ఎప్పుడూ వెనుకబడే ఉంటుంది. ఒక్కొక్కప్పుడు కొందరి మనస్సులు ఏనాడో నిరకృతాలైన అర్థాలనుపట్టుకొని అలాగే వేలాడుతుంటాయి. ఇందుకు నిదర్శనంగా కవితా సిద్ధాంతాలను తీసుకోవచ్చు. కవిత్వం అనేది వచనంలో ఉండవచ్చును, పద్యంలోను ఉండవచ్చును అని తెలుగు ప్రాచీనలాక్షణికులు కూడ చెప్పుకున్నారు. అయినా 1920–30 వరకు కవిత్వమనేది ఛందోబద్ధంగానే ఉంటుంది గాని, గద్యరూపంలో ఉండదని ఆనాటి పెక్కుమంది రచయితల నమ్మకం. ఈనాడు కూడా సిసలైన కవిత్వం ఛందోరూపంలో వెలువడుతుంది. కాని మరొక రూపంలో ఉండదనీ, అదికూడాయతి ప్రాసలతోకూడిన లాక్షణిక పద్యాలలోనే ఉంటుందనీ నమ్మేవారూ, వేదిక లెక్కి రాయిగ్రుద్దేవారూ లేకపోలేదు.

అయినా ఆంగ్లసాహిత్య ప్రభావంవల్ల అనూచానంగా వస్తున్న ఛందశ్శాస్త్రంపై తిరుగుబాటు బయలుదేరింది. వృత్తాలు తెలుగు నుడికారానికే విరుద్ధమని నిషేధించి కొందరు రచయితలు దేశీయచ్ఛందస్సువైపు మళ్ళారు. యతి ప్రాసలు మాత్రమే శృంఖలాలుగా ఉన్నవి. వాటిని తప్పిస్తే కవితకు స్వేచ్ఛ లభిస్తుందని కొందరు రచయితలు భావించి తదనుగుణంగా ప్రారంభం సాగించారు. మరి కొందరు రచయితలు అసలు పాత ఛందస్సుగాని, ఆ వాసనలుగాని పనికిరావు. వాటిని ముందు ధ్వంసంచేస్తే కవిత్వం తరువాత బయలుదేరుతుందని ఛందస్సుమీద దాడి ప్రారంభించారు. వచన గేయాలనే దుడ్డుకర్రలతో పద్యాల నడుములు విరగదంతామని బయలు దేరారు. కథానికలు ప్రాబల్యం సంపాదించిన వెనుక కవికుమారుల ఈ ఆవేశం కొంత తగ్గింది. లేదు, పఠితలదృష్టి ఈ కవిత్వం అనే దాని నుంచి చాలావరకు మళ్ళింది. అయినా రచయితలు ఏదో ఒక రూపంలో తమ కృతులను నిర్మించడం మానుకొనలేదు.

ఏది ఏలా ఉన్నా, కట్టమంచివారి కవిత్వ తత్త్వవిచారణ కవితావస్తువును, అలంకారాలను దుయ్యబట్టినతర్వాత, ఉమాకాంతంగారు పాదనియతి విచ్ఛేదక సమాసరచననూ, యతి ప్రాస క్రీడలనూ ఎదుర్కొన్న తరువాత కవితా స్వరూప విచారంలో పెద్దమార్పువచ్చింది. ఆ మార్పు అనిబద్ధకవిత్వం పేరుతో నిర్దిష్టరూపం తాల్చింది. సిసలైన కవిత్వానికి మద్దెల దరువు లతో పనిలేదు.

త్రాగుబోతు ఊపులుగాని కూనరాగాలు కాని ఉండరాదు. అలంకారాలు అచ్చపు చూపునకు మసకలు తెచ్చి పెట్టేవేకాని సత్యం బోధపడనీవు. పైగా వ్యామోహం గలిగిస్తవి. కనుక అచ్ఛమైనకవిత్వానికి ఛందస్సు ఉండనే ఉండరాదు. అలంకారాలు ఏ రూపంలోనూ కనిపించరాదు. అలాంటి నిర్మల నిరాడంబర రూపంతో సాక్షాత్కరించి మనస్సుకు ఆహ్లాదం కలిగిస్తేనే కవిత్వం అవుతుందని ఇటీవల మరొక వాదం బయలు దేరింది.

స్థితప్రజ్ఞులు ఈ విభిన్న వాదాలకు చలించకపోవచ్చును. కాని సాహిత్యమంటే కొంత ఆసక్తి ఉన్నవారికి ఈ వాదోపవాదాలు స్మృతిపథంలో మెదలినప్పుడు విభ్రాంతి కలుగక మానదు. అలాంటివారికి డాక్టర్ పాటిబండ మాధవశర్మగారి '' ఆంధ్రమహాభారతము – ఛందఃశిల్పము'' అవశ్యం చూడవలసిన 576 పేజీల బృహద్గ్రంథం. అందులో సిద్ధాంతవ్యాసం విశేషించి కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ గారు ఆచార్య గంటి జోగిసోమయాజులుగారు ఈ గ్రంథాన్ని పరీక్షించి మెచ్చి డాక్టరేట్ డిగ్రీని రచయితకు ప్రసాదించారు. గ్రంథ ముద్రణ, సంపుటీకరణ హృద్యాలు. తెలుగు మహాభారతం సైజులో ఆ సంపుటాల ప్రక్కని చేర్చుకోడానికి వీలుగా గ్రంథాన్ని రచయిత లోకానికి అందిస్తున్నారు.

డాక్టర్ శర్మగారు ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆంధ్రశాఖలో రీడర్‌గా పని చేస్తున్నారు. ప్రాజ్ఞులు. సంస్కృతాంధ్రాంగ్ల భాషావేత్తలు. వారు వేదాలు, బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు, దర్శనాలు, సుశ్రుతం, శార్ఙ్గధరసంహిత, బసవ రాజీయం మున్నుగాగల వైద్య గ్రంథాలు, ఆంగ్లంలోవున్న మనశ్శాస్త్ర ఛందశ్శాస్త్ర గ్రంథాలు, సంస్కృతాంగ్ల భాషాకోశాలు, అష్టాధ్యాయి మహాభాష్యం, సిద్ధాంతకౌముది, పరమలఘు మంజూష మున్నగు వ్యాకరణగ్రంథాలు చూచి అవసరమైనచోట్ల యథామతి ప్రమాణీకరిస్తూ కవిత్రయంవారి ఛందశ్శిల్పాన్ని మధించి తాము సేకరించిన అమృతాన్ని ఆంధ్రులకు అందిస్తున్నారు. వారి కృషి ఎట్టిదో మనం వేరే చెప్పనక్కరలేదు. వారి అంకితం పద్యమే అక్షతలు చల్లుకొంటున్నది.

నీవు నాజీవితమున పండించినట్టి
యమృతఫల మీ మహాగ్రంథ మంబుజాక్షి
ఉభయులము దీనిచేత మృత్యువుతరించి
యనుభవించెద మమృతమయత్వసిద్ధి

తమ ప్రతిపాద్య విషయాన్ని శర్మగారు మూడుభాగాలుగా విభజించుకొన్నారు. మొదటి భాగంలో ఛందస్తత్త్వాన్ని రెండవదానిలో ఛందస్సునకు అలంకారప్రాయాలైన యతి ప్రాసలను, మూడవదానిలో విశేష సామాన్యచ్ఛందాలను చర్చించారు.

కవిత్రయ భారతం భాషలోను, ఛందస్సులోను తెలుగు వారికి ముఖ్యంగా గ్రాంధికవాదులకు పరమ ప్రమాణగ్రంథం. అలాంటి గ్రంథం బాగోగులనుగూర్చి ముఖ్యంగా శిల్పాన్ని గూర్చి చర్చించవలసివచ్చినప్పుడు విమర్శకుడు అన్నిటికంటె ముఖ్యమైన ఒక ప్రబల అవరోధాన్ని ఎదుర్కోవలసి ఉంటుంది. కవిత్రయమందు మనకున్న ప్రామాణ్యబుద్ధి తత్త్వవివేచనకు అవరోధక

మవుతుంది. ఎంతో నిగ్రహముంటేే తక్క విమర్శకుని పరిశీలన బహుమాన వ్యాక్షిప్తంకాక తప్పదు. ధర్మ రాజంతటివాడికే ఈ స్థితి తప్పలేదు. అంతమాత్రాన అర్జునుల వంటివారు ఉండకపోరు. లక్ష్యం సాధించకనూ మానరు.

ఛందః శిల్పం అన్న పేరు చూడగానే పాఠకులకు సంశయము అంకురించడం సహజం. వ్యాకరణం ఒక శాస్త్రం. ఛందస్సు మరొక శాస్త్రం, యుక్తిప్రయోగాల రెంటిద్వారా తత్త్వాన్ని నిరూపించేదాన్ని శాస్త్రమని ఆధునికుల భావన. ఈ దృష్టితో ఛందోవ్యాకరణాలను శాస్త్రాలని చెప్పలేము. యుక్తితో నిమిత్తం లేకుండా సుప్రసిద్ధ ప్రయోగాలను చూపుతున్నవి కాబట్టి వీటిని శాస్త్రాలనడం పరిపాటి. వ్యాకరణం సుశబ్దాన్ని చెబుతుందేతప్ప అందాన్ని గూర్చిగాని, అందమైన శబ్దాన్ని గూర్చిగాని చెప్పదు. అలాగే ఛందస్సు పద్యలక్షణాలను చెబుతుందేగాని ఫలాని పద్యాలు అందంగా ఉంటాయి. ఫలానివి అలా ఉండవు అని చెప్పదు. అలాంటప్పుడు వ్యాకరణ శిల్పము ఛందః శిల్పము అంటే ఏమని అర్థం చేసుకోవాలి ?

వ్యాకర్త గ్రంథగౌరవానికి పాల్పడక అల్పాక్షరాలైన అల్పసంఖ్యాక సూత్రాలతో సుశబ్దాలను అనుశాసించ గలిగినప్పుడు ఆ అనుశాసనంలో శిల్పం ఉండడం లేదా? దానిని వ్యాకరణ శిల్పమని ఎందుకనగూడదు? అలాంటి లాఘవ సంపాదన శాస్త్రానికి విహితం. దానిని ఉల్లంఘించి గౌరవానికి పాల్పడితే అది శాస్త్రకారుని దోషమవుతుంది. ఇది ఛందశ్శాస్త్రానికి గూడ అన్వయిస్తుంది.



ఈ సందర్భంలో మరొక సంశయం. సుశబ్ద ప్రయోగం ద్వారా కవి రస నిష్పత్తి కలిగిస్తున్నప్పుడు దానిని వ్యాకరణ శిల్పం అనవచ్చునా? సుశబ్ద ప్రయోగం కవికి అవశ్య కర్తవ్యం. అలాంటి ప్రయోగం లేక రససిద్ధి అసంభవం. సుశబ్దం ప్రయోగించినా రస నిష్పత్తి కలుగకపోవచ్చును. అది వేరే విషయం. ఏది ఎలావున్నా వ్యాకరణ శిల్పమంటూ లేదు.

ఈ పక్షంలో ఛందశ్శిల్పం అనేది లేక పోవాలికదా? ఇది యుక్తి సహజంగా కనిపించడం లేదు. పద్యాలు వృత్తాలని, జాతులని, ఉపజాతులని మూడు రకాలుగా ఉన్నవి. వీటిలో ఒక్కొక్కదానిలో వందలకొలది విభేదాలున్నవి. ఇన్ని వేల భేదాలుండగా వాటిలో రసభావాద్యనుగుణంగా కొన్నింటిని ఏరుకొని రచనను రసవంతం చేయడంలో శిల్పం లేదా? భరతుడేమి, క్షేమేంద్రుడేమి, భోజుడేమి ఈ విషయంలో కొన్ని సూచనలుకూడా చేసినట్లు కనిపిస్తున్నది. ఇదంతా హుళక్కేనంటారా? అలాంటి ప్రామాణికులనే హుళక్కేనంటే మీ మాట హుళుహుళక్కి కాదా?

కవిత్వంలో ఛందస్సుకున్న స్థానాన్ని ఆలోచించిన తరువాత కాని ఈ ప్రశ్నకు సమాధానం చెప్పుకోడానికి వీలుపడదు. అయితే ముందుగా ఒక విషయం మరచిపోరాదు. మననోట వెలువడే మాట రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి పాఠ్యం, రెండవది గేయం. గేయం కేవలం సంగీత శాస్త్రానికి సంబంధించినది. పాఠ్యం రెండు విధాలు. ఒకటి పాదాది నియతిలేని వచనం. రెండవది పద్యం. ఛందస్సు పద్య లక్షణాన్ని నిర్దేశిస్తుంది. పద్యాన్ని గాయకుడు పాడితే పాడుకోవచ్చును. ఆ మాటకువస్తే వచనాన్ని కూడా రాగయుక్తంగా పాడవచ్చును. కాని ఛందస్సుకు గేయానికి సంబంధము

లేదు. ఛందస్సు పాఠ్యమైన పద్యలక్షణం మాత్రమే వివరిస్తుంది. ఎందుకంటే ఏకమాత్రకమైన లఘువును, ద్విమాత్రకమైన గురువును మాత్రమే అది గుర్తిస్తుంది. ఈ గురు లఘు పరిణామానుసారంగా పద్యలక్షణాన్ని అది నిర్ణయిస్తుంది. త్రిమాత్రకమైన ప్లుతానికి వ్యాకరణ శాస్త్రంలో స్థానమున్నా, ఛందశ్శాస్త్రంలో ప్రత్యేక ప్రయోజనమేమీ లేదు. అందువల్ల తాళానుగుణంగా లఘువును అనేక మాత్రకంగాను, గురువును ఏక మాత్రకంగాను పఠించే సంగీతానికి, ఛందస్సుకు సంబంధం లేదు. సంగీతానికి గానప్రక్రియ విషయమైతే, ఛందస్సుకు గురు లఘు నియతికమూ పాఠ్యమూ అయిన పద్యం విషయం.

ఈ వింగడింపు గుర్తు పెట్టుకున్న వెనుక ఛందస్సు ప్రత్యేకతను పరిశీలించవచ్చును. మానవునికి క్రోధము, అపహాసము, వాత్సల్యము, రాగము మున్నైనవి ఆయా సందర్భములబట్టి కలుగుతుంటవి. అవి ఆంగికంగా, వాచికంగా, సాత్త్వికంగా వెలువడుతుంటవి. అయితే ఈ వెలువడే తీరులో ఆయా వ్యక్తుల ప్రకృతులనుబట్టి తరతమ భేదాలుంటవి. ఇది అందరకు అనుభవసిద్ధమే.

ఆంగికాదులను ఆవలవుంచి వాచిక విశేషంలో గోచరించే వాటిని చూదాము. కోపం వచ్చినప్పుడు సామాన్య మానవుడు త్వరితంగా మాటాడుతాడు. ఒక్కొక్కప్పుడు దీర్ఘాలు హ్రస్వం కావడం, మామూలు మాటనే నొక్కి పలకడం, లేని ఒత్తులను తగిలించడం జరుగుతుంటుంది. వెక్కిరింత, రోత తలచూపినప్పుడు మాటలను సాగదీయడం, వికృతంగా విరవడం, 21 త్రుంచివేయడం మున్నైన పనులు జరుగుతవి. వాత్సల్యమో, అనురాగమో కలిగినప్పుడు మాటలోను, ఉచ్చారణలోను ప్రశాంతతనెలకొంటుంది. వర్ణాలు తాపీగా సాగడమేకాకమెత్తగాగూడ ఉంటవి. మధ్యలో దొరలే పరుషాక్షరాలను గూడ వీలైనంత మృదువుగా ఉచ్చరించడం జరుగుతుంది. ఆకస్మికంగా మధ్యలోవచ్చి వినేవాడికికూడ ఈ క్రోధాదులు స్పష్టంగా బోధపడుతాయి. పద్య కవిత్వమనేది మాటకున్న అర్థాన్నే కాక ఉచ్చారణలో ఏర్పడుతున్న ఈ విశేషాలనుగూడ వినియోగించుకొంటుంది.

ఈ విశేషాలను మరికొంత విశదంగా పరిశీలించాలంటే వ్యాకరణశాస్త్రం ప్రతిపాదించే వర్ణ విభాగాన్ని పరిశీలించాలి. స్వరం రెండు విధాలు: హ్రస్వం, దీర్ఘం, సామాన్యంగా హ్రస్వం ఓజస్సును, దీర్ఘం ప్రసాద మాధుర్యాలను ఒలికిస్తాయి. వ్యంజనాలను పరుషాలని, కోమలాలని విభజించవచ్చు. మహాప్రాణాలు (అంటే ఖ ఘ ఛ ఝ థ ధ ఫ బ శ ష స) జిహ్వా మూలీయము, ఉపధ్మానీయము, మూర్ధన్యాలైన ట ఠ డ ఢ వర్ణాలు, అలఘు రేఫము, అన్యవర్ణంతో సంయోగం పొందిన రవర్ణలకారాలు పరుషాలు, వర్గాద్య తృతీయములతో సంయోగంపొందిన ద్వితీయ చతుర్థ వర్ణాలు పరుషాలు. సబిందుక నిర్బిందుకాలైన క, గ,చ, చే, జ, జే, త, ద వర్ణములు, న, ణ, మ, య, ర, ల వర్ణములు కోమలాలు.

పరుషములు కోమలములు అయిన సంయోగ అసంయోగములైన వ్యంజనాలు, హ్రస్వ దీర్ఘాలయిన స్వరాలు రసవ్యంజకాలు అవుతవి. మరి గణాలు ఈ నియతితో నిమిత్తంలేకుండా రసవ్యంజకాలు అవుతవా?

జి. వి. కృష్ణరావు

భర్గుడు, భాసము, భిక్షువు, భీష్మము, భుగ్నము, భూ(భ్రము, భ్రుంటిక, భేద్యము, భైక్షము, భోజ్యము భౌమము, చంచల, చారువు, చింతన, చీరము, చుంచువు, చూళిక, చేలము, చైత్రము, చోరుడు, చౌలము– ఇవన్నీ పదాలని వైయాకరణుడూ భగణాలని ఛాందసీయుడూ అంగీకరిస్తారు. అర్థభేదం ఉభయులకు సమ్మతమే. వృత్తరచనలో ఈ గణాపేక్ష ఏర్పడినప్పుడు వీటిలో దేనిని వాడినా వీరిద్దరికీ అభ్యంతరం కలుగదు. కాని కవి వీటికి ఒకటే విలువ ఇస్తాడా? ఇస్తే అతడు కవి గాడు.

భచవర్ణాదియైన భగణంలోనే ఇంత భేదం ఉన్నప్పుడు తక్కిన వర్ణాలతో ఏర్పడిన భగణంలోను, తక్కిన గణాలలోను ఎంత భేదం ఉండాలి? పద్యం విభిన్నగణాలతో ఏర్పడుతుంది. అప్పుడు ఏర్పడే భేదం, వైచిత్రి ఊహకుకూడా అందడంకష్టం. అలాంటప్పుడు ఈ వృత్తం వల్ల ఈరసము, ఈభావాదికం వ్యంగ్యమౌతుంది. ఈవృత్తంవల్ల ఈరసాదికం వ్యంగ్యమౌతుంద ని చెప్పడానికి సాధ్యపడదు. ఒకవేళచెబితే అది సాహసమే అవుతుంది కాని సత్యం కాజాలదు. అందువల్ల గుణప్రతిపాదియైన దండికాని, రీతివాద ప్రవర్తకుడైన వామనుడుకాని, ధ్వని ప్రస్థానాచార్యుడైన ఆనందవర్ధనుడుకాని పద్యమే రసాదివ్యంజక మౌతుందని పేర్కొనలేదు.

ఈ సందర్భంలో సంస్కృతంలోని పద్యానికి, తెలుగు లోని పద్యానికి ఉన్న తేడా పరామర్శనీయం, సంస్కృత పద్య పాదమందు యతిస్థానంలోను, అంతంలోను విరుపు విధిగా ఉంటుంది. తెలుగు పద్యం ఏ పాదానికి ఆ పాదం విరుగవలసిన పనిలేదు. నాలుగు పాదాలు విరుపులేకుండా సాగినా అది ఛందోభంగంగా గాని, వ్యతిక్రమంగాగాని తెలుగు లాక్షణికులు పరిగణించరు. అయితే సంస్కృతంలో ఛందశ్శాస్త్ర విహితంకాని ప్రాసం, వడి తెలుగు పద్యానికి అదనంగా ఉన్నాయి. వీటి తత్త్వాన్ని గూర్చి గాని ఆవశ్యకతను గూర్చిగాని ఆంధ్ర ఛ్చందశ్శాస్త్ర కర్తలు స్వచ్ఛందంగా చర్చించి సిద్ధాంతీకరించినవారు కారు. కాకపోతే తాము ప్రామాణికులనుకొన్న కవులు ప్రయోగాలను పేర్కొన్నారు. అపభ్రంశాలను, కక్కుర్తి పాట్లను లక్షణాలని సిద్ధాంతీకరించారు. వాస్తవం చెప్పాలంటే తమ శస్త్రానికి ఏది విషయమో, ఏది కాదో నిశ్చయించుకోలేక కొంత వ్యాకరణం, కొంత జ్యోతిషం, కొంత మంత్రశాస్త్రం, కొంత అలంకార శాస్త్రం కలిపి కలగాపులగపు గ్రంథాలు వ్రాశారు.

అందువల్ల ఆంధ్రఛ్చంద స్సౌందర్యతత్త్వం పరిశీలించవలసి వచ్చినప్పుడు యతి ప్రాసాల స్వరూపాన్ని తేల్చుకోవలసి ఉంటుంది. ఇది శబ్దాలంకారంతో ముడిపడి వున్నది. ఈ శబ్దాలంకారాన్ని క్షోదక్షమంగా అలంకారికులు పరిశీలించారు. వారి నిర్ణయాలు ఆంధ్ర ఛ్చంద శ్శాస్త్రకర్తలకు తెలియని పనడం సాహసమే కాని మరొకటికాదు. అయితే వారు సౌందర్యతత్త్వంతో నిమిత్తం లేకుండా ప్రయోగాలకు గతి కల్పించడం కోసం యతి ప్రాసల లక్షణాలను చెప్పుకొన్నారు.

వాస్తవానికి అనతి వ్యవహితమైన వ్యంజనావృత్తి ''పూర్వానుభవ సంస్కారబోధిని'' యైనప్పుడు శబ్దాలంకార మౌతుంది. పద్యం ఏ పాదానికి ఆ పాదం విరుపుగలిగి అంత్యాక్షరం ఆవృత్తమైనా శబ్దాలంకారమౌతుంది. దేశీయ ఛ్చందస్సుకు చెందిన కందము, ద్విపదమున్నైన వానిలోని ప్రాసం, సీసగీతాదుల ప్రాసయతులు శబ్దాలంకారాలవుతాయి. అలాగే రగడల అంత్యప్రాసలు.

తెలుగువారికి ఈ శబ్దాలంకారం ఇష్టం భాషాస్వభావం కూడా అట్టిదేమో ననిపిస్తుంది. ఎందుకంటే శబ్దాలంకారములేని సామెత లేదు. యతో, ప్రాసో విధిగా వుంటుంది. ఈ విషయమే దేశీయ చ్ఛందస్సులో కూడా కన్పిస్తుంది. సంస్కృతం నుంచి తెచ్చుకొన్న చంపకాది వృత్తాలకు గూడా వీనిని అన్వయించడం జరిగింది. ఈ నేరం నన్నయ్య భట్టారకునిది కాదు. అంతకు ముందు శాసనాలలో కన్పిస్తున్న వృత్తాలలోనే ఈ ప్రాస నియమం వున్నది. భట్టారకుడు దానిని ఉల్లంఘించలేక అనుసరించాడు. తరువాతి వారు అతనిని అనుకరిస్తున్నామనుకొన్నారు. యతి ప్రాసల విషయంలో అతడు పాటించిన అక్షరరమ్యతను తక్కినవారు పాటించలేదంటే అతిశయోక్తిలేదు.

ఏది ఎలావున్నా పెద్దవృత్తంలో ప్రాసశ్రుతి గోచరం కావాలంటే ఏ పాదానికి ఆ పాదం విరగనన్నా విరగాలి. ప్రాసాక్షరం పరుషసంయోగమైనా కావాలి. లేదా పూర్వపాద ఉత్తరార్ధంలోనుంచి ప్రాసాక్షరం పలుమారు ఆవృత్తమైనా కావాలి. ఇది లేనప్పుడు ఆ ప్రాసం ఛందోగోచరమే కాని శ్రుతి గోచరం కాదు. ఆంధ్రఛ్ఛందః కర్తలు దీనిని పాటించక కవుల కక్కుర్తిపాట్లకు గతి కల్పించే నిమిత్తం సంయుతాసంయుత ప్రాసం (రేఫగాని, లకారంగాని పరమందు గలిగిన వ్యంజనానికి అతత్పరక వ్యంజనానికి ప్రాస- అండము, గుండ్రము; ఎండ- ఏండ్లు), వికల్ప ప్రాసం (యరో2 మనాసికే2 ను నాసికోవా అను సూత్రాన్ని పురస్కరించుకొని ఏర్పడే నానునాసిక సంయోగ వర్ణానికి జశాదేశంవల్ల ఏర్పడే సంయోగవర్ణానికి ప్రాస, సజ్జీకరము, అగ్ని); ప్రాస మైత్రి ప్రాసము (మాముడికి బిందు పూర్వక బకారమునకు), స్వవర్గజ ప్రాసము (థ ధ లకు, ద ధ లకు ప్రాసము. మొదటిది ఉచ్చారణ భ్రష్టతనుబట్టి క్షంతవ్యం కావచ్చును. కాని రెండవది శోచనీయం.) లడల ప్రాసము, సంధిగత ప్రాసము (ముఖ్యంగా రేఫ లకారాలకు ప్రాసం) విధించారు. కొంతమంది మహోదారులు శ స లకు, బిందుపూర్వకమైన ట కారానికీ, డకారానికి గూడ ప్రాస చెప్పుకొన్నారు.

ఈ దిక్కుమాలిన లక్షణాలు మాత్రమే ప్రాసను అనుప్రాసనుంచి వేరు పరుస్తున్నవి. అంతేకాని ప్రాస శబ్దాలంకారం కంటె భిన్నమైనది కాదు. ఈవిషయం మనసులో మెదలటం వల్లనే పదిహేడు ప్రధాన ప్రాసములను పేర్కొన్న అప్పకవి '' ఇంక శబ్దాలంకారంబులగు విశేష ప్రాసంబు లెఱింగించెద,'' నంటూ సుకర, దుష్కర, ద్వంద్వ, త్ర్యక్షర, చతురక్షర ప్రాసాలను, అంత్యప్రాసానుప్రాసాలను ఏడింటిని పేర్కొని,

వడులకు ప్రాసంబడులకును
విడువక చెల్లుబడులెల్ల వివరించితిఁ బా
ల్పడి వీనిలోన సత్కవు
లొడఁబడి కావలసినవి ప్రయోగింపదగుఁ,

అంటూ సంప్రదాయానికి, కాదు, కవుల దురభ్యాసానికి నమస్కారం చేశాడు.

పాదాద్యక్షరంతో స్వరవ్యంజనమైత్రిగల అక్షరం స్పష్టంగా శ్రుతి గోచరమవుతుంది. ఇందుకు వేమన ఆటవెలదులు, సామెతలు నిదర్శనంగ తీసుకోవచ్చును. మన కావ్యకర్తలందరు ఈ నియమాన్ని దిగద్రొక్కివేశారు. కనీసం పాదాద్యక్షరమునకు సాజాత్యమైన అక్షర శ్రుతిని యతి స్థానమున

పాటించినా బాగుండేది. నిజానికి ఈనియమాన్ని అనుసరించే కవిజనాశ్రయకర్త, స్వరయతి, వర్గజయతి, సరసయతి, ఎక్కటియతి అన్న నాలుగు యతులను పేర్కొన్నాడు. కాని కవులు సంస్కృతాంధ్ర వ్యాకరణాలను అడ్డంపెట్టుకొని కులటా శబ్దంలోని ల కారము మీది అకారానికి, ద్వీపంలోని ఇకారానికి మొక్కుబడి యతులను చెల్లిస్తూ యతుల సంఖ్యను పెంచడమేకాక ఉద్దిష్ట ప్రయోజనాన్ని ధ్వంసం చేసుకొన్నారు. ఈ అపమార్గాన సిమ్మెంటు రోడ్డు వేసిన గౌరవం తిక్కనకే ఇవ్వాలి.

డాక్టరు మాధవశర్మగారికి ఈ విషయాలేవీ పట్టలేదు. ఆంధ్ర ఛాందసులు పట్టిన తోవ రసమార్గమని భావించి గహనంలోపడ్డారు, హ్రస్వదీర్ఘాలతోను, పరుషకోమలాలైన వ్యంజన సంయోగాలతోను నిమిత్తంలేని మగణాదులు వీరాది రసవ్యంజకాలౌతవని భావిస్తున్నారు. అలాగే ప్రాసంవేరు అనుప్రాసంవేరు. మొదటిది ఛందోలంకారమనీ రెండవది శబ్దాలంకారమనీ సిద్ధాంతీకరిస్తూ ఇలా వ్రాస్తున్నారు.

''త్రిజగదవన నిత్యక్రీడనోద్యత్ప్రమోదా!

రజనిచర విఘాతారంభ లీలా వినోదా!

'' పాదాంతములంతే సదృశ వర్ణావృత్తి ముండుటచే నిది యంత్య ప్రాసయనఁబడు ఛందోలంకారము. వీని నామము లందే భేదమున్నది. అలంకార శాస్త్రసంబంధమైనది 'అంత్యానుప్రాసము'. ఛందశ్శాస్త్ర సంబంధియైనది 'అంత్యప్రాసము', ఇది ప్రాసభేదము అది అనుప్రాస భేదము''. ఈ దరువులు వింటున్నప్పుడు''రోలువగిలి తేనేమి లిద్దె చక్కగా బిగిసెం, 'దన్న సామెత జ్ఞప్తికివస్తున్నది. డాక్టరు శర్మగారు అవలోడించి ఆవల పారవేసిన కవిరాజవిశ్వనాధుని సాహిత్యదర్పణం అంత్యానుప్రాసానికి సోదాహరణంగా ఇలా లక్షణం చెబుతున్నది:

వ్యంజనం చేద్యథావస్థం సహాద్యేన స్వరేణతు.

ఆవర్త్య తేంత్య యోజ్యత్వాదంత్యానుప్రాస ఏవతత్.

పాదాంత గో యథా మము--

కేశ: కాశస్తబకవికాస:

కాయ: ప్రకటిత కరభ విలాస:

చక్షుర్దగ్ధ వరాటకకల్పం

త్యజతి న చేత: కామ మనల్పమ్

అయినా విశ్వనాధుడు ఇచ్చిన ఈ లక్షణం లక్ష్యం వారికి ప్రమాణం కాదు.

''ఈ క్రింది యుదాహరణము వలన శబ్దాలంకారమైన యనుప్రాసమునకును, ఛందోలంకారమైన యనుప్రాసమునకును భేదము స్పష్టమగును.

''వివిధోత్తుంగ తరంగ ఘట్టన

చలద్వేలా వనైలావలీ

లవలీలుంగ లవంగ సంగత లతా

లాస్యంబు లీక్షించుచున్.

ఇందు బిందుపూర్వక గకారము లకారము బహువారము లావృత్తములై యున్నవి గనుక వానివలన నను ప్రాసమను నలంకారము సిద్ధించుచున్నది. ఆవృత్తములయిన యక్షరములలో నేదియు ప్రాసాక్షరముకాదు గనుక నీయనుప్రాసము గద్యపద్యోభయ సామాన్యమైన శబ్దాలంకార మనఁదగియున్నది.''

శర్మగారు ఉదహరించిన ఈ పాదాలలో ప్రాసమైన వకారం అవ్యవహితంగా నాలుగుమారులు వినిపిస్తూ వృత్త్యను ప్రాసాన్ని ఘోషిస్తున్నది. అయినా దీనిని విస్మరించి 'ఆవృత్తాలయిన యక్షరములలో నేదియు ప్రాసాక్షరము కాదు. గనుక ప్రాసము గద్యపద్యోభయ సామాన్యమైన శబ్దాలంకారమనఁ దగియున్నది'' అని వ్రాస్తున్నారు.

''యమకము లనియత స్థానములు, ఇవి షడ్విధప్రాసములు నియమిత స్థానములు'' అని ఘంటాపథంగా చెబుతూ ఆంధ్ర మహా భారతంలోని

మకర వ్యూహంబనియెడు

మకరాలయ మపుడు దర్ప మహిమోజ్జ్వలుఁడై

మకర క్రీడం జండత

మకరాభీలముగఁ జొచ్చె మారుతి యధిపా!

అన్న పద్యం చూచి దీని యందు యమక చ్ఛాయ కొంత గోచరించు చున్నది'' అని 2
నసుకుతున్నారు.

ఈ పద్య మందున్నది యమక మే గాని యమకచ్ఛాయ కాదు. ఛంద: శిల్పకర్తలు తమ ప్రసక్త గ్రంథ సూచికలో చేర్చడానికి మరచిపోయిన అలంకార సర్వస్వానికి వ్యాఖ్య వ్రాసిన రాజానక జయరథుడు ఇలా అంటున్నాడు.:

''ఇదంచ (యమకం) స్థాననియమాంత రేణ న భవతి యదుక్తం, ''పదమనేకార్థ మక్షరం చావృత్తం స్థాననియ మే యమకం'' ఇతి, అత ఏవ స్థాననియమాద్ యమక మిత్యస్యాన్వర్థమభిధానమ్ పదస్థాన నియమో వైవక్షికో న వాస్తవ:.

ఈవ్యాఖ్యాత అన్నట్లు యమకానికి స్థాననియమము వాస్తవము కాకపోయినా వైవక్షికము. ఈవివక్షను పురస్కరించుకొనే పాదాది యమకము, పాదార్థ యమకము, పాదయమకము, శ్లోక యమకము, మున్నైన భేదాలేర్పడ్డవి, ఉదాహరణలు తెలుగు సాహిత్యంలో కోకొల్లలు.

లేమా దనుజుల గెలువగ

లేమా

తిరు మంత్రము సెప్పెదమని

తిరు మంత్రముసెప్పినారు.

ఇలాంటి వెన్నైనా చూపించవచ్చును. ఈ ఉదాహృత పద్యాలలో యమకం లేదంటారా? లేక ప్రాస తప్పిందంటారా? కాక యమకచ్ఛాయ కొంత వున్నదంటారా? కడపటిపక్షంలో అచ్చమైన యమక లక్షణం శర్మగారు ఇంక సరికొత్తగా వ్రాయవలసి వుంటుంది.

జి. వి. కృష్ణరావు

సూక్ష్మేక్షికగల శర్మగారుఇలా సిద్ధాంతీకరిస్తున్నారు:''అనంతుడునుఅప్పకవియు వీనిని (షడ్విధ ప్రాసములను) శబ్దాలంకారములనిరి. రేచన యట్లన లేదు. అనకుండుటయే యుచితము. షడ్విధ ప్రాసములుశబ్దాలంకారాలు కావు''.

అప్పకవి సంగతి ఎట్లున్ననుఅనంతుడుభోజరాజీయమే కాక రసాభరణముకూడా వ్రాసాడు. అందు రసములనుగూర్చి వ్రాశాడుగాని అలంకారములనుగూర్చి వ్రాయలేదు గదా! కనుక ఆలంకారికుడు కాడు. ఆలంకారికుడు కానివాడు షడ్విధ ప్రాసములను శబ్దాలంకారములంటే అది ఎలా ప్రమాణమౌతుంది? నిజమేమరి!

శర్మగారు ప్రాసానుప్రాసలనుగూర్చి సంగ్రహంగా శాస్త్ర పద్ధతిని ఇలా వివరిస్తున్నారు:

''షడ్విధ ప్రాసములు శబ్దాలం కారములు కావు. అవి శబ్దాలంకారములుగానే యాలంకారికుడును జెప్పియుండలేదు. శబ్దాలంకారము లనబడినవి పద్యముననను గద్యమునను నుండవచ్చును. షడ్విధ ప్రాసములు పద్యమందు మాత్రమే యుండదగినవి. కనుక వీనిని శబ్దాలంకారము లనుటయందు సామంజస్యము లేదు''

వీరు పేర్కొన్న అంశములనుగూర్చి చర్చించకముందు ఒకటే ప్రశ్న అడుగవలసి ఉన్నది.

1. అతడు పురవైరి; ఈతడు పలురవైరి.



2. అతని పలుకులు ములకులు; ఇతని పలుకులు కొలకులు.

ఈ రెండు వాక్యాలలో వినిపించేది ప్రాసమా, అను ప్రాసమా? పద్యమంటే ప్రాసమై, గద్యమంటే అనుప్రాసంగా ఒక్కసారి మారి ఊరుకొంటుంది కాబోలు! అలా మారుతుందన్నా మంచిదే, ప్రాసమే అనుప్రాసంగా మారుతున్నదన్నా, అనుప్రాసమే ప్రాసంగా మారుతుందన్నా ప్రాసానుప్రాసలకు అభేదం అంగీకరించినట్లే,

''ఈ వాదం సరికాదు. శబ్దాలంకారము లనబడినవి పద్యముననను గద్యమునను ఉండవచ్చునని చెప్పితిమి గదా! మొదటి వాక్యము సీసపాద పూర్వార్థమైనను గావచ్చును. లేదా ఆటవెలది పాదమైనను గావచ్చును, లేదా పదమైనను గావచ్చును. కనుక ఇందలిది శబ్దాలంకారియైన అనుప్రాసము'' అని శర్మగారనవచ్చును. అయితే ఉదాహృత వాక్యాలలో ప్రాసలేదా? ఆంధ్ర ఛందః కర్తలు దీనిని ప్రాసగా అంగీకరించరా? ఉన్నది; అంగీకరించారు అంటే ప్రాసాను ప్రాసాల అభేదత్వం అంగీకరించినట్లే కాదా?

ఇది అలావుంచి ఈ వాదనకు మూల భూతము లైన ప్రతిజ్ఞా హేతువులను చూదాము. ''షడ్విధ ప్రాసములు శబ్దాలం కారములుకావు' అన్నది ప్రతిజ్ఞ. 'అవి శబ్దాలంకారములుగా నేయాలంకారికుడును జెప్పియుండలేదు' అన్నది హేతువు. ఇది హేత్వాభాసం కాదా? ఆనంద వర్ధనులకు పూర్వంధ్వనివాదం ప్రతిపాదించినవారులేరు. అంతమాత్రాన ధ్వనిలేకపోయిందా? షడ్విధ ప్రాసలు శబ్దాలంకారాలని ఏ ఆలంకారికుడూ చెప్పనంతమాత్రాన అవికాకపోతవా? శబ్దాలంకారాలని చెప్పిన అనంతుడు ఆలంకారికుడు కాకపోయె. ఇంక ప్రామాణికుడైన ఆలంకారికుడు ఎవడు?

సంస్కృత ఆలంకారికుడే కదా. సంస్కృత పద్యానికి ప్రాసవడి నియమంలేదు. లేని దానిని గూర్చి ప్రస్తావించవలసిన ఆవశ్యకత ఎందుకు ఏర్పడుతుంది? కనుక వారి మౌనం ప్రాసవిషయంలో నిశ్చాయకం కాదు.

పోనీ, వాదం కొరకు షడ్విధ ప్రాసలు శబ్దాలంకారాలు కావనీ, కేవలం ఛందోలంకారాలనీ చెప్పే శర్మగారి వాదం అంగీకరిద్దాము ఛందోలంకారమైన షడ్విధ ప్రాసల పరమార్థమేమిటి? శబ్దాలంకారాలైన యమకానుప్రాసల పరమార్థమేమిటి? . రసము లేక లోకోత్తర చమత్కారముయొక్క అభివ్యక్తియేకదా! అవును నిజమే, ఛాందసులకు విషయమైన ప్రాసాలంకారము వేరు, యమకానుప్రాసాలంకారములు వేరు, ఛంద స్సౌందర్యం నిర్వచించవలసిన వారు ఛంద:కర్తలు, యమకాది శబ్దసౌందర్యం చర్చించవలసిన వారు ఆలంకారికులు. మొదటివారికి గురులఘుయోజనా సౌందర్య మీమాంస రెండవ వారికి శబ్దార్థోభయ గత సౌందర్యమీమాంస ముఖ్యములనవచ్చును.

ఈ వాదం యుక్తిసహంకాదు ఎందుకంటే రసవ్యంజకములు హ్రస్వ దీర్ఘ స్వరములు, పరుష కోమలములైన వ్యంజనములు, సంయోగాలు మాత్రమే కాని గురు లఘువులు కాదు. పైగా సొగసు సాహిత్యంలో ఎందున్నా ఎత్తిచూపి లక్షణం చెప్పవలసిన ఆవశ్యకత ఆలంకారికునకు ఉన్నది. అందువల్లనే అతడు ప్రకృతి, ప్రత్యయం, శాబ్దబోధము మున్నగుగల వ్యాకరణాంశాలనుగూర్చికూడా చర్చించడం జరిగింది. ఛందస్సుకుప్రత్యేకమైన అలంకారాలుఉంటే వారు చర్చించి ఉండాలి. పద-సంఘటనకు సంబంధించిన గుణరీతులను, శాబ్దికాలైన యమకానుప్రాసాలనుదక్క మరొక ఛందోలంకారాన్ని పేర్కొన్నట్లు కనబడదు, ప్రాసకూ గుణరీతులకూ సంబంధంలేదు. కనుక పరిశేషన్యాయం చొప్పున ప్రాసకూ యమకానుప్రాసలకూ సంబంధం ఉండాలి.

కాని ఛంద:శిల్పకర్తలు, ఆలంకారికులు పేర్కొన్న యమకాను ప్రాసాలువేరు. ఛందోలంకారమైన ప్రాసవేరు అంటున్నారు. బాగానే ఉన్నది. కాని శ్రుతిమాధుర్యం ద్వారా చమత్కారకారియైనప్పుడే శబ్దాలంకార మౌతుందనికదా ఆలంకారికులు చెప్పుకొన్నది? ఛందోలంకారము శబ్దాలంకారం కంటె భిన్నమున్నప్పుడు ఆ ఛందోలంకారము 1. శ్రుతి మాధుర్యంతోనిమిత్తం లేకుండా చమత్కారకారి కావాలి. లేదా 2. శ్రుతి మాధుర్యంద్వారా శబ్దాలంకారంవల్ల భాసించే సొగసుకంటె విలక్షణమైన సొగసు భాసించాలి. లేదా 3. శ్రుతిహితమైన సొగసు లేకపోవాలి. లేదా 4. కొంత శ్రుతిమాధుర్యంద్వారా ఒక కొంత చమత్కారం భాసించాలి.

ఈ నాలుగు పక్షాలలో రెండవ పక్షం తప్ప తక్కిన మూడు పక్షాలు సమంజసాలు కావని స్వయంగా చాటుకొంటున్నవి. కనుక రెండవ పక్షం మాత్రమే చర్చనీయం, అనుప్రాసం కంటె ప్రాసంవల్ల ద్యోత్యమయ్యే విలక్షణ వైచిత్రి, విశిష్ట చమత్కారం ఏమిటి? డాక్టరు శర్మగారు ప్రాసాధ్యాయంలో సుదీర్ఘం చర్చించి ప్రాసవల్ల ద్యోత్యమయ్యే విశిష్ట చమత్కారాన్ని చూపినది లేదు. అలాకాదు, ప్రాసం ఒక విధంగా కట్టుబొట్టు లాంటిది అని అంటారు. అది అనూచానంగా వస్తున్నది. అందువల్ల అనుల్లంఘనీయ సంప్రదాయ మంటారు. కాని వాస్తవానికి ముఖ్యమైనది రసం.

జి. వి. కృష్ణరావు

రసం కోసమే ఛందస్సు, తదంగాలు. రస వ్యంజకంగా ఛందస్సును, తదంగాలను దిద్దు కోవాలి. అంతేకాని ఛందస్సు మున్నైనవాటికోసం రసనిష్పత్తికి భంగం కలిగించరాదు. అపక్షంలో ప్రాసయే అనుప్రాసం కావాలి. అంతేకాని, దధలకు, షసలకు, శసలకు, నణలకు ప్రాస చెల్లుతుందా లేదా అన్న విచారం అనావశ్యకం. అప్పకవీయంలోని తృతీయాశ్వాసాన్నంతా ఎక్కించి దానిని ఛందఃశిల్పం అనడం శిల్పమీమాంసకు వంచన.

ప్రాస విషయంలో ఛందఃశిల్పకర్తలవాదం తత్త్వవిరుద్ధమైనట్లే వివిధ వృత్తజాత్యుపజాతి పద్యాలను గూర్చి కావించిన సుదీర్ఘ మీమాంసకూడా నేల విడిచిన సాము. కేవలం గురు లఘువులు రసవ్యంజకాలు కాగలవన్న భ్రాంతితో ఫలాని పద్యాలు ఫలాని రసభావాదుల అభివ్యక్తికి అనుకూలమంటున్నారు. ఇది అనై కాంతికం, ఉదాహరణకు చంపకమాలా వృత్తాన్ని గూర్చి శర్మగారు వ్రాసిన ఈ వాక్యాలనే తీసుకోవచ్చును.

''.. చంపకమాలా వృత్తపాదము మిక్కిలి సుఖముగా బ్రయోగింపదగియున్నది. 21 అక్షరములలో 14 లఘువులైన దీని గతి మిగులద్రుతము. లఘ్వక్షరప్రాయమైన ఈవృత్తము చిత్తవృత్తి యతనువాహియైన పట్టులందు– అనంగా వీరరౌద్రాదులయందు ప్రయోగింపదగినది. సమాంతర వినివిష్టములయిన గుర్వక్షరములు చంపకమాలాద్రుతగతియందు విలంబనము ఆదానము చేసి కొంతవరకు సావ్యయము భాసింపజేయుట చేత ద్రుత్యభిముఖమైన సమగతిగల రత్యాది భావములందును ఈ వృత్తము ప్రయోగింపదగియున్నది. లక్షణమునుబట్టి చంపకమాల జగణమయము అనగా ద్రుతోత్ప్లుతి గలది, కాని పదఘటనావశమున జగణములు స్థగితములై భగణములు రూపుకట్టవచ్చును. అట్టి చంపకమాల ద్రుతావరోహణ గతి గలదియగును. ద్రుతియందు ఉత్ప్లుతి భాసించినచో వీరాదులు, అవరోహణము భాసించినచో శృంగారాదులు చంపకమాల నిర్వహింపగలదని భావింపవలెను.

''..... ఈ రసముల (వీరరౌద్రముల) నిర్వహణము నందే కవిత్రయం చంపకోత్పలములను బహుధా ప్రయోగించిరని ఆ వృత్తముల సంఖ్యా బాహుళ్యమువల్ల ఊహించవలసి యున్నది..... ఇది భరతముని యాదేశము ననువర్తించు ప్రయోగ పద్ధతి.''

నన్నయ భట్టారకుడు నలోపాఖ్యానమున కరుణ ఘట్టమున చంపకోత్పలాలు వాడి ఉన్నాడు. ఒక్క నన్నయ యేమి, ఇతర కవులుకూడ వీరాదులకు, శృంగారాదులకు భిన్నమైన పట్టుల చంపకమాలావృత్తం వాడి ఉన్నారు.

స్తుతమతియైన యాంధ్రకవి
 దూర్జటి పల్కుల కేల గల్గెనో
యతులిత మాధురీమహిమ
 హా తెలిసెన్ భువనైక మోహనో
ద్దత సుకుమార వారవనితా జనతా
 ఘనతాపహారి సం

తత మధురాధరోదిత సుధారస
ధారలఁ గ్రోలుటంజుమీ
గెలిచిన వాడు నేడు రణకేళిఁ
బురందరుఁ దద్గజేంద్రమున్
వెలిచిన వాడు దేవతల వెట్టికి
బట్టినవాఁడు, ధూర్జటిన్
విలిచినవాడు భక్తిమయ
విత్తమునన్ ధర నేకవీరుడై
నిలిచినవాడు శౌర్యమున
నీజనకుడు భయం బి దేటికిన్.
పిరిగొనదాల్పు నెట్టైముగఁ
బ్రేవులు చుట్టి కపాలపాత్రలో
విరియఁగలంచుఁ గ్రొమ్మెదడు,
వెంద్రుక లేరి తొలంగవై చు నె
త్తురు చవిచూచుఁ, గండలు
తుథూయని కాయు, ద్రిశూలధారలం
జెరివిన ప్రేతమాలికలఁ జిమ్ముఁ
బిశాచ విభుండు వేడుకన్.
చొరని బిలంబులున్ వెడలఁ
జూడని క్రంతలుఁ గాలురావడన్
దిరుగని త్రోవలున్ విడియ
దీర్పని గొందులు, నాలుబిడ్డలే
కరయని రేలుఁ జీమ చిటు
కన్నను విప్పనిమూఁకలుం, బయిం
జిరుగని చీరలుం గలవె?
చేరిన యీ సురకోటి కచ్యుతా.
నగవకు మన్నదైవగతి
వచ్చిన కీడుదలంచి నెమ్మదిన్
బొగులకు మన్న కర్మముల
పోకకు భోగమె హేతువన్న! వి

జి. వి. కృష్ణరావు

శ్వగురుఁ గరీంద్ర వత్సలు
దివానిశముం దలపోయుమన్న! మే
లగు హరిభక్తి యుక్తులకు,
నాపద రాదుగదన్న యెన్నఁడున్.
ఒకడు నిరూఢ కృష్ణరుచి,
యొక్కఁడు నిర్మల మానసప్రియుం
డొకఁడు ప్రయత్న యోగ్యఫలుఁ
డొక్కఁడనాదృత బంధకంచుకుం,
డొకఁడు రసానుకూలమతి
యుక్తుఁడునై విలసిల్లి రింతివు
త్రకు లిల నెట్టి వారలకుఁ
దప్పునె తొల్లిటి జన్మవాసనల్.
మలమున బ్రుంగుపైన తలిమంబు
పయిన్ శయనించి మేను చీ
మలుదిన మక్షికల్ గఱవ
మానుప నేరక యొత్తిగిల్లి పై
నొలసిన తీట గోకికొన నోపక యె
వ్యవహార మజ్ఞనా
దులును బరేచ్ఛఁ గైకొనుచు
దుఃఖము నొందు శిశుత్వ వేళలన్.
ఉనికి శిలోచ్చయంబు, నిజయోష
శిలోచ్చయ రాజపుత్రి. నీ
ధనువు శిలోచ్చయమ్ము, పురదాహ,
రథీకృత రత్నగర్భ! నీ
మనమున కీ శిలాశకల మండన
మెట్లు ప్రియంబుఁ జేసె? నే
మనఁగల వాఁడ నిన్ను వ్రతహాని
యొనర్చు దురాత్ముఁడుండఁగన్.
కనక శలాకలం దెగడు కన్యలు
గట్టిన బొమ్మరిల్లు శం

భుని గుడి, బొమ్మ శంకరుడు,

బోనము గుజ్జనగూడు వేడ్కఁజే

సిన పను లన్నియున్ శివుని సేవ

యొనర్పఁగఁ బద్ధ పాట్లుగా

మనమున నూహ సేయుదురు;

మానునె తొల్లిటి జన్మ వాసనల్?

శర్మగారి సిద్ధాంతం ప్రకారం ఉదాహృతాలైన ఈ పద్యాలన్నీ వ్యతి క్రామకాలై, రసభంజకాలు కావాలి. మరి ఇవి ఆయా రసాది వ్యంజకాలుగా లేవా? వృత్తం ఎక్కడైనా అడ్డుపడినట్టు కనిపిస్తున్నదా? దీనినిబట్టి ఛందఃశిల్పమందలి రసానుశీలమన్న భాగం (271వ పేజీ నుంచి 547వ పేజీవరకు విస్తరిల్లిన ఖండం) ఎంతవరకు సార్థకమో వేరే చెప్పనక్కరలేదు.

సాహిత్య సిద్ధాంతాలలో అనుల్లంఘనీయమైన దర్శనం ఏదైనా ఉన్నదంటే, అది ధ్వన్యాలోకమే. ఆ ధ్వన్యాలోకం ఎంత అపహాసం పాలవుతుందో ఛందఃశిల్పం చక్కగా నిరూపిస్తున్నది. ధ్వని పేరు చెప్పి సరిక్రొత్తలైన విరూప ధ్వనులను ప్రతిపాదిస్తున్నది. ఉదాహరణకు రెండు మూడు పద్యాలపై ఛందః శిల్పం కావిస్తున్న వ్యాఖ్యలనే తీసుకోవచ్చును:

''నెట్టన యాపగాసుతుడు నేలకు వ్రాలె ననంగ విన్న నా

కట్టడి పీసు లేమి విను కాఁతియ కోర్వవు? దుర్వినీతికిం

బుట్టిన యిల్లనై వినకపోవగ వచ్చునె యింక నాకు, నే

దిట్టడ నైతి నెల్లవియు దెల్లముగా విననేర్తు సంజయా!

''భీష్మ మరణము విని విలపించుచున్న ధృతరాష్ట్రుని వాక్యమిది. ఉచ్చతర స్థానమైన టకారము ద్విరుక్తమై ధృత రాష్ట్రవిలాపమందలి యుచ్చస్వరత్వమును సూచించుచున్నది. మూర్ధ తాడన రూపమున ధృతరాష్ట్రుని శోకోద్రేకాభినయమునుగూడ ప్రాసాక్షరములందనుమేయమగుచున్నది.''

ఈ భారతపద్యం చదివినపుడు కలిగే అనుభవ మేమిటి? కరుణం, ఆ కరుణానికి ద్విరుక్తటకారం పోషకంగా ఉన్నదా? పద్య భావం ద్రవింపజేస్తున్నది. కనుక ఈ ప్రాసను పట్టించుకోము. వాస్తవానికి విప్రలంభము, కరుణము కోమలతరాలనీ, తదనుగుణంగా కోమల పదసంఘటన ఆవశ్యకమనీ, పరుషములైన వర్ణములు, సంయోగాలు దీర్ఘ సమాసఘటన పనికిరావనీ ఆలంకారికులు ఐక్యకంఠంతో చెబుతున్నారు. ఆ నిర్ణయం కాదని వ్యాఖ్యాతలు ద్విరుక్తటకారంవల్ల ధృతరాష్ట్రుడు తలను ఎంత గట్టిగా మోదుకొని యేడుస్తున్నాడో ప్రతీయ మాన మౌతున్నదని అంటున్నారు. ఈ లెక్కలో ధృత రాష్ట్రుని శిరస్తాడన ధ్వని వ్యంజకంగా ఘోష వర్ణాలను పరుషాలైన ద్విరుక్త వర్ణాలను వాడితే ఇంకా బాగుండేదన్న మాట! ఈ లెక్కలో పద్యం ఎలా తయారవుతుందో శర్మగారూహించినట్లు లేదు. ఇలాంటి వ్యాఖ్యలు దురభిమానాన్ని తెలియజేస్తవేకాని తత్వాన్ని నిరూపించవు.

జి. వి. కృష్ణరావు

నన్నయగారి మరొక పద్యాన్ని వ్యాఖ్యానిస్తూ ఛందఃశిల్పకర్తలు ఇలా వ్రాస్తున్నారు:

''కాశిరాజ దుహితల నపహరించుకొనిపోవు తన్నెదిరించిన రాజులతో భీష్ముడు పోరాడు సందర్భమున.నన్నయ శకటరేఫప్రాసము నుపయోగించుట మిక్కిలి సరసముగా నున్నది.''

నెఱనుఱకవైరి వీరుల
నెఱఁకులు దూఱంగ నేయు నృపపుంగవునం
పఱకోర్వక పిఱుసనిరని
వెఱచి విషణ్ణులయి సకల విషయాధిపతుల్.

''రేఫమే శ్రుతినికర్తన శీలము, శకట రేఫము మాట చెప్పనేల.''

ఈ మాట వ్రాసిన వ్యాఖ్యాతలు ఆ తరువాతి పుట లోనే

''గురునాశ్రమంబునను ము
న్నరుదుగఁ బతివలనఁ గనినయనురాగము నా
దరణము ననుగ్రహంబును
గరుణయు సంభ్రమము నపుడు గానక యెడలోన్''

అన్న నన్నయగారి శకుంతల స్థితిని అభివర్ణించే పద్యాన్ని వ్యాఖ్యానిస్తూ ''ఆశాభంగజనితమైన ఆమె చిత్త సంతాప స్వరూపమును నన్నయ సాధురేఫ ప్రాసమునఁ బ్రతిపాదించెను'' అని వివరిస్తున్నారు. శ్రుతినికర్తన శీలమైన రేఫం సంతాప వ్యంజనాదక్ష మెలా అవుతున్నది? వీరము సంతాపము విరుద్ధ కోటికములుగాని, ఏక కోటికములు గావు. ఈ విరోధ మున్నట్లుకూడ రచయితకు పొడకట్టినట్లులేదు. ఎందువల్లనంటే రేఫము శ్రుతనికర్తన శీలమని పేర్కొన్నవాడు అభినవగుప్తుడు. కనుక విరోధ మేదైనా ఉంటే ఆ దోషం అతనిదే అవుతుందని రచయిత ధీమా.

వాస్తవానికి అభినవ గుప్తుడు యథార్థమే చెప్పాడు. రచయిత రేఫమంటే ఏమో గ్రహించినట్టు తోచదు. భర్గుడు, క్రకచము ఈ పదాలలోని రేఫము వికర్తన శీలము, గౌరి, శౌరి ఇందలిది కాదు. రెంటికి తేడా ఏమిటి? మొదటి జంటలోనిది పొల్లు. రెండవ జంటలోనిది స్వరసహితము. స్వరసహితమైన రవర్ణము పరుషము గాదు. వ్యంజన మాత్రమైనది పరుషము. అందువల్లనే ఓజోగుణాభి వ్యక్తియందు రేఫఘటితమైన సంయోగమును ఆలంకారికులు అభిమానించారు. ఇంతకూ రేఫము అన్నమాటకు అర్థం విస్మరించడంవల్ల ఈ తికమకలు పొడసూపాయి.

ఛందఃకర్తల విరూపధ్వనుల పరాకాష్ఠను ఈ వ్యాఖ్యలో చూడవచ్చును.

''తన పలుకు లోకమెల్లను
గొనియాడఁగఁ దగిన లోకగురుడీయమునం
దను దేమేవురమును నీ
తనుమధ్యవివాహమయ్యెద మని పలికెడున్.

''లాట్టురుజ్ఞ పరంబగునపుడు ఎద గాగమం బగు. '' ఎదము'' నందలి దకారము ప్రత్యయ మధ్యగత లఘువు కనుక ఊనిక లేనిది. అది వడియందు నిల్చి గతి భంగకారియగుచున్నది. ద్రౌపదిని పార్థుఁడు వివాహమాడునని యాశించిన ద్రుపదునకుఁ దా మేవురును నామెను బెండ్లాడఁ దలచినట్లు ధర్మజుఁడు ప్రకటింపఁగాఁ గలిగిన యాశాభంగము ఈ యతి భంగముచేఁ జక్కగా సూచింపబడినది. పరమధర్మ పరుండని ప్రసిద్ధికెక్కిన ధర్మజుడు పల్కిన పల్కు లోకవిరుద్ధమై ధర్మభంగకారి యగుచున్నదన్న ద్రుపదుని యంతర్గత భావమునుగూడ ఛందమందలి గతిభంగము వ్యక్తము చేయుచున్నది. ధర్మభంగము లేనిచోఁ బాండవు లేవురు ద్రౌపదిని వివాహమాడుట ద్రుపదుని కనిష్టముకాదు. కనుకనే ఇచటి యతిభంగము నాత్యశ్రవ్యమై యున్నది.

''యతియందు ధాతునామభేదము నిషిద్ధమైనను గ్వాచిత్కముగా నంగీకరింపబడినది. ''ప్రత్యయాదౌ...క్వచిత్'' అని క్రియాపదమునకు ప్రత్యయాదిచ్ఛేద మంగీకరింపఁబడినది. స్వరసంధియందు ఉత్తరపదాది స్వరమునకు బూర్వాంతవర్భావ మంగీకరింపబడియుండుటచే (పూర్వాంతవత్ సర్వసంధౌ) ''అయ్యెదము'' నందు ''ద'' ప్రత్యయాదిగా గ్రహింపఁదగి యున్నది. కనుక అల్పమైన యూఁతగలదై పద్యమందలి యశ్రావ్యతను కొంతవరకు తగ్గించుచున్నది.

''కవిత్రయంవువారి కందవులందలి గతి భంగవులు పెక్కుపట్టుల రసాదివ్యంజనముకొఱకు బుద్ధిపూర్వకముగఁగావింపఁబడిన శిల్పవిశేషము లగుట ఈవిధముగ ననుశీలించి గ్రహింపవచ్చును''

ఈ వ్యాఖ్య రచయితకుఁ గాల వ్యాకరణ ఛందోలంకార వైదుష్యాన్ని ఉద్ఘోషిస్తున్నది. ''లాట్టురుజ్ఞ పరంబగు నప్పుడు ఎదగాగమంబు అన్నది బాలవ్యాకరణ క్రియాపరిచ్ఛేదమందలి 23–వ సూత్రమందలి పూర్వ భాగం.

ఎదగాగమం దేనికి అవుతుంది? ఆగమము, ఆదేశము, ప్రత్యయము, కిత్తు అంటేకూడ తెలియదా, లేక ఏనాడో చదివినది కావటంవల్ల వ్యాఖ్యాతలు మరచిపోయారా? బహుశః మరచిపోయివుంటారు. '' ఆగమమానాం ఆగమి ధర్మివైశిష్ట్యమ్'' అన్న పరిభాషేందు శేఖరోక్తి వారి స్మృతిపథం నుంచి తాత్కాలికంగా తొలగివుంటుంది. ఆగమం దేనికి విహితమో అద్దాని ధర్మిని ఆగమం పొందుతుంది. ఎదక్కు దేనికి విధింపబడింది? వ్యాఖ్యాతలు రుజ్ఞనకు అనిభావిస్తున్నారు. ఈలెక్కలో ఎదక్కు కిత్తు కావడంవల్ల ముషర్ణకమునకు పరమున చేరవలసివుంటుంది. ప్రత్యయమున కంతాగమమైనప్పుడు ఎదక్కు ప్రత్యయ ధర్మం పొంది ప్రత్యయమవుతుంది. ఈ పక్షములో ము ఎద అన్నది మెద అయి ధాతువగు ''అగు'' నకు చేరి అగుమెద అన్న రూపం ఏర్పడవలసి ఉంటుంది. ఇష్టరూపము అయ్యెదము కాని అగుమెద కాదు.

ఇంతకూ ఈ తికమక లెట్లేర్పడ్డవి? ఎదక్కు కిత్తు కావడంవల్ల ధాతువునకు అంతాగమ మౌతుంది. అంటే ''అగు'' ధాతువునకు '' ఎద'' అన్న ఆగమము అంతమున చేరి క్రియాపరిచ్ఛేదమునందలి 100–వ సూత్రముచే ఆయెద అని యేర్పడును. ఎదాగమము ధాతువునకు అవుతున్నది. కనుక ధాతు ధర్మం కలది అవుతున్నది. అంతేకాని '' ఎద'' ముషర్ణకం

మీద చేరదు. ప్రత్యయ ధర్మమూ పొందదు. కారణాలు 1. " ఎదక్కు" కిత్తుకావడం. 2. ధాతువునకు విధింపబడటం. కనుక " ఎదుము" ప్రత్యయ మనుట వ్యాకరణ పరిచయాభావాన్ని చాటుతుందేతప్పసత్యముకాదు. దీనినిబట్టి "ప్రత్యయాదౌ.... క్వచిత్" "పూర్వాంతవత్ స్వరసంధౌ" ఇత్యాదిసూత్రానుసంధానం వ్యర్థం.

ఇక ఛందోవిషయము పదవిరామపూర్వకమైన యతినియమమును తెలుగు కవులలో కవిత్రయముగాని, ఆతరువాతివారుగాని ఎంతవరకు పాటించారు? పద మధ్యగతవర్ణముపై కందములోగూడ ఎన్ని చోట్ల యతిని నిల్పలేదు? ఆభంగములన్ని రసాదివ్యంజకములా? ఇట్టి వాదములు అపలాపములే కాని సిద్ధాంతములు కావు.

ఛందః శిల్ప కర్తలు మరీ విచిత్రవాదం ప్రతిపాదిస్తున్నారు. పద్యం కుంటితే అందొక ధ్వని, ఒక సొరస్యం ఉంటుందంటున్నారు. బహుశః అది కుంటిరసమో, కుంకుడు రసమో అయిఉంటుంది. త్రాగుబోతుకు గతిస్ఖలనమే కాదు. పదస్ఖలనంకూడ ఉంటుంది. దీనిని విద్వత్కవి ఎలా ప్రతీయమానం చేస్తున్నాడో చూడండి.

మధురసాన్మధురం హి తవాధరం

తరుణి! మద్వదనే వినివేశయ

34 మమ గృహాణ కరేణ కరాంబుజం

పథ పతామి హహా బథ భూతలే.

ఇచట వర్ణితుని మధుపానోన్మత్తత భాష తెలియని వాడికి గూడ ప్రస్ఫుటమే. అయితే శ్లోకం కుంటలేదు. కుంటక పోవడం వల్ల స్ఖలద్గతి ప్రతీయమానం కాకపోవడం లేదు.

ఇలాంటి అపలాపాలకు ఛందః శిల్పమున కొదవ లేదు. అమరకోశం అమరసింహుడు వ్రాశాడని దానికి క్షీరస్వామి లింగాభట్టు మున్నైనవారు వ్యాఖ్యలు వ్రాశారనీ ఇంతవరకు లోకం భావిస్తున్నది. డాక్టరు మాధవశర్మగారు తాము పరిశోధించి లింగాభట్టీయంకూడ అమరసింహుడే వ్రాశాడని తేల్చారు. ఎందుకంటే "సుతరాం ఆద్రియతే ఇతి సుందరం అని అమరసింహుని నిర్వచనము" అనీ; "శిల్పం నిపుణకర్మ" అని అమరసింహుని నిర్వచనం" అనీ మూడవ పేజీలోనూ, " మండయత్యలంకరోతీతి మండనం" అని అమరసింహుని నిర్వచనము" అని 33-వ పేజీలోనూ " ఇంద్రస్య ఆత్మనఃలింగం ఇంద్రియం" అని అమరసింహుని నిర్వచనమని 31-వ పేజీలోనూ వ్రాస్తున్నారు, కనుక విద్వల్లోకం ఇకనైనా భ్రాంతిపడరాదు.

మరొక విశేషం, సిద్ధాంతకౌముది నుండిమహాభాష్యం దాకా లీలామాత్రంగా ఉదహరిస్తున్న శర్మగారు "తక్షాతంతువాయ నాపితరజకాదులు" " ఏకమాత్రికము" "ద్విమాత్రికము" అనీ "తదధీతే, తద్వేద" అన్న అర్థాలలో మీమాంసికుడు, ఛాందసికుడు అనీ అనేక పర్యాయాలు ప్రయోగిస్తున్నారు. కనుక ఇవి ముద్రా ప్రమాదాలు కావు. వీనిని సాధువులని గ్రహించి పండితులు మననం చేసుకోవలసి వుంటుంది!

ఏది ఎలా ఉన్నా డాక్టర్ శర్మగారు " ఆంధ్రమహాభారతము, ఛందః శిల్పము" వ్రాయడానికి ఎంతో శ్రమ చేశారు. అందు ఏమాత్రం సందేహం లేదు, కాని తాము సేకరించిన విషయాలను మననం చేసుకొని అనుభవంతో సమన్వయించి వ్రాసి ఉంటే ఉత్తమోత్తమమైనా గ్రంథం వెలువడి ఉండేది, వీటన్నిటికంటే సాహిత్య విమర్శకు అత్యంతావశ్యక మైనది సహృదయత్వము, ఆ తరువాతనే శాస్త్రోక్తి, అందుకనే ధ్వనికారు డన్నాడు:

"శబ్దార్థ శాసన జ్ఞానమాత్రేణైవ నవిద్యతే
వేద్య తేసతుకావ్యార్థ తత్త్వజ్ఞైరేవ కేవలమ్."

# 3. ప్రాసలు - అనుప్రాసలు

''నిరుపాదాన సంభార మభిత్తావేవ తన్వతే
జగచ్చిత్రం నమస్తస్మైకలాశ్లాఘ్యాయశూలినే॥
అమరీ కబరీభారభ్రమరీ ముఖరీకృతమ్
దూరీకరోతు దురితం గౌరీచరణ పంకజమ్॥''

ఇందు గల డందు లేడను
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలడు దానవాగ్రణివింటే!

ఈ పద్యాల వినకిలోని తేడా ప్రతి చెవికీ ప్రస్ఫుటమే, మొదటిదాని శ్రుతిలో విశేషం లేదు, మలిదానిలో రేఫము, తుదిదానిలో బిందుపూర్వక 'డ' కారము విశేషంగా వినిపిస్తున్నవి. అయితే తొలిది అనుప్రాసమనీ, కడపటిది ప్రాసమనీ పెద్దలంటారు.



రెండింటనూ వినిపిస్తున్నది బహుతరమైనా వర్ణావృత్తే, ఒకటి అనుప్రాసం అనీ మరొకటి ప్రాసంఅని ఎందుకంటున్నారు? ఈ ప్రాసానుప్రాసలకు నిజంగా తేడా ఉన్నదా? ఉంటే అది ఎలా ఏర్పడుతున్నది? ఈ ప్రశ్నలకు సమాధానం శబ్దాలంకార పరిశీలనంతో కాని లభించదు.

అలంకారం రెడం విధాలు, ఒకటి శాబ్దికం, రెండవది ఆర్థికం, ఈ రెంటికీ మూలం 'వైచిత్రి' లేదా సొగసు, ఈ వైచిత్రి లేక ఏ అలంకారమూ లేదు. శబ్దాలంకారాన్ని ప్రాచీనులు తిరిగి రెండుగా విభజించారు, ఒకటి యమకం, రెండవది అనుప్రాసం. యౌగికార్థాలను ఆవల ఉంచి యమకం అంటే ఏమో చూద్దాము.

''అవ్యపేత వ్యపేతాత్మా వ్యావృత్తిర్వర్ణ సంహతేః
యమకమ్, తచ్చపాదానా మాదిమధ్యాంతగోచరమ్.''
అని దండి;
''పదమనేకార్థమక్షరం చావృత్తం స్థాననియమే యమకమ్''
అని వామనుడు;
'అర్థేసతి అర్థభిన్నానాం వర్ణానాం సాపునః శ్రుతిః యమకమ్'
అని మమ్మటుడు;
''స్వరవ్యంజన సముదాయ పౌనరుక్త్యం యమకమ్''
అని రుయ్యటుడు నిర్వచిస్తున్నారు.

ఈ ఆచార్యుల తాత్పర్యం ఇలా సంగ్రహించుకోవచ్చు, (1) పదంకాని, అక్షరం కాని అనేకార్థం కావలె, (2) అది ఆ వృత్తం కావలె, (3) అందును భిన్నార్థంలో (4) ఈ ఆవృత్తి శ్రుతిగోచరం కావలె, అది స్థాననియమ మున్నపుడే సాధ్యం.

కాలుగాలును గేలు మోవి

మోవియును దాల్చి భోగి సమూహ మమరె

ఈ పాదాలలో పదావృత్తి ఉన్నా అర్థభేదం లేదు కనుక యమకం లేదు.

"నీవారము నీ విచ్చితి

నీ వారము గావు తండ్రి"

"కురువీర! వసింపగ నీ

కుఱు వీర!" అన్నవి యమకానికి లక్ష్యాలు, యమకంలో ఎన్నో భేదాలున్నవి, అయితే

"దేవుడాతండు కుడిటిని దేవునితండు" ఇలింటి వెక్కిరింతలకు సరసాలకు అధిక్షేపాలకు వినియోగపడినా ఇది కరుణం లోను, విప్రలంభంలోను సాధారణంగా పనికిరాదు, అరణ్యానికి వెళ్ళిపోయిన శ్రీరాముని గూర్చి

"కానకకన్న సంతానంబు గావున

కానక కన్న సంతానమయ్యో"

అంటూ దశరధుడు శోకించినట్లు అయ్యలరాజువారు అభివర్ణించారు, ఈ పాదం కొంత నయం, తతిమ్మా పాదాలు మరీ అన్యాయం, అందుకనే ఈ కవిగారి దశరధుడు నిఘంటువు చూచి యేడుస్తున్నాడని కట్టమంచివారన్నారు. మొత్తం మీద కోశ మపేక్షించని సుభోధపదంతో నిర్వహింపబడిన యమకం రుచించినంతగా అన్యం రుచించదు.

"రాజనందన రాజరాజాత్మజులు సాటి

తలప నల్లయ వేమధరణీపతికి"

అన్న పద్యంకంటె

"పాఱ జూచిన రిపు సేన పాఱజూచు

వింటి కొరగిన రిపురాజు వింటి కొరగు"

అన్నపాదాలు హాయిగొల్పవా? యమకంలో వున్న గుణాలను గ్రహించే

"వృత్తిం వర్ణసంఘాతగోచరాం యమకం విదుః।

తత్తునైకాంత మధుర మతః పశ్చాద్విధీయతే॥

అని ఆచార్య దండి అన్నాడు.

ఇంక అనుప్రాసతత్త్వం చాదాము,

"వర్ణావృత్తిరనుప్రాసః పాదేషుచ పదేషుచ।

పూర్వానుభవబోధినీయద్యదూరతా॥

అని కావ్యాదర్శమూ; ''వర్ణ సామ్యమనుప్రాసః'' అని కావ్య ప్రకాశము; ''వ్యంజనమాత్ర పౌనరుక్త్యమ్'' అని అలంకార సర్వస్వమూ పేర్కొంటున్నవి. సంగ్రహంగా వీటి తాత్పర్యం ఇది. (1)వర్ణావృత్తి ఉండవలె, (2) ఆవృత్తమగునది వ్యంజనం కావలె,(3) ఆవృత్తవ్యంజనం ఏకైక పదగతం కారాదు, (4) ఆ ఆవృత్తిలో స్వరవైషమ్యం ఉన్నా పట్టింపు లేదు, (5) ఆ ఆవృత్తి అతివ్యవహితం కారాదు, (6) ఇలాంటి ఆవృత్తి పూర్వానుభవబోధినియై చమత్కారకారి కావలె.

'' ఆదిజుడైన బ్రహ్మ'' అన్నప్పుడు వర్ణావృత్తి లేదు, కనుక ఇది అనుప్రాసకు లక్ష్యంకాదు.

''ధళుధళుక్కున నింగి దాటించె బలుమాఱు

నీ రాళ్ళగొంది, కన్నియ మెఱుంగు''

అన్న పాదంలోని 'ధళుధళుక్కున' అన్నపదంలో ళకార ఆవృత్తి ఉన్నది. ఆలాగే హాలాహలము, కోలాహలము, ఆలవాలము అన్నపదాలలో లకారావృత్తి ఉన్నది. అయినా ఇవి అనుప్రాసానికి విషయాలు కావు. ఈ ఆవృత్తి శబ్దసిద్ధమే కాని కవి కల్పనాసిద్ధం లేదు.

''అ ఆ ఐ ఔలకు మరి ఇ ఈలు'' అన్నప్పుడు స్వరావృత్తి మాత్రమే కనుక అనుప్రాసం కాదు.

''గాండీవ గుణరవం బొండొండు చెలగంగ'' అన్నప్పుడా వృత్త దకారంతో స్వరభేదం ఉన్నా అనుప్రాసం ఓసరిల్లటంలేదు. 'నా కవితావధూటి వదనంబు'' అన్నప్పుడు నకారావృత్తి లేకపోలేదు, అయినా ఇట్టిది వ్యవహితత్వంవల్ల అనుప్రాసం కాకపోతున్నది,

'జలధి వీచీ వాచ్య జలిచాకెగాయని

అక్కున నందంద యలమి యలమి''

ఇందులో చమత్కారం లేదు కనుక ఈ పాదంలోని 'అందంద', 'అలమి యలమి' అన్నవి అనుప్రాసకు లక్ష్యాలు కావు.

ఆలంకారికులు ఈ అనుప్రాసంలో అయిదు భేదాలను చెప్పుకొన్నారు. అవి 1. ఛేకము, 2. వృత్తి, 3. శ్రుతి, 4. లాటము, 5. అంత్యము, ఛేకానుప్రాసలక్షణాన్ని ''సోऽనేకస్యసకృత్పూర్వః'' అని కావ్యప్రకాశమూ, ''ఛేకోవ్యంజన సంఘస్యసకృత్సామ్యమనేకధా'' అని సాహిత్యదర్పణమూ పేర్కొంటున్నవి. అంటే అనేక వ్యంజనాలు ఒకసారి ఆవృత్తి పొందినప్పుడు ఛేక మౌతుంది.

''గనయంబున్ గొనయంబు నెన్నడుముతో గర్ణావతంసంబులో, చనుదోయింగనుదోయి సాయకముతో సంధాన హస్తంబుతో'' ''చరమసంధ్యాకాల సంపుల్ల మల్లికాస్తబకపంక్తులతోడ సరసమాడి'' – ఇందు 'గనయంబున్ గొనయంబు' 'సంపుల్లమల్లిక' అన్నవి లక్ష్యాలు, స్వల్పమైన స్వరంమార్పుతో ఈ వ్యంజనావృత్తి మరింత రంజకంగా ఉంటుంది.

''మును చేసిన వైరంబును మునిచేసిన వైరము'' అన్న దానిని దృష్టాంతంగా తీసుకోవచ్చు. ఆలాగే పూర్వపదంకాని తదంశంకాని ఉత్తరపదంలో భాగంగా ఆవృత్తమైనప్పుడు చక్కని వైచిత్రి ఏర్పడుతుంది.

''గంగాసంగము మిచ్చగించునె మదిం. గావేరిదేవేరిగా నంగీకారమొనర్చునే''. ''తిమ్మారెడ్డికి సరియె తతిమ్మా రెడ్లెందరేని'' అన్నవి ఇచ్చట ఉదహరించవచ్చును. ఛేకాను ప్రాసంనుంచి వేరుచేస్తూ, '' ఏకస్యాప్యసకృతోపరః'' అని మమ్మటుడూ;

''అనేకస్యైకథా సామ్యమసకృద్వాప్యనేకధా

ఏకస్యసకృదప్యేష వృత్త్యానుప్రాస ఉచ్యతే''

అని విశ్వనాథకవిరాజూ వృత్త్యను ప్రాసాన్ని నిర్వచిస్తున్నారు, అంటే అనేక వ్యంజనాలకు స్వరూపంలో ఏకవారావృత్తి కానీ, అనేక వారావృత్తి కాని, అనేక వ్యంజనాలకు అనేకథా అసకృత్సామ్యంగాని, ఏకవ్యంజనానికి సకృత్సామ్యంగాని అసకృత్సామ్యంగానీ వృత్త్యనుప్రాసం వీనికి క్రమంగా

(1) కరమున నిమిరెన్

(2) రాకాసుధాకరుకరములట్లు

(3) హరి దంత ద్విప దంత కుంత శిఖరాహంకార నిశ్శ్రింతనిర్జర రాజార్జితవజ్ర జర్జరితము

(4) ఆశావకాశంబులన్ – అన్నవీ;

''దూరాన నారాజుకేరాయిడౌనో

ఈరోజు నారాతలేరాలపాలో'' అన్నవీ లక్ష్యాలు. ఈ వృత్త్యనుప్రాసం వెర్రితలలు వేసినప్పుడు ఏకాక్షరాది పద్యాలుగా రూపొందుతవి, ఇలాంటివి పాండిత్యపు మూలుగులే కాని కచ్ఛపీమూర్ఛనలు కావు.

పూర్వస్వరంతోగూడ వ్యంజనము యథాతథంగా ఉదాంతమునగాని ఆవృత్తమైతే అంత్యానుప్రాసమని విశ్వనాథకవిరాజు నిరుక్తి. అంత్యాక్షరానికి పూర్వాక్షరంమాత్రానియతికమైనా సరిపోతుంది.

జగదవన వినోదా, సత్యజాతప్రమోదా!

జయజయకల్పితసాగరతాపా

జయజయ ఖండిత శంకరచాపా

హత విమతజీవ, శ్రీకాకుళాంధ్రదేవ!

''చిన్నారికళ్ళల్లో కన్నీటిజల్లు

కన్నీరు చూపకే కరగు నెడదల్లు''

అన్నవి లక్ష్యాలు, కాని

''తడియొత్తు చీరతో దాది కౌగిట జేర్చి

చూపంగ గన్నార జూడనైతి

తడవియాడకమున్న తల్పాడు మనిపట్టి

వడకంగ సెజ్జపై వ్రాల్చనైతి''

అన్న పాదాలలో అంత్యానుప్రాసం ఉన్నదని భ్రాంతిపడరాదు.

జి.వి.కృష్ణరావు

''తాత్పర్య భేదవత్తు లాటానుప్రాసః'' అని అలంకార సర్వస్వం లక్షణం చెబుతున్నది. దీనికి ''కమలాక్షు నర్చించు కరములు కరములు'' అన్నది లక్ష్యమని వేరుగా విశదీకరింప నక్కరలేదు, దాఙ్మాత్రంగా ఇదీ శబ్దాలంకార స్వరూపం.

ఇంక ప్రాసస్వరూపం చూదాము: పాదద్వితీయాక్షరం ప్రాస, పాదాదిని గురులఘువులలో ఏది నిలిచిన దానినే తక్కిన పాదాదులందు నిలుపవలసి ఉంటుంది. ప్రాసాక్షరానికి మూరుబిందువుగాని విసర్గకాని ఉంటే అదికూడ ఆవృత్తం కావలె, దీనిని సమప్రాస మంటారు. ఇదికాక సంయుతా సంయుతప్రాసము, వికల్పప్రాసము, ఉభయప్రాసము, ప్రాసమైత్రి ప్రాసము, స్వవర్గజప్రాసము, ఋప్రాసము, అభేదప్రాసము, సంధి గతప్రాసము అన్న వానినిగూడ ఛాందసీయులు పేర్కొన్నారు.

ఈ ప్రాసప్రపంచాన్ని సుకరము, దుష్కరము, ద్వ్యక్షరము, త్ర్యక్షరము, చతురక్షరము, అంత్యప్రాసము, అనుప్రాసము అని తెలుగు లాక్షణికులు విభజించారు, వీటిని శబ్దాలంకార విశేషాలుగా అనంతుడు, అప్పకవి పేర్కొన్నారు.

ఇప్పుడు ప్రాసానుప్రాసల తత్త్వమూ, పరస్పర సంబంధమూ పరిశీలించవచ్చును.

శబ్దాలంకారమైన యమకం కాని, అనుప్రాంసకాని నాతివ్యవహితం, అంతకుమించిన స్థాననియతి లేదు, కనుక యమకమూ, అనుప్రాసమూ ప్రాసం కావటానికి ఎట్టి నిరోధమూ లేదు, ''లేమా దనుజుల గెలువగలేమా'', ''నాపాలి పారిజాతము గోపాలక చక్రవర్తి గొనిరానైతిన్'' ఇలాంటి పద్యాలను కోకొల్లలుగా లక్ష్యంగా ఉదహరించవచ్చును.

మరి తెలుగు ఛందఃకర్తలు ప్రాసంగా పేర్కొన్నదంతా అనుప్రాసం అవుతుందా? అప్పకవీయం పేర్కొంటున్న సంయుతాసంయుతప్రాసం. వికల్పప్రాసం, ప్రాసమైత్రిప్రాసం, స్వవర్గజప్రాసం, అభేదప్రాసం వంటివితక్క తక్కిన ప్రాసలన్నీ అనుప్రాస లవుతవి, అయితే దీర్ఘవృత్తపాదాలలోవలె సువ్యవహితం కారాదు, ఈ దీర్ఘ వృత్తాలలోగూడ ఏ పాదానికి ఆ పాదం తెగినా లేక మహాప్రాణమో, సంయోగమో ప్రాసాక్షరంగా నిలిచినా ఆ ప్రాసం అనుప్రాసం అవుతుంది.

అభంగవృత్తితో నిర్వహింపబడుతున్న ప్రాసం పద్యం సగంలోకాని, ఏకపాదంలోకాని సభంగమైతే అనుప్రాసంకాదు. దీనికి భారతంలోని 'ధృతరాష్ట్రుండు' అన్న పద్యంలోని కడపటి పాదమైన ''కానతగం బొందుట కార్యమీయుభయమున్ సంతుష్టిమైనున్కిన్'' అన్నది దృష్టాంతం. వాస్తవానికి ఈ వ్యత్యాసాలు పరిహృతమైతే ప్రాస అనుప్రాసం అవుతుంది.

అయితే కొందరు విద్వాంసులు ఇలా వితర్కిస్తున్నారు. అనుప్రాసం శబ్దాలంకారం. ఇది గద్యపద్యోభయ సామాన్యం, ప్రాసం ఛందోలంకారం, ఇది పద్యంలోనే ఉండదగినది. అందువల్ల ప్రాసము ప్రాసవే, అనుప్రాసము అనుప్రాసవే, అని భావిస్తున్నారు. కాని వీరు గద్యభేదం విస్మరిస్తున్నారు. గద్యభేదాలలో వృత్తగంధి ఒకటి. దీనిలో పద్యపాదాలు వుంటవి వాటితో ప్రాసకూడ గద్యంలో ప్రవేశించక తప్పదు. కనుక ప్రాసం పద్యైకవర్తి అన్నవాదం యుక్తిసహంకాదు. అనుభవసిద్ధం అంతకంటెను గాదు.

ఈ సంధర్భాన మరొక యుక్తినిగూడ పరిశీలించవలసి వున్నది, అనుప్రాసం శబ్దాలంకారమై ప్రాసం ఛందోలంకారమై భిన్నా లవుతున్నప్పుడు వాటి సొగసులుగూడ విభిన్నాలు కావాలి, మరి యీ విభిన్నత గోచరిస్తున్నదా? ప్రాసానుప్రాసాలు కలిసివున్న పద్యమే తీసుకొందాము.

అట చని కాంచె భూమిసురు డంబరచుంబిశిరస్సరిజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుటనటనానురూపపరిఫుల్ల కలాపకలాపిజాలమున్
కటక చరత్క రేణుకరకంపితసాలము శీతశైలమున్,

ఈ పద్యంలో ప్రాస మున్నది, అనుప్రాసమూ వున్నది. రెండూ వేరువేరు సొగసులను విరజిమ్ముతున్నవా? లేదు. ప్రాసం అనుప్రాసంలో లీనమై అనుప్రాస సౌందర్యానికి సహకారి అవుతున్నది.

కనుక అనంతాదులు పేర్కొన్నట్లు ప్రాసాలు శబ్దాలంకారాలేకాని విభిన్నాలు కావు. అయితే పద్యరచనా సౌందర్య మారాధించేవారు, ఛాందసీయులు పేర్కొన్న విపరీత ప్రాసలను కొన్నిటిని పరిహరించవలసి వుంటుంది.

# 4. స్వప్న శిల్పము - ధ్వని

మానవునకు నిద్రా స్వప్నాలు తక్కిన ఉన్నత శ్రేణి జంతు జాలానికి వలెనే స్వాభావికాలు. అయితే ఈ స్వప్నాలు ఎందుకు వస్తున్నవి? స్వభావ స్వరూపాలు ఏమిటి? అన్న ప్రశ్నలనుగూర్చి అతడు ఎప్పుడు ఆలోచించటం మొదలు పెట్టాడో తెలియదు. కాని వీటి ప్రస్తావన ఉపనిషత్తులలోను, దర్శనాలలోను, వైద్యశాస్త్ర గ్రంథాలలోను, పురాణేతిహాసాలలోను కనిపిస్తున్నది.

జాగరితస్థానో బహిఃప్రజ్ఞ స్సప్తాంగ ఏకోనవింశతిముఖః స్థూలభుగ్వైశ్వానరః ప్రథమః పాదః; స్వప్నస్థానోంతః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతిముఖః ప్రవివిక్తభుక్ తైజసోద్వితీయఃపాదః; యత్రసుప్తోనకంచన కామంకామయతే నకంచన స్వప్నం పశ్యతి తత్సుషుప్తం షుసుప్తంసుషుప్తన ఏకీభూతః ప్రజ్ఞాన ఘన ఏ వానందమయోహ్యానందభుక్‌చేతో ముఖః ప్రాజ్ఞః తృతీయః పాదః -- అని మాండూక్య మంటున్నది. అంటే బ్రహ్మమైన ఆత్మకు ప్రథమ పాదము వైశ్వానరుడు. ఈ



వైశ్వానరుడు జాగరిత స్థానుడు. బహిఃప్రజ్ఞుడు. ఈతనికి ఏడు అంగాలు, 19 ముఖాలున్నవి, ఇతడు స్థూల భుక్కు, రెండవ పాదము తైజసుడు, ఇతడు స్వప్నస్థానుడు, అంతః ప్రజ్ఞుడు, ప్రవివిక్తభుక్కు, మూడవ పాదం ప్రాజ్ఞుడు. ఇతడు సుషుప్తస్థానుడు, సుషుప్తుడైవుండి ఇతడు ఏకోరికను కోరటంలేదు. ఏ స్వప్నాన్ని పొందటంలేదు. ఆనందఘన రూపుడై ఆనందం అనుభవిస్తున్నాడు. ఇతడు చేతో ముఖుడు అని మాండుక్యం అభివర్ణిస్తున్నది.

''కరణోపరమే జాగ్రత్సంస్కారోర్థ ప్రబోధవత్
గ్రాహ్య గ్రాహక రూపస్ఫురణం స్వప్నావస్థా భవతి
తత్ర విశ్వ ఏవజాగ్రద్వ్యవహారలోపాన్నాడీచరం
తైజసత్వ మవాప్య వాసనా రూపకమ్
జగద్వైచిత్ర్యం స్వభానాభాసయన్ యథేప్సితం స్వయభుంక్తేం

అని పైంగ లోపనిషత్తు అభివర్ణిస్తున్నది. అంటే స్వప్నావస్థలో ఇంద్రియాలు విరతిపొందుతున్నవి. జాగ్రదవస్థలో పొందిన సంస్కారార్థాలు, గ్రాహ్య గ్రాహక రూప స్ఫురణంతో మేలుకొంటున్నవి. ఈ అవస్థ యందు విశ్వుడే జాగ్రద్వ్యవహార లోపంవల్ల నాడీ చరమైన తైజసత్వం పొంది, తన కాంతిచే వాసనా రూపకమైన జగద్వైచిత్ర్యాన్ని భాసింప జేస్తూ యథేప్సితంగా తనకు తాను అనుభవిస్తున్నాడు- అని ఈ ఉపనిషత్తు స్వప్నాన్ని గూర్చి వ్యాఖ్యానిస్తున్నది. వైద్య గ్రంథాలు కొన్ని రకాల కలలు వ్యక్తి ఆరోగ్యాన్ని, కొన్ని రకాల కలలు అనారోగ్యాన్ని సూచిస్తావని చెబుతున్నవి. ఈ వ్యావహారిక ప్రపంచం స్వప్న ప్రపంచం వంటిదే కాని పరమార్థ సత్యం కాదు అని చెప్పటానికి మాధ్యమిక కలలను దృష్టాంతరీకరిస్తూ వచ్చారు, కలలురానున్న శుభాశుభాలను సూచిస్తాయని

వివరించే ఘట్టాలు పురాణేతిహాసాలలో ఎన్నో ఉన్నాయి. ఈనాటికీ ఈ విషయాన్ని నమ్మి దుస్స్వప్నాలకు శాంతి చేయించుకోవాలని చెప్పేవారు ఎందరో ఉన్నారు. ఏది ఎలా ఉన్నా, స్వప్నాలలో కనిపించే విచిత్రరూపాలు, అద్భుత చర్యలు, అతిలోక వృత్తాలు చూచి అవి లోకోత్తరాలనీ జాగ్రదవస్థతో వీటికి సంబంధం లేదని భావించడం సహజమే.

అయితే, మన ప్రాచీన శాస్త్రకారులు జాగ్రదవస్థకూ, స్వప్నావస్థకూ ఉన్న కార్య కారణభావం గుర్తించక పోలేదు, కాని,స్వప్నాలు ఎందుకు వస్తాయి? ఎలా వస్తాయి? వైచిత్రి ఎందుకు ఏర్పడుతున్నది? వీని ఆంతర్యం ఏమిటి? జాగ్రదవస్థలతో వీనికున్న సంబంధం ఏమిటి? – అన్న విషయాలను గూర్చి విశదంగా ఆలోచించినట్లు కనబడదు.

స్వప్న స్వరూపస్వభావాలను గూర్చి, శిల్పాన్ని గూర్చి మొదటిసారిగా వివరించినవాడు సిగ్మండ్ ఫ్రాయిడ్. అతడు 1909 లో మొదటిసారిగా స్వప్నాలను వ్యాఖ్యానిస్తూ ఉపన్యాసా లిచ్చాడు. ఆ తరువాత యంగ్ ఎడ్లర్ మున్నైనవారు మరికొన్ని విశేషాలను వివరించారు.

ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం ఆత్మను మూడు భాగాలుగా విభజించవచ్చును, 1. వైశ్వానరము (Conscious), 2. తైజసము (Preconscious), 3. ప్రాజ్ఞము (Unconscious). మానవుడు నిద్రపోతున్నప్పుడు వైశ్వానరం పనిచేయదు. అది కూడ నిద్రపోతుందని చెప్పవచ్చు. అంటే జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు పనిచేయక పోవటంవల్ల అహంత అంతర్ముఖమవుతుంది. అందువల్ల దేశ కాలాలు జారిపోతాయి. జాగ్రదవస్థలో ఉన్నప్పుడు ప్రాజ్ఞంలో దాగిఉండే వాసనల ఇష్టాలను, తనకు అంగీకరించరాని వాటిని వైశ్వానరం అణచివేస్తుంది, ఇలా అణచివేయబడి జాగ్రదవస్థలో సిద్ధి చేకూర్చుకోలేని ఈప్సితార్థాలు స్వప్నావస్థలో విహారానికి బయలు దేరుతవి. గడచిన రెండు మూడు రోజుల్లోని అముఖ్య సంఘటనలలే గుర్రాలు వీటికి వాహనాలు, ఈ సంఘటనల్లో సాధారణంగా అవాంతరాలవల్ల ఆపివేసిన ఆలోచనలు కాని, ఆలోచించే ఓపిక లేక వదలి వేయబడినవికాని,, అసలు వైశ్వానరంలోకి రానీకుండా తైజసం త్రొక్కిపట్టిన ఆలోచనలు కాని, అముఖ్యంగా కనిపించటం వల్ల జాగ్రదవస్థలో అపరిష్కృతంగా ఉండిపోయిన ఆలోచనలు కాని ఉంటవి.

స్వప్నభావాలన్నీ ఆత్మాశ్రితాలే కలకకేవాడు కలకు నాయకుడు.

అపారే కావ్య సంసారే కవి రేవ ప్రజా పతిః యథాస్మై రోచతె విశ్వం తథేదం పరివర్తతే– అని ధ్వనికారుడు ఉట్టంకించాడు. ఇది అక్షరాల స్వప్నానికి అన్వయిస్తుంది. స్వాపియే స్వప్న కథానాయకుడు. అతని అవ్యక్త ఈప్సి తార్థానుగుణంగా స్వప్న ప్రపంచం పరివర్తనం పొందుతుంది.

ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చును. కొన్ని కొన్ని కలల్లో స్వాపి కనిపించడే. అలాంటి కలలకు స్వాపి నాయకుడు ఎలా అవుతాడు? అవి ఆత్మాశ్రితాలు ఎలా అవుతాయి?

కలలో కనిపించే వ్యక్తులలో స్వాపి లేనప్పుడు, ఆ కనిపించే వ్యక్తులలోనే ఎవని మాటుననో ఒకని మాటున అతడు దాగి ఉంటాడు. ఒక్కొక్కప్పుడు ఆ గోచరించే వ్యక్తులలో అతడు ఉంటూ మరొకనిమాటునకూడా దాగి ఉండవచ్చును.

జి.వి.కృష్ణరావు

వేరొకప్పుడు అతని వెనుక మరొకవ్యక్తి దాగియుండ వచ్చును. స్వాపి ఆ మరొకవ్యక్తికీ, తనకూ నిగూఢ సాధర్మ్యం ఉన్నదని భావించి, దానిని తనకు ఆపాదించుకొనటానికి ఇలా చేస్తాడు. మరొకప్పుడు కలలో స్వాపి ఉంటాడు; ఇతర వ్యక్తులు ఉంటారు. అయితే జాగ్రత్తగా పరిశీలించినపుడు ఇతర వ్యక్తులు స్వాపి రూపాంతరాలుకాని అన్యులుకారు. బెర్నార్డ్‌షా నాటకాలలో ఈ తత్త్వమే గోచరిస్తుంది. దాదాపు అతని పాత్రలన్నీ అతని ప్రతిబింబాలే. స్వాపి అంతరాత్మ అంటే తైజశాంసం ఆమోదించిన విభిన్న భావాలున్నప్పుడు ఇలాటి విభిన్న రూపకల్పన జరుగుతుంది.

ఇదంతా నిజమేకావచ్చు. కాని అసలు ప్రశ్న అలాగే ఉన్నది. ఇష్టావాప్తే స్వప్నాల పరమ ప్రయోజనమైతే స్వప్నాలన్నీ సుఖప్రదంగా ఉండాలి. కోరుకున్న కోరిక నెరవేరనప్పుడు, సంతోషం భగ్నమైనప్పుడు దుఃఖం కలగటం సహజంకదా? అలాంటప్పుడు కొన్ని స్వప్నాలు సుఖప్రదంగాను, కొన్ని దుఃఖకారులుగాను, కొన్ని తటస్థంగాను ఎందుకు ఉంటున్నవి? పీడకలలు ఎందుకు వస్తున్నవి? చెట్టు నడుస్తున్నట్టు, మానవులు ఆకాశంలో ఎగురుతున్నట్టు, సింహం మాట్లాడుతున్నట్టు, అగ్ని చందన శీతలంగా ఉన్నట్టు స్వప్నాలలో చూడటం కద్దు. ఇలాంటి లోక విరుద్ధ దృశ్యాలు, అనుభవాలు ఎలా కలుగుతున్నవి?

స్వప్నం నిద్రాభంగం పాడమనీకుండా చూస్తుంది. అందువల్ల ప్రాజ్ఞాంశంలో దాగియున్న
14 తీరని కోరికలను పురస్కరించుకొని బయలుదేరే దృశ్యాలను, భావాలను వైశ్వానరంలో ప్రవేశించకుండా, ఆ భావాలకు అనుగుణమైన చర్యలను జ్ఞానకర్మేంద్రియాలకు వైశ్వానరం ఆదేశించవలసిన అవసరం రాకుండా చేయటానికి తైజసం నిరోధిస్తుంది. అందువల్ల స్వప్నభావాలు, దృశ్యాలు తైజసానికి లోబడి దాని ఆమోదంకోసం క్లుప్తీకరణ (condensation) వ్యత్యయీకరణం (Displacement) మిలితీకరణం (combination) విపర్యయీ కరణం (Invertion) సంకేతీకరణం (symbolization) పొందుతవి. వికల్పభావాన్ని స్వప్నం చిత్రించలేదు. అందువల్ల వికల్ప విషయాలను ఒకదాని ప్రక్క మరొకదానిని చేరుస్తుంది. పోలికలను కదుపులను చెప్పవలసివస్తే పోలికలున్న వాటి నన్నిటిని ఒకటిగాను, కదుపును ఒకదాని ద్వారాను చూపిస్తుంది. అందువల్ల స్వప్నంలోని అర్థాలు, దృశ్యాలు విచిత్రంగా, అలౌకికంగా కనిపిస్తాయి. వాస్తవానికి వుత్తమకావ్యంలో వాచ్యార్థం ఒకటీ తద్విలక్షణమైన వ్యంగ్యార్థం మరొకటి వుంటున్నట్లే, స్వప్నంలోకూడా వ్యక్తార్థం ఒకటి, అంతరార్థం మరొకటి వుంటాయి. వాచ్యార్థం ఒక్కొక్కప్పుడు అన్వయాద్విక్లేశం లేక సామాన్యంగా వుంటుంది. రాజుగారి పెద్దభార్య పతివ్రత అన్నప్పుడు అన్వయక్లేశం లేదు. అయినా చిన్నభార్య శీలవతి కాదన్న వ్యంగ్యార్థం స్ఫురిస్తూనే వున్నది. మరొకప్పుడు వాచ్యార్థం అన్వయంపొందక విడ్డూరంగా వుంటుంది. ఉదాహరణకు అమ్మబోతే అడవి, కొనబోతే కొరవి అన్న వాక్యమే తీసుకోవచ్చు. అమ్మకానికీ అడవికీ, కొనడానికీ కొరవికీ సంబంధం ఏమిటి అని తోస్తుంది. నిర్జనారణ్యంలో వస్తువును అమ్మాలంటే ఎవరు లభిస్తారు? కొరవిని పట్టుకోలేము. పట్టుకుంటే కాల్చివేస్తుంది. అలాగే కొనటం అసాధ్యము అన్న అర్థం భాసిస్తుంది. అలాగే అభివ్యక్త స్వప్నం ఒక్కొక్కప్పుడు సర్వసామాన్యంగా వుంటుంది. వేరొకప్పుడు విడ్డూరంగా అలౌకికంగా వుంటుంది. ఉదాహరణకు యీ అభివ్యక్త స్వప్నాలనే తీసుకోవచ్చును.

ఒక స్త్రీ తన స్తనవల్కలం స్తన్యసిక్తమైనట్లు కలగన్నది. మరొక పాశ్చాత్యవనితకు తన 15 ఏండ్ల కూతురు చనిపోయినట్లూ, ఆ దేహం తన ఎదుటి పెట్టెలో వున్నట్లూ కలవచ్చింది. ఈ స్వప్నాలలో ఇష్టావాప్తి జరిగిందా? వీని అంతరార్థం ఏమిటి?

మొదటి కలగన్న ఆవిడ తిరిగి గర్భం తాల్చింది. మొదటి కాన్పులో బిడ్డకు పాలిచ్చుకొందామంటే తెల్లజీరకూడా కనిపించలేదు. ఈ మలి కాన్పుకైనా బిడ్డకు పాలిచ్చుకోగలనా అని ఆందోళన పడుతున్నది. అలాంటి తల్లికి కలిగే కోర్కె ఏమిటి? స్తన్యసంవృద్ధేకదా? అదే స్వప్నంలో వ్యక్తమైంది. సంగతి సందర్భాలు స్వప్నస్వరూపం. తెలిసిన వారికి వాచ్యార్థంగావున్న అభివ్యక్త స్వప్నం ఆమె వితర్కాన్ని ఆక్షిప్తం చేస్తున్నది.

ఇంక రెండవ కల అభివ్యక్తరూపం దారుణంగా కనిపించక తప్పదు. ఏ తల్లి తన కన్న బిడ్డ చావుకోరుకుంటుంది? స్వప్నం ఇష్టావాప్తి సూచకమన్న సిద్ధాంతం ఏలానిలుస్తుంది? దీని అంతరార్థం ఏమిటి?

ఇక్కడ ప్రకరణాదిక జ్ఞానం ఆవశ్యకం. ఈ రెండవ కలగన్నది జర్మనీ గృహిణి. ఈ కల గనటానికి ముందరి సాయంకాలం స్నేహితురాండ్రు బాక్స్ అన్న ఆంగ్ల పదానికున్న అర్థాన్ని గూర్చి చర్చించుకొంటూవుంటే ఆమె విన్నది. జర్మన్ భాషలో పేటికను చెప్పే విభిన్నపదాలు చర్చకు వచ్చాయి. ఆ గృహిణికి పేటికార్థాన్ని చెప్పే జర్మన్ గ్రామ్యపదం తోచివుంటుంది. ఆ గ్రామ్య పదానికి పేటికలనీ స్త్రీ గుహ్యాంగమనీ అర్థం. పేటికలో శిశువు అంటే గర్భకోశంలో శిశువు. ఆమెకు తాను గర్భవతి కావటం ఇష్టంలేదు. పుట్టకముందే శిశువు చనిపోతే బాగుండునని ఆ గర్భమేర్పడిన రోజుల్లో అనుకొనేది. వాస్తవానికి ఆ రోజుల్లో కడుపును పిడికిటి పోటులతో పీడించింది. అయితే ఆ కోరిక 15 ఏండ్ల క్రిందటిది. తరువాత ఆమెలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఇంతకూ ఈ స్వప్నం 15 సంవత్సరాల క్రిందటి కోర్కెను వ్యక్తం చేస్తున్నది.

ఇంతకూ చెప్పుకోవలసింది ఏమంటే, స్వప్నంలో ఉత్తమకావ్యంలో వలెనే రెండు అంశాలు ఉంటవి (1) అభివ్యక్త స్వప్నం. దీనినే ఫ్రాయిడ్ manifest dream అన్నాడు. ఇది కావ్యంలోని వాచ్యార్థం వంటిది. వాచ్యార్థం గ్రహించినంత మాత్రాన కావ్యాత్మ అర్థం కాదు. అందుకనే ధ్వనికారుడు –

''శబ్దార్థ శాసన జ్ఞాన మాత్రేణైవ నవేద్యతే
వేద్యతే సహి కావ్యార్థ తత్త్వజ్ఞై రేవ కేవలమ్''

అంటున్నాడు. వ్యాకరణము, కోశము గ్రహించినంత మాత్రాన కావ్యార్థం అవగతం కాదు. ప్రకరణాదికం వూహించగలిగిన సహృదయునకే అది అర్థం అవుతుంది. అలాగే అభివ్యక్త స్వప్నంలోని అంతరార్థం (Latent Dream content) స్వప్న స్వరూప స్వభావాలు స్వాపి జీవితాది ప్రకరణం తెలియని వానికి బోధపడవు. కనుక కావ్యార్థానికి స్వప్నార్థానికి సామ్యం ఉంది. అందుకనే రసగంగాధర కర్త ''విభావాదీనామపి స్వప్న తురగాదీనా మివ, రంగరజతాదీనామివ సాక్షి భాస్యత్వమ విరుద్ధమ్'' అని పేర్కొన్నాడు. అయితే పండిత రాయలు విభావాదులు స్వప్న తురగాదులు విరుద్ధాలు కావని పేర్కొన్నాడేకాని, ఒకటేనని చెప్పలేదు. ఎందువల్లనంటే, శిల్పంలోస్వప్నార్థాలు, కావ్యార్థాలు ఒకటే

అయినా కొంత తేడా ఉన్నది. స్వప్నార్థాలు స్వాపిగతాలు. కావ్యార్థాలు సామాజికాలు. ఈ విభేదాన్ని గ్రహించలేక పాశ్చాత్య సాహిత్యంలో బయలుదేరిన ప్రతిధ్వనులు వెర్రి తలలువేసి అయోమయత్వంలో పడిపోయాయి. ఈ సందర్భంలో గుర్తింపవలసిన అంశం మరొకటి వున్నది. స్వప్నం కేవలం స్మృతికాదు. అయితే స్మృతిలేక స్వప్నం వుండదు. ఇష్టావాప్తికై తైజసాంశశాసన బద్ధమైన స్మృతి యోజనం స్వప్నం. అలాగే భావ్యమానమైన కావ్యార్థం వర్ణ్యవర్తు మున్నెనవారు పేర్కొన్నట్లు స్మృతికాదు. దండి పేర్కొన్నట్లు కావ్యం ఇష్టార్థ వ్యవచ్ఛిన్న పదావళి మాత్రమే.

ఇంతకూ స్వప్నార్థాలు అతి సంగ్రహంగా విచిత్రంగా వుండటానికి కారణాలు ఆత్మలోని తైజసాంశము విధించే శాసనాలను పాటించటానికై ప్రాజ్ఞాంశంలోనుంచి బయలుదేరే ఈ ప్సితార్థాలు క్లుప్తీకరణానికి, వ్యత్యయీ కరణానికి, మిలితీ కరణానికి, విపర్యయీకరణానికీ పాల్పడుతాయి. వీటివల్ల స్వప్నార్థాలు విచిత్రంగా లోకోత్తరంగా కనిపిస్తవి. ఈ శబ్దమే కావ్యంలో ధ్వని అవుతున్నది. క్లుప్తీకరణాదికానికి తేజస శాసనం ఏలా కారణమో కావ్యంలోని ధ్వనికి ఔచిత్యం ఆలా కారణం. అసలు తైజసం లేకపోతే స్వప్నమే భగ్నమై పోతుంది. ఆలాగే ఔచిత్యం లేకపోతే కావ్యమే వుండదు. అందుకనే ధ్వనికారుడు ''అనౌచిత్యాదృతేనాన్య ద్రస భంగస్యకారణమ్'' అన్నాడు. కాగా స్వప్న శిల్పమూ, ధ్వనీ అవిరుద్ధాలు.

# 5. సర్వజ్ఞ సింగభూపాలుడు

జంబూద్వీపే లసతి నితరా మాంధ్రదేశో విశేషః
శ్రేయస్తస్మిన్ భవతి నగరం రాజశైలాభిధానమ్
తత్రోత్కర్షం కలయతి సభా సింగభూపాల మౌళేః
సారాత్సారం వచన రచనం తత్ర తత్రాపిరాజ్ఞః
సిక్తోపి సింగభూపాల కల్యాణోక్తి సుధారసైః
యో న పల్లవితః తస్మై జంగమస్థాణవేనమః

జంబూ ద్వీపంలో ఆంధ్రదేశం విశిష్టమైనది. అందు రాచకొండ అన్న పట్టణం మేలైనది. అందు సింగభూపాలుని సభ ఉత్కృష్టం. అక్కడ అత్యంతసారతరమైన పలుకులు భాసిస్తవి. ఆ పల్కులందును రాజు వాక్కు మేలైనది. ఆ భూపాలుని కళ్యాణోక్తి సుధారసములందు తడిసియు చిగురింపని నట్రాడు ఏదైనావుంటే దానికొక నమస్కారం'' అన్నాడొక కవి. అతడు ఆత్మప్రత్యయంలేని వందిమాత్రుడా? అంటే కాదు.

సేవ్యం కి ? పరముత్త మస్యచరితం లోకోత్తరః కః పుమాన్?
శ్రీ సింగః, సతుకీదృశోవద నిధిర్ధర్మస్య, ధర్మస్తుకః?
సత్యోక్తిః, వచనంతు కిమ్? కవి నుతం, కోనామతాదృక్కవిః?
విశ్వేశః, సతుకీదృశ్యః? విజయతే విశ్వేషు విశ్వేశవత్.

''సేవించదగినదేది? మిక్కిలి ఉత్తముడగు వాని చరిత్ర. అతిలోకోత్తర పురుషుడెవరు? శ్రీ సింగమనాయకుడు. అతడెట్టి వాడు? ధర్మానికి నిధి. ధర్మమంటే ఏమిటి? సత్యవచనం, వచనమంటే? కవి వినుతం. అట్టి కవి ఎవడు? విశ్వేశుడు. అతడెట్టివాడు? విశ్వమందు విశ్వేశునివలె భాసించువాడు''. ఇంతటి ప్రగాఢమైన ఆత్మప్రత్యయంవున్న విశ్వేశ్వరకవి సింగభూపతిని వర్ణిస్తున్నాడు.

ఇంతగా శ్లాఘకు పాత్రుడైన ఈ సర్వజ్ఞ సింగభూపాలుడు ఎవరు? – అన్న ప్రశ్న కలగటం సహజం. కాకతీయ సామ్రాజ్య పతనానంతరం రేచర్ల వంశోద్భవుడైన యాచమ నాయకుడు ఇప్పటి తెలంగాణాలోని రాచకొండ రాజధానిగా నేర్పరచుకొని స్వతంత్రరాజ్యం స్థాపించాడు. ఈతని వంశంవారు నూరేండ్లు అవిచ్ఛిన్నంగా పరిపాలించారు.

సర్వజ్ఞ సింగభూపాలుడు ఈ రేచర్లవంశంలో ఉద్భవించాడు. తండ్రి అనపోత భూపతి. తాత సింగభూపాలుడు. ముత్తాత యాచమనాయకుడు. చరిత్రజ్ఞులు విస్పష్టతకోసం ఈ సర్వజ్ఞ సింగభూపాలుని ద్వితీయ సింగభూపాలుడని పేర్కొంటారు. రెండవ సింగభూపాలుని మనుమనికికూడా తాతపేరు బిరుదు వంశానుక్రమంగా సంక్రమించాయి.

జి. వి. కృష్ణరావు

రెండవ సింగభూపాలుని తండ్రి అనపోతభూపతి మహావీరుడు. స్వయంగా కవి. ''అభిరామ రాఘవం'' నాటకం వ్రాశాడు. అతని ఆస్థానంలో మదన విలాస భాణకర్తయైన నాగనాథుడు వుండేవాడు. ఈ కవి విశ్వేశ్వరకవిని తన గురువుగా పేర్కొన్నాడు. కనుక విశ్వేశ్వరుడు కూడ అనపోతభూపతి ఆస్థానకవిగా వుండివుంటాడు.

ఇలాంటి సంస్కార సంపన్నమైన వంశంలో ఉద్భవించిన సింగభూపాలుడు వివిధ విద్యలలో ఆరితేరి సర్వజ్ఞ బిరుదానికి పాత్రుడయ్యాడంటే విస్మయపడవలసిన పనిలేదు. ఉన్నది ఉన్నట్లు చెప్పటానికి వెనుకంజ వేయడు. తాను చతుర్థ కులజుడనని బాహాటంగా చెప్పుకొన్నాడు. ఆలా చెప్పుకోడానికి సంకోచం పొందలేదు. సరిగదా గర్వించాడు. దీనికి అతని ఆస్థాన కవియైన విశ్వేశ్వరుని చమత్కృతే నిదర్శనం. తనకు ఆశ్రయ మిచ్చిన సర్వజ్ఞుని అభివర్ణిస్తున్నాడు.

సింగ ప్రభు రలంకారీ లంకారీ రాఘవఃపునః
వర్ణాంతరత్వ ముభయోఃశ్రూతియతే సర్వ సమ్మతమ్.

సింగ భూపాలుడు అలంకారి. రాముడు లంకారి. ఇరువురికీ తేడా ఒక్కవర్ణము మాత్రమే. ఇక్కడ వర్ణము అంటే అక్షరము, కులము అని. అలంకారి, లంకారి అన్న శబ్దాలకు వ్యత్యాసము అన్న ఒక్క అక్షరమే కదా. ఆలాగే రాఘవుడు క్షత్రియుడు. సింగ భూపాలుడు శూద్రుడు. ఇరువురకు ఒక్క వైశ్యకులమే అంతరం.



ఈ సింగ భూపాలుని కాలంలో తక్కిన రాజులు, మండలాధిపతులు, అధికారులు జనపదాలను మిక్కిలిగా పీడించి ద్రవ్యం సంపాదించేవారు. ఆ సంపాదించిన ధనం విలువ గ్రహించక పుణ్యస్త్రీలు మున్నైన వారికి వెచ్చించేవారు. సింగ భూపాలుడు అలాకాదు. విశ్వేశ్వరుడు తన చమత్కార చంద్రికలో ఎలుగెత్తి చాటుతున్నాడు.

రాజన్యోహి ధనాన్యలం జనపదాన్నిష్పీడ్య తాన్యన్వహం
పణ్యస్త్రీ విటచేట పాటకనటస్తోమేన సంయుచ్ఛతే
శ్రీ సింగక్షితి పాలకః పునరయం న్యాయక్రమైరార్జితా
న్యుర్వీ దేవ జనాయ వేద విదు షే విత్తాని దత్తేతరామ్

సింగ భూపాలుడు అభిమానించి ఆదరించింది ఒక్క పాండిత్యాన్ని మాత్రమే కాని పటాటోపాన్ని కాదు.

కిం దారుణా కొంకర వంకరేణ?
కిం వాససా చీంగిరి మాంగిరేణ?
శ్రీ సింగ భూపాల విలోకనాయ
వైదుష్య మేకం సుధియాం సహాయః

పండితులకు వంకర టింకర వాసంతో పనిలేదు. అంటే పల్లకి అక్కరలేదు. చీకిరిబాకిరి వస్త్రంతో నిమిత్తంలేదు. అంటే పట్టాంశుకం పనిలేదు. ఆ భూపాలుని దర్శనానికి పాండిత్యమొక్కటే తోడుకావాలి, అని చమత్కార చంద్రిక సాక్ష్యమిస్తున్నది.

సర్వజ్ఞ బిరుదాంకితుడు, పండిత పక్షపాతి అయిన ప్రభువు కవులకూ, పండితులకూ ఆశ్రయమివ్వకుండా ఉంటాడా? విశ్వేశ్వర కవి చంద్రుడు, బొమ్మకంటి అప్పయార్యుడు ఇతని ఆస్థాన కవులు. శ్రీనాథుడీ ప్రభువును సందర్శించి సన్మానం పొందాడు. ఈ శ్రీనాథునివలె మరెందరు విద్వాంసులు సత్కారం పొందారో మాటుపడిపోయిన చరిత్రకే తెలియాలి. బమ్మెర పోతన ఇతని కాలములోవాడేనని భోగినీ దండకం ఇతనికే అంకితం మిచ్చాడని కొందరు భావిస్తున్నారు. ఇది కేవలం భ్రాంతి. పోతనామాత్యుడు మూడవ సింగభూపాలునకు మాత్రమే సమకాలికుడు.

విశ్వేశ్వరునియందు సింగభూపాలునకు ఎంతోగౌరవం, ప్రమాణబుద్ధి ఉన్నాయి. అందువల్లనే ఈ ప్రభువు సూత్రధారునిచేత కువలయావళి నాటికలో-

అహో సాహిత్య సౌభాగ్యం శ్రీసింగధరణీపతే:

శ్లాఘ్యమై యస్య సన్నద్ధా విశ్వేశ్వర సరస్వతీ.

అనిపించాడు. విశ్వేశ్వరుడుకూడా భక్తి తాత్పర్యంతో ప్రభువు కృతికి పరిశేష గ్రంథంగా తద్గుణోదాహరణగా చమత్కారచంద్రిక వ్రాశాడు. దీనిసేగాక వీరభద్ర విజృంభణమన్న ''డిమము'' వ్రాశాడు. అప్పయార్యుడు అమరపద పారిజాతమన్న పేరిట అమరకోశానికి వ్యాఖ్యవ్రాసి దాని ప్రాశస్త్యాన్ని ఇలా చెప్పుకొన్నాడు.

కుమారసింగభూపేన లక్ష్యలక్షణవేదినా

శోధిత శ్చేదయం గ్రంథ:కిం శోధ్య: శోధకాంతరై:?

కుమారసింగ భూపేన య: కదాపి న శోధిత:

సగ్రంథ: శోధితో ప్యన్యై: కింబుధై రవధీయతే''

'లక్ష్యలక్షణ వేదియైన సింగభూపాలుడు ఈ గ్రంథాన్ని శోధించినప్పుడు ఇతర శోధకులకు శోధింపవలసిన దేమివుంటుంది? అతనిచే ఎన్నడు శోధింపబడని గ్రంథాన్ని ఇతరులు శోధించినప్పటికీ విద్వాంసులు అవధరించరు' అని అప్పయార్యునివంటి మనీషి అంటున్నాడు. దీనినిబట్టి సింగభూపాలుని వైదుష్యమెట్టిదో ఊహించుకోవచ్చును.

సర్వజ్ఞుడు కవి పండితులకు ఆశ్రయంగా నికషోపలాయమానంగా ఉండటమేగాక స్వయంగా రసార్ణవ సుధాకరమన్న నాట్య విషయకలక్షణ గ్రంథము, రత్నపాంచాలిక అన్న నామాంతరం కలిగిన కువలయావళి నాటిక, శార్ఙ్గదేవ విరచితమైన సంగీతరత్నాకరమను లక్షణ గ్రంథానికి సంగీతసుధాకర మన్న వ్యాఖ్య రచించాడు. మదనవిలాసభాణము సింగభూపాలీయముగ రసార్ణవసుధాకరము పేర్కొంటున్నది. దీనిని విశ్వేశ్వరుడు తన కృతిగా చమత్కార చంద్రికలో ఉట్టంకించాడు. ఈకృతి ఇంతవరకు లభించినట్లు లేదు. కనుక కర్తృత్వము అనిశ్చితంగానే ఉన్నది. రసార్ణవ సుధాకరంలోను, చమత్కారచంద్రికలోను ఉన్న ఉదాహృతాలనుబట్టి మరి కొన్ని కృతులనుకూడా సర్వజ్ఞుడు వ్రాసినట్లు కనిపిస్తున్నది.

జి. వి. కృష్ణరావు

ఏది ఎలావున్నా భోజునకు వినా తక్కిన రాజ కవులకు ఆపాదించిన అపప్రధను కొందరు మహనీయులు సింగభూపాలునకుగూడా ఆపాదిస్తున్నారు, రసార్ణవ సుధాకరము, కువల యావళి, చమత్కారచంద్రిక – ఈ కృతులలో ఏది ముందు వెలువడిందో చరిత్ర నిర్దిష్టంగా చెప్పటంలేదు. నాటికలోని రెండు మూడు శ్లోకాలు అటు రసార్ణవంలోను ఇటు చమత్కార చంద్రికలోను కనిపిస్తున్నవి. చమత్కార చంద్రికలోని లక్షణ శ్లోకాలుకాని, అందలి విషయంకాని రసార్ణవం స్పృశించటం లేదు. కాకపోతే చమత్కార చంద్రికలోని మూడు ఉదాహరణ శ్లోకాలు రసార్ణవసుధాకరంలో ఉల్లాసానికి ఒకటిచొప్పున తదంతంలో చేర్చబడ్డాయి. చమత్కారచంద్రిక లక్ష్యాలను పెక్కింటిని సుధాకరంనుంచి ఇవ్వటమేగాక విశేషాలనుగాని, అనుక్తవిషయాలనుగాని సుధాకరంలో చూచుకోవలసిందని చెబుతున్నది. కనుక రసార్ణవసుధాకరము తరువాతనే చమత్కారచంద్రిక వెలువడిందని ఊహించవచ్చును. ఇటీవలనే వెలువడిన ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి చమత్కార చంద్రిక లోని పీఠిక సుధాకరం క్రీ. శ. 1368 లోను చంద్రిక క్రీ.శ.1370 లోను రచితములని పేర్కొంటున్నది. అయితే ఏ ఉపపత్తులబట్టి ఈ నిర్ణయం జరిగిందో తెలియదు.

అయినా, ముందు సుధాకరం తరువాత చంద్రిక వెలువడిందనటంలో విప్రతిపన్నులము కావలసిన పని లేదు. చంద్రిక తరువాతనే కువలయావళి రచితమై ఉండవచ్చు ననటానికి కారణం కనిపిస్తున్నది. సింగభూపాలుని సాహిత్యాన్ని ప్రశంసిస్తూ చమత్కారచంద్రిక లోని

అహో సాహిత్య సౌభాగ్యం శ్రీ సింగధరణీపతేః

శ్లాఘాయై యస్యసన్నద్ధా వాదోవిశ్వేశ్వరస్యయే.

అన్న లక్ష్యశ్లోకం కడపటి పాదంలో 'విశ్వేశ్వరసరస్వతీ' అన్న చిన్న మార్పుతో కువళయావళి ప్రరోచనలో కనిపిస్తున్నది. చమత్కారచంద్రికలోను, రసార్ణ వసుధాకరంలోను ఎలా ఉదాహృతాలయ్యాయి అన్న ప్రశ్న అంకురించక తప్పదు, ఇది సుసమాధానమే. సింగ భూపాలుడు తన ఇతర రచనలనుండి ఈ శ్లోకాలను తన కువలయావళిలో చేర్చియుండవచ్చును.

ఇంతకూ, ఉన్న అపప్రథ రసార్ణవ సుధాకరాన్ని సింగ భూపాలుడు వ్రాయలేదు. దానిని విశ్వేశ్వరుడు తానే వ్రాసి తన ప్రభువు పేరుబెట్టాడట! ఈ కళంకం ఆపాదించేవారు చెబుతున్న కారణాలు 1. రసార్ణవ సుధాకరం, చమత్కార చంద్రిక ఒకదానికొకటి పరిశేష గ్రంథంగా వున్నవి. ఇది యుక్తిసహంగా కనిపించదు. పరిశేష గ్రంథం మరొకరు వ్రాయరాదన్న నియమం లేదుకదా? 2. రసార్ణవ సుధాకరం ప్రారంభంలోవున్న వంశావళి సింగభూపతి పూర్వులనేగాక అతనినిగూడ మిక్కిలిగా పొగుడుతున్నది. ఆత్మస్తుతి దేషమే ఇట్టి దోషం విశ్వేశ్వరునిలోకూడ వున్నది. అంతమాత్రాన విశ్వేశ్వరుడు వీరభద్రవిజృంభణము కాని, చమత్కార చంద్రికకాని వ్రాయలేదని చెప్పవచ్చునా? 33. రసార్ణవసుధాకరం ప్రతి విలాసాంతాన గ్రంథముతో సంబంధంలేని సింగ భూపాలస్తుతిపరాలైన రెండు శ్లోకాలు కనిపిస్తున్నవి. ఇందులో ఒకటి చమత్కారచంద్రికలో ఉన్నది. ఈ అంశం కొంత ఆలోచించదగ్గదే. 4. రెండు రచనలలోను అధ్యాయాన్ని విలాసమనటం

జరిగింది. ఇది వాస్తవం కాదు. రసార్ణవ సుధాకరంలోని అధ్యాయానికి ఉల్లాసమని, చంద్రికలోని పరిచ్ఛేదానికి విలాసమని పేరు. ఉల్లాసము, విలాసము ఒకటి కావు గదా? ౫5. రెండు కృతులూ భరత భోజులను అనుసరించినవే. ౬6. రెండూ ఏకావళి కర్త అయిన విద్యాధరుని తీవ్రంగా విమర్శించినవే, కాబట్టి రెంటికీ కర్త విశ్వేశ్వరుడే.

ఈ శంకలన్నిటినీ దూరాపాస్తం కావించే ప్రబల కారణాలున్నవి. (1) రీతి విషయంలో చమత్కార చంద్రిక రసార్ణవ సుధాకరం భేదిస్తున్నవి. సుధాకరం భోజుని విమర్శిస్తే చంద్రిక అనుసరిస్తున్నది. (2) ధ్వనివాదం చంద్రికకు సమ్మతం. (3) సుధాకరం ఆ విషయమే ఎత్తుకొనలేదు. విశేషించి పదార్థ వాక్యార్థ న్యాయానుగుణంగా రస సంవేదనను వివరిస్తున్నది. చంద్రిక తన కిష్టమైన ధ్వనితత్త్వాన్ని మరచిపోయి అభివ్యక్తి వాదాన్ని విసర్జించి ఘట ప్రదీప న్యాయానికి మారుగా పదార్థ వాక్యార్థ న్యాయాను గుణంగా రస సంవేదనను వివరిస్తున్నది. (4) రసార్ణవ సుధాకరాన్ని విశ్వేశ్వరుడు వ్రాసి వుంటే రేచర్లవారు శూద్రులని పేర్కొని ఉండేవాడా? పైగా అనపోత నాయకుని అభిరామ రాఘవం నుంచి సుధాకరంలో ఉదాహరణ ఇచ్చినవాడు చమత్కార చంద్రికలో యెందుకు మానివేస్తాడు? (5) సింగ భూపాలునకు సర్వజ్ఞ బిరుదమున్నట్లు కవితా నైపుణ్యమున్నట్లు విశ్వేశ్వరుడు అనేక పర్యాయాలు తన చంద్రికలో అభివర్ణించాడు.

అప్పయార్యుడు

కావ్యాలంకార నానార్థ తత్త్వ భావిత మానసః

కుమార సింగ భూపాల ఏక ఏవాస్తి నాపరః

అని తన అమరపద పారిజాతంలో పేర్కొన్నాడు. (6) మల్లినాథసూరి అతని కుమారుడు కుమార స్వామి సోమపీథి తమ తమ వ్యాఖ్యానాలలో సుధాకరం సింగ భూపాలునికృతిగా పేర్కొన్నారు. (7) రత్న పాంచాలికా సంగీత సుధాకరమూ సర్వజ్ఞునివేయని అంటున్నారు. వీటన్నిటిని బట్టి చూచినప్పుడు రసావర్ణ సింగ భూపాలుని రచనమే అని అంగీకరించక తప్పదు.

సింగ భూపాలుని రసావర్ణ సుధాకరము నాట్యార్థ ప్రతిపాదనైక ప్రవణము. ప్రతి పాద్య విషయాలు మూడు ఉల్లాసాలుగా పరిచ్ఛితి పొందాయి. మొదటిది రంజకోలాసము ఇందు నాయకుల తత్సహాయుల భేదాలు, చతుర్విధమై ఉద్దీపన స్వభావం, అను 5వ భేదాలు, రీతివృత్తి ప్రవృత్తులు, అష్ట విధసాత్విక భావాలు వివరింపబడ్డాయి.

రసికోల్లాసమన్న రెండవ పరిచ్ఛేదంలో 33 వ్యభిచారి భావాలు, భావ తదాభాసోదయాదులు, స్థాయి భావాలు, రసవిచారం, అష్ట రసాలు, తదవాంతర భేదాలు, రస సాంకర్య విరోధాలు, తదంగాంగీభావం. రసాభాసము అభివర్ణించబడ్డాయి. భావకోల్లాసమ్ను కడపటి పరిచ్ఛేదంలో ఇతివృత్త పంచధాత్వము, కార్యావస్థలు, సంధి సంధ్యంగాలు, ఏక వింశతి సంధ్యం తరాలు, ౩౬ భూషణాలు, నాటక లక్షణము, నాందీ ప్రరోచన విభేదాలు, ఆముఖం, విధ్యంగాలు, అర్థోపక్షేపకాలు, ప్రకరణాది పరిశిష్ట రూపకాలు, పరిభాష విశదీకరింపబడ్డాయి.

జి. వి. కృష్ణరావు

సర్వజ్ఞ సింగభూపతి తన యీకృతిలో భరత దత్తిల మతంగ రుద్రట శారదాతనయుల ప్రతిపాదితార్థాలను వాడుకొన్నాడు. చిత్తగాత్రారంభాలైన అనుభవాల సంఖ్యానంలో భోజమతాన్ని రసార్ణవ సుధాకరం కాదంటున్నది. భోజుడు గర్వస్నేహ మతిధృత్యాద్యాయులైన ఉద్ధత ప్రేయః శాంతోదాత్త రసాలను అంగీకరించగా గర్వాదులు స్థాయీభావాలు కాజాలవనీ అందువల్ల ఉద్ధతాదులకు రసత్వసిద్ధి లేదనీ రత్నాకర మంటున్నది. దశరూపకము ఘృణాశుద్ధ జుగుప్సను వేరుగా నిరూపించగా రసార్ణవ సుధాకరము అది హేయశ్రవణోత్పన్న జుగుప్సకంటే వేరైనది కాదని చాటుతున్నది. ''సంధ్యంగాలలో సంధ్యంతరాలు అంతర్భవిస్తవని దశరూపకము సింగభూపాలుడు తన అభిప్రాయ భేదాన్ని సూచించాడు. భావప్రకాశికాకారుని నుంచి వైశిక లక్షణాలు స్వీకరించి పతాకాప్రకరుల విషయంలో అతని మతాన్నీ అనువదించాడు. ఇంతే కాదు. అంగరసము స్వేచ్ఛతో వృద్ధిపొందితే అంగిరసం అవినీతుడైన మంత్రివల్ల ఆభాసపాలైనట్లు అభావతను పొందుతుంది అంటూ భావ ప్రకాశోక్తిని ప్రమాణీకరించాడు.

సింగ భూపాలునకు పూర్వీకులైన ఒక కొందరు వేశ్యను నాయికగా స్వీకరించ దగదని నిషేధించారు. ''వేశ్య సామాన్య వనిత. ఆమెకు ద్రవ్యమే ప్రధానం. ఆమె గుణహీనుని ద్వేషించదు. గుణవంతుడని అనురక్తి పొందదు. అందువల్ల ఆమె శృంగారాభాసానికే ఆలంబమౌతుంది. కాని శృంగారానికి కాజాలదు'' అని వారు చెబుతారు. దీనికి తాను అంగీకరించజాలనంటూ రసార్ణవ సుధాకరకర్త. ఇలా అంటున్నాడు.

వేశ్యకు భావానుబంధం ఉండదంటే నాయికత్వానికే భంగం వాటిల్లుతుంది. మరి ప్రకరణాదియందు ఆమెనే ఎందుకు నాయికగా విధించారు? నాయిక కానిదానిని ప్రకరణాదులు అభివర్ణిస్తున్నవి కాన అవి రసాభాసానికి పాల్పడవలసివస్తుంది. పైగా అవి అరసాశ్రయాలు కావలసివస్తుంది. అవి రసాశ్రయాలు కావన్న పక్షంలో రసాశ్రయమైన రూపకం పది విధాలు అన్న శాస్త్రోక్తికి విరోధ మేర్పడవలసివస్తుంది. కాగా వేశ్యలకు గుణశాలియైన నాయకునియందు భావానుబంధం ఏర్పడుతుంది. రుద్రటుడుకూడ ఈమాటే చెబుతున్నాడు.

రసము సామాజిక విష్ఠమనీ, నిర్వేదము స్థాయి భావత్వం పొందజాలదనీ అందువల్ల శాంతం రసం కాదనీ కనుక రసాలు ఎనిమిదిమాత్రమేననీ రసార్ణవ సుధాకర నిర్ణయం, భట్టనాయకుని భుక్తివాదము, అభినవగుప్తుని వ్యక్తివాదము ఈ రెండూ రసం సామాజిక విష్ఠమని అంగీకరిస్తున్నవి. కనుక వీనిలో దేనినే గ్రహించాలి, మరి దేనిని గ్రహించరాదు? అన్న పట్టుదల మాకు లేదు. అని భూపాలుడు అంటూ ధ్వనికారుని ఘట ప్రదీప న్యాయాన్ని వర్జించి ధనికుని మతానుసారంగా పదార్థ వాక్యార్థ న్యాయంతో రససం వేదనను వివరించాడు. శృంగారంలో విప్రలంభాన్నేకాక కరుణ విప్రలంభమన్న మరొక భేదాన్ని సర్వజ్ఞ సింగమణి ప్రతిపాదించాడు.

శృంగార రసాభాసంలో అరాగము, అనేక రాగము, తిర్యగ్రాగము, మ్లేచ్ఛరాగము అన్న రాగము అన్న నాలుగు భేదాలను రసార్ణవ సుధాకరము ప్రతిపాదిస్తున్నది. అనేక రాగము శృంగారాభాస మన్నప్పుడు దక్షిణ నాయకుని రాగం రసాభాసం కావటంలేదా? అన్న ప్రశ్న వేసుకొని సర్వజ్ఞుడు

సమాధానం చెబుతున్నాడు. దక్షిణ నాయకునకు అనేక నాయికలయందు వృత్తిమాత్రం చేతనే సాధారణత్వం కాని రాగమందుమాత్రం కాదు. ఒకతెయందు మిక్కిలిగాను, మరొకతెయందు మధ్యమంగాను, వేరొకతెయందు మందంగాను రాగం ఉంటుంది. ఇలా తుల్యానురంగంకాక రాగవైషమ్యం వుంటుంది. కనుక అది అభాసం కాదు. ఈ యుక్తిని కుమారస్వామి తన రత్నాపణంలో స్వీకరించాడు.

తిర్యఙ్మ్లేచ్ఛగతమైన రాగము ఆభాసం కాదని ఏకావళి కర్త విద్యాధరుడు మమ్మటాదులను అతిక్రమించి నిరాకరించాడు సర్వజ్ఞుడు విద్యాధరుణ్ణి "ఘోమ్లేచ్ఛో రసవాదిన్" అంటూ తీవ్రంగా ఎదుర్కొన్నాడు. వస్తువులకు విభావత్వం జాతియోగ్యములైన ధర్మములచేతనే సిద్ధిస్తుంది. ఔచిత్య వివేకం తిర్యక్కుల కుండదు. అందువల్ల వానికి విభావత్వం సిద్ధించదు. ఔచిత్య వివేకం మనుషులలోకూడ కొందరికి లేక పోవచ్చును గదా అంటే ఔను, వారికి విభావత్వం సిద్ధించదు. అలాంటివారి రాగం రసాభాసమే అవుతుంది. మేము చెబుతున్నదీ అదేగదా అని సుధాకరకర్త వాదిస్తూ క్రమంగా లక్ష్యాలిస్తున్నాడు.

మధు ద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వామనువర్తమానః
శృంగేణ సంస్పర్శ నిమీలితాక్షీం
మృగీమకండూయత కృష్ణసారః,
భార్యాం మోహన సుప్తాం
మృతేతి మత్వాధావితే హాలికే
దర స్ఫుటిత ఫలోదరాభి ర్హసిత
మిద కార్పా సలాభిః

తుమ్మెద తన ప్రియురాలిని అనుసరిస్తూ పుష్పైక పాత్రంలో తేనె క్రోలింది. స్పర్శ సుఖ పారవశ్యాన మోడ్పుగన్నులతో వున్న ఆడుజింకను మగజింక కొమ్ములతో గీరింది రతిసుఖ పారవశ్యం పొంది నిద్రించిన భార్యను చూచి చచ్చిపోయినదని హాలికుడు పారిపోతుంటే చూచి ఇంచుక విరిసిన కాయలతో ప్రత్తితీగలు నవ్వుతున్నట్లున్నవి.

సింగభూపాలుని మతంలో ఈ రెండింట శృంగారా భాసమే, మొదటిది తిర్యగ్గతం, రెండవది మరజనగతం, అంతకు తక్క మరేమీ భేదంలేదు. వాస్తవానికి శ్రోతకు ఈ అనుభవమే కలుగుతున్నదా? మొదటిది శృంగారమే ఏల కాదు? తిర్యగ్ తత్వమే కారణమైతే తిర్యగ్గతమైన కారుణాదికమంతా రసాభాసమే కావాలి. పైగా ఇంతకుముందు పేర్కొన్న దృష్టాంతాలలోని అనుభూతులు ఏకకోటికం కావు. రెండవ అనుభూతిలో హాస్యస్పర్శ వున్నది. మొదటిదానిలో లేదు. కాగా, రసాభాస విషయంలో ముమ్మటుని దగ్గరనుండి సింగ భూపాలునిదాక తికమకలకు పాల్పడినట్లు తోస్తుంది.

జి.వి. కృష్ణరావు

రసానికి మూలం నాట్యం. నాట్యం అనుకరణ మూలం. ఈ అనుకరణం మూడు విధాలు. 1. సంపూర్ణమైన అవస్థానుకరణం, ఇదే రసమవుతుంది. 2. అముఖ్యమైన అనుకరణం. ఇదే రసాభాసం. ఈరసాభాసం ఆస్వాదనస్థితిలో రసమువలె భాసిస్తుంది. కాని, సమనంతరం కాలంలో అనౌచిత్యం ప్రస్ఫుటమై హాస్యస్ఫూర్తి ఏర్పడుతుంది. 3. రసానుకరణం అంటే అనుకృతికి అనుకరణం. ఇది కేవలం హాస్య మవుతుంది. కనుక రసత్వము, రసాభాసత్వము, హాస్యము అన్నవి కవి అనుకరణంపైన అంటే అతని భావనపైన ఆధారపడుతున్నవేకాని, వస్తునిష్ఠాలు కావు. అరాగము, ఆవేశరాగము, తిర్యగ్రాగము, మ్లేచ్ఛరాగము, రసాభాసము కావచ్చును, కాకపోవచ్చును. కాని విధిగా రసాభాసం కావాలన్న నియమంలేదు. మొత్తంమీద రసార్ణవ సుధాకరం  ఆలంకారిక విశేషాలను సంప్రదాయాలను ఎన్నిటినో విశదీకరిస్తున్నది.

సింగభూపాలుని రెండవ కృతి కువలయావళి . అది నాలుగు అంకాల నాటిక. ఇతివృత్తం కల్పితం.  శ్రీకృష్ణుడు కాలయవనుడు అన్న రాక్షసుని సంహరించడానికి వెళ్లుతాడు. కాలం గుడుస్తుంటుంది. యదువల్లభుని వృత్తాంతం రుక్మిణ్యాది అష్టమహిషులకు తెలియరాదు. వారు నాధుని అభ్యుదయం కోరి సువాసినీవ్రతం నిర్వహిస్తూండగా, నారదుడు కువలయావళి యన్న కన్యను కొనివచ్చి రుక్మిణీదేవివద్ద న్యాసంగా వుంచి వరాన్వేషణం పోతున్నానని చెప్పి వెళ్ళిపోతాడు.

కువలయావళి ఆడువారికి ఆడుదిగాను, మగవారికి రత్న పాంచాలికగాను కనిపిస్తుంది. అందువల్ల రుక్మిణి ఆమెను న్యాసంగా స్వీకరిస్తుంది.

కొన్నాళ్ళకు నారదుడు తిరిగివచ్చి శ్రీకృష్ణుడు దనుజుని జయించి నిజనగరానికి తిరిగవస్తున్నాడని చెప్పి పోతాడు. శ్రీకృష్ణుడు తన భార్యలకు ఆకస్మికంగా దర్శనమిచ్చి ఆనందపరచాలన్న ఉద్దేశంతో నివాసోద్యానంలో దిగుతాడు. అక్కడ విహరిస్తున్న కువలయావళిని ఆమె చెలికత్తెయైన చంద్రలేఖను చూచి విస్మితుడవుతాడు. చంద్రలేఖ పాంచాలికతో విస్రంభాలాపాలేమిటి అని చకితుడై నిరీక్షిస్తుంటాడు. సఖి హస్తావకర్షణ సంరంభంతో భాసిస్తుంది. శ్రీకృష్ణుడు ఆమెయందనురక్తుడవుతాడు. మణిముద్రిక అతనికి లభిస్తుంది. మణిముద్రికా గత అక్షరపంక్తివల్ల కువలయావళి వాస్తవరూపం అతని కెరుక పడుతుంది. ముద్రిక ఆమెచేత ఉన్నంత కాలం పురుషులకు ఆమె రత్నపాంచాలికగా కనిపిస్తుంది. ఆ ముద్రికను పొందిన పురుషుడు ఆమెభర్త అవుతాడు. ముద్రికను కోల్పోయిన కువలయావళి ఆ ఉంగరంకోసం వెతుకుతూ చంద్రలేఖతో తిరిగివచ్చి శ్రీకృష్ణుని కలుసుకుంటుంది. ఇరువురు పరస్పరానురక్తు లవుతారు. నాయికా ప్రణయార్థియైన నాయకుడు మణిముద్రికను ఆమె వ్రేలికి తొడుగుతాడు. ఆ సమయంలో సత్యభామ వచ్చి స్థితిగతులను కన్నులార చూచి మండిపడుతుంది. ఈ వుభయుల అనురాగవార్త సత్యభామ వల్ల విని రుక్మిణి కువలయావళిని సప్తచ్ఛద ప్రాసాదపుగదిలో బంధిస్తుంది.

ఇలా వుండగా, కువలయావళిని కాలయవనుని సహోదరుడు ప్రతీకారబుద్ధియై అదృశ్యరూపంలో అపహరించుకొని పోతుంటాడు. ఆమె కేవలం పరిచారిక కాదు. నారదమహర్షి రుక్మిణిచెంత ఉంచిన న్యాసం. పట్టమహిషి తన చరిత్రం లోకోపవాద కళంకిత మవుతుందని భయపడి

కువలయావళిని కాపాడవలసిందని భర్తను వేడుకుంటుంది. శ్రీకృష్ణుడు చక్ర ప్రయోగంతో దనుజుని సంహరించి, తన ప్రియురాలిని రక్షించుకుంటాడు. నారదుడు వచ్చి కువలయావళి సోదరియైన భూదేవియని రుక్మిణికి రహస్యంగా చెబుతాడు. తరువాత కువలయావళీ శ్రీకృష్ణులకు వివాహం జరుగుతుంది.

ఇది కువలయావళిలోను యితివృత్తం, ఇందు స్వప్న వాసవదత్తరత్నావళుల ఛాయలు కనిపిస్తాయి. సంఘటనలు, సంభాషణలు ఔచిత్య సుందరాలు, మృదుమధురాలు. ఇందలి మణిముద్రిక కవి స్వోపజ్ఞం, రుచిర రుచిరం. అయితే, కవి యీ కల్పనను విస్తరించవలసినంతగా విస్తరించి, పిండగలిగినంత రసం పిండలేదేమో ననిపిస్తున్నది.

సింగ భూపాలుని మూడవ కృతి సంగీతసుధాకరం. ఇది శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరానికి వ్యాఖ్య. ఇప్పటివరకు తెలిసినంతలో ఇదే మొదటి వ్యాఖ్య అనీ, కల్లినాథుని వ్యాఖ్యకంటే విపులమైనదనీ, ప్రాచీనాలైన సంగీత సాంప్రదాయాలెన్నిటినో వివరిస్తున్నదనీ విజ్ఞు లంటున్నారు.

మొత్తంమీద సర్వజ్ఞ సింగభూపాలుడు ఆలంకారికుడుగా, కవిగా, సంగీత శాస్త్రజ్ఞుడుగా, భారత సంస్కృతి చరిత్రలో సుస్థిరమైన విశిష్ట స్థానం సంపాదించుకున్నాడు.



జి. వి. కృష్ణరావు

# 6. హృదయోల్లాసం

సంస్కృత సాహిత్యంలో నాటకాలకు, తెలుగుసాహిత్యంలో మహాప్రబంధాలకు విశిష్టస్థానం ఉన్నది. ఈ మహాప్రబంధాలలో కవిత్వదృష్టితో చెప్పుకోదగిన రచనలు పెక్కు ఉన్నా విజయవిలాసం ఒక ప్రత్యేక స్థానం సంపాదించుకొన్నది. ఇందలి తెలుగు పలుకుబళ్లు, సామెతలు, మాటల తీరుతీయాలు, అందచందాలు, విరుపులు మెరపులు, మెలకువలు, మేళవింపులు, పోలికలు, పోహలింపులు కేవల సంస్కృత పండితులకు అందనివి. తెలుగు పండితులకు విడువరానివి, మరవరానివి కూడ తెలుగు కవిత్వానికి కాకపోయినా తెలుగుతనానికి విజయ విలాసం పెట్టింది పేరు.

అయితే వసుచరిత్రవలెనే విజయవిలాసం కూడా వ్యాఖ్యానం అపేక్షిస్తుంది. ఈ అపేక్షఉన్నా దీనికి ప్రాచీన కాలంలో వ్యాఖ్యలు బయలుదేరినట్లు తెలియదు. తెలిసినంతలో జూలూరివారి వ్యాఖ్య మొదటి దంటారు. వ్యాఖ్య కూడా సామాన్య పాఠకలోకానికి శ్రుతిగోచరమేగాని చక్షుర్గోచరం కాదు. కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారి వివృతి 1911 లో వెలువడింది. ఇది సమగ్ర వ్యాఖ్యకాదు. గచ్ఛద్వ్యాఖ్య. దీని పునర్ముద్రణ విజ్ఞప్తిలో వారి మనుమలు ఇలా పేర్కొంటున్నారు :

''(శ్రీ) తాతగారి వ్యాఖ్యను ఉన్నది ఉన్నట్లుగా మరల ముద్రించవలసినదని మమ్ము పలువురు కోరుచుండిరి. పైగా శ్రీవారు నాడు వ్రాసిన రీతిని ఈ చేమకూర వేంకటరాజ కవీంద్రుని కులమేదో చరిత్రశోధకులు ఇప్పటికిని నిర్ణయింపనేరకున్నారు. కారణము సాధనసామగ్రి లేకపోవుటయే. భాషా విషయమై చెప్పవలసినదంతయు వారే చెప్పియున్నారు. 'చేమకూర పాకరుచులకు' ఈపాటి వ్యాఖ్యయే చాలుననియు ఇందలి శ్లేష చమత్కారాదికము అనుభవైక వేద్యమనియు దలంచి సంజీవని సర్వంకషాదుల వ్రాసినవారు అనవసరపు విపులీకరణమునకుం జొరక ఈ మాత్రముతో దీనిని వదలియందురని తలంపనై యున్నది'' తలంపేదైనను ఈవ్యాఖ్య అరగొరగానున్నదనుట నిర్వివాదాంశము.

ఆ తరువాత 1952 లో (శ్రీ) బులుసు వేంకటరమణయ్యగారి ''ముకుర'' వ్యాఖ్య వెలువడింది. ఇది వేదంవారి రచనకంటే మేలు అయినా ఇంకా మరొక వ్యాఖ్య వెలువడవలసిన ఆవశ్యకత వున్నది.

అయినా తాపీ ధర్మారావుగారి హృదయోల్లాస వ్యాఖ్య వచ్చేటంతవరకు మరొక వ్యాఖ్యానం వచ్చినట్లు వినలేదు.

మనకు సిద్ధాంత వ్యాసాలు వస్తున్నంత పుష్కలంగా ప్రాచీన కావ్య వ్యాఖ్యానాలు రావటంలేదు. ఎందువల్ల ? దేశంలో పండితులు లేరా? వోపిక లేదా? ఆసక్తి లేదా? ఆదరణ లేదా?

పండితులకు లోటు లేదు. ఆసక్తి ఆదరణలకు అంతగా కొరత లేదు. కాని వున్నలోటు ఒకటే. మన పండితులు చేస్తున్న కృషి శాస్త్రీయంగా చిత్తశుద్ధితో సహనంతో తరువాతి కాలంవారికి

పనికివచ్చేటట్లు చేయటం లేదు. ఈనాటికీ సరియైన నిఘంటువు లేదు. చరిత్ర లేదు. ఒకరు చేసిన పనిని మరొకరు అభినందించరు. వినియోగించుకోరు.

ఉదాహరణకు మన శబ్దరత్నాకరమే తీసుకోవచ్చును. శబ్దరత్నాకరకారులు నిజంగా మాననీయులే వారు తెలుగు వారికి చేసిన సేవ మరవరానిదే. కాని, వారి నిఘంటు రచనా విధానం చూడండి. తమ నిఘంటు రచనకు పూర్వం బ్రౌణ్యం వున్నది. దానిని ఎంతవరకు వారు వినియోగించుకున్నారు? బ్రౌను వ్యావహారిక భాషావాది కాబట్టి బహుజనపల్లివారు వారి బ్రౌణ్యం అప్రమాణికమని తలపోసి ఉపేక్షించా రనవచ్చును. ఆంధ్రభాషార్ణవాన్ని ఆయన ప్రామాణిక నిఘంటువుగా స్వీకరించారుగదా. మరి ఆ భాషార్ణవము ఇచ్చిన పదాలను అర్థాలను ఎందుకు స్వీకరించలేదు?

''వ్రీహి భేదంబులు వ్రీహి సామాన్యంబు

వరి వడ్లు నాగను వరలుచుండు''

వరి, వడ్లు అన్నవి నిత్యవ్యవహారంలో ఉండేవికదా. ఈ పదాల అర్థంలోకూడా నిఘంటుకారుడు ప్రమాదపడుతాడా?

''వాజినీ గర్భంబు వాచవులు ముత్తెంపు

తూనిక చవులు నా దోచుచుండు''

చవి అన్న పదానికి 'గుర్రపు చూలు', 'ముత్తెపు తూకము' అన్న అర్థాలు లేవని శబ్దరత్నాకరకారులు ఎలా నిర్ణయించుకొన్నారు? వెంకనార్యుని సంగతి వదలివేద్దాము. అమరకోశం ప్రమాణం కాదా? అందులోని పదాలనైనా తెలుగులో వాడుకోదగినవన్నీ శబ్దారత్నాకరం స్వీకరించిందా?

గ్రంథ విస్తరభీతి అన్నది చక్కని సమాధానమే. కాని దానివల్ల వస్తున్న అనర్థం అంతా ఇంతా కాదు. వెనుకటివారి కృషిని వినియోగించుకొని ఇప్పటివారు ముందుకు సాగిపోవడానికి వీలులేకపోతున్నది. పరిశీలించామని చెప్పిన గ్రంథాలనే మాటిమాటికి పరిశీలించవలసిన స్థితి యేర్పడి అడుగుసాగడం లేదు. వాస్తవానికి ప్రాచీన పద్యనిఘంటువులకు, ప్రముఖ ప్రాచీన రచనలకు, అకారాదిగా పదకోశాలను తయారుచేసుకొంటే ఎంత శ్రమ తప్పి వుండేది? చిత్తశుద్ధి లేని అరగొర పనులవల్ల ఎన్ని చిక్కులకు పాల్పడవలసి వస్తున్నది?

మన శబ్దకోశకారుల దృష్టికి మన వ్యాఖ్యాతల విధానముకూడా ఏమాత్రం తీసిపోదు. రచనయందు తత్కర్తయందు వ్యాఖ్యాతకు విశేషభక్తి ప్రపత్తులు ఏర్పడటం సహజం దీనికితోడు వ్యాఖ్యాన పరిశ్రమ అధికమైనకొలదీ ఈ భక్తి ప్రపత్తులు పెచ్చరిల్లడం స్వాభావికమే. ఒక వ్యాఖ్యాత వ్రాసినది మరొక వ్యాఖ్యాతకు నచ్చకపోవటం, అది ద్వేషంగా పెంపొందడం అనుభవ గోచరమే. శివభక్తియందు విప్రతిపన్నులై ఆత్మార్పణం చేసుకొన్న కాళనాగాలు మనకు తెలియనివికావు. పదవాక్య ప్రమాణపారావార పారీణుడైన మల్లినాథసూరియంతవాడు ''భారతీ కాళిదాసస్య దుర్వ్యాఖ్యా విష

# 6. హృదయోల్లాసం

సంస్కృత సాహిత్యంలో నాటకాలకు, తెలుగుసాహిత్యంలో మహాప్రబంధాలకు విశిష్టస్థానం ఉన్నది. ఈ మహాప్రబంధాలలో కవిత్వదృష్టితో చెప్పుకోదగిన రచనలు పెక్కు ఉన్నా విజయవిలాసం ఒక ప్రత్యేక స్థానం సంపాదించుకొన్నది ఇందలి తెలుగు పలుకుబళ్లు, సామెతలు, మాటల తీరుతీయాలు, అందచందాలు, విరుపులు మెరపులు, మెలకువలు, మేళవింపులు, పోలికలు, పోహలింపులు కేవల సంస్కృత పండితులకు అందనివి తెలుగు పండితులకు విడువరానివి, మరవరానివి కూడ తెలుగు కవిత్వానికి కాకపోయినా తెలుగుతనానికి విజయ విలాసం పెట్టింది పేరు.

అయితే వసుచరిత్రవలెనే విజయవిలాసం కూడా వ్యాఖ్యానం అపేక్షిస్తుంది ఈ అపేక్షఉన్నా దీనికి ప్రాచీన కాలంలో వ్యాఖ్యలు బయలుదేరినట్లు తెలియదు. తెలిసినంతలో జూలూరివారి వ్యాఖ్య మొదటి దంటారు. వ్యాఖ్య కూడా సామాన్య పాఠకలోకానికి శ్రుతిగోచరమేగాని చక్షుర్గోచరం కాదు కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారి వివృతి 1911 లో వెలువడింది. ఇది సమగ్ర వ్యాఖ్యకాదు గచ్ఛద్వ్యాఖ్య. దీని పునర్ముద్రణ విజ్ఞప్తిలో వారి మనుమలు ఇలా పేర్కొంటున్నారు :

''శ్రీ తాతగారి వ్యాఖ్యను ఉన్నది ఉన్నట్లుగా మరల ముద్రించపవలసినదని మమ్ము పలువురు కోరుచుండిరి పైగా శ్రీవారు నాడు వ్రాసిన రీతిని ఈ చేమకూర వేంకటరాజ కవీంద్రుని కులవేదో చరిత్రశోధకులు ఇప్పటికిని నిర్ణయింపనేరకున్నారు కారణము సాధనసామగ్రి లేకపోవుటయే భాషా విషయమై చెప్పవలసినదంతయు వారే చెప్పియున్నారు 'చేమకూర పాకరుచులకు' ఈపాటి వ్యాఖ్యయే చాలుననియు ఇందలి శ్లేష చమత్కారాదికము అనుభవైక వేద్యమనియు దలంచి సంజీవని సర్వంకషాదుల వ్రాసినవారు అనవసరపు విపులీకరణమునకుం జొరక ఈ మాత్రముతో దీనిని వదలియుందురని తలంపనై యున్నది'' తలంపేదైనను ఈవ్యాఖ్య అరగౌరగానున్నదనుట నిర్వివాదాంశము.

ఆ తరువాత 1952 లో శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి ''ముకుర'' వ్యాఖ్య వెలువడింది ఇది వేదంవారి రచనకంటే మేలు అయినా ఇంకా మరొక వ్యాఖ్య వెలువడవలసిన ఆవశ్యకత వున్నది.

అయినా తాపీ ధర్మారావుగారి హృదయోల్లాస వ్యాఖ్య వచ్చేటంతవరకు మరొక వ్యాఖ్యానం వచ్చినట్లు వినలేదు.

మనకు సిద్ధాంత వ్యాసాలు వస్తున్నంత పుష్కలంగా ప్రాచీన కావ్య వ్యాఖ్యానాలు రావటంలేదు. ఎందువల్ల ? దేశంలో పండితులు లేరా? వోపిక లేదా? ఆసక్తి లేదా? ఆదరణ లేదా?

పండితులకు లోటు లేదు. ఆసక్తి ఆదరణలకు అంతగా కొరత లేదు కాని వున్నలోటు ఒకటే మన పండితులు చేస్తున్న కృషి శాస్త్రీయంగా చిత్తశుద్ధితో సహనంతో తరువాతి కాలంవారికి

ధర్మారావుగారు తాము సమాలోచించిన ప్రతులను పేర్కొన్నారు. తమకు నచ్చిన పాఠం మాత్రమే స్వీకరించి, తక్కినవాటిని విస్మరించక, తమ వ్యాఖ్యలో ఆ భేదాలను పేర్కొనటమేకాక, వాటి గుణావగుణాలను ఆయా సందర్భాలలో సావకాశంగా చర్చించారు. దీనివలన ప్రథమాశ్వాసం ౯9-వ పద్యంలో '' రాజశేఖర ప్రియ వారిజముఖి'' అన్న సుబోధమైన పాఠం ఇచ్చారు. అలాగే వేదంవారి ప్రతిలో 10-వ పద్యమైన 'ఆ రాజశేఖర ప్రియ వారిజముఖి'' అన్న సుబోధమైన పాఠం ఇచ్చారు. అలాగే వేదంవారి ప్రతిలో 10-వ పద్యమైన 'ఆ చెవ్వనృపాలాగ్రణి' అన్నదీ 11-వ పద్యమైన 'శివి సచ్యుతరాయల' అన్న పద్యం ధర్మారావు గారి ప్రతిలో 11, 10 పద్యాలుగా స్థానం మార్చుకొని చక్కని అన్వయం కల్పిస్తున్నవి. అలాగే ప్రథమాశ్వాసం 11-వ సీసపద్యంలోని ఎత్తుగీతి అయిన 'రసికమాత్రుండె...... రఘునాథభూమిజాని' అన్నపట్టున ధర్మారావుగారు చక్కని పాఠం సంతరించారు. 'సమర నిశ్శంక రఘునాథ సాహసాంక'' అన్న మకుటంతో ఉన్న సీసపద్యాలు చేమకూరవారివే అయినా విజయవిలాసంలోనివి కావనీ, ఎవరో వాటిని యీ కావ్యంలో చేర్చివుంటారనీ, తాపీవారు నిర్ణయిస్తున్నారు. అదిసముచితమే కావచ్చును. ఎందువల్లనంటే వాటిని తొలగించి నా లోటు కనిపించడం లేదు.

విజయవిలాసం ప్రథమాశ్వాసం 40-వ నాల్గవ పాదాన్ని వేదంవారు. బులుసువారు ఇలా పఠించారు.

'' విజయ సమారబ్ధ వేశ కౌతుకమున

మొగమున గరువంపు మురువుదోప''

కాని ధర్మారావుగారు 'విజయ సమారబ్ద వేళఁ గౌతుకమున' అని ఉండవలె నంటారు. పెద్దల యిచటి అభిప్రాయ భేదానికి సమారబ్ధము, కౌతుకము అన్న పదాలే మూలం. కౌతుకమంటే కుతూహలము అని ముగ్గురూ అంగీకరించారు. అయితే, ఆపదానికి వివాహకంకణము అన్న అర్థమూవున్నదని ఎవరూ గ్రహించినట్లు తోపదు. సమారబ్ధము అన్నది భూత కాలిక క్రియావిశేషణమని భ్రాంతిపడి వ్యాఖ్యాతలు అసముచిత విగ్రహం చెప్పుకొన్నారు. వేదంవారు, బులుసువారు, తృతీయా తత్పురుష చెప్పుకొని అర్థం పొసగకుండా చేశారు. చతుర్థీ తత్పురుష చెప్పుకొని తాపీవారు వ్యాకరణసమ్మతం కాని మార్గం త్రొక్కారు. సమారబ్ధము అంటే ఇక్కడ సమారంభమని మాత్రమే, అయితే భావార్థకంగా క్తాంతపదం వాడవచ్చునా?

నపుంసకే భావేక్త:

పాణినీయం 3-3-114

'హసితమ్,' 'జల్పితమ్' వంటిదే 'సమారబ్ధమ్' అన్నది కూడా. ఇప్పుడు ఏపాఠం సరియైన అర్థం సమర్పిస్తుందో చూదాము. రఘునాథనాయకుడు పెండ్లికి తరలినట్లుగా యుద్ధమునకు తరలివెళ్ళి విజయలక్షిని చేపట్టుటను కవి వర్ణిస్తున్నాడు. విజయ సమారంభ వేశకౌతుకము అన్నది షష్ఠీతత్పురుషగా చెప్పుకోడానికి ఆటంకం ఉండదు. అర్థం అడవి పాలూ కాదు. వేశమంటే వేషమని గురుబాల ప్రబోధిక పేర్కొంటున్నది. కనుక ధర్మరావుగారి పాఠం సముచితమని తోచదు. వేదంవారి పాఠం యోగ్యమనిపిస్తుంది.

జి. వి. కృష్ణరావు

ప్రథమాశ్వాసం 183 వ పద్యంలో వేదంవారు ''చూపులిరు చిక్కని బేడిసలు, గుబ్బలు చొకారపు దాళములు, రూప మానంగన్నైన చెక్కిళులు నాణెపుటద్దములు, అధరంబును గెంపగు'' అన్న పాఠములను స్వీకరిస్తే, ధర్మారావుగారు ''చూపులిరు చక్కని బేడిసలు, గుబ్బలు చొకారపు దాళములు, చెక్కిళు లొయారపు టద్దములు, అధరం బిలకెంపగు'' అన్న పాఠాలు స్వీకరించారు ఇలాంటిపట్టులలో పాఠ నిర్ణయానికి తోడ్పడేది సార్థకత, సౌందర్యం తప్ప మరొకటిలేదు. కవి–చూపులను బేడిసలనీ, స్తనాలను తాళములనీ, చెక్కిళ్ళు అద్దములని, అధరము కెంపని సామాన్యమైన రూపకం చెప్పక ఉత్ప్రేక్షిస్తున్నాడు. ఈ ఉత్ప్రేక్షా నిర్వహణానికి విశేషణులు వాడుతున్నాడు. చూపులు ఇరుచక్కని బేడిసలా? ఇరు చక్కని బేడిసలా? ఇరుచిక్కని బేడిసలా ? చంగున లేదా చెంగున దాటు చూపులు అని పేర్కొనబడుతున్నవి గనుక చూపులంటే వీక్షణము లేకాని, కన్నులు కాజాలవు. కనుక ఇక్కడ సంఖ్యావాచకంతో నిమిత్తం లేదు. చూపులు ఇరు ప్రక్కలనుంచి వెలువడుతున్నవి–– అని చెప్పటంలో విశిష్టత కనిపించదు, బేడిసలు సహజంగా అందమైనవి అయినప్పుడు చక్కని బేడిసలు అని చెప్పటంవల్ల కవి సాధించేప్రత్యేకత ఏమి ఉంటుంది? బేడిసలు అందమైనవే కాని అవి బొస్తవానికి చిక్కుతవి. మరి ఈ చూపులు చిక్కవు. వానికే హృదయం చిక్కవలసి ఉంటుంది. కనుక చిక్కని బేడిసలు అనటంలో చమత్కారం ఉన్నది. అప్పుడు ఉరి చిక్కని బేడిసలు అన్న పాఠం మేలుకాదా?

''రూపమానంగన మించు చెక్కిళులు నాణెపుటద్దము లేమొ'' అన్న వేదంవారి పాఠాన్ని ధర్మారావుగానే త్రోసిపుచ్చారు. బాగున్నది. '' అధరంబును'' అన్న వేదంవారి పాఠాన్ని, ''అధరం బొక'' అన్న పాఠాన్ని త్రోసిపుచ్చి, తాపీవారు '' అధరం బిల'' అన్న పాఠాన్ని స్వీకరిస్తూ, ఈ వర్ణన నాగలోక వాసినియైన ఉలూచికి సంబంధించినది కనుక మన భూమిలోని కెంపగు నేమొ అని వ్రాస్తున్నారు. బాగానే ఉన్నది. కాని కెంపులు నాగలోకంలో ఉండవా? ఉంటే తెల్లగా ఉంటవా? వివిధ లోకాలను తత్ ప్రకృతులను ప్రాచీనులు చెప్పుకున్నట్లు లేదు.

ఏది ఎలావున్నా 'ఎలకెంపు' అయివుంటుందని తోస్తున్నది. అధరానికి నిండు ఎరుపురంగు వుండకపోదు. అయితే అది ఆరోగ్యచిహ్నం కాదు. లేత ఎరుపు అంటే పగడపు చాయ ఆరోగ్య చిహ్నం, అందంగాను వుంటుంది. ఎల అన్నపదం లేతదన్ని, మృదుత్వాన్ని , ప్రాయాన్ని సూచిస్తుంది. కెంపునకు మృదుత్వం, ప్రాయం వుండవు, అందువల్లనే మోవి ఎలకెంపుగా ఉత్ప్రేక్షిస్తున్నాడు.

ఈ దృష్టితో చూచినప్పుడు చూపులు ఉరిచిక్కని బేడిసలు గుబ్బలు చొకారపు తాళము. కేవల తాళములు తమకు తాముగా చొక్కచేయవు. అందువలననే కవి చొకారపు తాళములంటున్నాడు. అద్దము రూపు చూపుతుందే తప్ప ఒయారంపోదు. అందువలననే చెక్కిళులు ఒయారపుటద్దము లంటున్నాడు. కెంపునకు మృదుత్వము, ప్రాయము వుండవు. కనుక అధరాన్ని ఎలకెంపు అని పేర్కొంటున్నాడు.

ఏది ఎలావున్నా ఇచటి యీ పాఠ నిర్ణయానికి సహృదయులే ప్రమాణం.

మొత్తంమీద ఇలాంటి ఒండు, రెండు పాఠభేదాలకేమి గాని, తాపీవారి పాఠ నిర్ణయాలు చాలా సముచితంగా వున్నాయి.

వ్యాఖ్యానపద్ధతిలో తాపీ వారు క్రొత్తమార్గంత్రొక్కారు. గ్రాంధికభాష కాక ఈనాటి వ్యావహారిక భాష వుపయోగించారు. ఇది పరిశోధకులకు క్రొత్తది కాకపోవచ్చును. ప్రాచీనులు ఇలాంటి భాషే, అంటే తమ కాలంనాటి వ్యాహారిక భాషే వాడారని గిడుగువారు మున్నైనవారు వ్రాశారు. గ్రాంధికవాదులకు ఇది మనస్కరించకపోవచ్చును. ఈ వ్యావహారిక భాషవల్ల శబ్దస్వరూపం విద్యార్థులకు తెలియదనీ, విగ్రహ వాక్యానుగుణంకాని సమాసార్థాలు రచనాశిక్షణకు తోడ్పడవని అనవచ్చును. వ్యావహారిక భాషావాదులుమాత్రం తాపీవారి వ్యాఖ్యానానికి స్వాగతం పలుకక తప్పదు. ఎందువల్లనంటే, ఇలాంటివాటివల్ల వ్యావహారిక భాషకు ఒక స్థాయి చిక్కుతుంది. ప్రమాణం ఏర్పడుతుంది.

వెనుకటి వ్యాఖ్యానాలకు, నేటి వ్యాఖ్యానాలకు తేడా వుండక తప్పదు. వెనుకటి రోజుల్లో ముద్రిత ప్రతులుండేవి. కోశాలు, లక్షణగ్రంధాలు మున్నైనవి సర్వసామాన్యంగా లభ్యమయ్యేవికావు. కనుక నాటి వ్యాఖ్యాతలు అర్థాలకూ, అలంకారాలకు, శాస్త్రవిషయాలకు ఆయా గ్రంధాలనుండి సందర్భాల కావశ్యకమైన ఉట్టంకనాలు ఇవ్వవలసివచ్చేది. ఈ నాడు సమగ్రమైన సంస్కృత కోశాలు ముద్రితాలై లభిస్తున్నవి. తెలుగు నిఘంటువులుకూడా అచ్చయ్యాయి. సరిక్రొత్తవి వస్తున్నవి. అయినప్పుడు వీటిని విపులంగా ఉదహరించి పేజీలు పెంచనక్కరలేదు. పాఠకునకు తల దిమ్మెత్తించనక్కరలేదు. ఈ అంశాన్ని గమనించి తాపీవారు జాగ్రత్త పడ్డారు. అవసరమైనచోట తప్ప కోశాదుల ప్రస్తావన తేలేదు. అయితే 'కోమలి యీ గతిన్మది తగుల్వడబల్కిన' (2-వ ఆశ్వాసం 168-వ పద్యం) అన్న మొదటి పాదంలోని తగుల్వడ అన్న పదానికి పట్టుబడునట్లు అని చక్కని అర్థం చెప్పి ఆంధ్రభాషార్ణవ పద్య పాదాలను ప్రమాణీకరించారు. వాస్తవానికి శబ్దరత్నాకరం కూడా యీ ఒక్క అర్థాన్నే యిచ్చింది. అయితే యీ అర్థం ఇటీవల వచ్చిందికాదు. వెనుకటినుంచి వున్నదని సూచించడంకోసం తాపీవారు భాషార్ణవాన్ని వుదహరించి వుంటారనుకోవచ్చును. 61

ఏది ఎలావున్నా పదాలకు అర్థాలు వ్రాయవలసి వచ్చినప్పుడు ధర్మారావుగారు కనుగలిగి వ్రాశారని చెప్పకతప్పదు. వుదాహరణకు పరిగ్రహించు అన్న సంస్కృత పదాన్ని తీసుకోవచ్చును. దీనికి స్వీకరించు, పెండ్లియాడు అన్న అర్థాలున్నవి. సందర్భానికి ఈ రెండు అవశ్యకం. అందుకోసం చేపట్టు అని నిత్య వ్యవహారంలోవున్న పదాన్ని అర్థంగా ఇచ్చారు. పెండ్లియాడు అన్న అర్థంకూడా ఈ పదాన్ని అర్థంగా ఇచ్చారు. పెండ్లియాడు అన్న అర్థంకూడా ఈ పదానికివున్నది. ఈ అర్థాన్ని పాఠకుడు విస్మరిస్తాడేమోనని బ్రాకెట్‌లో సూచించారు.

చరిత్ర, తెలుగు పలుకుబడి, చమత్కారం, ఆపోశనం పట్టిన ధర్మారావుగారి వ్యాఖ్య నిజంగా హృదయోల్లాసవ్యాఖ్యే. వెనుకటి వ్యాఖ్యానాలు వివరింపని ఎన్నో సొగసులను వీరి వ్యాఖ్య పాఠకునకు కరతలామలకం చేస్తున్నది. ' ఊదుకపోవు శంఖము' 1- ఆ 134ప- అన్న పద్యాన్ని పరిష్కరించి, దాదాపు నాలుగున్నర పుటల వ్యాఖ్య ఇచ్చారు. వ్యాఖ్యాతలు నిజంగా ఉలూచి హృదయంలో నెలకొన్న నరుని వీరవిలాస సంపదను మనకు సాక్షాత్కరింప జేశారు.

జి. వి. కృష్ణరావు

అలాగే తరువాతి పద్యంలోకూడ ఎంతో చమత్కారం చూపించారు. ' ఉలూచి తన హృదయమనే అమూల్యమైన రత్నాభరణమును అమ్మదలచుకుంది. రత్నా భరణమును మొదట బంగారు పరీక్షకుడు వన్నెకట్టాలి. తరువాత రత్న పరీక్షకుడుకూడా రత్నముల వెల నిర్ణయించాలి. ఆ తరువాత అంత ఎక్కువ ఖరీదు ఈయగల ధనికుడు గావాలి. అప్పుడు గాని ఆ రత్నాభరణమును అమ్మటానికి వీలుండదు.

'ఈ మూడు గుణములు అర్జునునియందు కనబడుతున్నాయి. జాళువా నొరయగల్గుట, కెంపు వెలగాగొనుట, ధనాధిపసూనుని ధిక్కరించుట. కాబట్టి అక్కడే, అతనికే, అప్పుడే అమ్మక తప్పదు అని నిశ్చయించుకొంటుంది.

'ఈ అవకాశం చేయిజారిపోతే మళ్ళా ఇటువంటి అవకాశం కలుగునో, లేదో, ఎప్పుడో, ఎక్కడో అని భావము' అని హృద్యంగా వివరించారు.

ఈ పద్యమందలి వెలగాగొను అన్న పదంలోని అచుంబిత పూర్వ చమత్కారన్నంతా ఆస్వాద్యంచేస్తూ తిరస్కరించు, తెల్లదానినిగాభావించు, వెలకట్టు అన్న విశేషాలను చూపించారు. ధర్మారావుగారి విమర్శక ప్రతిభ జాగేయం.

అయితే, యీ పట్టున వారుకావిస్తున్న అలంకారశాస్త్ర సమన్వయం దిగ్భ్రాంతి కలిగిస్తున్నది. ఈ పద్యంలో ప్రతీపము, యమకము వున్నవని పేర్కొంటున్నారు. యమకమున్నది నిజమే. ఇక్కడ ప్రధానమైన చమత్కారమేది? ఉలూచి హృదయం అమూల్య రత్నమని, అర్జునుడు సుందర సంపన్న రత్నవర్తకుడనికదా గమ్యమాన మవుతున్నది. ఈ వస్తుధ్వనిని పేర్కొలేదు. స్ఫూలంగాకనిపిస్తున్న వాచ్యోపమనుగూడ పేర్కొనక, ప్రతీపాలంకారమంటున్నారు. వుపమానానికి వుపమేయత్వకల్పన కాని, అన్యోపమేయ లాభం చేత వర్ణ్యానికి అనాదరంకానీ, వర్ణ్యమునకు వుపమేయ లాభముచే వుపమానమునకు తిరస్కారముకాని, వర్ణ్యముతో నుపమానమునకు సామ్యము సిద్ధింపదనుటగాని, వుపమానమెందుకనుటగాని ప్రతీపమవుతుంది. ఇందేలక్షణమూ ప్రకృతార్థానికి అన్వయించదు. అయినప్పుడు ప్రతీపాలంకార ప్రసక్తి రాదు. 'మామకాగమన వార్త దెలుపుమనుచు విశారదు బిలిచి పనిచే' 1– ఆ, 217–వ–అన్న పద్యానికి ధర్మారావు గారు చేసిన వ్యాఖ్య చెప్పుకోదగ్గది. ముఖ్యంగా మామకాగమన వార్త అన్న పదమందలి శ్లేషను హృద్యాతిహృద్యంగా వివరించారు. అలాగే 'పంకేజాతములన్' 'హరిపతి నడుమున కోడెన్' 16–17–అన్న పద్యాలవ్యాఖ్య హృదయంగమము.

ధర్మారావుగారి వ్యాఖ్యలో మరొక ప్రత్యేకత కనిపిస్తుంది. చేమకూరకవి శబ్దాన్ని రిత్తపోనీయడు. కనపడ్డ పామును కన్నానపడనీక కవితా నరేంద్రుడై పట్టి ఆడించి సహృదయులకు హృదయోల్లాసం కలిగిస్తాడు. వెనుకటి వ్యాఖ్యాతలు ప్రదర్శింపని ఇలాంటి శబ్ద చమత్కృతులను పెక్కింటిని తాపీవారు తమ వ్యాఖ్యలో చూపించారు.

విజయవిలాసం మొదటి ఆశ్వాసం 83–వ పద్యంలో కవి ముగ్గులు, దీపికా శ్రేణులు, ధూపవాసనలు, వాద్యఘోషములు, 'మిగులంగను విందొనర్చు' నని వర్ణించాడు. ముగ్గులు,

దీపికలు కనువిందులుకావచ్చు కాని, ధూప వాసనలు, వాద్యఘోషములు ఎలా కనువిందొనర్చుతవి? అన్న ప్రశ్న వస్తుంది. దీనికి సమాధానంగా ''మిగులంగను విందొనర్చు'' అన్న విరుపునుచూపి తాపీవారు ఆహ్లాదం కలిగిస్తున్నారు.

ఇలాగే '' ఒక భూమీదివిజుండు-108 ప-అన్న పద్యంలోని ఉద్యోగము అన్న పదానికి పని అనీ, గొప్పయోగమూ అని అర్థంచూపి పాఠకులను ముగ్ధులను చేస్తున్నారు.

''అనుకూలమారుతాగతి గనుగొననామోదసూచకంబైనదిగా - 1 ఆ 118 ప- అన్న పద్యంలో కనుగొనన్ - చూడగా అనీ, కన్నుల కొనలయందు'' అను చమత్కారం చూపించారు. ఉలూచి తమినొక్కనాడు -1 ఆ 113ప- అన్నప్పుడు తమిన్ అన్న పదానికి వేకువను అన్న అర్థము చెప్పుకోవాలని యుక్తియుక్తంగా ప్రదర్శించారు. అలాగే ''అల్లవాల్గంటి'' - (1 ఆ 179ప) - ఆ వాలిన కన్నులు గలిగిన ఉలూచి అన్న చక్కని అర్థం సూచించారు. ద్వితీయాశ్వాసం 12-వ పద్యంలో 'చిత్రాంగదయుత' అన్న సమాసంలోని అంగద శబ్దానికి అందియ అని అర్థం చెప్పటం ప్రకరణ హృద్యంగా ఉన్నది.

' ఇందమని వేగ నీవి నీ వియ్యకున్న - (2-31)'' అన్న పాదంలో 'నీవి, నీవు, ఇయ్యకున్న' అనీ ' ఈవి, నీవు, ఇయ్యకున్న' అని విరుపులు చూపి ఔచిత్య చమత్కారాలను ఆవిష్కరించారు.



బెళుకు బేడిసమాలం

గడకొత్తుఁగన్ను, లౌరా

జడయందముఁజూపఁబాప జగతింగలదే? బేడిసమాలన్ కడకొత్తు అనీ, బేడిసమాలన్ గడకొత్తు అనీ విరుపులు చూపించారు.

పాప తొలగింప-అన్న అర్థము విశేషంగా చూపించారు.

ఇలాగే 'నెమ్మది సంశయింపక' అన్న 2-121 పద్యంలోని 'అమ్ముని ప్రవరుడు' అన్న పదానికి, మునిశ్రేష్ఠుడని మాత్రమేకాక 'ముని యనెడి వరుడు' అన్న చమత్కారాన్ని గూడా ప్రదర్శించారు.

'కావలిబెట్టిన దెటిగితిరుగు' అన్న దానిలోని తిరుగు అనుదానికి వెనుకటివారు మరలుము అని మాత్రం అర్థం వ్రాశారు. దానికి తాపీవారు 'ప్రవర్తించుము' అని జోడించటం సరసంగావుంది.

ధర్మారావుగారి హృదయోల్లాస వ్యాఖ్యలో మరొక విశేషమున్నది. మన నిఘంటువులు సమగ్రంగా వుండకపోవటం వల్లా, చారిత్రక విషయాలు తెలియకపోవటంవల్లా కొన్ని పదాల అర్థ విషయంలో వెనుకటివారి అర్థవివరణ పెడమార్గం పట్టింది. ఇందుకు ఉదాహృతులుగా ఆలవట్టములు, చవులు, దిసంతులు, పికిలికుచ్చులు, వహి, రేకమోచుట, కంటసరి, రూపు, సింహాసనము, నేపాళము అన్న పదాలను తీసుకోవచ్చును. వీనికి తాపీవారు విజయవిలాసోద్దిష్టార్థాలను నిర్ణయించి చూపారు. ఆలవట్టమునుండి వహి వరకువున్న పదాల అర్థాలను ప్రౌఢ్యం ఇచ్చింది.

జి.వి. కృష్ణరావు

ఇది ప్రమాణం కాదన్న దృష్టితోనో, లభ్యపడకపోవటంవల్లనో వెనుకటివారు ఉపమార్గం పట్టారు. విజయధ్వజమెత్తిన తాపీవారుకూడ ఈ పట్టులప్రౌణ్యాన్ని పేర్కొలేదు. రేకమోచుట అంటే గంటువహించుట అనీ, కంటసరి, రూపు అన్నవి కన్యలు ధరించే ఆభరణాలనీ వీరు చక్కగా వివరించారు. పికిలికుచ్చుల పుట్టుపూర్వోత్తరాలను విశదీకరించారు. చరిత్రను పరిశీలించి సింహాసనమంటే విజయనగరసామ్రాజ్యమని, నేపాళమంటే హిమాలయప్రాంతమందలి రాజ్యంకాక జఫ్నాదీవి అని తాపీవారు తేల్చారు. 'తమినిగుడగుడా కేశుండు' అన్న పద్యంలోని గుడా కేశ శబ్దానికి అర్జునుడు అని అర్థమున్నా ఆ పదమందలి కేశశబ్ద ప్రాముఖ్యం కవికి అభిప్రేతమని మొదటగా గుర్తించినవారు ధర్మారావుగారనుకొంటాను. వేదం వారుగూడా కా– ఆలస్యమునకు ఈశుడు– దొర అనగా అలసత లేనివాడు అన్న వ్యుత్పత్త్యర్థం వ్రాశారు. ఈవ్యుత్పత్త్యర్థాన్ని సూచించవలసిన ఆవశ్యకం ఎందుకు ఏర్పడిందో బోధపడదు. ఈలోటును గ్రహించిన ధర్మారావుగారు గుడా కేశ శబ్దాన్ని ఇలా వివరిస్తున్నారు: 'గుడా అనగా చూపుడు వ్రేలుకొనా, బొటన వ్రేలికొనా కలసినప్పుడు ఏర్పడేవలయము. తల వెంట్రుకలను పట్టి చూచినప్పుడు ఆ వలయమునిండా వున్నంత దట్టమైన జుట్టు కలవాడు'. గుడా కేశుడు ఇక్కడ 'అర్జునుడు' అని వ్రాశారు.

ఈ వివృతి కొంత మెరుగే, అయితే ఆపాటి కేశపాశంతో గంగానది, యమునానదియేమో అన్నట్లు ఎలా తోచింది? ఈప్రశ్న వ్యాఖ్యాతలకూ కలిగినట్లువుంది. అందువల్లనే తద్గుణమూ, భ్రాంతిమంతమూ వున్నదన్నారు. కాని ఒకటి తన గుణమునువీడి అన్యగుణమును గ్రహించినప్పుడే తద్గుణాలంకార మేర్పడుతుంది. స్వగుణత్యాగా దన్యోత్కృష్ట గుణస్వీకార స్తద్గుణః, మరి గంగానది తన గుణమువీడి యమున గుణమును పొందలేదు. అందువల్ల ఇచ్చట తద్గుణాలంకార ప్రసక్తిలేదు. సాదృశ్యంవల్ల ఒక వస్తువును వేరొక వస్తువని భ్రాంతిపడినప్పుడు భ్రాంతిమంత మౌతుంది.– సాదృశ్యా ద్వస్త్వంతర ప్రతీతిర్భ్రాంతిమాన్– గంగానది యమునానది యన్న భ్రాంతి కలుగుటలేదు. కనుక ఇచ్చట భ్రాంతిమంతానికి తావులేదు.

కనుక గుడాకేశుడన్నదానికి సూర్యరాయ నిఘంటు పేర్కొన్నట్లు జెముడువలె మిక్కుటముగా బెరిగిన జుట్టు కలవాడు అర్జునుడు అని ఇక్కడ చెప్పుకోవటం సముచితంగా తోస్తున్నది.

విజయవిలాస కథాప్రారంభ పద్యమందలి 'రమాహేలా కలావాస' మన్నసమస్తపదానికి లక్ష్మీకిని, పార్వతిని, సరస్వతికిని ఉనికిపట్టుఅని తాపీవారు వివరించారు. హేల అంటే పార్వతి అని చెప్పటానికి విశ్వనిఘంటువును ప్రమాణీకరించారు. చంద్ర ప్రస్తర... చంచరీకోత్కరంబు అన్న మొదటి సమాసం దీనికి పోషకంగా తోపదు. ఏది ఎలావున్నా ఇది సహృదయులు నిర్ణయించుకోవలసిన విషయం.

వరులు అన్న పదంవిషయంలోగూడా తాపీవారు భ్రాంతిపడ్డారేమో ననిపిస్తుంది. ఈ ''వరులు'' అన్నది చేమకూరవారు రెండు సందర్భాలలో ప్రయోగించారు.

నీ వరుల నోదెపాటు చేసితివనుట యేపాటి తం౹ప-1 ఆ 44ప- నల్గడల భూమివరులు మేలనదగి - 1 ఆ 69 ప- ఈ రెండు చోట్ల ఇది శ్లిష్టమే. ఈ రెండుపట్ల ఇది ధాన్యవాచి అని వ్రాస్తున్నారు. వరి ధాన్యవాచి అని ఆంధ్రభాషార్ణవము, బ్రౌణ్యము పేర్కొంటున్నవి. కాని ఈ అర్థము ఇక్కడ పొసగదు. తాపీవారు చెప్పినట్టు వరులు ధాన్యవాచి అయితే ఓదె పాటుచేయటం అన్నది ఎలా పొసగుతుంది? సస్యవాచి అయినప్పుడే ఓదెపాటుచేయటం సాధ్యపడుతుంది. ఇంక రెండవ పట్టున అర్థవిచారం కొంత జాగ్రత్తగా చేయవలసి వుంటుంది. 'తడబాటు' అన్న పద్యంలో కవి ఆయా వర్ణాలవారి పని పాటల ప్రాశస్త్యాన్ని వారి కౌశలాన్ని అభివర్ణిస్తున్నాడు. బ్రాహ్మణులు పాడితప్పరు. వేదపాఠక్రమమున తడబడరు. క్షత్రియులు ధనుఃకౌశలమును విడిచిపెట్టరు. వైశ్యులు లక్షలకు అమ్మజాలుతారు. ఇంక శూద్రులు మెచ్చుకోదగినట్లు వరులు పండిస్తారు. విత్తనం ఎంచుకోవటంలోకంటె పైరును పెంచడంలో ఎక్కువనైపుణ్యం కావాలి. శూద్రులు అత్యంత నిపుణులు అన్నప్పుడు పైరు పెంచటంలో గొప్పవారని చెప్పినప్పుడే వారి ఉత్కర్ష భాసిస్తుంది. కనుక ఇక్కడ వరులు అంటే వరిపైరులు అన్న అర్థం చెప్పుకోవటం సమంజసం. నలుగడల అంటేనే నలుగడలభూమి అన్న అర్థం సిద్ధిస్తుంది. అయినప్పుడు భూమి దేనికి? భూమివరులు అంటే మెట్టవరులని కవి హృదయమై ఉంటుందా?

ఏది ఎలావున్నా వరులు అన్నది సస్యవాచియే కాని ధాన్యవాచిగా తోచదు. ధాన్యవాచిఅయితే వడ్లు అన్న రూపమేఉండాలని వ్యాకరణమూ, వ్యవహారమూ బోధిస్తున్నవి. 65

సంప్రదాయ విషయంలో ఒకటి రెండు పొరపాట్లు హృదయోల్లాసంలో కనిపిస్తున్నవి. ''వాసవి త్రిదండి'' అన్న 3-వ ఆశ్వాసంలోని 83 వ పద్యంలోని విశేషం వివరించే సందర్భాన అద్వైతమత సన్యాసులు సిగను తీసివేసి జందెమును మాత్రమే వేసుకోవచ్చును అని వ్రాశారు. ఇది ప్రామాదికం. ఇలాగే మూడవ ఆశ్వాసంలోని 'మకరాంకుడు గానకుండగనే' అన్న 220-వ పద్యానికి విశేషాలు వ్రాస్తూ మన్మథుడిని గ్రుడ్డి బాలుడుగా చిత్రించటం వుందికదా అని ధర్మారావుగారు వ్రాశారు. అవును నిజమే. ఏ సంప్రదాయంలో? గ్రీకు సంప్రదాయంలో-17-వ శతాబ్దిలో వెలువడిన తెలుగు ప్రబంధానికి వ్యాఖ్యవ్రాస్తున్నామన్న సంగతి వారు విస్మరించినట్లుంది.

ఎన్నో లోతుపాతులను త్రవ్వి చూపుతున్న హృదయోల్లాసం, కొలదిచోట్ల ప్రస్ఫుటంగా సుగమంగావున్న కొన్ని చమత్కారాలను ఎందువల్లనో విడిచిపెట్టింది. ఉదాహరణకు ఈ క్రింది సందర్భాలే తీసుకోవచ్చును:-

వీరవరుడని హరు డత్యుదారకరుణ
జేయునెప్పుడు విజయు నజేయుగాగ 1-4

శివుడు విజయవముల సంపాదించుకొని వచ్చిన రఘునాథ రాజును శత్రువులకు గెలువరానివానిగా చేయునుగాక యని ధర్మారావుగారు చక్కగా చెప్పారు. ఈ సందర్భంలో విజయశబ్దంతో అర్జునుని వృత్తాంతం జ్ఞప్తికి వస్తున్నది. ఈ విషయంకూడ వారే ప్రస్తావించారు. అయితే అర్జునుడు బభ్రువాహనునివల్ల పరాజయం పొందాడు. అట్టిది కలుగకుండా కృతినాయకుని అజేయునిగా జేయుగాక అన్న విశేషాన్ని గూడా ప్రస్తావించి యుండవలసినది.

జి. వి. కృష్ణరావు

ఏమునుచూచి యెఱుగ నిను

నీమును ననుజూచి యెఱుగ వీవును. 2-181

దీనికి ఏన్-నేను. మును- ఇంతకు ముందు, నినున్-నిన్ను చూచి యెఱుగన్-చూడలేదు. ఈవున్-నీవుగూడ, ఈమును- ఇంతకు పూర్వము, ననున్, చూచి యెఱుగవు-చూచిన దానవు కావు అని మాత్రం వ్రాశారు. ఈమును- ఇంతకుమున్ను-ననున్ నీవు చూచి కాంచియు ఎఱుగవు-తెలియవు అన్న అర్థంకూడ ఉన్నది. వాస్తవానికి ఈ యర్థమే ఎక్కువ చమత్కారకారి. ఈ యర్థము చెప్పుకొన్నప్పుడే ఈమును అన్న పదము సార్థకమౌతుంది. విశేషించి కవికి అభిమానాస్పదమైన యమకం సిద్ధిస్తుంది. ఇలాగే

సుఖనీరధి తేలగనీక నాకయో

సిగ్గను పేర వెంటబడ జెల్లునొకో ప్రతిబంధమయ్యెడన్

ప్రతిబంధము అంటే ఆటంకము, బంధము అన్న రెండర్థాలు ఉన్నవి. సుఖనీరధిని బంధము తేలనీయదు కనుక రెండవ అర్థంగూడా వ్యాఖ్యాతలు ప్రస్తావించి ఉండవలసింది.

ఇలాంటి స్వల్ప విషయాలు ఒక్కొక్కప్పుడు స్ఫురిస్తాయి. ఇంకొక్కప్పుడు స్ఫురించవు. అంతమాత్రాన న్యూనతను ఆపాదించ నక్కరలేదు. కాని సొగసు అన్నది కావ్యానికి ప్రాణం. ప్రాచీనుల మతంలో అది ఆత్మ. దానిని వివరించేదే అలంకారశాస్త్రం. ఆ పని చేయలేకపోతే అది అంగారకశాస్త్రం. ఈనాటి కొంతమంది పండితులకూ మన విశ్వవిద్యాలయాలకూ ఈ అంగారకశాస్త్రంలో గౌరవమున్నది. కానీ అలంకారశాస్త్రం లోనే గౌరములేదు, నమ్మకం లేదు. కేవలం పద్యసలలోని సొగసులను వివరించవలసి వచ్చినప్పుడు ఈ అయ్యవార్లు ఎలా చెప్పుకొంటున్నారో.

ఇంతకూ నమ్మకం లేనివారితో పేచీపడవలసిన పని లేదు. కాని ధర్మారావుగారు, వారి హృదయోల్లాస వ్యాఖ్య ఈ కోటిలో చేరినవారు కారు. ఇది మరొక ప్రత్యేకత. ఆయా పద్యములందు అన్వయ ముఖాన కాకపోయినా అలంకారాలను నామగ్రాహంగానైనా యిచ్చారు. ఇది. ముదావహం. అయితే కొలది చోట్ల వారిచ్చిన అలంకారం వివరించిన అర్థానికి అనుగుణంగా లేదేమో ననిపిస్తుంది.

శ్రీగౌరుల్ సమకూర్తు రాహవ జయశ్రీగౌరులన్ నిత్యమున్''

ఇందు క్రమము, యమకము, శ్లేష చెప్పబడ్డవి. కాని శ్లేష ఉన్నదా?

పంచామరతరులో హరి

పంచాయుధములొ గిరీశు పంచాస్యములో

అంచున్ సకలజనంబులు

నెంచన్.

ఇందు ఉదాత్తంతోపాటు సందేహం పేర్కొనబడ్డది. ఓ అన్న అవ్యయం సంభావనా సంప్రార్థనా సందేహ ప్రశ్నాద్యర్థకమే. కాని ఇచట అది సందేహాన్ని తెలుపుతున్నదా? సంభావనను

కాదా? 'పారజూచిన పరసేన పారజూచు' అన్న పద్యంలో యమకము, అతిశయోక్తి, విభావనశ్లేష పేర్కొనబడ్డవి. విభావనా శ్లేషాలంకారాలుకూడా ఉన్నవా?

రాకొమరు నెరులు నీలపు

రాకొమరు నిరాకరించు రాకాచంద్రున్

రాకొట్టు

ఈ పద్యంలో వ్యతిరేకాలంకారంకూడా వున్నదని పేర్కొన్నారు. కాని ఇందు ఉపమ చెప్పుకోవటమేహృద్యం.

'వనధికాంచి నొక్క వనముకాంచి' ఇందనుప్రాసమున్నదన్నారు. కాని ఇది యమకం.

భాలిక యేగుదెంచె విభుపాలికి బ్రాణ సఖుల్ తెమల్పగా

యేలిక మ్రోలకున్ మనవికేగెడు నయ్యభిమాని పోలికన్.

ఇందున్నది ఉపమాలంకారమని హృదయోల్లాసము పేర్కొంటున్నది. ఇది విస్పష్టమైన ఉత్ప్రేక్ష.

ఎన్నో సందేహాలను తొలగిస్తున్న హృదయోల్లాసం ఒకటి రెండు చోట్ల సందేహాన్ని తొలగించటం లేదు. 

రంభ వాకిటను దోరణములు గట్టెడు

తీవరమొక కొంత దీలుపడియె

మేనక......

సంరంభ మొక కొంత సడలువారె

కనకాంగి యింటిలో ......

సవరించు టొక కొంత జాగుపడియె

హరిణి ...... సెజ్జలు

నిర్మించు టొక కొంత నిలుకడయ్యె

మబ్బు గబ్బున నీశౌర్య మహిమ వినక

తెగువతోడుత నెదిరించి తిరిగి విఱిగి

పారిపోయిన మన్నీల పాటుసూచి

సమర నిశ్శంక రఘునాథ సాహసాంక.

ఇచ్చట దేవవేశ్యల సంరంభం పూర్తిగా తొలగిపోయింది అని అనక ఒక కొంత దీలుపడింది; ఒక కొంత సడలింది; ఒక కొంత జాగుపడింది; ఒక కొంత నిలుకడయింది, అని కవి అంటున్నాడు. ఇందలి తాత్పర్యాన్ని తాపీవారు సందేహనివారకంగా వివరించినవారు కారు.

జి. వి. కృష్ణరావు

మరొక విశేషం. తాపీవారు గుణైక పక్షపాతంతో కాబోలు గుణీభూతాలై చెడిపోయిన పట్లు, యమకాది ప్రలోభంవల్ల చెడినపట్లు ఉట్టంకించలేదు.

శైలములెక్కి యష్టమద సామజమౌళుల మీదుగా మహా
కోలకులేంద్రు వాడిబలు కొమ్ము మొనం బడి సర్వదా విష
జ్వాలలు గ్రమ్ము శేషుత్తల చాయెనె యోడక వచ్చి కూడెనౌ
భులలితాంగి కెంతవలపో? రఘునాథ నృపాల మౌళిపైన్

ఇచట నాల్గవ పాదం సొగసును చెరచటం లేదా?

''నువ్వు బువ్వు నవ్వు జవ్వని నాసిక''

అన్న ప్రథమాశ్వాసంలోని 149–వ పద్యంలోని అనుప్రాసం వెక్కసంగా వున్నది. ఇక్కడ రసికుడైన అర్జునునికి చక్షుః ప్రీతి కలిగిందన్న భావము కవి ఈ పద్యములో శబ్దాలంకారా వేశముతో తేటపరిచాడు అని వ్యాఖ్యాతలు వ్రాస్తున్నారు. ఇందుకే కాబోలు 'లోకో భిన్నరుచిర్హి' అంటారు.

మొత్తంమీద వెనుకటి వ్యాఖ్యాతలకంటె ధర్మారావు గారు ఎన్నెన్నో విశేషాలను హృదయోల్లాసంలో ఉపన్యసించారు. అయితే విజయవిలాసం చమత్కారాల విషయంలో ఇసకపాతర. త్రవ్వినకొలది విశేషాలు తోస్తూనేవుంటవి. ఉదాహరణకు ఈ పద్యాన్ని తీసుకొందాము.

చెఱుకు విలుకాని బారికి వెఱచి నీదు
మఱుగు జొచ్చితి జేపట్టి మనుపునన్ను
ప్రాణదానమ్ము కన్నను వ్రతము కలదె
యెఱుగవే ధర్మపరుడవు నృపకుమార.

వెనుకటివారు, ''మన్మధుని బారికి వెరచి నీ శరణుజొచ్చితిని. చెరకువిలుకానికి భయపడి నీ ప్రాపుజేరితిని. వివాహమాడి, గ్రహించి బ్రతికింపుము''. అన్న అర్థాలను పేర్కొన్నారు. ధర్మారావుగారు వీనికితోడు ధర్మపరుడు అన్న పదంలోని చమత్కారం వివరిస్తూ, ''ధర్మమందు ఆసక్తి కలవాడవు. ధర్మజునకు తమ్ముడవు.'' అని వివరించారు. అయితే ఇంతటితోనే తృప్తిపడటానికి వీలులేదు. ధర్మము అంటే విల్లు. ఇంకను వింటియందు ఆసక్తి ఉన్నది అన్న విశేషం కూడా చెప్పుకోవాలి. ఆలాగే నృపకుమార అన్న సంబోధనంలో కూడా విశేషమున్నది. నృపశబ్దం ఇచట సాభిప్రాయం. కుమార శబ్దానికి పుత్రుడు, కుమారస్వామి, మన్మథుడూ అన్న అర్థాలు ఉన్నవి. ఈ అర్థాలన్నీ ఆవశ్యకాలే. ఎరుగవె అన్న పదం కూడా ముఖ్యం. అనుభవపూర్వకంగా తెలుసుకోవా? విన్నదానికంటే కన్నదానికంటే అనుభవించినది ప్రామాణికతరము. ఈ పద్యంలో ఉపమాధ్వని, వస్తుధ్వని ఉన్నాయి.

విజయ విలాసానికి సారతరమైన యింత విపుల వ్యాఖ్య వ్రాసిన ధర్మారావుగారినుంచి వెంకటకవి వంశాదిక విషయ పరిష్కారం పాఠకు లాసించటం సహజం. వెనుకటివారు కొందరు కవి నియోగ బ్రాహ్మణుడన్నారు. కాటూరివారు, బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు ''పన్నిన సత్రుబంధమున'' అన్న చాటువును పురస్కరించుకుని కవి భోగినీ పుత్రుడని వ్రాశారు. నిజంగా కవి భోగినీ పుత్రుడైతే సారంగధరలో చిత్రాంగిని వేశ్యగా చిత్రించి ఉండేవాడు గాడని తాపీవారుత్రోసిపుచ్చారు. ఇది యుక్తిసహంగానే కనిపిస్తున్నది. ''కవి పేరు వేంకటరాజు అని తేటపడ్డది. దీనిలోని రాజు అన్నది బిరుదు పేరు. నాయకులు నాయుళ్ళు రాజుగా ఉన్నప్పుడు నాయుడు అందురు. ఆ బిరుదు పేరునే ఉంచుకొనేవారు. దీన్నిబట్టి చూచినా వెంకటరాజు నాయుడు బిడ్డ అని తేటపడుతుంది. ఇప్పటికీ చేమకూర నాయుడు కుటుంబాలు మనదేశంలో ఉన్నాయి.'' అని ధర్మారావుగారు వ్రాస్తున్నారు.

ఏ విషయాలు ఎలాఉన్నా తాపీవారి విజయవిలాస వ్యాఖ్య ఆంధ్రసాహిత్య ప్రియులందరు పరిశీలించదగ్గది. కన్నుల కద్దుకోదగినది కాకపోవచ్చునుగాని, కన్నుల గప్పుకోదగినది.



జి.వి.కృష్ణరావు

# 7. వేమన

దక్షిణ భారతానికి చెందిన కవియోగి వేమన ఆంధ్రసాహిత్య చరిత్రలో ఉన్నతస్థానాన్ని ఆక్రమించుకొన్నాడు. భారతీయ భావవికాసంలో వేమన వహించిన పాత్ర ప్రముఖమైనది. ఆంధ్రదేశంలో అతని పద్యాలు కనీసం కొన్నైనా నోటికిరాని పండితుడుగాని, పామరుడుగాని వుండడని చెప్పటం అతిశయోక్తికాదు. అంతమాత్రాన ఆ మహనీయుణ్ణి మనం సరిగా అర్థంచేసుకొన్నామనిగాని, ఆయన తాత్త్విక సంపదకు సముచిత గౌరవం ఇచ్చామనికాని చెప్పలేము. వాస్తవానికి చాల కొద్దిమంది మాత్రమే ఆ కవియోగిని అర్థం చేసుకున్నారు. మొత్తం మీద ఆయన దృక్పథంతో ఏకీభవించేవారు చాల తక్కువ. దీనికి కారణాలు దురూహాలుకావు. సంప్రదాయమనగానే ''దాసో౽హం'' మని పెక్కుమంది పరితలు తలలువంచారు. ఈ దాస్యం మొదటికారణం. వేమన విశృంఖల విహారం స్వేచ్ఛాప్రవృత్తి వీరికి గిట్టవు. ఇక రెండో కారణం – కవి తాను చెప్పదలచిన విషయాన్ని ఒక క్రమపద్ధతిలో వివరంగా చెప్పకపోవడం. ఈ రెండు కారణాలవల్లనే పాఠకులు ఆయన రచనలపట్ల పూర్తిగా వుపేక్షవహించారు. పద్యాలకు శుద్ధమైన ప్రామాణిక ప్రతులు లభ్యం కాకపోవడం వల్ల యీ స్థితి ఇంకా దిగజారిపోయింది. ఈయన కవితా సౌందర్యాన్ని కొంచపరచే
70 రచనలూ, తాత్త్వికదృక్పథాన్ని తప్పుత్రోవపట్టించే పద్యాలెన్నో ఈయన పేరుతో చెలామణి అవుతున్నవి. కొన్ని సందర్భాల్లో ఏ పద్యం వేమనదో, ఏది కాదో తెలుసుకొనడం విజ్ఞులకే తలకు మించినవని. ఇవన్నీ కలసి వేమనకు వ్యతిరేకంగా పనిచేశాయి; ఆంధ్ర సాహిత్య చరిత్రలోను, భారతీయ వేదాంత చరిత్రలోను ఆయనకు దక్కవలసిన స్థానాన్ని దక్కకుండా చేశాయి. అంతేకాదు; ఆయనను విస్మరించడానికి దారితీశాయి. వేమనకు సముచిత స్థానం లభించక పోవడానికి కారణాలేమైనా కొన్ని విషయాల్లో మాత్రం అతడు మరవుకురాని మహనీయుడు. కుల, మత, జాతి విచక్షణలనే సరిహద్దుల్ని చెఱిపివేసే ఆయన మానవతాదృక్పథం అందులో ప్రథమ స్థానాన్ని అలంకరిస్తుంది. మానవుల మధ్య సమానత్వ, సౌభ్రాత్రాలను నింపే ఆయన అమరసందేశం రెండవది. ఇక మూడవది ఆయన స్వచ్ఛమూ, సరళమూ, హృదయావర్జితమూ అయిన భావప్రకటన.

కాని వేమనకున్న దృక్పథమే వేరు. పుస్తకాల కళ్ళజోడు తగిలించుకొని అతడు జీవితాన్ని పరిశీలించడు. పరోక్ష జ్ఞానంతో దాన్ని వివరించడు. అపరోక్షానుభూతి ఒక్కటే అతనికి దివ్యజ్యోతి. ఆయన దృష్టిలో వేదాలు, శాస్త్రాలు సాధకుని ముక్తిపథం నుంచి పెడత్రోవలకీడ్చే వేశ్యల వంటివి.[1]

కాబట్టి వేమన ఎప్పుడూ శుష్కతర్కం సాగించేరిక్త ప్రస్తారం పొంతపోడు. అతడు కవి కావడంవల్ల చక్కని దృష్టాంతాలతో తాను చెప్పదలచిన విషయం తిన్నగా, సూటిగా, మన మనస్సులో

---

1. ''వేదవిద్యలెల్ల వేశ్యలవంటివి
భ్రమలపెట్టి తేటపడగనీవు''

నాటేట్లు చెప్పగలడు. జీవితానుభవం నుంచి తాను గ్రహించిన ప్రతి సత్యాన్ని ఆత్మశుద్ధితో మనచెవుల్లో ఎప్పుడూ ప్రతిధ్వనిస్తూ వుండేట్లు చెప్పగలడు. ప్రమాణాలను ప్రస్తావించడు. శాస్త్రచర్చకు దిగడు. విరుద్ధ సిద్ధాంతాలను శాస్త్రీయ విమర్శకు పాత్రం చేయడు. కాని ఆ విరుద్ధ సిద్ధాంతాలు జీవితం మీద ఏలాంటి హానికరమైన పరిణామాల్ని కల్గించి జీవితాన్ని చైతన్యహీనంగా మారుస్తాయో దాన్ని మాత్రమే ఆయన తెలియజేస్తాడు.

మన ఇంద్రియాలకు గోచరించే ఈ చరాచర విశ్వమంతటికీ మూలం బ్రహ్మమన్న విషయంలో ఇతర వేదాంతులతో పూర్తిగా వేమన ఏకీభవిస్తాడు. పశువుల జాతులు వేరైనా, వర్ణాలు వేరైనా అవి ఇచ్చే పాలుమాత్రం తెలుపు.[2].

పూలు భిన్నజాతులు కావచ్చు. కాని ఉద్దిష్టపూజ ఒక్కటే. అట్లే భగవంతుడూనూ. జున్ను, వెన్న, నెయ్యి మొదలైన పదార్థాలన్నీ పాలకు రూపాంతరాలు. ఆలాగే విశ్వంలోని అన్ని పదార్థాలూ బ్రహ్మముయొక్క భిన్న రూపాలు. వాస్తవానికి మనకు విశ్వంలో గోచరించే అన్ని వస్తువులు మాయామాత్రాలని వేమన అంటాడు. ఆలుబిడ్డలు సుఖదుఃఖాలు, సిరిసంపదలు, ఊహాపోహలు ఇవన్నీ మాయాకల్పితాలు.[3].

పరమార్థ స్వరూపాన్ని అర్థం చేసుకోనీయని ఈ మాయ నశిస్తే ఎంత బాగుండును!

భగవంతుడు మాత్రమే సత్యమనీ, అతడు సర్వప్రాణి హృదయాల్లో నివసిస్తూవుంటాడని వేమన చెప్తాడు. పశుపక్ష్యాదులలోనేకాదు, శూద్రులు పంచములని, హీనజాతివారని చెప్పబడుతున్న మానవుల హృదయాలలోకూడా పరమాత్ముడున్నాడని వేమన విశ్వాసం. తోలు బొమ్మలను నిర్మించి వాటిని మనం ఆడిస్తాము. ఆ రీతిగనే జగన్నాటకం కూడా సాగుతున్నదని మనం ఊహించవచ్చు. ఈ మహత్తర నిగూఢ జగన్నాటకాన్ని ఆడించేవాడు భగవంతుడేనని వేమన విశ్వాసము. దర్శనాలు పెక్కులు కావచ్చును కాని దేవుడొక్కడే. 'కుండ'ను పలు భాషలలో పలురీతుల పేర్లతో పిలిచినంత మాత్రాన అది ఒక్కటికాక అనేకములౌతుందా?

''భగవంతుడు ఉన్నాడేపో. అతనికి మానవునితోగాని, మానవునికి అతనితోగాని పనియేముందన్న ప్రశ్న పొడమవచ్చును. కాని భగవంతుడొక్కడే సర్వప్రాణి లోకానికి చివరకు చేరదగిన లక్ష్యమని వేమన సిద్ధాంతం. భగవంతుని యందు నమ్మకంలేని రోజున జీవితానికే అర్థంలేదు. ఆతణ్ణి విశ్వసించని పక్షంలో జీవితం దుస్సహమూ, హీనాతి హీనమూ అవుతుంది. పరమాత్ముణ్ణి మనసార భావించి అతణ్ణి గూర్చి తపించనంత కాలమూ, రకరకాల సందేహాలు, కామక్రోధాదులు మానవుణ్ణి



---

[2]. ''పసులవన్నె వేఱు పాలేక వర్ణమౌ
పుష్పజాతివేఱు పూజయొకటి
దర్శనంబువేఱు దైవంబదొక్కటె''

[3]. ''సతులు సుతులు మాయ సంసారములుమాయ
ధనము ఘనము మాయ తనువు మాయ
తెలియ నీదు మాయ దీనిల్లు పాడాయ''

జి. వి. కృష్ణరావు

అనుక్షణం వెంటాడుతూ వుంటవి. విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానం కాని, మతపరమైన కర్మాచరణంగాని మానవునికి మనశ్శాంతిని, స్థితప్రజ్ఞను ప్రసాదించలేవు. 'భగవద్దర్శనం పొందిన మానవుడు దివ్యజ్ఞానం పొందుతాడు. అలాకాక సృష్టిలో తానే అధికుడనని భావించుకునేవాడు ఎండమావుల వెంట పరువెత్తేవాడుగ భావించవలసి వుంటుంది. దివ్యపరిజ్ఞానం కల్గినవాడు ప్రతి విషయాన్ని తెలుసుకొనేవుంటాడు.'' దురదృష్టవశాన దురహంకారానికి వశమైనవాడు తనకు సంపూర్ణ స్వేచ్ఛ వున్నదని భావిస్తాడు. కాని అతడు తన ఇష్ట ప్రకారం ప్రపంచంలోకి వచ్చాడంటే అది నమ్మలేని విషయం. అలాగే తనకు ఇష్టం వచ్చినప్పుడు ఈ ప్రపంచాన్ని మానవుడు వదలిపోలేడు. ఇటువంటి పరిస్థితుల్లో అతడేవిధంగా సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు తన హక్కులని వాదిస్తాడో అర్థం కాదని వేమన అంటాడు. అపరోక్షానుభూతి పొందనివాడు నిజంగా స్వతంత్రుడు కాలేడు. అతడు తన ఇంద్రియాలకూ, రాగాదులకూ దాసుడు. తన అహంకారంవల్ల దేవుడులేడని ఆ దేవునితో తనకేం సంబంధం లేదని అతడు వాదిస్తాడు. ఈలాంటివాడు తన జీవితభారాన్ని ఒంటరిగా ఏ ఆశ, ఏ లక్ష్యం లేకుండా మోయవలసి వుంటుంది. ఈశ్వరుని అస్తిత్వం అంగీకరిస్తే దివ్యశక్తి అతనికి ఆలంబన మౌతుంది.

ప్రతి ప్రాణి హృదయంలో నెలకొని ఉన్న భగవంతుడు మానవుని కంటే భిన్నుడు మాత్రం కాడు. మానవుడు తనలో భగవంతుని దర్శించి తన అహంకార మమకారాలను, పాశవిక మనోవికారాలను విసర్జించి, తన సర్వస్వాన్నీ తన్ను పరమాత్మునికి సమర్పించుకొన్ననాడు భగవంతునితో సమానుడౌతాడు; కాదు భగవంతుడే దీనిని అర్థం చేసుకొనలేని మానవులు భగవంతుని కొరకు దేవాలయాలు, తదితర పవిత్ర స్థలాలు వెదుకుతారు. కొందరు జంతుబలులిస్తారు; కొందరు పుణ్యతీర్థాలలో మునిగి తేలుతారు. నీటిలో మునకవేసినంత మాత్రాన మోక్షం లభ్యమయ్యేట్లయితే ఎప్పుడూ నీటిలో మెసలే బాతులు మానవుల కంటే ఎంతో ధన్యాలు. ప్రజలు భగవంతుని అన్వేషణ కోసం పడేపాట్లు చాల విచిత్రమైనవి. కొందరు మానవ ప్రపంచాన్ని త్యజించి కాలాంతరాన మరో లోకంలోనైనా భగవంతుని దర్శించవచ్చని అడవులకు వెళ్ళి కొండంత ఆశతో తపస్సుకు పూనుకుంటారు. ఇది కేవలం దుర్భ్రమ; మృషు, ఇప్పుడు ఇక్కడ బ్రహ్మానందం పొందలేని వాడు ఎప్పుడో ఎక్కడో ఏవిధంగా పొందగలడు? ఆదిలో దక్కని తత్త్వం అంతంలో ఏలాలభిస్తుంది? అందువల్ల సృష్టిపై సర్వాధికారం గల భగవంతుడు ఈ దృగ్గోచరమయ్యే భౌతిక ప్రపంచానికి ఆవల ఎక్కడో మానవునికి అందని దేశంలో లేడు. అతడు ఈ ప్రపంచంలోనే అంతటా ఉన్నాడు. మానవుడు ఆ భగవంతుణ్ణి వెదకి అతని అస్తిత్వాన్ని తనకు తానే అనుభవ సిద్ధం చేసుకొనవలసి ఉన్నది. భగవద్దర్శనం కొరకు మానవుడు తన ఊరి సరిహద్దులనుకూడా దాటనవసరం లేదు. ఊరు వదలి దారిలో కనుపించే నక్కలను లెక్క పెట్టుకొనవలసినదే కాని దానివల్ల మరొక ప్రయోజనంలేదు. భగవద్దర్శనానం దాన్ని తాను హృదయంలోనే అనుభవించవచ్చును.

ఈ విషయాలన్నిటినీ అంగీకరించినా ప్రాథమికమైన సమస్య మిగిలిపోతున్నది. ఏ విధంగా మనం ఆత్మ సాక్షాత్కారాన్ని పొందాలి? చాల ధైర్యంగా వేమన ఈ సమస్యను ఎదుర్కొని నీతి పథాన మెలుగుతూ అనాసక్తిని, భక్తిని పెంపొందించుకోవలసినదని ప్రజలను హెచ్చరించాడు.

అంతేకాదు; ఆధ్యాత్మిక గురుని ఆశ్రయించి అతని ఉపదేశానుసారంగా రాజయోగాన్ని అభ్యసించండని బోధించాడు.

దృగ్గోచరమయ్యే ప్రపంచమంతా మాయ అని, బ్రహ్మము మాత్రమే సత్యమైనదని చెప్పే సిద్ధాంతం క్రొత్తదేమీ కాదు. ఆర్యనాగార్జునుడు, శంకర భగవత్పాదులు ఈ విషయాన్ని ఏనాడో బోధించారు. హిందువుల మనస్సుల్లో ఇది దృఢంగా నిలిచి ఉన్నది. నీతి, భక్తి మనల్ని ఆధ్యాత్మిక గమ్యానికి చేర్చగలవన్న సిద్ధాంతం మనకు క్రొత్తదిగాని మౌలికమైనదిగాని కాదు. అన్ని మతాలు ఈ నీతిని, భక్తినీ బోధిస్తూనే ఉన్నాయి. కాని నీతి అంటే ఏమిటో నిర్వచించవలసి వచ్చినప్పుడు మతాలన్నీ విప్రతిపన్నా లవుతున్నవి. ఆయా మతస్థులు ఆయా మత గ్రంథాలే పరమ ప్రమాణాలన్న వాటిని తూచాలు తప్పకుండా పాటించాలనీ అంటారు. మన తత్త్వవేత్తలు ప్రాచీనులైనా, అర్వాచీనులైనా వారి తార్కిక బుద్ధి ఎంత నిశితమైనా యీ మార్గమే అనుసరించారు. వారు వేదాలు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత – ఈ గ్రంథాలన్నీ చూపిన విజ్ఞానపు వెలుగులు ఆధారంగా చేసుకొని విశ్వస్థితిని గూర్చి, మానవునిగూర్చి, భగవంతుని గూర్చి చర్చించారు. ఈ వివృత్తిలో విభేదాలు పొడమినప్పుడే తమ పవిత్ర గ్రంథాల్లోని మూలసిద్ధాంతాలను వాటి ఔచిత్యాన్ని ప్రశ్నింపలేదు. అవి స్వయంప్రకాశములైన సత్యాలని వారు సమ్మతించారు. అంతేకాని వాటి ప్రామాణ్యాన్ని వారు ఎన్నడూ శంకించలేదు. ఏలావున్నా భారతీయ తత్త్వశాస్త్రం శ్రద్ధాభక్తుల ఆలంబనం అపేక్షించని స్వతంత్ర విచారానికి సాహసించ లేకపోయింది.

ఇట్టి తల్లిచాటు బిడ్డ నీతి నియమాల విషయంలో స్మృతుల చోదనం కోసం ఎదురు చూడడము సహజమే. మరి ఈ స్మృతులు తమతమ నీతి సూత్రాలను వర్ణాశ్రమాలను పురస్కరించుకొని ప్రతిపాదించాయి. స్వీయ మతం ఏదైనా ప్రతి హైందవ తత్త్వవేత్త ఆ సూత్రాలను నిస్సంకోచంగా ఆమోదిస్తాడు. అక్షరశః వాటిని పాటించాలంటాడు.

వేమన పూర్వులవలె గాక పూర్తిగా తద్భిన్నమైన మార్గం అనుసరించాడు. నీతి సూత్రాల విషయంలో క్రొత్త పుంతలు త్రొక్కాడు. అతడు నిజమైన మానవతావాది. ఆత్మ సాక్షాత్కారాన్ని పొందిన మహనీయుడు కావటం వల్ల పవిత్ర మత గ్రంథాలను, వాటి ఆదేశాలను అతడు సరకు చేయడు. సాంఘికాచారాలను కర్మకాండను అతడు జాగ్రత్తగా పరిశీలించి లోకోత్తర జ్ఞాన సంపన్నమైన తన హృదయంతో చూచి గుణావగుణాలను తేలుస్తాడే కాని సంప్రదాయ సిద్ధాలైన స్మృతి ప్రమాణాలను అంగీకరించడు. ఈ పద్ధతివల్ల నూతన ద్వారాలు విచ్చుకొన్నవి; నవ్య దర్శనం లభించింది. ఒకప్పుడు పవిత్రంగా తోచినది అతనికి అపవిత్రమై పోయింది. ఒకప్పుడు ఆత్మ సిద్ధికి దోహదకారిగా భాసించి భయంకర విభ్రమమై పోయింది. ఒకప్పుడు పూర్వమనుకొన్నది ఘోర పాపమని తేలింది. కవియోగి వేమన పీటపై తిరుగబడ్డాడు. తనకున్న యావచ్ఛక్తిని వినియోగించి ఎదుర్కొన్నాడు.

వేమన ఆగ్రహానికి, అవహేళనకు, నిందకు, ఖండనకు పాత్రమైన సాంఘిక దురాచారాలలో వర్ణవ్యవస్థ, తీర్థస్నానాలు, జంతు బలులు, శుష్కోపవాసాలు, మతం పేరిట నిర్వహింపబడే కొన్ని

కర్మలు పేర్కొనదగినవి. బ్రాహ్మణకులంలో పుట్టినంత మాత్రాన ఒకడు బ్రాహ్మణుడు కాజాలడని ఆయన వాదము. బ్రాహ్మణత్వానికి, యజ్ఞోపవీత ధారణకు ఏలాంటి సంబంధము లేదు. యజ్ఞోపవీతముతో అతడు పుట్టలేదు. ఈ లోకాన్ని విడిచి పోయేప్పుడు దానికి తనతో తీసుకుపోలేడు. కన్నతల్లికిని జందెము లేదు. కాబట్టి మధ్యలో వచ్చిన యజ్ఞోపవీతము ఒక వ్యక్తికి ఏలా బ్రాహ్మణత్వం ఇప్పించగలుగుతుంది ? వేదాలు వల్లించ గలిగినంత మాత్రాన అతడు ఇతర మానవులకంటే అధికుడు కాడు. అజ్ఞానులను చూచి అపహసించడానికిగాని, నీచులుగా పరిగణించడానికిగాని అతనికి నైతికంగా హక్కు లేదు. హీనకులంలో పుట్టిన ఒక బీదరైతు కూడా ఆ చదువుకొన్న అజ్ఞానికంటే ఎన్నో రెట్లు అధికుడని వేమన వాదన. ''సత్యమెరుగడు; పరుల ధనం కోసం చేయిచాపుతాడు. నిబ్బర మెరుగని తిరుగుబోతు. ఇట్టివాడు తాను బ్రాహ్మణుడనని చెప్పుకుంటాడే. ఎంతవింత'' అని వేమన. కాబట్టి పుట్టుక చేతనే వ్యక్తి ఎన్నడూ బ్రాహ్మణుడు కాడు. బ్రహ్మజ్ఞానము, ఈశ్వరానుభూతి పొందినవాడే బ్రాహ్మణుడు. వాల్మీకి జన్మచే శూద్రుడయినా ఆధ్యాత్మిక విజ్ఞానం వల్ల బ్రాహ్మణుడయ్యాడని[4] అంటాడు. దీనిని బట్టి వేమన బ్రాహ్మణ జాతిని ద్వేషిస్తున్నాడని

అపోహపడరాదు. వారికి ఇతర కులాల వారిని హీనంగా చూచే హక్కు లేదంటాడు. అంతేకాదు, ప్రజలకు జ్ఞానం ప్రసాదించి పరమార్థ సిద్ధికి తోడ్పడ గలిగినప్పుడు బ్రాహ్మణులకు సర్వ సంపదలూ సమర్పించి ఎల్ల సత్కారాలు చేయాలని అత డుద్ఘోషిస్తాడు.



బ్రాహ్మణుల అభిశంసనంతో వేమన వర్ణ వ్యవస్థాన హేళనము ఆగిపోలేదు. అస్పృశ్యుల మీద జాలిపడి అతడు వారి పక్షాన్ని వహిస్తాడు. ''మీరు అంటరాని వానిని నిందిస్తూ ఎందుకు వ్యర్థ ప్రసంగాలు సాగిస్తారు? అతనిని పలికిస్తున్న అతని కులమేదో నాకు కాస్త చెబుతారా?''[5] అని ప్రశ్నిస్తాడు. అంతేగాక వేమన మరొకడుగు ముందుకువేసి ఒక కులంకంటె మరోకులం ఉత్తమమని చెప్పడం అర్థరహితమంటాడు. ఒక కులంకంటె మరొక కులం ఉత్తమమని కాని, హీనమని కాని చెప్పడానికి ప్రమాణమేమున్నది? వాస్తవానికి బాహ్యపూజల కంటె హృదయ పవిత్రత ముఖ్యమైనట్లే కులంకంటె శీలసంపత్తి ప్రధానమని వేమన భావన. ఏ కులంవారైనా ఏ మతంవారైనా కడకు మృత్యువుకు తల వంచవలసినదే. బ్రాహ్మణుడయినా, మహాయోగి అయినా ఎవరినీ మృత్యువు విడిచిపెట్టదు.

---

4. ''రామనామపఠన రమణచే వాల్మీకి
పరగ బోయఁడయ్యు బాపఁడయ్యె కులము
ఘనము కాదు గుణమె ఘనంబురా''

5. ''మాలవానినేల మఱిమఱినిందింప
నొడల రక్తమాంస మొకటిగాదె
వానిలోన మెలఁగు వాని కులంబేది''

వర్ణవ్యవస్థలని అనర్ధకాలను గుర్తించిన ప్రథమ సంఘసంస్కర్తలలో వేమన ఒకడు. హైందవ సంఘము తిరిగి తన పూర్వపు ఐైకమత్యాన్ని, బలాన్ని పొందవలెనంటే ఈ కుల వ్యవస్థ సమూలంగా పోవాలని వేమన అభిప్రాయము. సమాజంలో కొన్ని వర్ణాలకు సాంఘికంగా విశేషాధికారాలున్నంత వరకూ దళితజాతుల వారికి విముక్తి లేదంటాడు.

జంతుబలులు ఎట్టివైనా, యాజ్ఞికాలేకానీ, దేవతారాధకాలే కానీ వాటిని వేమన నిర్దాక్షిణ్యంగా ఖండిస్తాడు. భగవంతుడు ప్రతిప్రాణిలో ఉన్నాడు. మానవునికి మరొక నిండు ప్రాణిని చంపే హక్కులేదు. పితృదేవతల నిమిత్తం కాకులకు పిండాలు వేయటం వేమనకు సమ్మతం కాదు.[6]

కర్మలను అతడు ప్రశ్నిస్తాడు. ఈ విధంగా అన్నాన్ని వ్యర్ధపరచటంకంటే పేదలకు పెట్టడం మేలంటాడు. విగ్రహారాధన, తీర్ధయాత్రలు, మతాచార పరమైన ఉపవాసాలు, యోగాభ్యాసాలు, ఆత్మజ్ఞానసాధనకు దోహదం చేయలేవు. అందువల్ల వాటికి వేమన విముఖుడు. మాటిమాటికి ఆ కర్మలను అతడు పరిహాసిస్తాడు. దానం, శీలం, చిత్తశుద్ధితో వీటిని ఎంతగనో శ్లాఘిస్తాడు. యుక్తియుక్తమైన నీతికి భంగం వాటిల్లనంతమేరకు అతడు మతసహనాన్ని సమర్ధిస్తాడు. నిరుపేదలైన నేరస్థులను, కడకు తన శత్రువులను సహితం వుదారంగా చూడమని ప్రజలకు వుపదేశించునంతటి జాలి గుండె కలవాడు. హిందూ సమాజం జవసత్వాలను కబళిస్తున్న మూఢాచారాలను, దుష్ప్రవర్తనలను ఆతని ధర్మనిష్ఠ గమనించకపోలేదు. అతని నిశిత విమర్శకు గురికాని మతం కాని, కులంకాని లేదు. తాను శైవుడైనా, శైవమతాన్నికూడ తన విమర్శలకు గురిచేశాడు. వున్నత ప్రమాణాలకు చెందిన వివేచనాయుతమైన నైతిక సూత్రాలు, వున్నతమైన ఆధ్యాత్మిక దృక్పథంతో మేళవింపబడిన మానవతావాదానికి ప్రతీక అయికూడ వేమన లోకంలో సముచిత గౌరవం సంపాదించుకోలేక పోయాడు.



ఆధునిక కవిపండితలోకంలో వేమన కవిగాకూడ తగిన ఆదరణ పొందలేదు. నీతిబోధ, సరసోపదేశం కవిత్వం కాని మాట వాస్తవమే. ఇతర లక్షణాలు ఆవశ్యకాలైనా కాక పోయినా పాఠకుల అహాన్ని మరపించి భావనాలోకాలకు తీసుకొనిపోయి పారవశ్యం కలిగించాలి. వేమన రచనలలో ఒకటైనా మనకీ స్థితిని కలిగిస్తున్నదా? పోనీ ఇట్టిది దానికి గమ్యమైనా అవుతున్నదా అని రసపిపాసువులు ప్రశ్నిస్తారు. పండితులు వేమన వ్యాకరణ దోషాలను ఎత్తిచూపుతూ పై విమర్శక బృందంతో వంతపాడుతారు. విశ్వనాథుని కవితా సిద్ధాంతాన్ని ఖండిస్తూ రస గంగాధరకర్త చేసిన విమర్శ మొదటి ప్రశ్నకు సమాధానమిస్తుంది. అంతే గాక ఎల్లప్పుడు ఆచార సంప్రదాయాలను, చట్టాలను, సాంఘిక నిబంధనలను ప్రతిభావంతుడు నిరంతరం మన్నిస్తూ కూర్చోడు. వాస్తవానికి ప్రతికళాఖండము నిర్జీవ సంప్రదాయ నిరంకుశత్వాన్ని ప్రతిఘటిస్తుంది.

---

[6]. పిండములను జేసి పితరుల దలపోసి

కాకులకును బెట్ట గాడ్దెలార

పిండి దినెడు కాకి పితరుడెట్లాయెరా''.

తేట తెలుగుకు మిక్కిలి అనువైన ఆటవెలదిలో వేమన తన భావాలను వెలిబుచ్చాడు. అతని పూర్వులెవ్వరు ఊహించని అద్భుతమైన అందచందాలను, ఒయ్యారాలను అతని చిన్నారి ఆటవెలది సంతరించుకొన్నది. కాళిదాసు మహాకవికి మందాక్రాంత, భవభూతికి శిఖరిణీవృత్తము ఎట్టివో వేమనకు ఆటవెలది అట్టిది. చాలమంది ఆటవెలదిని అందంగా తీర్చిదిద్ద ప్రయత్నించారు. కాని వేమనవలె ఆ ప్రయత్నంలో కృతార్థులైనవారు లేరు. వేమన చూపిన నేర్పూ, కూర్పూ, నడకలోని వంపు, సొంపు, మాటలలోని మదపు పొదుపు ఇతరులకు అందలేదు.

భావాభివ్యక్తిలో వేమన అమోఘ విజయం సాధించాడు. అతని భాష సరళమైనది; సూటియైనది; స్వచ్ఛమైనది; హృదయోల్లాసకరమైనది. ప్రాతవడి వ్యవహారంనుంచి తొలగిన మాటలు, దీర్ఘసమాసాలు, పాండిత్యప్రకర్షలు అతని రచనలో కన్పట్టవు. భావవిస్పష్టతలో అతని కతడేసాటి. నన్నయ, తిక్కనలు నిజంగా ఆంధ్రసాహిత్యంలో సిద్ధహస్తులు; అగ్రగణ్యులు. పెద్దయెత్తున సువిశాల భిత్తికపై మనోహర వర్ణరంజిత కవితాచిత్రాలను చిత్రించినవారే. కాని అంతటి మహాకవులును వేమన కవితలోని సరళతను సాధించలేకపోయారు. అతని పద్యాలలోని చాలా పాదాలు సామెతలుగా పలుకుబళ్ళుగా రూపొందాయి. బలమైన, లోతైన భావాలు కూడా చాల సులభమైన భాషలో తక్కువ పదాలలో వేమన వెల్లడించాడు. వేమన పద్యాలలో ఏదైనా ఒక పదాన్ని తొలగించి దాని స్థానంలో భావగతికి భంగం లేకుండా మరొక చిన్న పదాన్ని చేర్చటం మిక్కిలి దుష్కరం. సముచిత స్థానంలో సముచిత శబ్దాన్ని ప్రయోగించటమే కవిత్వమైతే వేమన కవిత్వం ఉన్నతస్థానాన్ని ఆక్రమిస్తుంది.



అధోజగత్ సహోదరులపట్ల అతని సానుభూతి ఎంత ప్రగాఢమో అతని కవితాశిల్పం అంత విపులం. సాధారణంగా తాను వ్రాసే ఆటవెలది పద్యం మొదటి రెండు పాదాలలో తాను చెప్పదలచిన భావాన్ని ప్రతిపాదించి మూడవపాదంలో దానికి సమర్థకంగా అద్భుతమైన దృష్టాంతం ఇస్తాడు. నాలుగవ పాదం మకుటం మాత్రమే. పద్యాలలోని సౌందర్యమంతా మూడవపాదంలోని దృష్టాంతం మీద ఆధారపడి ఉంటుంది. తుపాకిగుండు అయినా ఎప్పుడైనా గురి చెదరిపోవచ్చునేమోకాని వేమన చెప్పిన దృష్టాంతంమాత్రం లక్ష్యం తప్పదు. విశేషించి బలంగా గుండెలో నాటుకుంటుంది. అతని కవితలోని గొప్పతనము, నైపుణ్యము చాలవరకు ఈ దృష్టాంతాల పైనే ఆధారపడి ఉన్నవి. అతని చేతుల్లో ఈ దృష్టాంతం ఒక క్రొత్తదనాన్ని, స్వచ్ఛతను సాధించింది. తరచుగ శుష్కనీతి వాక్యం కూడ ఈ దృష్టాంతంవల్ల హృద్యాతి హృద్యమై పఠితలను ఆశ్చర్య చకితులను చేస్తుంది. కాళిదాసు ఉపమవలె వేమన దృష్టాంతంకూడ ప్రసిద్ధి సంపాదించుకొన్నది.

వేమన కవితా శిల్పంలో పఠితల ఆదరాన్ని పొందిన మరొక గుణం ఔత్సుక్య కల్పన. అతని పద్యాల్లో దేనికది ప్రత్యేకమయినది. ఒక పద్యానికి, మరొక పద్యానికి సంబంధం లేదు. ఆ పద్యంలో సైతం భావప్రకటనానికి ఉండేవి మూడే పాదాలు. ఈ అలతి మేరలోనే పాఠకునికి ఉత్సుకతను కలిగించటం సామాన్యమా? కాని వేమన దీన్ని సాధించి విభ్రాంతి కొల్పుతాడు. అతని కవితలోవున్న ఇతర గుణాలు హసోపహాసాలు. వేమనకు ముందు ఈ రెండు గుణాలు మన సాహిత్యంలో చాలవరకు పూజ్యమే. తెలుగు సాహిత్యంలో ఈ రెండు లక్షణాలను ప్రవేశపెట్టినఘనత నిజానికి వేమనదే.

ఇలా అనగానే వేమన ప్రతిపద్యంలో హాసోపహాసాలు చిప్పిల్లుతుంటవని అపోహపడరాదు. ప్రాయికంగా అతని కవితలో ఈ రెండు గుణాలు మనకు కనిపిస్తాయి.

''కవిరేవ జానాతికవేః పరిశ్రమ'' మన్న ఆభాణకం మనకు ఒకటి ఉన్నది. దీనిలో కొంత అతిశయోక్తి ఉండవచ్చును కాని అంతా అసత్యం మాత్రం కాదు. వేమన గొప్పదనాన్ని గ్రహించి ఆయనను కవిగా గుర్తించటానికి విశాల దృక్పథము, ఉన్నత భావసంస్కారము అవసరం. ఈ లక్షణాలే భావరంగంలో, సాహిత్యరంగంలో వేమనకు సుస్థిర స్థానాన్ని సమకూర్చిపెట్టాయి. మన హైందవసంఘం పూర్వపుటున్నతి, సమైక్యస్థితి పొందవలెనన్నా, మన సాహిత్యం పూర్వపు గాంభీర్యాన్ని తిరిగి సాధించవలెనన్నా వేమనలు పెక్కురు మన సమాజంలో అవతరించాలి.



జి. వి. కృష్ణరావు

# 8. పేరిగాడు

భారతవీరులను మినహాయిస్తే ఆంధ్రసాహిత్య ప్రపంచములో సజీవమైన పాత్రలు చాల తక్కువ. అలాంటివాటిని వ్రేళ్ళమీద లెక్క పెట్టవచ్చును. పూర్వసాహిత్యములో వరూధినీ ప్రవరులు, సుగాత్రీశాలీనులు, నిగమశర్మ, ఆధునిక సాహిత్యములో గిరీశం, రామప్పపంతులు, పేరిగాడు పేర్కొనదగినవారు. పూర్వసాహిత్య ప్రపంచములోనుండి పేర్కొన్న పాత్రలు కొంతవరకు భావనాప్రపంచములోనివి. గిరీశం, రామప్పంతులు, పేరిగాడుమాత్రం కేవలం వాస్తవ ప్రపంచములోని వారు. ఇందులో గిరీశం, రామప్పంతులు (మాత్రం) తలవని తలంపుగా సృష్టి అయినవారు గారు. గురజాడవారి ప్రతిభలోనే అలాటి సృష్టికి అవకాశముంది.

పేరిగాడిపాత్రమాత్రం అలాకాదు. వేదమువారి ప్రతిభకే అదొకవిధంగా క్రొత్తని చెప్పాలె. ఎందుకంటే ప్రతాపరుద్రీయములోని కథాకథనానికి అలాంటిపాత్ర వెలువడవలసిన ఆవశ్యకత లేదు కాని తెలుగువారి పుణ్యపరిపాకంవల్ల పేరిగాడు అయాచితంగా లభించాడు. కవి నాటకాన్నంతా
78 దృష్టిలో ఉంచుకొనికాక ఏ అంకాని కా అంకం రక్తికట్టాలన్న దృష్టితో చిత్రించడంవల్ల ఆంధ్రుల అదృష్టం పండింది, పేరిగాడు లభించాడు. రేవేలినవారు కొంతకాల మేలినవారయి ఆంధ్రులను కేవలం వికృతహాస్యములో కాకుండ తపస్సిద్ధి పొందిన హాస్యములో ఓలలాడించారు.

పేరిగాడు మౌఢ్యములో పుట్టాడు. మౌఢ్యములో పెరిగాడు. కాని స్థితిగతులు వ్యత్యస్తం కావడంవల్ల యుగంధర తంత్రం అతన్ని యథాస్థానాన్నుండి బయటకు లాగింది. తిరిగీ స్వస్థానం చేరుకునేంతవఱకూ అన్నీ ఒడుదుడుకులే. పేరిగాడు మూఢుడే. అయినా నీచత్వం అతనిలో ఎక్కడా కనిపించదు. జ్యోస్యం చెప్పడానికి విశ్వనాథు డతగాణ్ణి చేయి చూపించమంటే తానుగాని, తనయెల్లిగాని తీయలేదంటాడు. అసలు ఎరగనంటాడు. ఏమిటిరా అంటే విశ్వనాథుని ఉంగరం పోయిందేమో? దానికోసమే ఆయన చేతులు వెతుకుతున్నాడేమో అని అలా అన్నానంటాడు.

పేరిగాడు పరమమూఢుడే అయినా వాడికీ సంసారపు గుట్టుమట్టులున్నాయి. ఏవి వెల్లడించుకోవలెనో, ఏవి వెల్లడించుకోరాదో సంపూర్తిగా తెలియకపోలేదు. కాని వట్టి అమాయకుడు; గుట్టు దాచుకోదగిన నేర్పూ తెలివీ లేవు. శెప్పకుండిసామే? అంటాడు. మరొకప్రక్క తనకుతానే తనకూ తన యెల్లికి ఎందుకు జగడం వచ్చిందో చెబుతాడు. పెళ్ళాముచే మామా అనిపించుకోవాలెనని వాడికి బుద్ధి. అది ఎంతసేపటికి ఓ పేరిగా పేరిగా అనే పిలుస్తుంది. వాడు కోపం వచ్చి కానిమాట అంటాడు. అది మైలగుడ్డలమూట యెత్తివాడి నెత్తిన వేస్తుంది. ఇదంతా పేరిగాడే తన నోటిమీదుగా చెబుతాడు.

అంతగా భార్యతో జగడమాడేవాడైనా పేరిగాడికి ఎల్లి అంటే ఎంతో ప్రాణం. తురకసర్దారు డేరాయొద్ద పహరా యిచ్చేసిపోయి తన్ను నరికివేసి ఎల్లిని ఢిల్లీకి పట్టుకుపోతాడని విశ్వనాథుడు

జ్యోస్యం చెబితే పెరిగాడు హడలిపోతాడు. ఓయి బాబో నన్ను నరికేసినా నాను బతుకుతాను గాని ఎల్లి లేకుంటే నాను బతకలేనంటాడు. ఎల్లి నేలాగైనా కాపాడేటట్లుగా మాట పుచ్చుకొంటాడు. ఆ గండం తప్పించుకోడానికి రాజయోగ మంగీకరిస్తాడు. అయితే అతని కొక్కటే సందేహం. ఏమంటారా? తాను రాజైతే తన యెల్లి యేమౌతుంది? ఇంతకుతప్ప తనకు ఆరాచరికం ఎంతకాలవుంటుందో తెలుసుకోవాలన్న కుతూహలంకాని, పట్టిన రాజయోగం నిలుపుకొందామన్న తహతహగానీ లేవు. వీడి జీవితాని కొకే ఒక పరమార్థమున్నది. ఎల్లికూడా తా ననుభవించే రాజభోగా లనుభవించాలె. తాను దాంతో సరసాలాడాలె. అంతకన్నా అతనికి గావలసిన దేమీలేదు.

రాజమంత్రులు పేరిగాడికి రాజసంప్రదాయాలు, ఆచారవ్యవహారాలు నానా అవస్థలు పడి బోధిస్తారు. సంస్కారంలేని పేరిగాడికి అవి పట్టుపడలేదంటే ఆశ్చర్యమేమీ లేదు. కాని అతను కనీసం నోరుమూసుకొని కూర్చుంటే అట్టె యిబ్బంది ఉండేదికాదు. అయినా ఊరుకునే పిండంమాత్రం గాదు. ఆత్మవంచన మనేది అతనికి అణుమాత్రమూ లేదు. మనలో చాలామందిలాగా తెలియకపోయినా తెలిసినట్లు నటించుట అతని యింటా ఒంటా లేదు. తల యెగిరిపోతుందన్నా కలిగిన సందేహం తీర్చుకోవలసిందే. తోచిన అభిప్రాయం చటుక్కున చెప్పవలసిందే. ఇతరులు నవ్వి పోతారన్న బాధ ఏమాత్రమూ లేదు. అజ్ఞానం దాచుకుందామన్న తహతహలూ లేవు. ఈ విషయములో పేరిగాడు ఎల్లవిధాల విశిష్టుడనే చెప్పాలి. 79

గానసభ ప్రారంభమౌతుంది. వీణానిక్వాణం బయలుదేరుతుంది. పేరిగాడు వినివిని ఒక పాలి నాను ఒక బేపిని పెంచినా, అది కార్తిలో ఆడ బేపిని చూస్తే ఇంతకంటె ఎయ్యింతలు కుయ్యికుయ్యిమనేది. దానికంటే యిసేసం ఏంటి? అంటాడు. గాయకుడు పాడితే పాటలోమాత్రం ఈన ఎచ్చేంటి? నా గాడిద ఓండ్రపెడితే రేవురేవంతా రోయిరోయి అంటూ మోగిపోయేదే, ఈన పాడితే ఏది మోగమను'' అంటాడు. పాటగాడు అలాచేయగా నిజంగా తన్మయుడౌతాడు. పుట్టినప్పుంతాలనుంచి ఆటిమద్దెనే పెరిగినానుగందా నాకు రాలేదు. ఈళ్ళు దానిదెగ్గిరికే రారు. రేవులో అడుగెట్టనే యెట్టరు. ఈళ్ళకెలా వచ్చిందిరా అంటాడు.

నటి నృత్యం చేస్తుంటే బలే బలే ఆడు ఆడు. ఆడికడుపుమీద్దాన్ని కొట్టుకుంటే నువ్వెందుకే యేడవడం, యగరడం, శేతు లిసురుకోవటం? నాకాణ్ణా నీటక్కులు? నీకేమన్నా తగిలిందా? పోనీ నీకేం వాయువా? శేతులలా యగరేశావు. ఒత లేయిస్తాలే యాడవకు అంటాడు. మద్దెలవాణ్ణే చూచి నువ్వు దానెంబడి తిరగడంయాంటంటా? యంకటయ్య కడుపులాగా అదొక్కటి మీదేసుకొని ఆడపిల్లని దాన్నెందుకురా ఏడిపిస్తావు అంటాడు. కవీశ్వరుడు సందర్శనార్థం వస్తే నాను మెచ్చుకోనేలా కయిత్తం చెప్పాలె అంటాడు. అంతకవి, ''జ్యాయసిఁ జేయుచున్, గుమలసంభవు బ్రోలను, దత్కళత్రమున్, నాయన, బ్రెుక్కుగొమ్మని యనారతమున్పలికించుచున్సిరిన్, అయగజాతకున్ సనతియాలము వెట్టుచు నెట్లు సూచినన్, నీయశమెల్లలోకముల నిందలు వొందు నరేంద్ర చంద్రమా'' అని ఆశీర్వదిస్తే సీటీ ఇదేంకయిత్తం? దీనికి నాను సొయింపాకమైనా యీను, అంటాడు. మల్లి, ''హెచ్చుగ నీవు సత్కవుల కిచ్చు పసిండిని రాలు రంజకం బచ్చుగ నీదు

దానసలిలాపగలంబడి యూ మహోబ్ధిలోఁజొచ్చి శయూనశౌరిహృదిజోటిగఁజిట్టెముగట్టు, దానినే లచ్చియు, బుచ్చి, పొల్కడలిలక్ష్మ యంచువచింత్రు కాకవుల్'' అంటే నవ్వుతూ, దీనికొక సాయింపాక మిస్తా. కయిత్తమంటే ఈలాగ పెతిమనిషికి తెలియాలె అంటాడు. ధూర్తత్వానికి దిగి కవి,

సలప మడతలకి మలెనే,

యెలి బూడిద సౌడుసున్న మెల్లల మలెనే

కలునీలమలె, మడేలా,

యెలిగే నీయసము నేలకెలికోకవురా!

అంటాడు. పేరిగాడది విని, వావ్వా వావ్వా బలే బలే బాపనయ్య అచ్చురసచ్చులు, ఉప్పారనచ్చులు అంటాడు. ఇందులో ఆత్మవంచన కంచుకాగడా పెట్టి గాలించినా కనిపింపదు. చదువుకొన్నవాళ్లకంటె చాకలి మెలు గనిపించాడనవలసి వస్తుంది. మొదటిది ధ్వని ప్రధానము. రెండవది అలంకార ప్రధానము, మూడవది శాస్త్రదూషితము. అయినా మూడవ పద్యమే మేలని ప్రాజ్ఞులంతా పేరిగానితో ఏకీభవించక తప్పదు భవతు. ఈవిధంగా మన పేరిగాడు రసాభాస చేస్తాడు. రాజభోగాలనుభవిస్తాడు. అతగాడి కివి ఏవీ నచ్చవు. ఎలాగో అవస్థపడి యుగంధరుని తంత్రం ముగియగానే బయట పడి తిరిగి కొంపకు చేరుకొంటాడు. మామా మామా అంటూ ఎల్లీ, రారా పేరయ్యా అంటూ తల్లీ పిలువగానే అతగాడికి పోయినప్రాణాలు లేచివస్తవి. తోడి చాకలీలతో సరదాలు తీరుకొంటాడు. వారు పన్నీరు త్రాగి అత్తరు తలకు రాచుకొంటూవుంటే పేరిగాడి అప్పటి ప్రవర్తన నిజంగా చూచితీరవలసిందే. వాళ్లంటే జుగుప్సగాని తాను వాళ్ల కంటే గొప్పవాణ్ణను మదహంకారముగాని కనిపించదు. ఓరి యెఱ్ఱిమొగాల్లారా! అది మీద చల్లుకోటమేగాని తాగటం గాదురా అని తెలియచెబుతాడు.

అన్ని రాజభోగాలనుభవించినా అతనికి కళ్లు నెత్తికి రావు. తన పరిస్థితిమీద, తన పరివారంమీద ఏవగింపూ ఈసడింపు కలక్కపోగా కాసిన్ని కల్లునీళ్లుకనిపించగానే ఎగిరి గంతువేస్తాడు. తన సముదాయములో తనకున్న స్వాతంత్ర్యం తిరిగి లభించగానే మురిసిపోతాడు. మఠేలాంటి భోగాలూ తన కవసరంలేదు. మందీమార్బలం, అడుగడుగుకు పరిచర్యలు, నమోవాకాలు, హంసతూలికాతల్పాలు, గంధగజారోహణలూ ఇలాంటివేవి అక్కరలేదుఁగాని ఒకటిమాత్రమిట్లంటాడు. దూడపేడ, బఱ్ఱెపేడ లేకపోతే ముద్ద లోనికి పోదంటాడు. ఈ మాట అన్నప్పుడు నిజంగా ఏలాటివారికైనను నవ్వు రాక తప్పదు. ఎల్లితో నీవు ముతకగుడ్డ లుదికే కంపెల్లివి. ఇంక నాకు నువ్వు పనికిరావు. నానెల్లిపోతా నంటాడు. అది పైకన్న మాట. సరసానికి అని వేసాడేగాని మరల ఎల్లి ఎంత నొచ్చుకుంటుందో అని బాధపడతాడు. ముసలిది వెల్లిపోయినాక సదఃసమని శేప్పేస్తా ననుకొంటాడు. తాను ఎనిమిది నెలలు బ్రతికినవిధం తోడి చాకలివాండ్రతో చెప్పేటప్పుడు మధ్య మధ్య పేరిగాడు కాస్త కోతలు కోస్తాడు. ఆ కోతల వల్ల ఇతరులకు వచ్చేనష్టంగాని తనకు ఒరిగే లాభంగాని ఏమీలేదు. కేవలం వినోదంకోసమంటాడు.

అచట అయ్యవార్లవారు, పూజారయ్యవార్లవారు మారాజుల బుఱ్ఱమీదెట్టేది నా బుఱ్ఱమీదెటితే నాను తియ్యోద్దని జగడమాడేవోణ్ణి. దాన్ని నెత్తినేసుకొనే పసాదాలు తినేవోణ్ణి అంటాడు. మఱికొన్ని మాటలు ఎంతవఱకు కోతలో, ఎంతవఱకు నిజమో చెప్పలేము. ఉదాహరణకు ఈ ముక్కలే చూడండి. బాపనోళ్లు నాకు దంజెం యేసినారు. ఆళ్ళను బాగా ఏడిపించినా, ఆళ్లు లేకుంటే దంజెం తీసేవాణ్ణి. యడం శేతిమీద యేసుకోమంటే కుడిశేతిమీదుగా ఏసుకోవటం, సదరంగాల కాడ కాయలు ముందఱికి తొయ్యటంతో బాగా యేడిపించినాను అంటాడు. ఇక్కడ సత్యాసత్యా లెంతవఱ కున్నవో చెప్పలేము. పేరిగాడు మొత్తంమీద ఎంత నిజం చెప్పినా చాకలోళ్ళలో ఒక్కడూ నమ్మడు. త్రాగి యేదో ప్రేలుతున్నాడనుకొంటారు. చివరికి పేరిగాణ్ణి కాచి వడపోసిన ఎల్లిగూడా శివశివ ఏమి నా రాత! దూడపేడేంటి? బఱ్ఱపేడేంటి? నామామో? నామామో? ఎ(త్రెత్తినా బగుమంతుడా అంటుంది ఆఖరికి మహామంత్రికి విన్నవించుకొని తన మగణ్ణి తిరిగి తెచ్చుకొంటుంది.

ఇదీ పేరిగాడి జీవితం. కల్లాకపుడు లేని బ్రదుకు, నీచత్వమెఱుగని నడవడి, అకలంకమైన మధురానురాగం, అమాయికత్వం, మౌఢ్యం మనకు నవ్వు కలిగిస్తవిగాని మన కసహ్యము గలిగింపవు. అసహ్యించుకోకపోగా అతడంటే వాత్సల్యం, జాలి గలుగుతుంది. ఎల్లిమీద వాడికున్న ప్రేమను గూర్చి ఎవరూ ప్రశంసింపకుండా ఉండలేరు. దురహంకృతి దురభిమాన మాపాత్రలో లొంగిచూడ నేరవు. సత్యమని తోచిన అభిప్రాయ మాతనిలోనుండి చటుక్కున బయటపడుతుంది. ఇతరులు నవ్వేది, ఎక్కిరించేది జంకన్నది లేదు. ఈలాటి ఋజువర్తన మెంతమంది కున్నది? ఇక మూఢత్వమంటే అది సాపేక్షకం. విజ్ఞులు కూడా సర్వజ్ఞనితో పోల్చినపుడు మూఢులే అవుతారు. అందువల్ల ఈ విషయములో పేరిగాణ్ణి వ్రేలుపెట్టి చూపవలసిన అగత్యం లేదు. నిజంగా విద్యానాథు డన్నట్లు

అరయుగా నమంత్రమగు నక్షరము లేదు
మందుగాని వేరు మఱియు లేదు
భువి నయోగ్యుడయిన పురుషుం డొకఁడు లేఁడు
కూర్చువా డొకండె కొదవగాని.

పేరిగానిలో మఱొక విశేషముంది. కట్టులోబొట్టులో, ఆటలో పాటలో, మాటలో మంతిలో ఇదది అననేల, అన్నిటిలో అసలైన సిసలైన జాతీయత ఉట్టిపడుతుంది.

అయితే పేరిగాడు మాత్రం దర్బారులోని సేవకుడని కవి చిత్రించడంమాత్రం చింత్యం. మొత్తముమీదవేదము వారు సంస్కారస్నిగ్ధమైన తమ హృదయాన్ని మలిచి ఈలాటి మనోజ్ఞ పాత్రను ప్రసాదించడం ఆంధ్రుల అదృష్టం.

జి. వి. కృష్ణరావు

# 9. కళాపూర్ణోదయము-కథా సంవిధాన వైచిత్రి

కథా శరీరము త్పాద్య వస్తు కార్యం తథా తథా

యథా రసమయం సర్వ మేవై తత్ప్రతిభాసతే.

కావ్యాన్ని ప్రాచీనులు శ్రవ్యమనీ, దృశ్యమనీ రెండు విధాలుగా విభజించారు. కవిత్వాన్ని గూడ అలాగే వర్ణకమనీ, వస్తువనీ విభజించవచ్చును. కాని యీ విభాగం అంత తేలిక కాదు. అయినా వీటిని స్థూలంగా చెప్పుకోవచ్చును. సంఘటని చిత్రణము వర్ణకము. నిరపేక్షమైన బహు సంఘటనా ప్రబంధం వస్తువు.

వర్ణక కవిత పువ్వైతే, వస్తు కవిత దండ దండలో పువ్వులుంటవి. రేకు లుంటవి, కాని పువ్వులో దండ ఉండదు. అలాగే వస్తు కవితలో వర్ణక కవిత వుంటుంది కాని వర్ణక కవితలో వస్తు కవిత ఉండదు.

పువ్వు సహజ సుందరం. దానికి నిర్దిష్ట ప్రయోజనం లేదు. అది అలంకరణకూ
 ఉపయోగపడవచ్చును; దేవతార్చనకూ ఉపకరించవచ్చును. దండ అలాకాదు. అందంగానూ ఉంటుంది. నిర్దిష్ట ప్రయోజన కలితమూ అవుతుంది. వాస్తవానికి అది మాల్యమో, గర్భకమో, గ్రైవేయకమో, ప్రాలంబమో, వైకక్షికమో అవుతుంది. అలాగే వర్ణక కవిత ప్రీతిని నియతంగా ఇస్తుంది. దీనికి ఋతుసంహారాదులు దృష్టాంతాలు. వస్తుకవిత ప్రీతినిమాత్రమే కాదు, నిర్దిష్టవ్యుత్పత్తిని గూడా కలిగిస్తుంది. దృష్టాంతం రామాయణాదికం.

ఈ భేదంవల్లనే లోకం కేవల వర్ణక కవితకంటే వస్తు కవితయందు మొగ్గు సూపుతున్నది. పామరులు సైతం రామాదులను పేర్కొంటారు గాని కాళిదాసుని వర్ణనలను గూడ చెప్పుకోరు.

ఈ వస్తువు మూడు విధాలు. 1. ప్రఖ్యాతము 2. ఉత్పాద్యము 3. మిశ్రము. ఉత్పాద్యాన్ని ప్రాచీనులు నిషేధించలేదు. కాని రసపక్షపాతంతోను, ఔచిత్యభంగ భీతి తోనూ, కవి ప్రతిభాశక్తి యందలి శంకతోను, సర్వత్ర రసపరి గ్రహసాధ్యమన్న నమ్మికతోను ప్రఖ్యాత మిశ్రకథలను ఆదరించారు, అభిమానించారు.

ప్రపంచం ఉత్పాదస్థితి భంగపూర్వకమైన చక్రికా పరిణామంకాక అతర్కితోపనతమైన విచిత్ర పరిణామం పొందుతున్నప్పుడు, జీవనము జీవికలూ మారుతున్నప్పుడు విశేషవ్యుత్పత్తి ఆవశ్యకం ఈ వ్యుత్పత్తి విశేషం ఉత్పాద్య వస్తుసాధ్యమేకాని ప్రసిద్ధ వస్తు సాధ్యంకాదు. ఇనుముతో నిర్వర్తించవలసిన కట్టడాన్ని కలపతో నిర్వర్తించలేము.

కనుక వ్యుత్పత్తినిబట్టి ఉత్పాద్య వస్తువునకు ఎంతో ప్రాముఖ్య మున్నది. ఉత్పాద్య వస్తుప్రసిద్ధాలు పురాణేతి హాస బృహత్కథలు. కాదంబరి, అభిజ్ఞాన శాకుంతల మట్లు ప్రసిద్ధ వస్తువే కాని అన్యం కాదు. కేవల ప్రబంధదృష్టితో పరిశీలించినప్పుడు పేర్కొనదగినవి రామాయణ

మహాభారత బృహత్కథలు. తరువాత కళాపూర్ణోదయం. మొదటివి మూడూ కవికులోపజీవ్యాలుగా వున్నవి, వుంటున్నవి. ఆ గౌరవానికి నోచుకోనిది కళాపూర్ణోదయమే.

కళాపూర్ణోదయంలో హృద్యాలైన వృత్తాంతాలు అనేకం వున్నవి. కలభాషిణీ వృత్తాంతం, సరస్వతీ చతుర్ముఖుల క్రీడ, సుగాత్రీశాలీనుల కథ, అలఘువ్రతుని చరిత్ర, రంభల కలహం, మణిహార వృత్తాంతం, మృగేంద్ర వాహనాలయ ఘట్టం హృదయావర్జకాలు. అయితే నేమి? శేషుని ఫణామణులు సుందరాలు అనర్ఘాలు కావా? చూచి భక్తిపారవశ్యంతో నమస్కరించవలసిన దేతక్క వాటిని ఆహరించటం సాధ్యమా? ఒక వేళ సౌందర్య వ్యామోహియై సాహసించి ఏకవి అయినా ఆహరిస్తే అనౌచిత్యదష్టాలై ఆ దివ్యమణులు గాజు పూసలై పోతవి.

కలభాషిణీ వృత్తాంతాన్ని కళాపూర్ణోదయం నుంచి వేరుచేసి ఆమె మృతితో కథను ముగిస్తే, కథానాయిక ప్రియుని కోసం ఇల్లు వదలి పారిపోయి భ్రష్టశీలయై దుర్మరణం పొందవలసివస్తుంది.

సరస్వతీ చతుర్ముఖ క్రీడ స్వతోరమ్యమే. దానిని పుణికి పుచ్చుకొని వేరుగా వ్రాస్తే అది దేవతారతి వర్ణనమై నికృష్ట రసాభాసమైపోతుంది. విశేషించి ఆ క్రీడను కథా ప్రపంచ పర్యవసాయితావిరహితంగా చిత్రిస్తే ఎంత సొగసు లోపిస్తుందో సహృదయులే ఊహించుకోవచ్చును. దీనికయినా అంగీకరించి అనౌచిత్యాన్ని పరిహరించి చిత్రిస్తే, అది సాధారణ నాయికానాయకుల శృంగార క్రీడ కావచ్చునేకాని సరస్వతీ చతుర్ముఖుల క్రీడ మాత్రం కాదు. సుగాత్రీశాలీనుల కథను ఇల్లరికమను పేరు పెట్టి వేరొక రచయిత చక్కని నవలో, నాటకమో, పద్యకావ్యమో వ్రాయవచ్చును. 83
అట్టి ఆలుమగల నడుమ పొరపొచ్చాలు కల్పించటం, వాటిని పరిష్కరించటం, తన్మూలంగా కథకు అందమైన ముగింపు ఇవ్వటం అంత తేలిక కాదు వీటిని ఒక వేళ సాధించినా శాలీనుని నిగూఢ మనస్తత్వం చిక్కదు.

అలఘువ్రతునిచరిత్రను వేరుపరచి నిరపేక్షంగా వ్రాయవచ్చు. అప్పుడది పౌరాణిక కథో లేక బృహత్కథాంతర ఖండమో అయి అన్నదానమహిమను అభివర్ణిస్తుంది. అయితే కవి లోకసూరుడైన సూరన సాధించినవైచిత్రిని కోలుపోతుంది. వ్యాసమహర్షి అంతటివాడు తన భారతం వింటే కలిగే ప్రయోజనాన్ని తరచుగా ఉపాఖ్యానాల చివర ఫలశ్రుతి రూపంతో చెప్పుకోవలసివచ్చిందే కాని దానిని ఇతివృత్త శరీరాంగంగా చేయలేకపోయాడు. ఆయనకు అట్టి శక్తి లేదని కాదు. అట్టి ఆలోచనే కలుగలేదు. గడుసరియైన సూరన తన కావ్య ఫలశ్రుతిని కథాంతర్భాగం చేసి వైచిత్రిని సాధించాడు.

రంభల కలహం, మృగేంద్ర వాహనా మణిహారాల వృత్తాంతాలు మనోజ్ఞాలైనా కథాశరీరంనుంచి విడదీయలేము. ఒక వేళ విడదీస్తే ఖండిత పృథక్కృతాంగాలవలె నిర్జీవాలు, నిరుపయోగాలు అవుతవి.

అందువల్ల కళాపూర్ణోదయ ఘట్టాలు అన్యకవులకు దురవాపాలూ దురాలోకాలు అయిపోయాయి.

వాస్తవానికి కళాపూర్ణోదయంలోని సొగసు చాలవరకు కథాసంవిధానంమీదనే ఆధారపడివుంది.

జి. వి. కృష్ణరావు

కథ అన్నప్పుడు అనేక వృత్తాంతాలు, కార్యములు, ఘటనలు, సన్నివేశాలు వుంటవి. విభిన్న పదాలను అర్థవంతంగా సరసంగా తీర్చి వాక్యాన్ని ఘటిస్తున్నట్లు, రకరకాల రంగు రంగుల పూలను సంస్థానుగుణంగా, ఆహ్లాదకరంగా ప్రయోజన సాధకంగా కూరుస్తున్నట్లు వృత్తాంతాలను కూర్చటంలోనే సంవిధాన వైచిత్రి గోచరిస్తుంది.

కళాపూర్ణోదయంలో కలభాషిణి ప్రాథమిక వృత్తము, నారద తుంబురుల కలహం, మణికంధరుని తీర్థయాత్ర, మణిస్తంభుని వృత్తాంతమూ, రంభల కలహము, సుగాత్రీ శాలీనుల కథ, సరస్వతీ చతుర్ముఖుల క్రీడ, స్వభావుని ఉదంతము, కళాపూర్ణుని జన్మము, శల్యాసురుని వృత్తాంతము, అలఘువ్రతుని చరిత్ర, మధురలాలసా కళాపూర్ణుల వివాహం, కళాపూర్ణుని జైత్రయాత్ర, సత్వదాత్ముని పూర్వచరిత్ర, లక్ష్మీనారాయణ సంవాదము అన్న ఘట్టాలు క్రమసంవిహితాలు.

కాలక్రమాన్ని బట్టి వీటిని ఏర్పాటుచేస్తే కథను సరస్వతీ చతుర్ముఖ క్రీడతో ప్రారంభించాలి. సూరన ఈ క్రమం త్రోసిపుచ్చి కలభాషిణీ వనవిహారం ఘట్టంతో ప్రారంభించి లక్ష్మీనారాయణ సంవాదంతో తన కావ్యాన్ని ఉపసంహరించాడు. కవి అనుసరించిన యీ క్రమంలోని ప్రతి అంశమూ బహులార్థసాధకమై సరసంగా ఉన్నది.



సంధ్యంగ ప్రయోజనాలను భరతు డిలా ఉల్లేఖించాడు:

ఇష్టస్యార్థ స్వరచనా, వృత్తాంత స్యాన పక్షయం
రాగప్రాప్తిః ప్రయోగస్య, గుహ్యానాం చైవ గూహనమ్.
ఆశ్చర్యవదభిఖ్యానాం, ప్రకాశ్యానాం ప్రకాశనమ్
అంగానాంపఙ్ద్యధం హ్యేతద్దృష్టం శాస్త్రే ప్రయోజనమ్ ...

ఈ ప్రయోజనా లన్నింటినీ సూరన తన కథాసంవిధానంతో సాధించాడు. ఏ ఘట్టాన్నయినా చిత్రించటానికి మూడే పద్ధతులు. ఒకటి కథన పద్ధతి; రెండు ప్రయోగపద్ధతి లేదా నాటకీయ పద్ధతి; మూడు మిశ్ర పద్ధతి. కవిగాని, పాత్రగాని వృత్తాన్ని నేరుగా చెప్పటం కథన పద్ధతి. పాత్రల సంభాషణల ద్వారా వృత్తాన్ని ఆవిష్కరించటం ప్రయోగ పద్ధతి. వృత్తంలో కొన్ని భాగాలు కవి నేరుగా చెప్పి కొన్నింటిని పాత్రల సంభాషణలద్వారా ఆవిష్కరించటం మిశ్ర పద్ధతి.

కళాపూర్ణోదయం ఊర్జితకథోపేతమైన మహాప్రబంధం. కనుక యీ మూడు పద్ధతులూ ఆవశ్యకాలే అవుతవి. అయితే యీ పద్ధతీ ప్రయోగంలో కథాసంనిధానవైచిత్రి యెంతో సాధించాడు.

ద్వారకా వర్ణనం కవి స్వయంగా చేసి నారదతుంబురుల కలహం, మణికంధరుని తీర్థయాత్రాదికం మణిస్తంభునిచేత కలభాషిణికి చెప్పిస్తాడు. దీనివలన పఠితలకు విస్మయ కుతూహలాలు అధికమౌతవి. ఈ మణిస్తంభుడు ఎవడు? కలభాషిణీ నారదాదుల వృత్తాంతాలు అతనికి ఎలా తెలిసాయి? మొదలీతడు దేనికి వచ్చినట్లు? వచ్చి యేమి చేయబోతున్నాడు? ఇలాంటి

ప్రశ్నలు అనేకం ఉద్భవిస్తాయి. పాఠకుల నిర్వేలమైన కుతూహలంతో తరువాతి కథాభాగం చదువుతాడు.

మణిస్తంభుడు కలభాషిణిని మృగేంద్రవాహనాలయానికి కొనిపోయి ఆ దేవికి బలిపెట్టబోయి భంగపడి దూరవిక్షిప్తుడై తిరిగి వచ్చి కలభాషిణినేకాక సుముఖాసత్తిమణికంధరులనుగూడ కలుసుకొంటాడు. ఈ భాగం కవి కథనంతో సాగింది. దీనివలన కథకు జిగిబిగువులు చిక్కాయి.

రంభావనాయారంభల కలహం కవి స్వయంగా చెప్పి ఉండవచ్చును. లేదా మణికంధరునిచేగాని కలభాషిణిచేగాని చెప్పించి ఉండవచ్చును. సూరన అట్లు చేయక మణిస్తంభునిచే చెప్పించి అనేక ప్రయోజనాలను సాధించాడు.

అలాగే సరస్వతీ చతుర్ముఖ క్రీడను తానుగాని బాల్యావస్థ దాటిన మరొక పాత్రచేగాని చెప్పించక కవి ఉయ్యాల తొట్టిలోని పసిపాపమైన మధురలాలసచే చెప్పించి ఆశ్చర్య పర్యుత్సుకతలను ఇనుమడింపజేయుటయేకాక పాత్రపోషణల ప్రబల అనౌచిత్య దోష పరిహారణం సాధించాడు.

సత్వదాత్ముని వృత్తాంతమూ, లక్ష్మీనారాయణ సంవాదమూ మధురలాలసచే చెప్పించి మిగిలిన కథాభాగాన్ని కవి నేరుగా వర్ణించి వైచిత్రిని సాధించాడు. వీటన్నిటికంటే కథాసంవిధానంలో సూరన సాధించిన అపూర్వ విశేషం మరొకటి వున్నది. 85

సాధారణంగా మనం పిల్లలకు కథ చెప్పాలంటే, అనగా అనగా ఒక రాజు, ఆ రాజుకు ఒక కూతురు అని ప్రారంభిస్తాము. అదే పెద్దవాళ్లకు చెప్పవలసి వస్తే రాజు పేరు చెబుతాము. దేశం పేరు పేర్కొంటాము. ఫలాని కాలంలో ఉన్నాడంటాము. ఆ రాజకుమారికి కనులు చేరెడు, కురులు బారెడు, అంటాము. ఇవన్నీ దేనికి? నమ్మిక చిక్కటానికి, రూపొందటానికి, రక్తి కట్టటానికి. ఇవన్నీ తరువాతి కథకు భూమికలు. బుద్ధిమంతుడైనవాడు ఈ పేర్లూ భూమికలూ కథతో విరోధించకుండా చూచుకుంటాడు. అంటే వీటికీ కథకూ అంగాంగిభావం ఉండదు.

దృష్టాంతంగా నలోపాఖ్యానమే తీసుకొందాము. నలుడు నిషధదేశాధీశ్వరుడు. ఆ నలుని పేరు మరొకటయినా, దేశం వేరొకటైనా, కాలం మారినా ఆ కథ యథాతథంగా సాగిపోవటానికి ఏ ఆటంకాలు ఏర్పడవు.

కళాపూర్ణోదయంలో అలా కాదు. కొన్ని పాత్రల పేర్లు కవి పేర్కొన్నట్లు లేకపోతే కథ నడవదు. కాదు. కళాపూర్ణోదయమే సిద్ధించదు. ఉదాహరణకు మణికంధరుని పేరే తీసుకోవచ్చును. ఆ గంధర్వునికి మణికంధరుడన్న పేరుగాక మయుడనో గయుడనో చిత్రరథుడనో మరొకపేరు ఉంటే కలభాషిణి తాను నలకూబరుని ప్రేమిస్తున్నానన్న ఆత్మవంచనకు పాల్పడి ఉండదు. ఆ నలకూబర సమాగమం కోసం మణిస్తంభుని వెంట పోయి హేతిఘూతంతో మరణించి ఉండేది కాదు. అంటే కళాపూర్ణోదయ కథే ఉండేది కాదు.

జి. వి. కృష్ణరావు

అలాగే శాలీనునికి ఉత్తరకాలంలో మణిస్తంభుడన్న వ్యవహార నామం ఏర్పడకున్నట్లైతే సుముఖాసత్తి అన్న నామాంతరం పొందిన సుగాత్రి తన మగనిని మృగేంద్ర వాహనాలయంలో గుర్తించి ఉండేది. అప్పుడు మణిస్తంభుడు మృగేంద్ర వాహన బలి నిమిత్తం కలభాషిణిని ద్వారకనుంచి మైదుపుచ్చికొని రావటానికీ అనంతర కథ జరగటానికీ అవకాశం ఉండేది కాదు.

ఇలా పాత్రల పేర్లను కథతో అవినాభూతులుగా ఏ కవి ముడిపెట్టగలిగాడు?

పాత్రల దేశకాల జాత్యాది భూమికలను కేవలం సంభావన కోసం కాక కవి కథలోని వివిధ ఘటనలకు సాధకాలుగా నిబంధించాడు. నిజాని కివి భారత కర్ణుని సహజ కవచకుండలాలను పరిహసిస్తున్నవి. మణికంధరుడు గంధర్వుడు కాక మానవమాత్రుడై ఉంటే ఆకాశగమనం, ఇష్టరూప గ్రహణం, చిరస్థాయులైన యౌవన జవసత్త్వాలు సిద్ధించి ఉండేవి కావు. అట్లే యజ్ఞశర్మ మళయాళ దేశంవాడు కాకపోతే ఓడ వర్తకులకు తన భార్యలను అవుమ్మకొని తరువాతి దురవస్థ పొందవీలుండేదికాదు. సుగాత్రీ శాలీనులు కాశ్మీర వాసులు కాకపోతే జాతిస్వభావ విరోధం ప్రాప్తించి ఉండేది.

సూరన కథా సంవిధానంలో మరొక విచ్చిత్తి గోచరిస్తుంది. కవి దుర్ఘట కార్యాలను
86 అభివర్ణిస్తాడు. ''బట్టతలకూ మోకాలికైనా ముడిపెట్టవచ్చును కాని వీటికి ముడిపెట్టటం ఎలా?'' అని పాఠకుడు విభ్రాంతి విచికిత్సలకు లోనవుతాడు. కవి తరువాత తన సంవిధాన మహిమతో చక్కగా వాటికి ముడి పెడతాడు. శాలీనుడు తన భార్యయైన సుగాత్రికి సంతానం కలుగకుండునట్లు, సుగాత్రి తనకు సంతానం కలుగునట్లు తమ ఇలువేలుపైన సరస్వతిని వరాలు కోరుతారు. ఆమె ఇస్తుంది. ఇవి పరస్పర విరుద్ధాలు. మరి ఇచ్చినది సరస్వతీదేవి. వరాలు వ్యర్థం కావటానికా వీలులేదు. సిద్ధించటానికా మార్గమేది? సూరన నాయికా నాయకుల శీలానికి, సరస్వతీదేవి మహిమకూ అన్యథాత్వం కలుగకుండా రెండువరాలకూ సఫలత కల్పిస్తాడు. సూరన కథా సంవిధానం ఇలాఅపూర్వ మార్గం త్రొక్కడమే కాదు, ఎట్టి నిశితబుద్ధినైనా తన సమ్మోహజాలంతో బంధించివేస్తుంది. మృగేంద్ర వాహనాలయంలో సుముఖాసత్తి తానే సుగాత్రి నని మణికంధరునకు వెల్లడిస్తుంది. వెంటనే అందుకొని నేనే శాలీనుడను అని మణిస్తంభుడంటాడు. అతడు చెప్పినది నిజమో కాదో తేల్చుకోవటం సుముఖాసత్తికి ఆవశ్యకం. శాలీనుడు మడుగులో దూకటానికి గల కారణం సుగాత్రి శాలీనులకుమాత్రమే తెలుసు. ఆ కారణం చెప్పగలిగితే సుముఖాసత్తి మణిస్తంభులు సుగాత్రీ శాలీనులవుతారు. సుముఖాసత్తితాను ముందుగా ఆ కారణాన్ని కలభాషిణికి రహస్యంగా చెవిలో చెప్పినా వ్రాసి చూపినా మణిస్తంభుడు తనకున్న దూరశ్రవణ దూరదృష్టులచే గ్రహించి తిరిగి అప్పగించగలడు. కాబట్టి ముందుగా అతనిచే చెప్పించి తరువాత తాను చెబుతుంది. ఇద్దరూ చెప్పిన కారణం ఒకటే కావటంవల్ల మణిస్తంభుడే శాలీనుడని సుముఖాసత్తి నమ్ముతుంది. ఔనౌనని కలభాషిణీ మణికంధరులూ పాఠకులూ సంతోషిస్తారు. పర్యాలోచిస్తే, ఏనాడో ప్రవర్తించిన నారద మణికంధరుల సంభాషణను కలభాషిణికి చెప్పగలిగిన మణిస్తంభుడు తన శక్తులచే శాలీనుని

హృదయగత కారణం గ్రహించి చెప్పలేడా? కనుక హృదయగత కారణం చెప్పినంతమాత్రాన మణిస్తంభుడే శాలీనుడని నమ్మటానికి ఎలా వీలుపడుతుంది?

ఇంతకూ శాలీన మణిస్తంభుల అభిన్నతకు ఉపపత్తి కల్పించకుండానే కవితాను కథా సంవిధానం సాగించాడా? దీని పరిష్కారం శ్రోతలే ఆలోచించగలరు.

మొత్తము మీద సూరనగారి కథా సంవిధానంలో ఎన్ని వైచిత్రులనైనా పేర్కొనవచ్చును. వీటన్నిటిని మించిన విశేషం ఒకటి ఉన్నది. సామాన్యంగా కావ్యాలలో కథ కంచికి వెళుతుంది. మనం ఇంటికి వస్తాము. కళాపూర్ణోదయంలోని కథ కంచికి పోక మనతోనే వస్తుంది. ఆ కథా సంవిధాన వైచిత్రి అట్టిది.

(1971)

# 1

ఆధునికయుగం సాహిత్యసిద్ధాంతాల్లో ఒయ్యారాలు పోతూవుంది. మున్నెయుగం లోనూ ఇప్పుడు వస్తున్నన్ని సాహిత్యపద్ధతులు రాలేదు. ఈ నూతన సిద్ధాంతాలను పురస్కరించుకొని వస్తున్న సాహిత్యం నాటి జర్మన్ జైత్ర యత్రలాగు పాఠకుడి కళ్ళకు బయర్లు కమ్మిస్తూవుంది.

ఒక ప్రక్కనుంచి కళకోసమే కళ అనీ, మరో ప్రక్క నుంచి సాంకేతికవాద (Symbolism) మనీ, ఇంకా మరో దిక్కునుంచి ఇంప్రెషనిజమనీ, పోస్టు ఇంప్రెషనిజమనీ, ఎక్స్ప్రెషని జమనీ, ఇంకోదిక్కునుంచి సర్రియలిజమనీ వస్తున్నాయి. కవిత్వాన్ని గూర్చి ఆలోచించ దలచు కొన్న వాళ్ళూ, సాహిత్యం వ్రాసేవాళ్ళూ ఈ సిద్ధాంతాలు తప్పక తెలిసికోవాలి.

ఆధునిక సాహిత్య సిద్ధాంతాల్లో ముందు కళకోసమే కళ అనే పద్ధతి వచ్చింది ఈ వాదమే సాంకేతికపద్ధతికి దారి తీసింది. తరువాత వచ్చిన ఇంప్రెషనిజాలు, ఎక్స్ప్రెషనిజం, ఇమేజిజం, క్యూబిజం, ఫ్యూచరిజం, డాడిజం, సర్రియలిజం అనేవి సింబాలిజంలోనుంచి వచ్చినవే. 9

అసలు ఈ సిద్ధాంతాలనే యిసుళ్ళపుట్ట 1890 లో పగిలింది. కళకోసమే కళ అనే సాహిత్యపద్ధతి మొట్టమొదట ఫ్రాన్సులో బయలుదేరి వాల్టర్ పేటర్ అనే ఆంగ్లేయ విమర్శకుడిద్వారా ఇంగ్లండుకు వ్యాపించింది. తరువాత ముప్పై సంవత్సరాలకు మన దేశానికి వచ్చింది. ఈ సిద్ధాంతం ప్రకారం కవితాప్రపంచం భౌతిక ప్రపంచంతో సంబంధంలేక స్వతంత్రంగా వుంటుంది. కేవలం కళాదృష్టితోనే కవితా ప్రపంచంలో విహరించాలి. కవితానుభూతి ఆత్మ ప్రకృతులకు భిన్నమైవుండే దేవుడిలాగ సామాజిక సిద్ధాంతజీవికలకు భిన్నమై వుంటుంది. కవిత్వం పేరు ప్రతిష్ఠలకూ, ధనసంపాధనకూ, నీతి బోధించటానికీ కాక, కేవలం కళకోశమే ఉంటుంది.

ప్రస్తుతానికి ఈ వాదాన్ని ఒప్పుకుందాం. అయితే కవిత్వం ఎలావుంటుంది? మానవుడు తన జీవితాన్నుంచి విడివడి ఆలోచించగలడా? హృదయంలో అతనికి తెలియకుండానే లీనమైన అనుభవాలు కళను ఆనందించేటప్పుడు పనిచేయకుండా

వుంటాయా? అసలు అది సాధ్యమా? నిజంగా మానవుడు అలా చూడగలిగితే, ప్రాచీన తమములైన కళలను ఎందు కానందించలేకపోతున్నాడు? ఈ ప్రశ్నలకు సమాధానం లేదు.

నేను కేవలం కళకోసమే వ్రాశానన్న ఆస్కార్ వైల్డుయొక్క 'దిపిక్చర్ ఆఫ్ డోరియన్‌గ్రే' కూడా జీవితంలోనుంచి బయలుదేరిందే. ఆ పుస్తకంలోనిది ప్రత్యేక ప్రపంచం కాదు. దానిలో ప్రాపంచిక జీవితం, శ్రేయస్సు ఉన్నాయి. ప్రాపంచికానుభూతి గలిగిన పాఠకుడే ఆ పుస్తకాన్ని చదివి ఆనందించ గలుగుతున్నాడు. కాబట్టి యీ వాదన నిలవదు.

ఈ సిద్ధాంతం తరువాత వచ్చినది సింబాలిజం. దీని ప్రకారం కావ్యంలో చిత్రింపబడే అనుభూతి వైయష్టికమనీ, దాన్ని శబ్దంద్వారా ప్రకటించటానికి సాధ్యం కాదనీ, కేవలం నాదంవల్లను, రంగువల్లను, ఆకృతివల్లను (Form) స్ఫురింపజేయవలసినదేననీ చెబుతారు. ఇది ధ్వనిపద్ధతికి చాల దగ్గర్లో వుంది. రెండూ వాచ్యార్థంకంటె వ్యంగ్యార్థమే ముఖ్య మంటాయి. రెంటికీ ప్రమాత, అంటే రసికుడు, లేక సహృదయుడు కావాలి. అయితే ధ్వని కారుడి మతంలో కావ్యగతమైన అనుభూతి సాధారణీ కరణాన్ని వరిస్తున్నది. సింబాలిజం ప్రకారం కావ్యానుభూతి కేవలం వైయష్టికం, అందువల్ల శబ్దాన్ని తిరస్కరించి కేవలం నాదంమీద ఆధారపడవలసి వచ్చింది. కాబట్టి సింబాలిస్టు కవిత్వమంతా సాంకేతికమయమై చాలవరకుఅర్థంకానిదైనది.

తరువాత వచ్చిన సిద్ధాంతాల్లో ఎక్స్‌ప్రెషనిజం ఒకటి ముఖ్యం. ఈ సిద్ధాంతం కాపిటలిస్టులు చెప్పే ఆధ్యాత్మిక వాదంలోనుంచి మొలకెత్తింది. దీన్ని మొలకెత్తించింది క్రోచే అనే ఇటలీ దేశస్థుడు. ఈతని సిద్ధాంతం ప్రకారం జ్ఞానం రెండు విధాలు. ఒకటి ఇంద్రియాల ద్వారా లభించేది (Logical); రెండు ఇంద్రియాతీతమైనది (Intuitive). ఇంద్రియాతీతమైన జ్ఞానం దేశ, కాల, ఇంద్రియాలకు బద్ధమైనది కాదు. ఇది స్వయంజ్యోతి. ఇలాంటి ఇంద్రియాతీతమైన జ్ఞానమే కళ. ఈ కళ వైయష్టికమైన అనుభూతులను ప్రకటిస్తుంది. ఇది మనస్సులోనే జరుగుతుంది. ఈ అనుభవం వైయష్టికం కావటం వల్ల పునరుక్తం కాజాలదు. కళ దేశకాలబద్ధంకాని ఇంద్రియాతీతజ్ఞానం కావటంవల్ల క్షీణతాభివృద్ధులూ, న్యూనతాధిక్యాలూ లేని పరంజ్యోతి.

అంటే, కాళిదాస భవభూతుల కావ్యాలొక్కటే; నన్నయ తిక్కన కృతులు ఒక్కటే; పెద్దన తిమ్మన కావ్యాలూ ఒక్కటే. ఒకటి గొప్పదికాదు, రెండోది తక్కువది కాదు. ఈ మాట వింటే ప్రతి పాఠకుడూ, ప్రతి విమర్శకుడూ నవ్వుతాడు. కాని క్రోచే సిద్ధాంతం అదే.

నిజంగా కళను గూర్చి అతడు క్రొత్తవిశేషాలు ఏమన్నా చెప్పాడా అంటే యిలా అన్నాడు: కళ అంటే ఇంద్రియాతీతమైన జ్ఞానం; అంటే వైయష్టికానుభూతి ప్రకటన; అంటే సౌందర్యం. సౌందర్యమంటే కళ. ఇలా నాలుగు స్తంభాలాట ఆడతాడు క్రోచే.

ఇక ఫ్యూచరిజం, డాడిజం కేవలం అరాజక సిద్ధాంతాలకు సంబంధించిన సాహిత్య సిద్ధాంతాలు. పూర్వ కావ్యాలను ధ్వంసం చేయటమే ప్రధానోద్దేశం. ఇవి పూర్వకావ్యాలను అర్థం చేసుకోటానికి కాని, రసస్వరూపాన్ని నిర్దేశించటానికి కాని పనికిరావు.

తరువాత సర్రియలిజం బయలుదేరింది. బోడితలకూ మోకాలికీ ముడిపెట్టినట్టుగా, ఈ సాహిత్య సిద్ధాంతం ఫ్రాయిడ్ సిద్ధాంతానికి మార్క్సిజానికి లంకెవేసింది. రాజకీయరంగంలో మార్క్సిజమే ఆదర్శమన్నారు. శృంగారమే అన్నిటికి మూలమనే (దీనికి మన దేశంలో భోజుడు బీజం వేశాడేమో ననిపిస్తుంది) ఫ్రాయిడిజం స్వీకరించి అంతరాత్మకు అనుభూతిమీద పెత్తనమిచ్చారు. కావ్యానుభూతికి చమత్కారం, లేక అద్భుతం ముఖ్యమన్నారు. ప్రాచీనా లంకారికుడైన విశ్వనాథుడు రసానికి చమత్కారం, లేక అద్భుతం ప్రాణమని ఎప్పుడో చెప్పాడు. కొత్తదన మొక్కటే రసం కాజాలదు. పైగా, ఈ చమత్కారజీవి అయిన కావ్యాన్ని అంతరాత్మ శాసిస్తూ వుండటంవల్ల పాఠకుడు కావ్యాన్ని ఆనందించలేక పోతున్నాడు. ఈ అంతరాత్మతో వ్యక్తిత్వం ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుతూవుంది. సాధారణీకరణం తొలగిపోతున్నది.

పైగా, ఈ సిద్ధాంతం కావ్య పరిణామాన్ని తెలపలేకుండా వుంది.

ఈ విధంగా 1690 నుచి 1930 దాకా వచ్చిన యీ సిద్ధాంతాలు కలుపు మొక్కలు పెంచటానికి వచ్చినవే కాని పూర్వకావ్యాలనుకాని, ఇప్పటి కావ్యస్వరూపాన్ని గాని, ముందు రాబోయే కావ్యస్వరూపాన్ని కాని అర్థం చేసికొని ఆనందించటానికి తోడ్పడటం లేదు. ఇవన్నీ అహానికి ప్రాముఖ్యం ఇస్తూవున్నాయి.

అయితే కవిత్వంయొక్క స్వరూపం ఎలా అర్థమౌతుంది? దీనికి మార్గం ఉందా? ఈ విషయమే ముఖ్యం.

శబ్దాత్మకమైన భాషతో కావ్యం నిర్మితమౌతుంది. ఏ సిద్ధాంతాలు ఎలా చెప్పినా, భాష సామాజిక జీవనంతో వచ్చింది. సామాజిక జీవనం లేక భాష ఉండదు. పరస్పర అభిప్రాయాలు తెలిసికోవలసిన ఆవశ్యకం ఉన్నప్పుడే భాష ఉంటుంది. ఈ ఆవశ్యకం సామాజికజీవనం ఉన్నప్పుడే వస్తుంది. ఏ విషయాన్నైనా ఆలోచించటానికీ, ఆలోచనాశక్తిని పెంపొందించటానికీ భాషే ముఖ్యం. భాష లేకపోతే మానవుడు ఆలోచించలేడు.

సామాజిక జీవనంతో ఉత్పన్నమైన భాష సమాజంతో పాటే మారుతూ వుంటుంది. శబ్దం నశించదనే మీమాంసకుల స్ఫోటసిద్ధాంతాన్ని యీవిషయంలో ఆదరించటానికి వీల్లేదు. పూర్వపు తెలుగు ఇప్పటి కెంత నాశనమయింది? తెలుగులో తూర్పు పడమర శబ్దాలున్నాయి; తతిమ్మా రెండుదిక్కులీ్నీ తెలియజేసే శబ్దాలు నశించాయి.

అసలు కళఅనేదికూడా సామాజిక జీవనం ఉన్నప్పుడే ఉంటుంది. సామాజిక జీవనం లేకపోతే కళ అనేదే వుండదు. చీమలూ, తేనెటీగలూ సామాజిక జీవులు కాబట్టి వాటికి కళ ఉంది. జూలియన్ హక్స్లీ చీమల్ని గూర్చి వ్రాస్తూ అవి సామాజిక జీవులు కాబట్టి వాటికి కళ ఉన్నదన్నాడు.

కాబట్టి కళను కాని, కవిత్వాన్ని కాని సమాజాన్నుంచి విడదీసి విమర్శించి ఇదమిత్థమని తేల్చుకోటానికి వీల్లేదు. ఒక వేళ విడదీస్తే అగమ్యగోచరమౌతుంది. మారకం లేని కరెన్సీనోటుగతి పడుతుంది.

మానవుడు సామాజికజీవి కానట్లైతే, భాష, కళ, కావ్యం ఉండేవి కావు. వ్యక్తిత్వం ఉండేది కాదు. అతను జంతువులలాగానే, కేవలం శారీరకంగానే, ఇతరులకంటె భిన్నుడుగా కనిపించేవాడు. కళకూ, కవిత్వానికీ హేతుభూతమైన సమాజం ఎల్ల కాలం ఒక్కరీతిగా ఉండదు. దీన్ని అంతా అంగీకరిస్తా రనుకుంటాను. ఈ సమాజంతో పాటే మానవుడి అనుభూతి మారుతుంటుంది. క్రొత్త అనుభూతితో ప్రాత అనుభూతిమీద మానవుడు కొంతవరకే సానుభూతి చూపించగలడు. ఈ సానుభూతి రెండనుభావాల భేదాన్ని పట్టి వుంటుంది. వెనుకటి రోజుల్లో సమాజానికి ఋగ్వేదం కావ్యం. ఈరోజున దానిలోని ఋక్కులకు అర్థం చెప్పుకోగలిగినా, కవిత్వమని ఆనందించలేము. ఈ విషయం అన్ని కళలకూ అన్వయిస్తుంది. ప్రాచీన కాలంలో చిత్రకారుడు లేడిని రెండుకాళ్ళలోనే చిత్రించాడు. ఆ బొమ్మను చూచి ఆనందించటం మనవల్ల సాధ్యపడుతుందా?

ఈ అనుభూతి భేదంవల్లనే పూర్వకావ్యాల్లోని ఒక ప్రత్యేక రసం ఆధునికులకు మరొకరసం కావచ్చును. నాచనసోముడు వ్రాసిన ఉత్తర హరివంశంలోని ''జడలు కంపలువట్టి జరుగనీకున్నచో'' అనే సీసపద్యం రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికి నవ్వు తెప్పించింది. నిజంగా ఆ పద్యం కేవలం కరుణరసఘట్టంలోనిది. షేక్స్పియరు వ్రాసిన ''మాక్బెత్'' అనే నాటకంలో ''పోర్టర్సు సీను'' డీక్వెన్సీ అనే విమర్శకుడికి పూర్వమున్న వారికి హాస్య ఘట్టంగా తోచి ''ఇది విచార్యము'' అన్నారు.

మరోవిషయ ముంది. మొట్టమొదటి కావ్యాల్లో హాస్యం అట్టే కనిపించదు. ఆ రసం మానవసమాజంతో అభివృద్ధి చెందుతూ వస్తున్నది. అందుకనే ప్రాచీనాలంకారికులు –

గ్రీసుదేశస్థులు కానీ, మన దేశస్థులుకానీ- హాస్యానికి ప్రాముఖ్యం ఇవ్వలేదు.

కాగా, ఒకటి : కళను గాని, కవిత్వాన్నిగాని సంఘాన్నుంచి విడదీయటానికి వీల్లేదు. రెండు: మానవ సమాజం మారుతూవుంది. సమాజంతో పాటు భాష, అనుభూతి, కావ్యం మారుతూ వస్తున్నాయి. ఈ మార్పును అంగీకరిస్తేనేకాని అన్నియుగాల కావ్యాలనూ అర్థంచేసుకోవటానికి కాని, కవిత్వతత్త్వం కొంత గ్రహించటానికి కాని వీలులేదు.

అయితే, సమాజం ఎందుకు మారుతున్నది? ఇదివరకు ఎలా మారింది? ఇకమీదట ఎలా మారుతుంది? ఈ విషయాలను తెలిసికొంచే కవిత్వం సంగతికూడా తెలుస్తుంది? ''కోవేత్తి కవితాతత్త్వ మీశ్వరోవేత్తివానవా'' అని కాళ్లారజాపుకో నక్కరలేదు.

ఈ మార్పును వివరించ గలిగింది చారిత్రిక భౌతిక సిద్ధాంత మొక్కటే. కొంతమంది మార్క్సు చెప్పిన యీ సిద్ధాంతం సాహిత్యానికి ఏ మాత్రమూ అన్వయించదంటారు. ఇది పొరపాటు. నూడో మార్క్సిస్టుల్లాగా భౌతిక సిద్ధాంతాలు అన్వయిస్తే ప్రయోజనం లేదు.



కాబట్టి కొంచెం జాగ్రత్తగా అన్వయిస్తే కవిత్వతత్త్వాన్ని అవగాహన చేసికోటానికి ఒక చారిత్రిక భౌతిక సిద్ధాంతమే తోడ్పడుతుంది. ఈ దృక్పథంతోనే సాహిత్యాన్ని అవలోకించాలి. అట్లుకాక కవిత్వాన్ని సమాజాన్నుంచి వేరుచేసి చూస్తే నాలుగు స్తంభాలాట ఆడవలసి వస్తుంది.

# 2

కింకవేస్తస్య కావ్యేన కింకాండేన ధనుష్మతః,
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణ యతి యచ్ఛిరః.

కావ్యజగత్తు నిత్యనూతనం, నిత్యసుందరం; ఎప్పటికప్పుడు పూర్వం. మనీషకు అందినట్లుంటుంది కాని అందదు. హృదయానికి తగులుతూ వుంటుంది. బుద్ధికి చిక్కదు; తప్పించుకు పోతూనే వుంటుంది. ఇలాంటి కావ్యజగత్తుకి కొందరు అలంకారము ఏలిక అన్నారు; కొందరు రీతి అన్నారు; కొందరు గుణమన్నారు; కొందరు రసమన్నారు; కొందరు ధ్వని అన్నారు; కొందరు వక్రోక్తి అన్నారు; కొందరు భక్తి అన్నారు; కొందరు 'స్వచ్ఛంద భావాలూ'[1] అద్భుతమూ నన్నారు.[2] ఎవ్వ రేమి చెప్పినా ఆనందం[3] ఏలికంటే ఎవరికీ అభ్యంతరం ఉండదను కుంటాను.

96 అయితే కావ్యజగత్తులోని ఆనందం సమాజంలో సర్వసాధారణంగా యథాతథంగా కనిపించకపోవటం వల్ల విస్తు పోవటం సంభవిస్తూ వుంది. సంస్కృతాన్నుంచి అపభ్రంశాలు బయలుదేరినట్లుగానే, కావ్యజగత్తునుంచి అపభ్రంశరూపంగా సామాజికజగత్తు వచ్చిందని కొందరభిప్రాయ పడుతున్నారు. ఈ మతం ప్రకారం కావ్యజగత్తు సత్యం – సామాజికజగత్తు మిథ్య.[4] కాని యీ మతం కేవలం భ్రమపూర్వకమైన దనటంలో సాహసం ఏమాత్రం లేదు. కావ్యజగత్తువల్ల కలుగుతున్న ఆనందంవల్ల వివశులై జ్ఞానాన్ని విసర్జిస్తున్నారు; కాక ఆధునిక శాస్త్రాలు పరిశోధించి కనుగొన్న విషయాలను అవగతం చేసికోవడం లేదు. ఒకవేళ చేసికొంటే, విస్మరిస్తున్నారు. కావ్యజగత్తుకి శాస్త్రాలు సంపూర్ణ వ్యాఖ్యానం వ్రాయలేక పోవచ్చును. అంతమాత్రం చేతనే యీ కావ్యజగత్తు సామాజిక జగత్తు కతీతమైనదని కాని, కావ్యజగత్తులోనుంచి సామాజిక జగత్తు వచ్చిందనికాని చెప్పటం కేవలం మూఢత్వ మేనని చెప్పాలి. సామాజిక జగత్తునుంచి కావ్య జగత్తు వచ్చింది. అయితే యిలా వచ్చిన

---

1. Free Associations.

2. ఈ మతం అతివాస్తవికులది.

3. సంతోషానికి పర్యాయపదం కాదు. నిర్లిప్తసౌఖ్యం.

4. క్రోచే తన Esthetics లో అంటాడు.

కావ్యజగత్తు సామాజిక జగత్తును స్వల్పంగా మార్చవచ్చును.[5] ఈ విషయం ఎలా తేలిందన్న ప్రశ్న వస్తుంది.

కావ్యం శబ్దాలతో నిర్మింప బడుతుంది. సాంకేతిక వాదుల్లో[6] అతివాదులు నాదంతో నిర్మింపంబడుతుంది అంటారు. వీరికి శబ్దగత అర్థం ప్రధానం కాదు; శబ్దగత నాదం ముఖ్యం.[7] ఈవాదాన్ని అంగీకరించటానికి వీల్లేదు. ఆదరించేపక్షంలో కవిత్వానికీ, సంగీతానికీ భేదమే ఉండదు. అందువల్ల కావ్యజగత్తు శబ్దాలతో నిర్మింపబడుతుంది. అందుకనే జగన్నాథ పండితుడు కవిత్వాన్ని 'రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః' అని నిర్వచించాడు.

అయితే యీ శబ్దంసంగతేమిటి? ఈ శబ్దం లౌకికమా, అలౌకికమా? ఈ శబ్దం ఎలా వస్తున్నది? శబ్దం ఏమిచేయకలుగుతున్నది? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పుకుంటే మనకు ప్రస్తుతమైన విషయం కొంతవరకు తేలుతుంది.

శబ్దం అర్థవంతం. శబ్దానికి అర్థమంటే ఏమిటి అని ప్రశ్నించి ఇతరులను కలవరపరచటం తమకుతాము కలవరపడటం జరుగుతున్నది.[8] మనస్సులో శబ్దంవల్ల ఏది గోచరిస్తుందో, దాన్ని అర్థమందాము. అయితే శబ్దానికి ఈశక్తి ఎలా వచ్చింది? ఈ శక్తి శబ్దంలోనే వుందా? ఈ విషయం తెల్సుకోవాలంటే పెద్ద రగడలోకిదిగవలసి వస్తుంది. పదిరూపాయల నోటుకున్న శక్తి ఎక్కడినుంచి వచ్చింది అని ప్రశ్నిస్తే, ఆర్థిక శాస్త్రమంతా ఒకలోడించి చెప్పవలసినస్థితి ఏర్పడుతుంది. తర్కించిన తరువాత పదిరూపాయల నోటువిలువ కేవలం సమాజంలోని మారకాన్ని పట్టి ఏర్పడుతున్నట్లు తేలుతుంది. ఇలాగే శబ్దానికి అర్థం లోక వ్యవహారంవల్ల ఎర్పడుతున్నది. అందుకునే శబ్దశాసనుడు ''సిద్ధి ర్లోకా ద్వ్యశ్యాలోకోஉనన్యాదృశశ్చనిత్యశ్చ[9]'' అన్నాడు. 97

---

5. దీనికి Mechanical Materialists మార్క్సును సరిగ్గా అర్థంచేసికొనని బుఖారిన్ లాంటివారు ఒప్పుకోరు. పారస్పర్యంవల్ల మార్పుకలగదు; ఒక్క ఉత్పత్తి సాధనాలే అన్ని మార్పులకు కారణమని తన "Historical Materialism" లో బుఖారిన్ వ్రాస్తాడు.
6. Symbolists.

7. ఈ వాదాన్ని "pure poetry" వాద మంటారు. ఈ సిద్ధాంతాన్నే హెన్రీ బ్రిమాండ్ తన 'prayer & poetry' అనే పుస్తకంలో చిత్రించాడు.

8. The Meaning of Meaning by Ogden and Richards

9. ఆంధ్రశబ్దచింతామణి.

శబ్దం జాతి గుణ ద్రవ్య క్రియాచ్ఛాయలకు సంకేతం. ఇంతటితోనే శబ్దంపని అయిపోదు, సమాజంలో ఈ జాతి గుణ ద్రవ్య క్రియలవల్ల మానవుడికి సాధారణంగా పొడమే వేదనలకుకూడ సంకేతం; అంటే యీ మనో వికృతులను కలిగిస్తుంది. స్నేహితునితో మాట్లాడుతూ పాము పాము అంటా మనుకోండి. అతడు ఉలిక్కి పడతాడు. ఎందువల్ల? పాము అనే శబ్దం విన్న వాని మనసులో అణగివున్న విషజాతిప్రాణి రూపచ్ఛాయను తెచ్చి పెట్టింది. అంతేకాక లోకంలో పాము అనేదాన్ని చూస్తే ఏ వేదనలు కలుగుతాయో వాటిని కలిగించింది. అందువల్ల శబ్దానికి ప్రత్యక్షాంశాలను, వేదనలను కలిగించే శక్తి ఉంది. అయితే శబ్దాన్నుంచి యీ ప్రత్యాక్షాంశ వేదనల రెంటిలో ఏ ఒకదానీ విడదీయటానికి వీల్లేదు. ఈ రెంటికీ, శబ్దానికీ అవినాభావ సంబంధముంది. అంతేకాని ప్రత్యక్షాంశాలను సూచించటానికి ఒక శబ్దం, ఆ ప్రత్యక్షాంశంవల్ల కలిగే వేదనలను కలిగించాటానికి వేరొక శబ్దం ఎందుకు సృష్టించుకోగూడదు అనే ప్రశ్న వస్తుంది. జీవితంలో ఒక వస్తువు, ఆ వస్తువువల్లకలిగే వేదన కలసి ఉంటున్నట్టే శబ్దంలో ప్రత్యక్షాంశ సంకేతం, దీనివల్ల కలిగే వేదన కలిసి ఉంటున్నాయి. వేదనలను దెలిపే భీతి, దుఃఖంలాంటి శబ్దా లున్నాయి. అయితే యీ రెండు శబ్దాలూ దృశ్యములైన అవస్థలను, ఈ అవస్థలను చూచినట్లైతే కలిగే వేదనలను కలిగిస్తున్నాయికాని, నిజంగా, వినేవాడిలో కాని, చెప్పేవాడిలోకాని, చదివేవాడిలోకాని భీతిని, దుఃఖాన్ని కలిగించటం లేదు.[10]



శబ్దం నాదరూపకం, అందువల్ల అర్థంకంటే భిన్నమైన శక్తి కూడ ఒకటి ఉంది. ఈ శక్తి ఒక్క పద్య కవిత్వంలోనే కనిపిస్తుంది. ఇది "Break, Break" అనే టెన్నిసన్ పద్యం లోనూ, పో వ్రాసిన The Bells అనే శీర్షిక గల పద్యాల్లోను, తిక్కన పద్యాల్లోను, గీతగోవిందంలోను చక్కగాకనిపిస్తుంది. ఇప్పటి సర్రియలిస్టులు, అంటే అతివాస్తవికులు

---

10. ఈ విషయాన్నే కాల్డ్‌వెల్ ఇలా చెప్పాడు :

"The word refers to this shadow world of thought and conjures up portions of it in a man's head. The common Perceptual world, with all the condensations, organisations and displacement it has undergone, refers to and symbolises outer reality. It is all the quality mobilised for action. It is the compendium of what happens to percepts when the underlying reality is affected. The word symbolises this shadow world which it has happened to create, and is therefore the symbol of a symbol."

- Illusion and Reality, 161 - 2.

తమవచనంలో కూడ ఈ నాదశక్తిని వాడుతున్నారు. ఈ నాదశక్తి కూడ లౌకికమేనని శాస్త్రాలు పరిశోధించి చెబుతున్నాయి.[11]

ఇవిగాక మన ఆలంకారికులు –ముఖ్యంగా అభినవగుప్తాదులు – రసచర్చల్లో వివక్షించిన విలక్షణజ్ఞానం, అంటే సమ్యక్ప్రతీతి, మిథ్యాప్రతీతి, సంశయప్రతీతి, సాదృశ్య ప్రతీతికంటే విలక్షణమైన జ్ఞానం కూడా శబ్దంవల్ల కలిగేదే.

ఇంతకూ శబ్దం సమాజసిద్ధమనీ, ప్రత్యక్షాంశాలను, వేదనలను తెలుపుతుందనీ, కలిగిస్తుందనీ, తేల్చుకున్నాం. అయితే సామాజిక జగత్తు అనంతంగా ఉందిగదా, శబ్దాలు ఇలాంటి ప్రత్యక్షాంశాలన్నిటినీ చెప్పగలదా అన్న ప్రశ్నరావచ్చును. సమాజంచేత సృష్టింపబడిన శబ్దంకూడ మారుతుంది. కొన్ని శబ్దాలు పోతాయి. కొన్ని కొత్త శబ్దాలు వస్తాయి. కొన్ని శబ్దాల అర్థం మారుతుంది. స్ఫోటవాదం శబ్దం నశించదని చెబుతూ వుంది. దీన్ని సమర్థించటానికి వీల్లేదు. తెలుగుభాషలో ఎన్ని శబ్దాలు నశించలేదు. ఒక వేళ నశించకుండా ఏ శాసనం లోనో, ఏమూలనో, ఎచ్చటనో నిల్చి ఉన్నాయని అనుకుందాము. ఉంటే? ఆంధ్రరాజుల నాణాలు ఒకటీ అరా ఉన్నాయి. మారకం లేనప్పుడు ప్రయోజనమేముంది? 99

అయితే ప్రపంచంలో ఎన్ని వస్తువులున్నాయో అన్ని శబ్దాలు లేనిమాట వాస్తవం. అంతమాత్రం చేతనే శబ్ద వ్యాపారం నియతమని చెప్పటానికి వీల్లేదు. విశ్వనాథుడు చెప్పినట్లు శబ్దశక్తి అనంతంగా ఉంది.[12]

యాబర్‌క్రోంబీ అనే ఆంగ్లేయ విమర్శకుడు శబ్దశక్తి నియతమనీ, భావాలు అనంతంగా ఉంటాయనీ, కాబట్టి వీటినన్నిటిని వ్యక్తంచేయటానికి కవికి సాధ్యపడదనీ, అందువల్ల పాఠకుడు సానుభూతి కలిగి ఊహించుకోవాలనీ అంటాడు.[13] శబ్దశక్తి నియత మవ్వటంవల్ల కవి చిక్కున పడటం లేదు. ఇతర భాషా శబ్దాల్లోనో 'రిథిమ్' లోనో భావించటంవల్ల భావప్రకటన సాధ్యం కావటం లేదు. కవియైనవాడు సామాజిక శబ్దాలతో

---

11. నాదశక్తి, భారతి 1941 మే సంచిక.

12. సాహిత్యదర్పణం.

13. ఈ వాదాన్నే పురస్కరించుకొని భావకవుల్ని ముద్దు క్రిష్ణగారు సమర్థింప చూచారు. చూడుడు: వైతాళికుల పీఠిక.

ఆలోచించాలి. ఆలాకాక రాగాలతోను, రేఖలతోనూ, వర్ణాలతోను భావిస్తే ప్రయోజన మేముంటుంది?

కాబట్టి శబ్దం సమాజసిద్ధమనీ, మారుతూవున్న సామాజిక జగత్తులోని ప్రత్యక్షాంశా లను, వేదనలను తెలుపుతుందనీ తేల్చుకొన్నాం.

ఇలాంటి శబ్దాలతో నిర్మింపబడే కావ్యజగత్తు అలౌకిక మెట్లవుతుంది ?

అయితే, పురాణాలు, ఇతిహాసాలు, బ్లాబర్డ్, ఎన్షియంట్ మారినర్ చిత్రించిన విషయాలు సామాజిక జగత్తునకు సంబంధించిన వేనా?

''బొదలఁ జదలేటి లేఁదరగలు బాలుఁ
డగు చందమామ నుయ్యాల లూఁపఁ
దొడవుల తలలఁ జెన్నడరు మానికముల
చాయ దిక్కుల నెఱసంజ వఱుపఁ
వోరంపుటేనిక తోలియేద్దెఱకప్పు
కుత్తుకతోఁ బ్రీతి పొత్తుసేయ
దట్టంపుబూదిపూఁతల బూదిసఱచిన
పునుకలు పేరురంబునఁ దలిర్ప
మూడులోకంబులను గావ మొనసినట్లు
చేత ముమ్మొనకైదువు చెన్ను మీఱ
వేల్పుపదువు చూడ్కికి గడువింతయొప్పు
సేసె ముక్కంటియున్న యా చెలువు పేర్మి.''[14]
అనీ,
''తొలుకారు మెఱుఁగుల తోఁటలో నాడెడు
రాయంచ కొదమతో రాయఁజాలి
యిరులబండారంపు టింటికిఁ బెట్టిన
బొండుమల్లెలకోటఁ బోర గెలిచి
బలుమంచుఁ గంబాల బలసిరాఁ జుట్టిన
క్రొత్తముంజిడి బాగుఁ గొఱఁతచేసి
పాలపెన్నురువు గుబ్బలిమీఁద నెలకొన్న
నిండు వెన్నెలముగ్గు నిగ్గుచెఱిచి

14. ఎఱ్ఱాప్రగడ, హరివంశం.

జడలఁ గ్రొన్నెల మెడఁ బాఁపసరిగఁ దొడలఁ
బొడలతోల్మేన వెలిమిడిపూఁత మించఁ
బొడమి వ్రేతేని ముందటఁ బొడవుసూపెఁ
పొడవులందెల్లఁ బొడువైన బోఁటివేల్పు.[15]

అనీ మనోహరంగా వర్ణింపబడిన శివుడు లౌకిక సృష్టికి లోనైనవాడేనా? కవిభావన దైవప్రేరణవల్ల లోకాన్ని అతిక్రమించి పోతుందని చాలమంది అభిప్రాయం.

ఇలాంటి అభిప్రాయం, ఆధునికశాస్త్రాలు కష్టపడి పరిశోధించి కనుగొన్న సత్యాలను గుర్తించలేదని తెలుపుతుంది. ముఖ్యంగా మానసిక వైద్యశాస్త్రం వృద్ధిచెంది ఈ భావనా విషయంలో చాల సత్యాలను కనుగొన్నది. ఈ కనుగొన్న సత్యాలను వినియోగించి మానసికవైద్యం వ్యాధులను నివారిస్తున్నది. ముఖ్యంగా చార్కాట్, జానెట్, మోర్టన్ ప్రిన్సు, ఫ్రాయిడ్, ఇతని శిష్యులైన జంగ్,[16] ఎడ్లర్[17] సిద్ధాంతాలు చాలా సమస్యల్ని పరిష్కరిస్తున్నాయి.

10

కవుల వర్ణనప్రకారం శివుడు అలౌకిక మూర్తి; కవులు ఎలా సృష్టించ గలిగారా ఒనే సందేహం ఒకప్పుడు నన్ను పీడిస్తూవుండేది. కాని సైకోయెనలిస్టులు బండారం బయట పెట్టారు. ప్రస్తుతం శివుడు అలౌకికుడు కాదనీ, వ్యాసుడు వాసనలను ప్రకృతిసిద్ధ మార్గాలను పోనీక సంయమించటంవల్ల ఈ సృష్టి బయలుదేరిందనీ, శివుని ఆకృతి అలౌకికం కాదనీ, కేవలం పుంస్త్వస్వరూపమేనవీ గ్రహిస్తే చాలు. ఏన్షియంట్ మారినర్ ఎలా సామాజిక జగత్తు నుంచి బాహిరిల్లిందో రీడ్‌వగైరాల విమర్శలను చదివితే తెలుస్తుంది.

భావనల తత్వాన్ని గూర్చికూడ కొంత తెలుసుకొందాము. నిజానికి భావాలు జాగ్రదవస్థలో కంటే స్వప్నావస్థలో విపరీతంగా పరుగిడుతుంటాయి. సామాజిక జగత్తుతో ఏ సంబంధం లేనట్లు కనిపిస్తాయి. ఇలా కనిపించటం వల్లనే స్వప్నం దైవప్రేరితమనీ,

---

15. నాచన, ఉత్తరహరివంశం.

16. ఇతనిది ఎనలిటికల్ సైకాలజీ.

17. ఇతనిది ఇండివిద్యుయల్ సైకాలజీ.

కాబోయే అర్థాన్ని సూచిస్తుందనీ, దుస్స్వప్నాలకు శాంతి చేయించుకోవాలనీ అనేవాళ్లు కూడా ఉన్నారు. [18]

స్వప్నాలు ఎందుకు వస్తాయో, వీటి ప్రయోజనమేమిటో, నిర్మాణం ఎలా వుంటుందో, లౌకికానుభూతికీ, స్వప్నానుభూతికీ ఎలాంటి చుట్టరికముందో, ఈ స్వప్నభావాల అర్థమేమిటో, ఫ్రాయిడ్ చాలవరకు పరిశోధించి కనుగొన్నాడు.[19] భావాల తత్త్వాన్ని గూర్చి తెలిసికోవాలంటే స్వప్నాన్ని గూర్చి తెలిసికోవాలి.

ఫ్రాయిడ్ మనస్సును మూడు భాగాలుగా విభజించాడు: 1. బుద్ధి[20], 2. ఉపబుద్ధి[21], 3. అవ్యక్తం[22], మానవుడు నిద్రపోతున్నప్పుడు బుద్ధి పనిచెయ్యదు. అది కూడ నిద్రపోతుందని చెప్పవచ్చును. అంటే జ్ఞానేంద్రియాలు పని చెయ్యకపోవటంవల్ల అహంత అంతర్ముఖ మౌతుంది. అందువల్ల దేశకాలాలు జారిపోతాయి. జాగ్రదవస్థలో ఉన్నప్పుడు, బుద్ధి అవ్యక్తంలో దాగి ఉండే వాసనల[23] ఇష్టాలను – తన కంగీకరిపంరాని వాటిని – అణచి వేస్తుంది. ఇలా బుద్ధిచేత అణచివేయబడిన ఇష్టాలు[24], జాగ్రదవస్థలో సాధ్యపడని యిష్టాలు స్వప్నావస్థలో విహారానికి బయలుదేరుతాయి[25]. గడచిన రెండు మూడు రోజుల్లోని

అముఖ్య సంఘటనలనే గుర్రాలు వీటికి యుగ్యాలు. ఈ సంఘటనల్లో సాధారణంగా అవాంతరాలవల్ల ఆపివేసిన ఆలోచనలుకాని, ఆలోచించే ఓపిక లేక విడిచిపెట్టబడినవికాని, అసలు బుద్ధిలోకి రానీకుండా ఉపబుద్ధి త్రొక్కిపట్టిన ఆలోచనలుకాని, అముఖ్యంగా కనిపించటంవల్ల జాగ్రదవస్థలో పరిష్కారం పొందనివికాని ఉంటాయి.

ఇలాంటి స్వప్నభావాలన్నీ ఆత్మోత్కర్షకాలుగా ఉంటాయి. అంటే, కలగనేవాడు కలలో నాయకుడుగా ఉంటాడు. కలలో అతడు కనిపించకపోతే, స్వప్నపాత్రల్లో ఎవరిలోనో దాగివుంటాడు.

---

18. ఎర్నెస్టు జోన్సు వ్రాసిన Essays in Applied Psychoanalysis అనే పుస్తకంలో The Madonna's Conception, The Symbolic Significance of Salt అనే రెండు వ్యాసాల్ని చూడుడు.

19. ఫ్రాయిడ్ వ్రాసిని Interpretation of Dreams.

20. Conscious, 21. Preconscious, 22. Unconscious, 23. Instincts కు వాసనలకు భేదముంది. అయినా గత్యంతరంలేదు.

24. Unconscious wishes. 25. కాళిదాసు స్వప్నంలో ఇష్టావాప్తి చేకూరుతుందని గ్రహించినట్లుంది. అందుకనే ఉత్తర మేఘంలో, "తస్మిన్కాలే జలద యది సా లబ్ధనిద్రాసుఖా స్యాదన్వాస్యైనం స్తనితవిముఖో యామమాత్రం సహస్వ, మాభూదస్యాః ప్రణయిని మయి స్వప్నలబ్ధే కథంచిత్ సద్యః కణ్ఠచ్యుత భుజలతాగ్రన్థి గాఢోపగూఢమ్."

---

జి.వి.కృష్ణరావు

స్వప్నం నిద్రాభంగం కాకుండా చూస్తుంది. అందువల్ల స్వప్నదృశ్యాలు, భావాలు, బుద్ధిలోకి ప్రవేశించవు, ప్రవేశిస్తే, నిద్ర చెడిపోతుంది. అవ్యక్తంలో నుండి వాసనాఽ సంతుష్టిని పురస్కరించుకొని బయలుదేరిన దృశ్యాలను, భావాలను బుద్ధిలో ప్రవేశించకుండాను, తదనుగుణమైన చర్యలను జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు తీసుకోకుండా ఉండేట్లు ఉపబుద్ధి చూస్తుంది. అందువల్ల స్వప్నభావాలు, దృశ్యాలు ఈ ఉపబుద్ధి ఆజ్ఞకు లోబడులాయి. అందువల్ల, అంటే క్లుప్తీకరణం, వ్యత్యయీకరణం, మిలితీకరణం, వ్యతిరేకీకరణం, సంకేతీకరణం పొందుతాయి. వికల్పభావాన్ని స్వప్నం చిత్రించలేదు. అందువల్ల రెంటినీ ఒక దాని ప్రక్క ఒకదాన్ని చేరుస్తుంది. పోలికల్ని, కదుపుల్ని చెప్పవలసివస్తే, పోలిక లున్నవాటి నన్నిటినీ ఒకటిగాను కదుపును ఒకదాని ద్వారాను చూపిస్తుంది. అందువల్ల స్వప్నంలోని భావాలు, దృశ్యాలు విచిత్రంగాను, అలౌకికంగాను కనిపిస్తాయి. నిజానికి స్వప్నంలో అలౌకిక విషయాలుండవు. దేశకాలాలు జారిపోవటంవల్ల జాగ్రదవస్థలో మనస్సునకెక్కి దాగివున్న జాతిగుణద్రవ్యక్రియాచ్ఛాయలను అసంతుష్ట అవ్యక్తగత వాసనలు ఉపబుద్ధి ఆజ్ఞలను శిరసావహించి ప్రసారం చేస్తాయి. అందువల్ల అలౌకికాలుగాతోచే దృశ్యాలను, భావాలు ఏర్పడతాయి.



అలౌకికంగా కనుపించే ఒక స్వప్నాన్ని తీసికొని వ్యాఖ్యానిస్తే, భావమనేది లౌకికమో అలౌకికమో తేలిపోతుంది.

''ఒకామె స్వప్నంలో మూడుసింహాలను చూస్తుంది. అందులో ఒకటి నవ్వుతూ వుంటుంది. ఆమెకు భయం మాత్రం కలుగదు. తరువాత ఎందువల్లనో పరుగెత్తి చెట్టెక్కటానికి ప్రయత్నిస్తుంది. అంతకుముందే ఆవిడ బావో, లేక జ్ఞాతో ఆ చెట్టు కొమ్మల్లో వుంటాడు.''

ఈ స్వప్నాన్ని వ్యాఖ్యానిస్తే యిలా తేలింది. ఆమె ఇంగ్లీషు చదువుకొంటూవుంది. ఇంగ్లీషుపాఠంలో కేసరాలే సింహానికి ఉత్తమమైన అలంకారమని వచ్చింది. ఆమె తండ్రికి సింహపు జూలులాంటి గడ్డముండేది. అందువల్ల కలలో తండ్రి ఒక సింహమయ్యాడు. ఆమెకు ఇంగ్లీషు చెప్పే పంతులమ్మ పేరు లయన్సు, ఇంగ్లీషులో ఈ పదానికి సింహమని అర్థం. ఈమెగూడ ఒక స్వప్న సింహమైంది. పంతులమ్మకు పరిచితురాలైన ఒక కవయిత్రి ఆవిడకు Loewe గేయాలు పంపింది. Loewe అంటే సింహం. కవయిత్రికూడ ఆమె స్వప్నంలో ఒక సింహమైంది. ఇలాంటి సింహాలకు ఎందుకు భయపడాలి? ఈ మానవ సింహాల్లో ఒకటి నవ్వటంలో ఆశ్చర్యమేముంటుంది?[26]

---

26. The Basic Writings of Sigmund Freud. P. 435.

కాబట్టి శబ్దాన్ని పట్టిచూచినా, భావాన్ని పట్టి చూచినా కావ్యజగత్తు అలౌకికం కాదు. పైగా కావ్యజగత్తులో కేవలం లౌకికాలైన స్వీయచరిత్రలున్నాయి.

అందువల్ల కావ్యజగత్తు సామాజిక జగత్తునుంచి వచ్చినదేకాని, అలౌకికమైనదికాదు. అందుకనే గ్రీక్ ఆలంకారిక శేఖరుడైన అరిస్టాటల్ కళ అనేది ప్రకృతి యొక్క ''అనుకరణ''[27]మేనన్నాడు. అభినవగుప్తుడు భరతుని మతాన్ని వ్యాఖ్యానిస్తూ, ''నాట్యాత్సము దయ రూపా ద్రసః, నాట్య ఏవ రసః, కావ్యేఽపి నాట్యాయ మాన ఏవ రసః కావ్యార్థః''[28] అన్నాడు. అద్వైతి అయిన విశ్వనాథుడు సహితం విభావాను భావాలు లౌకికాలేనన్నాడు. కావ్యానుభూతి, లౌకికానుభూతి ఒకటే. కాక పోతే తరతమ భావాలుంటే ఉండవచ్చును, అని నియోహేగిలిస్టు (ఆధ్యాత్మికవాదుల్లో ఒకతెగవాడు) అయిన క్రోచే సహితం ఘంటాపథంగా చెప్పాడు.[29]

అరిస్టాటల్ మరొక విశేషాన్ని చెప్పాడు. సామాజికునికి కనివిని గుర్తింపలేని విషయాలవల్ల ఆనందం గలిగిస్తే ఆ ఆనందం కావ్యజగత్తుకు సంబంధించింది కాదన్నాడు. అంటే కావ్యానుభూతి కేవలం లౌకికానుభూతికి సంబంధించినదిగా ఉండాలి. అనుభూతి అలౌకికమైతే కావ్యానుభూతి కాదన్నమాటేగదా!

ఇంతకూ కావ్యజగత్తుకూ, సామాజిక జగత్తుకూ భేదం లేదని అభిప్రాయం కాదు. కావ్యజగత్తు ఆనందప్రదంగా ఉంటుంది. ఆనందప్రదం కాకపోతే, అది కావ్యజగత్తు కాదు. సామాజికజగత్తు అంటేనో అలా కాదు. సుఖమో, దుఃఖమో కలుగుతుంది. ఆనంద మనేది చాలా తక్కువ. మృగ్యమనే చెప్పవచ్చునేమో, సాధారణంగా అనుభూతి మీదనే సుఖదుఃఖాలు కాని, ఆనందం కాని ఆధారపడి ఉంటాయి. సామాజిక కావ్యాను భూతులు ఒకటే అయినప్పుడు వీటివల్ల కలిగే వేదనలుకూడా ఒకటిగా ఉండాలికదా! అలాంటప్పుడు కావ్యానుభూతి నియతంగా ఎందుకు ఆనందప్రదంగా ఉంటున్నది? సామాజికానుభూతి ఎందువల్ల సుఖప్రదంగాను, దుఃఖప్రదంగాను ఉంటున్నది? దీన్ని పట్టయినా కావ్యజగత్తు అలౌకికమని రుజువు కావటంలేదా అని శంకించవచ్చును.

సమాజంలో సుఖం ఎలా కలుగుతున్నదో విచారిద్దాము. ఇలా తేలిన విషయాలకు కావ్యానందం అతిక్రమించిపోతే కావ్యజగత్తు అలౌకికమౌతుంది. ఏసూత్రాల వల్ల లోకంలో

27. Imitation.

28. నాట్యశాస్త్రంలోని షష్ఠాధ్యాయం పైని అభినవ గుప్తుని వ్యాఖ్య.

29. Eesthetics.

ఆనందం కలుగుతున్నదో ఆ సూత్రాల వల్లనే కావ్యజగత్తు ఆనందం కలిగిస్తే లౌకికమౌతుంది. అయితే యీపని చాల కష్టసాధ్యం. పైగా కూలంకషంగా తేలేదికాదు. దీనికితోడు శ్రీనాథుడన్నట్లుగా ''బహుధా విప్రతిపత్తి ధీవిషయమ్ములౌ పాడైన శాస్త్రార్థముల్.'' అయితే యథాశక్తిని పరిశీలిద్దాం.

''బాహ్యావస్తువుల అధీనమైవున్న దంతా దుఃఖం; మనస్సుకు స్వాధీనమై వున్నదంతా సుఖం''[30] అని మనువూ, ''మనస్సుచే దుఃఖచింతన చెయ్యకపోవటమే దుఃఖ నివారణకు ఔషధ''[31]మని వ్యాసుడూ చెబుతున్నారు. ''విషయాలను ధ్యానించటం చేత పురుషుడికి వాటియందు ఆసక్తి కలుగుతుంది. ఆ ఆసక్తివల్ల కామం, దానివల్ల క్రోధం కలుగుతుంది. క్రోధంవల్ల మోహం, మోహంవల్ల విస్మృతి, విస్మృతివల్ల బుద్ధినాశనము, దానివల్ల తానే నశించటం జరుగుతుంది. రాగ ద్వేష వియుక్తమై తనవశమైన ఇంద్రియాలవల్ల ఇంద్రియవిషయాలనుభవిస్తున్నప్పటికీ, స్వాధీనాత్ముడు నిర్మలుడౌతున్నాడు. ఇంద్రియ నిగ్రహం లేనివాడికి ఆత్మవిషయక బుద్ధీ, భావనా, ఉండవు. భావించలేనివాడికి శాంతి ఉండదు. శాంతిలేనప్పుడు సుఖమెలా కలుగుతుంది'[32] అని గీత చెబుతున్నది.



ఈ సిద్ధాంతంప్రకారం మనశరీరాల్లో మనస్సు ముఖ్యమైందనీ, మనస్సును స్వాధీనం చేసుకొంటే శారీరక దుఃఖాన్నీ, మానసిక దుఃఖాన్నీ లేకుండా చేసుకోవచ్చుననీ తేలుతుంది. శరీరం లేకుండా మనస్సు ఉంటుందా? మనస్సు ముఖ్యమైతే మనస్తత్వం ఎందుకు మారుతున్నది? ఈ అధ్యాత్మికవాదా న్ననుసరించి మనస్తత్వం మారకూడదు. కాని, సైకాలజీ ఇది మారుతూ వుందని నిరూపిస్తూవుంది. మనోగుణమైన హాసాన్నుంచి బయలుదేరే హాస్యం ఎలా పరిణామం చెందుతూ వచ్చిందో గ్రైగ్, గ్రిగరీలు చక్కగా నిరూపించి చెప్పారు.[33]

మరొక విషయ ముంది. ఆధ్యాత్మికవాదుల సిద్ధాంతం ప్రకారం హిట్లరు ప్రజలను అణచిపెట్టినట్లే మనస్సు ఇంద్రియాలను దమిస్తే, మానవుడు స్వాతంత్ర్యం అనుభవిస్తాడు. భౌతిక వాదులమని చెప్పుకొనే సద్రియలిస్టులూ, సైకో ఎనలిస్టులూ ఆవశ్యకమును

30. సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖమ్.
ఏత ద్విద్యా స్సమాసేన లక్షణం సుఖ దుఃఖయోః, (మనుస్మృతి, 4-160)
31. భైషజ్య మేత ద్దుఃఖస్య యదేతన్నానుచింతయేత్. (మ.భా, శాం 205-2)
32. గీత, రెండో అధ్యాయం, 62, 63, 64, 66 శ్లోకాలు.
33. "Psychology of Laughter" by Gregory.

గుర్తించక పోవటమే స్వాతంత్ర్య మంటారు. నిజానికి, స్వాతంత్ర్య మంటే ఏంజిల్సు చెప్పినట్లుగా ఆవశ్యకమును గుర్తించటమే,[34]. మనకు ఆకలి అవుతున్న దనుకోండి. ఆకల్ని అణచివేసుకోవడం వల్ల స్వాతంత్ర్యం లభించదు. ఆకలిని తృప్తిపరచవలసిన అవసరముంది. ఈ ఆవశ్యకమును గుర్తించి భోజనం చేస్తే ఆకలి బారినుండి బయట పడతాము.

ఈ కారణాలవల్ల ఆధ్యాత్మికవాదులు సుఖాన్ని గూర్చి చెప్పిన విషయాలు సమంజసంగా లేవు. నైయాయికుల మతమే సత్యానికి దగ్గరగా వుంది. వీరు వేదనను శారీరకమనీ, మానసికమనీ ఒప్పుకుంటారు. దీన్ననుసరించే సమాజంలో సుఖం ఎలా కలుగుతుందో విచారిద్దాము.

ఈ సుఖాన్ని గూర్చి విచారించేటప్పుడు జ్ఞానేంద్రియాలు, అవ్యక్తం, బుద్ధి వీటినిగురించి ముఖ్యంగా విచారించాలి. జ్ఞానేంద్రియాల వ్యాపారము స్వాభావికవృత్తికి అనుకూలంగా ఉంటే సుఖం, లేకపోతే దుఃఖం. పిడుగు పడ్డ చప్పుడు చెవిని పడుతుందనుకోండి. మన చెవికి అది సుఖం కాదు. దానివల్ల ఈ ఇంద్రియం దెబ్బతింటుంది. సాధారణంగా వినటానికి వీల్లేని చిన్నచప్పుడు వినవలసి వస్తుందనుకోండి. అది చెవికి సుఖప్రదంకాదు. అయితే ఈ జ్ఞానేంద్రియాల సౌఖ్యం కొంతవరకు వాసనలమీద, బుద్ధి మీదా ఆధారపడి వుంటుంది. వాసనలుగాని, బుద్ధిగాని ప్రేరేపించటంవల్ల జ్ఞానేంద్రియాల వ్యాపారం స్వాభావిక వృత్తికి వ్యతిరేకంగా ఎక్కువకాలం సాగవలసివస్తే, ఆ కాలంలో దుఃఖప్రదం కాకపోయినా తరువాత అవుతుంది.

అవ్యక్తంలో వాసనలు దాగిఉంటాయి. ఈ వాసనలు ప్రతి మానవునికీ ఉంటాయి.[35] కర్మప్రవృత్తికి ఈరతి, హాస, శోక, క్రోధ, భయ ఉత్సాహ, జుగుప్సా విస్మయాదులు (దానం, దయను మన ఆలంకారికులు ఉత్సాహం క్రిందికి నెట్టారు) కొంతవరకు కారణాలు, వీనివల్ల సుఖ మెలా కలుగుతుందో తరువాత చూద్దాము.

బుద్ధి అనేది జ్ఞానేంద్రియాదుల అనుభూతివల్ల ఏర్పడి పరిణామం చెందుతూ వుంటుంది. అందువల్లనే శిశువుల బుద్ధీ, పెద్దవాళ్ళ బుద్ధీ ఒకటికాదు. బుద్ధికి స్మృతి, భావన అనే రెండు ముఖ్యశక్తులున్నాయి. స్మృతివల్లనే భావన ఏర్పడుతుంది. స్మృతివల్ల

34. "Freedom is the recognition of necessity" Engels.

35. దీన్ని అభినవగుప్తుడు గుర్తించాడు. అందుకనే, ''జాత ఏవహి జంతు రియతీభిః సంవిద్భిః పరితో భవతి,'' అన్నాడు.

మనస్సులో నిలిచిన ప్రత్యక్షాంశాల ఛాయలను ఒక ఉద్దేశంలో ప్రస్తరించటమే భావన. జ్ఞానకర్మేంద్రియాల ఆవశ్యకాలను కొంతవరకు గుర్తించటంవల్లను, బుద్ధిచే దమింపబడని వాసనల ఆవశ్యకాల వల్లను; బుద్ధిలో ఇచ్ఛబయలు దేరుతుంది.[36] ఈ ఇచ్ఛా వాప్తికోసం మానవుడు కర్మప్రవృత్తుడౌతాడు. ఇచ్ఛ[37] నెరవేరకపోతే దుఃఖం, నెరవేరితే సుఖం. ఆశాలత తెగకుండా, ఈ ఇచ్ఛ ఎంత కష్టసాధ్యమైతే అంతసుఖం కలుగుతుంది. బుద్ధిచే దమింపబడని వాసనల్లో అంతర్యుద్ధం ఎంత గాఢంగా బయలుదేరి తుదకు పరిష్కారం పొందితే అంత సుఖం కలుగుతుంది. కలుగుతూవున్న దుఃఖం ఆగిపోయినా సుఖమే. గీతలో చెప్పిన నిష్కామ కర్మం ఇంద్రియాలకూ వాసనలకూ హానికరం కానట్లైతే సుఖమే.

అనుకరించటం,[38] గుర్తించటం, అనుకున్నట్లు జరగటం సుఖాన్ని యిస్తాయి.

సామాజిక జగత్తులో సుఖదుఃఖాలు ఎలా కలుగుతున్నాయో విచారిస్తున్నప్పుడు స్వప్నాన్ని విడిచిపెట్టటానికి వీల్లేదు. స్వప్నం కూడా లౌకికమేనని తేల్చుకున్నాం. దైవప్రేరణకాని, అలౌకిక విషయాలు కాని స్వప్నానికి కారణాలు కావని గుర్తించాము.

జాగ్రదవస్థలోని వేదనలు స్వప్నావస్థలో మారిపోతాయి. జాగ్రదవస్థలో బోనులోని సింహాన్ని చూచినా హృదయం బేజారెత్తి పోతుంది. స్వప్నంలో భయం లేకుండా దాని జూలుపట్టుకొని ఈడుస్తాము. దేహబాధలు లేకుండా అగ్నిలో నడుస్తాము. ముఖం గోడకు కొట్టుకుని బొప్పికట్టినా బాధ ఉండదు. ఈ గారడీ అంతా ఏమిటి? స్వప్నంలో ఏ కవితా ప్రతిభ వేదనలను తలక్రిందులు చేస్తున్నది?



స్వప్న తత్త్వాన్ని పరిశోధించిన ఫ్రాయిడ్ దీని కీలక మేమన్నా కనుగొన్నాడేమో చూతాము.

స్వప్నంలో బుద్ధిపూర్వకంకాని[39] ఇష్టావాప్తి జరుగుతుంది. ఈ బుద్ధిపూర్వకంకాని యిష్టం అవ్యక్తంలోని అసంతుష్టవాసనలది. ఇల్లాంటి యిష్టాన్ని పురస్కరించుకొని బయలుదేరే ఆలోచనలవల్ల కలిగే వేదనలు సాధారణంగా సంతోషకరంగా ఉంటాయి.

---

36. ఇచ్ఛావాప్తికీ ఫ్రాయిడ్ వాడే "wish fulfilment" కీ సంబంధం లేదు. ఇచ్ఛావాప్తి బుద్ధిపూర్వకమైనది; wish fulfilment అట్టిది కాదు.

37. గీత ఈ ఇచ్ఛను త్రుంచివేసి నిష్కామ కర్మం చెయ్యమంటుంది. ఇది మానవుడికి అనర్థదాయకం. వివేచన, అభివృద్ధి పోతాయి. జంతుతుల్యుడై అవ్యక్త వాసనలను పట్టి పోవలసివస్తుంది. ఇలాంటిది పరాజిత జాతి చెప్పుకొనే వేదాంతం.

38. అరిస్టోటల్ వ్రాసిన Poetics., 39. Un conscious

శిక్షాకస్వప్నాల్లో [40]. మాత్రం అవ్యక్తంనుంచి ఇష్టావాప్తిని పురస్కరించుకొని బయలుదేరే ఆలోచనలవల్ల కలిగే వేదనలు దుఃఖకరంగా ఉంటాయి. మొదటితరగతి ఆలోచనలు ఉపబుద్ధివల్ల మార్పు చెందుతాయి. సింహాలను పురస్కరించుకొని వచ్చిన స్వప్నాన్ని తీసుకొందాము. అవ్యక్తంలో బయలుదేరిన ఆలోచనల ప్రకారం ముగ్గురూ మానవులే. ఉప బుద్ధి వల్ల ముగ్గరూ మూడు సింహాలయ్యారు. మానవులను చూచినప్పుడు భయపడవలసిన పనిలేదు. మొదటి వేదన అలాగే ఉంది. కాబట్టి సింహాలను చూచినప్పుడు కూడ భయం కలుగలేదు.

ఒక్కొక్కప్పుడు ఉపబుద్ధి నిషేధంలోని వేదనలు అవ్యక్తంనుంచి బయలుదేరిన వేదనలతో కలుస్తాయి. అవ్యక్తపు వేదనలు సాధారణంగా సంతోషకరంగా ఉంటాయి. ఉపబుద్ధి వేదనల్లో దుఃఖంలేకపోతే, స్వప్నం సంతోషకరంగా వుంటుంది. మొదటి వేదనలు ఎంత సంతోషకరంగా వుంటాయో రెండో వేదనలు అంత దుఃఖకరంగా వుంటే స్వప్నం దుఃఖప్రదంగాగాని, సుఖప్రదంగాగాని ఉండదు. అలాకాక, ఈ రెండు వేదనల్లో దేనిబలం యెక్కువగా ఉంటే ఆ వేదనలు కలుగుతాయి.

శిక్షాకస్వప్నాల్లో ప్రథమ వేదనలు ఉపబుద్ధి నిషేధం వల్ల తలక్రిందు లౌతాయి. దుఃఖకరంగా ఉండవలసిన స్వప్నం సంతోష ప్రదంగా ఉంటుంది; సంతోషప్రదంగా ఉండవలసినది దుఃఖప్రదంగా ఉంటుంది.

ఈ స్వప్నశిల్పాన్నే ధ్వనివాదులు హెచ్చరించేది. విశ్వనాథుడు ఒక ధ్వనికి లక్ష్యంగా ''ఓయి బాటసారీ! గ్రామమున సంస్తరములేదు. ఉన్నతపయోధరములు చూచి నిలుతువేని నిలిచి పొమ్ము'' [41] అనేదాన్ని యిచ్చాడు.

దీన్ని చదువుకొని సనాతనులు ముసిముసి నవ్వులు నవ్వుకుంటారు. ఎవరైనా చలంగారి లాగా, ''ఓయి బాటసారీ, ఈ గ్రామంలో వ్యభిచారదోషం లేదు. వర్షంవచ్చేట్లుంది. పండుకోటానికి చాపకూడా దొరకదు. ఎత్తైన స్తనాలనుచూచేవా ఉండిపో'' అని వ్రాస్తే పచ్చిబూతుగా, అసభ్యంగా, ఉందంటారు. నిజానికి నీతి అనే పేరుతో మడికట్టుకొని ఆనందిస్తున్నది ఏమిటి? ''ఓయీ ఇచ్చట ధర్మంలేదు. అందువల్ల దయా దాక్షిణ్యా లుండవు. అయినా బ్రహ్మాండంగా మేఘాలు అవరించా యనుకుంటే ఉండిపో,'' అనేదాన్నేనా? ఎప్పటికీ కాదు. మొదటిదాన్నే అయితే తమ హృదయాన్ని దాచుకోటానికి ఇలా చేస్తున్నారు.

40. Punishment - dreams.

41. పథిక! నాత్ర సంస్తర మస్తి మనాక్ప్రస్తరస్థలే గ్రామే,
ఉన్నతపయోధరం ప్రేక్ష్య పునర్యదివససి త ద్వస.

పచ్చి బూతుగా కనిపించేది అవ్యక్తంలోని ఇష్టం. ఉపబుద్ధిమాత్రం నీతి పేరు పెట్టి నిషేధించటంవల్ల చాపకు సంస్తరం, స్తనాలకు పయోధరం వాడపడ్డాయి. యజ్ఞము వేషువు కనిపించేటప్పటికి ఉపబుద్ధి ఊరుకున్నది. అవ్యక్తంలోని యిష్టం తన అభిప్రాయాన్ని మార్చుకోకుండా ఉపబుద్ధి నిషేధం తప్పించుకొని వెలువడింది. ఇలా నిషేధం తప్పించుకొని రావటంలోనే స్వప్నశిల్పం, ధ్వని శిల్పం ఉన్నాయి.[42]

ఇంతకూ తేలినవిషయం. స్వప్నంలో వేదనలుమారుతాయి. లౌకికంగా భయం కలగవలసినచోట స్వప్నంలో సంతోషం, సంతోషం కలగవలసినచోట దుఃఖం కలగవచ్చును. ఇలాగే కావ్యజగత్తులో కూడా లౌకిక వేదనలు ఆనందంగా పర్యవసించ వచ్చును.

ఇంతవరకూ టూకీగా తేల్చుకున్న లౌకిక సౌఖ్య సూత్రాలు కావ్యానందానికికూడా అన్వయిస్తున్నాయా అని చూడవలసి ఉంది. దీన్ని తేల్చుకోకముందు, కావ్యం వల్ల ఎలా ఆనందం కలుగుతున్నదో విమర్శకులూ ఆలంకారికులూ చర్చించి తేల్చిన విషయాలను కూడ గమనించాలి. అప్పుడే కావ్యానందం లౌకికానంద సూత్రాలమీద ఆధారపడ్డదో లేదో తేల్చుకోవటం సులభం.



అయితే విమర్శకులూ, ఆలంకారికులూ తలా ఒకదారి త్రొక్కారు. ప్రతిదేశంలో ప్రతివిమర్శకుడూ ఈ కావ్యానందంకోసం అన్వేషించాడు. అందరి అభిప్రాయాలనూ ఇక్కడ చెప్పటానికి వీల్లేదు. అందువల్ల ముఖ్యులైనవారి మతాలనే తీసుకొంటాను.

మన దేశంలో పూర్వం వేదాంతం వలెనే[43] చక్కని విమర్శలు బయలుదేరాయి. రసాన్ని గూర్చి వ్రాసిన వారిలో భరతుడు, భట్టలోల్లటుడు. శంకుకుడు, భట్టనాయకుడు, అభినవగుప్తుడు ముఖ్యులు.

---

42. ధ్వని శిల్పాన్నంతా స్వప్న శిల్పానికి ఉదాహరణగా ఇవ్వవచ్చును. ''శైవాలంబును సైకతంబు లెదురై చంద్రప్రవాలాంబుజ, గ్రావాకాశ భుజంగకూపములు దూరంబయ్యె.'' ఇలాంటి ధ్వనిలో కూడా స్వప్నశిల్పమే ఉంది. ఇది స్వప్న సంకేతీ కరణానికి లక్ష్యం.

43. తాత్త్విక సిద్ధాంతాలనే మన అలంకారికులు సాహిత్యానికి అన్వయించారు. భట్టలోల్లటుడు మీ మాంసా సిద్ధాంతాన్ని, శంకుకుడు న్యాయాన్ని, భట్టనాయకుడు సాంఖ్యాన్ని. విశ్వనాథుడు అద్వైతాన్ని, రూపగోస్వామి వైష్ణవాన్ని పురస్కరించుకొని సాహిత్యాన్ని గూర్చి చర్చించి రహస్యరూపాన్ని చెప్పారు.

భరతుడు[44] రసాన్ని సాహిత్యానికి అన్వయించి చెప్ప లేదు. నాట్యాన్ని గురించి చెబుతూ చెప్పాడు. ''విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః'' అని సూత్రించాడు. ఈ సూత్రంలోని సంయోగనిష్పత్తులను ఏఅర్థంలో వాడాడో ఎవ్వడూ చెప్పలేదు. (అభినవ గుప్తుడు సహితం తన మతాన్ని భరతున కంటగట్టాడు.) అరిస్టాటల్ వాడిన ''ఇమిటేషన్'' 'కెథార్సిస్' అనే రెండు శబ్దాల అర్థం కోసం యూరిపియన్ విమర్శకులు ఎంత శ్రమపడ్డారో, ప్రాచీన భారతీయ ఆలంకారికులు కూడ అంత తంటాలు పడ్డారు.

రసాన్ని సాహిత్యానికి అన్వయించి చర్చించినవారిలో భట్టలోల్లటుడు మొదటివాడు. ఇతడు మీమాంసకుడు. ఇతని మతం అభినవగుప్తునిచే ఉదాహరింపబడి పూర్వ పక్షం చెయ్యబడింది. అభినవగుప్తుని ఉదాహరణవల్లనే భట్టలోల్లటుని వాదం చూచాయగా తెలుస్తూంది. ప్రత్యేక గ్రంథగతంగా కనిపించటంలేదు.[44a]

అభినవగుప్తుడు చెప్పినదాన్నిబట్టి లోల్లటుని మతం సంక్షేపించి చెప్పాలంటే ఇలా వుంటుంది : స్థాయి మానవుల్లోని వాసన. అనుభావవ్యభిచారాలు వాసనాస్వరూపాలు. విభావం పదార్థాత్మకం; లోకసిద్ధమైన వస్తుస్వభావాన్ని బట్టి స్వరూపసంపాదన చేసు
 కొంటుంది. విభావస్థాయులకు ఉత్పాదక ఉత్పాద్యసంబంధం (జనకజన్య భావం), వ్యభిచారిస్థాయులకు పోష్యపోషక సంబంధం అనుభావస్థాయులకు గమ్యగమక సంబంధం ఉంటుంది. విభావాదుల సంయోగం కలగగానే స్థాయి ఉపచితమై ప్రతీత మవుతుంది. అదే రసం, ప్రతీత మవుతుందంటే విషయీకృత మౌతుందని అర్థం.

ఇలాటి రసం నాయకనిష్ఠం. నాటక ప్రదర్శనంలో నటుని యందు ఈ రసం ఆరోపింప బడుతుంది. దీన్ని సామాజికుడు సహృదయత్వంవల్ల అనుమానించుతాడు (ఊహి స్తాడు.) సామాజికుడు ఇలా అనుమానించేటప్పుడు అహంతను పరిత్యజింపక, రసాన్ని ఆస్వాదిస్తాడు. అప్పటి అతని అహంత కేవల అహంతకాదు; సంవలితమైనది. సామాజికుడు దేశకాలములను మరచిపోయి నాయకమయ లోకంలో విహరిస్తాడు.

నాయకాభేదం సామాజికుడు పొందితే, అతనిలో విరుద్ధములైన భిన్న భిన్న భావాలు కలగటానికి వీలుంది గదా అంటే లోల్లటుడు ఇలా త్రోసివేస్తాడు. రసము నటునియందు

---

44. రసవాదాన్ని లేవనెత్తినవాడు భరతుడు. అంతేకానీ వేదాల్లోనే ఈ రసవాదం ఉందని 'రసోవైసః' అని పండితులు చూపి చెప్పటం సమంజసం కాదు.

44.a. చూడుడు: లోచనము – భరతుని రససూత్రానికి అభినవభారతి వ్రాసిన వ్యాఖ్య.

ఆరోపింపబడినప్పుడు లౌకికాలౌకిక మౌతుంది. అందువల్ల రసము పరిమితాపరిమితం అవుతుంది.

భట్టలోల్లటుని ఉత్పత్తివాదాన్ని తరువాతివారు ఎదుర్కొన్నారు. లోకంలో కారణంవల్ల కార్యం జరుగుతుంది. కారణం పోయిన తరువాతకూడా లోకంలో కార్యం అలాగే నిలిచి ఉండవచ్చును. తాజ్‌మహల్ నిర్మాణానికి షాజహాను కారణం. అతడు గతించిన తరువాత కూడ తాజ్‌మహల్ నిలిచివుంది. అలాగే రస మనేది కార్యమైతే కారణమైన విభావాదులు పోయినతరువాత కూడా రస ముండవలసి వస్తున్నది. కాని యిది అనుభవ విరుద్ధం. అందువల్ల రసము కార్యముకాదు అంటారు.

ఈ పూర్వపక్షం సమంజసం కాదు. విద్యుత్తువల్ల దీపం వెలుగుతున్నది. విద్యుత్తు ఆగగానే దీపం ఆరిపోతున్నది. దీని కేమి చెబుతారు?

విశ్వనాథుని ఆక్షేపణకూడ ఇలాంటిదే, లోకంలో కారణ కార్యాల జ్ఞానం ఒకేసారి కలగటానికి వీల్లేదు. రసాస్వాదన జరుగుతున్నప్పుడు విభావాలు కనిపించగూడదు. కాని విభావాలు గోచరిస్తున్నాయి. అందువల్లనే రసం ఆస్వాద్య మౌతున్నది[45] అంటాడు. పైనిచ్చిన ఉదాహరణమే ఈ అక్షేపణాన్ని పూర్వపక్షం చేస్తుంది.



శంకుకుడు భట్టలోల్లటుని ఇలా ఖండిస్తాడు: అనుపచిత స్థాయిభావము, ఉపచితస్థాయి రసముగదా. అయినప్పుడు ఉపచయ తరతమభావాలనుబట్టి రసంకూడ తరతమ భావాలవల్ల అనంతభేదాలను పొందవలసి వస్తుంది. ఇది రసస్వరూపానికి విరుద్ధ మంటాడు. రసము చర్వ్యమాణమవుతున్నంతకాలం తరతమభావాలు తెలియవు కాని, కావ్యజగత్తునుంచి సామాజికజగత్తులోకి వచ్చి చూస్తున్నప్పుడు రసం అనంత భేదాలతో కనిపిస్తుంది. శంకుకుని అభిప్రాయప్రకారం పొందగూడదు.[46] అంటే కాళిదాసు శాకుంతలంలో చిత్రించిన శృంగారం కాని, ముద్దుపళని రాధికాసాంత్వనములో చిత్రించిన శృంగారం కాని మనుచరిత్రలో పెద్దన చిత్రించిన శృంగారం కాని ఒకటేనా? దీనికి ఎవరొప్పుకుంటారు?

---

45. సాహిత్యదర్పణం, తృతీయ పరిచ్ఛేదం.

46. క్రోచే తన Esthetics లో ఇలాగే వాదిస్తాడు. కావ్యాలంతా ఒకటే. ఒకటి ఎక్కువదికాదు, ఒకటి తక్కువదికాదు. షేక్స్పియర్, మిల్టన్, కీట్సు, షెల్లీ, బైరన్ల కావ్యాలు ఒక్కటే. ఒకటి ఎక్కువ కాదు. ఒకటి తక్కువకాదు.

భట్టనాయకుడు లోల్లటుని ఇలా ఆక్షేపించాడు: విభావాలు వాస్తవమైనవికావు. అందువల్ల వాస్తవము కాని కారణాలవల్ల వాస్తవమైన రసకార్యం ఎలా జరుగుతున్నది? చీకట్లో త్రాడును చూచి పామనుకొని భయపట్టం లేదా? మిథ్యాసర్పంవల్ల వాస్తవమైన భయం ఎలా కలుగుతున్నది?

అసలు భట్టలోల్లటుని మతంలో రసం నాయకనిష్ఠమనటంలోను, అలౌకిక మనటం లోను ఉంది. నిజంగా రసం నాయక నిష్ఠమైతే నాయకుడు ఆనందించాలి. కాని అలాంటిది జరగటంలేదు. పైగా ఈ రసం నటునియందు ఆరోపింపబడ్డప్పుడు నటునికికూడ ఆనందాన్ని ఇయ్యాలి. కాని ఇలాంటిది జరగటం లేదు[47].

ఇక శంకుకుని మతం విచారిద్దాము. ఇతడు నైయాయికుడు. ఇతనిది అనుమిత వాదం, రసము భావపూర్వకం కాదు. రసంలోని అంశాలే భావాలు. రసం భావాల సముదాయం కాదు. రసము ప్రత్యేకమైన విశిష్ఠరూపం. ఇలాంటి రసం సామాజిక నిష్ఠం. విభావానుభావ వ్యభిచారులు రసంలో అనుమాపకాలు. రసం అనుమేయం. స్థాయి
112 అనుమేయమైతే రస మవుతుంది. రసప్రతీతి సమ్యక్ప్రతీతి, మిథ్యాప్రతీతి, సంశయప్రతీతి, సాదృశ్య ప్రతీతికంటే విలక్షణమైనది.

దీన్ని అభినవగుప్తుడు ఇలా ఆక్షేపించాడు : తనకంటే భిన్నుడైన నాయకుని సుఖ దుఃఖాలు సామాజికుని ఎలా అనుమేయాలై ఆనందం కలిగిస్తాయి?[48]

భట్టనాయకుడు సాంఖ్యుడు. ఇతనిది భుక్తివాదం. శబ్దానికి మూడు శక్తులున్నాయి.

---

47. అమెరికాలో ఆధునిక నాటక కర్తలు కొందరు సామాజికుల్ని కూడా నటు లయ్యేట్టుగా నాటకాలు వ్రాశారు. తీరా నాటక ప్రదర్శనంలో సామాజికులు ఆనందించ టానికి బదులు కల్లోలపడ్డారు. మరునాడు పత్రికల్లో విమర్శకలు గోలకెత్తారు.

48. రసో యది పరగతతయా ప్రతీయతే. తర్హి తాటస్థ్యమేవస్యాత్. నచస్వగత త్వేన రామాదిచరితమయా త్కావ్యా దసౌ ప్రతీయతే. స్వగత త్వేనచ ప్రతీతా స్వాత్మని రసోత్పత్తిరే వాభ్యుపగతా స్యాత్. సాచాయుక్తా. సామాజికానాం ప్రత్యవిభావత్వాత్. కాంతాత్వం సాధారణం వాసనాహేతు ర్విభావనాయం ప్రయోజక మితిచే, ద్దేవతావర్ణ నావౌ తదపి కథమ్? నచ స్వకాంతాస్మరణం మధ్యే సంవేద్య తే అలోక సామాన్యానాంచ రామాదీనాం యే సముద్ర సేతుబంధనాదయో విభవాస్తే కథం సాధారణ్యం భజేయుః?

(లోచనము, 67-68.)

1. అభిధ (ఇందులో లక్షణ కూడా వుంది), 2. భావకత్వం, 3. భోజకత్వం. భావకత్వం అంటే సాధారణీకరణం. శబ్దంయొక్క భావకత్వ వ్యాపారంవల్ల విభావాదులు సాధారణీకృతిని పొందుతాయి. శబ్దభోజకత్వ వ్యాపారంవల్ల విభావాదులతో కూడి స్థాయి సాధారణీకృతిపొంది ఆస్వాదింపబడుతుంది. ఇలాంటి స్థాయియే రసం. ఈరసం లౌకికం కాదు. అనుభవం కాదు, స్మృతికాదు; పరబ్రహ్మాస్వాదసవిధం (రసోఽనుభవస్మృత్యాదిలక్షణేన.... శ్రుతివిస్తర వికాసాత్మనా.... పరబ్రహ్మాస్వాదసవిధేన భోగేన -- అభినవ గుప్తుడు).

అభినవగుప్తుడు ''భావకత్వం భావాలలోనే ఉంది. భోగము రసానిది. వీటిని మళ్ళీ చెప్పటం వల్ల ప్రయోజనం లేదు,'' అన్నాడు.

అభినవగుప్తుడు. - ప్రతివాడిలోను పుట్టుకతోనే వాసన లుంటాయి. ఇవి కొందరిలో చక్కగా అభివృద్ధి చెందుతాయి; కొందరిలో అభివృద్ధి పొందవు. లోకంలో కారణంగా ఉండే విభావాలు కావ్యంలో విభావన లౌతాయి; కార్యంగా ఉండే అనుభావాలు కావ్యంలో అనుభావన లౌతాయి; సహకారులైన వ్యభిచారుల కావ్యంలో సముపరంజన చేస్తాయి. ఈ పని సాధారణీకరణంవల్ల జరుగుతుంది. అంటే సాధారణీకృతివల్ల సామాజకునికి ఈ విభావాదులు తనవి, తనవి కావు అనే స్థితినిపొందుతాయి. తాటస్థ్యాదాసీ న్యాదికము గాని, విషయావేశ వైవశ్యాదులుగాని, లేక విభావాదులు ప్రతీతమౌతాయి. 

లౌకికములైన విభావాదులవల్ల అనుమేయమైన స్థాయి భావం సామాజకుని మనస్సులో ఉంటుంది.[49] కావ్యంలో చిత్రింపబడిన విభావాదులవల్ల స్థాయి వ్యంగ్యమౌతుంది. ఇలా విభావాదులవల్ల స్థాయి వీతవిఘ్నంగా ప్రతీతి, లేక అభివ్యక్తిపొందితే రసమౌతుంది. ఈ రసం పరబ్రహ్మాస్వాదనకు సదృశం.

ఆనందవర్ధనుడు ధ్వనికి ప్రాముఖ్యమిస్తే, అభినవ గుప్తుడు రసానికే ప్రాముఖ్య మిచ్చాడు.[50] ధ్వనివాదుల ప్రకారం ధ్వని వస్తుధ్వని కావచ్చును, అలంకారధ్వని కావచ్చును. ఈవాదాన్ని రసవాదంతో సమన్వయింప జూస్తూ అభినవగుప్తుడు వస్త్వలంకార ధ్వనులుకూడ రసంగా పర్యవసిస్తా యంటాడు.[51] ఇది ముందు చెప్పబోయే కారణాలవల్ల సమంజసం కాదు.

---

49. రసనాచ బోధరూపైవ, కింతు బోధాంతరేభ్యో లౌకికేభ్యో విలక్షణైవ, ఉపాయానాం విభావాదీనాం లౌకిక వైలక్షణ్యాత్.

50. నహి తచ్ఛూన్యం కావ్యం కించి దస్తి. రసేనైవ సర్వం జీవతి కావ్యమ్. (లోచనము, 65 పుట)

51. రస ఏవ వస్తుత ఆత్మా, వస్త్వలంకారధ్వనీతు సర్వథారసం ప్రతిపర్యవస్యేతే.

ఇక ప్రాచీనులైన యూరపియన్ విమర్శకుల్లో అరి'స్టాటల్, లాంజైనస్, కూల్‌రిడ్జి ముఖ్యులు, అరిస్టాటల్ అనుకరణ[52] అనేది ప్రకృతిసిద్ధంగా మానవుడిలో వుండే వాసననీ, ప్రకృతిని అనుకరించటమే కల అనీ, ఇలాంటి అనుకరణవల్ల ఆనందం కలుగుతుందనీ అంటాడు. ఇతుడు ట్రాజెడీనిగురించి చెప్పిన విషయాలు చాలవరకు అప్రతిహతంగా ఉన్నాయి.

కూల్‌రిడ్జి కవితా ప్రతిభకు రమణీయార్థం శరీరమనీ, 'ఊహ'[53] ఆచ్ఛాదనమనీ, ఆవేశం జీవమనీ, భావన ఆత్మ అనీ అంటాడు.[54] ఈ భావన తన్ను తాను మరచిపోక భిన్న భిన్న విరుద్ధము లైనవాటికి సమైక్యము గలిగిస్తుంది. సాధారణములైనవి ప్రత్యేక ములతోను. నవ్యములైనవి ప్రాచీనములతోను, స్వాభావికములైనవి కృత్రిమాలతోను భావనాశక్తివల్ల సమన్వయము పొందుతాయి.[55] హ్యూమ్[56] చెప్పినట్లు కూల్‌రిడ్జి ఆస్వాదన అనేది సామాజికుడిలోనే ఉన్నది[57] అంటాడు.

---

52. Imitation. ఈ సిద్ధాంతాన్ని అరిస్టాటల్ ప్లేటో దగ్గరనుండి పుచ్చుకున్నాడు.

53. Fancy.



54. Finally good sense is the body of poetic genius fancy its drapery,emotion its life, and imagination the soul.

55. This power, first put in action by the will and understanding and retained under their irremissive, though gentle and unnoticed, control, reveals itself in the balance or reconciliation of oppisite or discardant qualities of sameness, with difference of the general with concrete, the idea with the image, the individual with the representative, the sense of novelty and freshness with old and familiar objects, a more than usual state of emotion with more than usual order, judgement ever awake and steady selfpossession with enthusiasm and feeling profound or vehement, and while it blends and harmonizes the natural and the artificial, still subordinates art to nature, the manner, to the matter and our admiration of the poet to our sympathy with the poetry.

*- Coleridges's Biographia Literaria*

56, "Beauty is no quality in things themselves; it exists merely in the mind which contemplates them. Humee.

57. O Lady! we receive but what we give
And in our life alone does nature live
..............................................
Ah! from the soul itself must issue forth,
A light, a glory, a fair Luminous cloud

అయితే ఇతడు భావనకు ఈ శక్తి ఎలా వచ్చిందో, భావనా వ్యాపారం ఎలా సాగుతుందో మాత్రం చెప్ప లేదు. ఇతనికీ, మన ఆలంకారికులకూ చాల పోలికలున్నాయి. ఇద్దరూ పద్య కవిత్వానికీ, వచనకవిత్వానికీ ఛందోభేదం తప్ప మరొకభేదం లేదంటారు. ఇద్దరూ భావనకూ ప్రాముఖ్య మిచ్చారు. ఇద్దరూ రసము సామాజికనిష్ఠ మన్నారు.

ఇప్పటి యూరపియన్ సాహిత్య సిద్ధాంతాలు కుక్కగొడుగుల్లాగ చాల మొలుచు కొచ్చాయి. వీటిల్లో మన సాహిత్యానికికూడ అంటుకున్నది అతివాస్తవిక పద్ధతి. ఈ పద్ధతి వారుచెప్పే దేమిటోకూడా చూద్దాము.

అతివాస్తవికులు ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ని పట్టుకొని బయలుదేరారు. స్వప్నశిల్పాన్నే వీరు కవిత్వానికి అన్వయిస్తారు. స్వప్నానికెలాగో కవిత్వానికికూడా అలాగే అవ్యక్తం కారణం. బుద్ధి పూర్వకంగా కవిత్వ మెప్పుడూ రాదని వీరి సిద్ధాంతం. ఉపబుద్ధిచే సంస్కరింపబడని స్వచ్ఛందభావాలు స్వప్నానికి ముఖ్యమైనట్లే కవిత్వానికి కూడా ముఖ్యం. బుద్ధిచేత ఈ స్వచ్ఛంద భావాలు సంస్కరిపంబడగూడదు. సంస్కరింపబడితే కవిత్వం కాదు. స్వప్నంలాగానే కవిత్వం సహేతుకం కాదు, స్వప్నంలో లాగానే కవిత్వం వల్ల ఇష్టావ్యాప్తి బుద్ధిపూర్వికమైనది కాదు. అందువల్ల మన ఆలంకారికులుకాని, ఆధునికవిమర్శకులు గాని చెప్పే శ్రేయస్సు, లేక లోకసంగ్రహం జరుగదు. స్వప్నం ఎలా విచిత్రంగా అద్భుతంగా వుంటుందో కవిత్వంకూడా విచిత్రంగా అద్భుతంగా ఉండాలి. లేకపోతే కవిత్వంకాదు. ప్రతివాడిలోను సఫలీకృతంకాని ఇష్టాలు ఉంటాయి. ఇవే స్వప్నంలో లాగా కవిత్వంలో చిత్రింపబడుతాయి. కాబట్టి అందరికీ కవిత్వం ఆనందమిస్తుంది? ఇదీ వీరిమతం.

నిజానికి ఫ్రాయిడ్ చెప్పేవి చాలవరకు సత్యమే. కాని వాటిని అన్వయించే పద్ధతిలోనే తప్పు ఉన్నది. సైకో ఎనలిస్టులు తమ శాస్త్రార్థాలను ఇతర శాస్త్రకారులు కనుగొన్న విషయాలతో సమన్వయించక తమ పరిశోధనలకే ప్రాముఖ్య మివ్వటంవల్ల ప్రమాదాలు సంభవిస్తున్నాయి. వీరు అన్నింటికీ వాసనా పూర్వకమైన అవ్యక్తమే కారణమంటున్నారు. బాహ్యాజగత్తుకు చోటే యివ్వటంలేదు. మనస్సే ముఖ్యమైతే, మన నాగరికత ఒక్కొక్క

---

Eveloping the earth -
And from the soul itself must there be pent
A sweet and potent voice, of its own birth,
Of all sweet sounds the life and element.

**Dejection, IV -**

యుగంలో ఒక్కొక్క మాదిరిగా ఉంటానికి కారణ మేమిటి? ఆధ్యాత్మికవాదులు పూర్వజన్మ కర్మఫలమంటే, భౌతికవాదులమని చెప్పుకొనే సైకో ఎనలిస్టులు 'కాంప్లెక్సెస్' అంటున్నారు.

ఇదే దోషం అతివాస్తవిక పద్ధతిలో ఉంది. పైగా స్వచ్ఛంద భావాలు నిజంగా స్వచ్ఛందవృత్తి అనుభవించేవి కావు. అవ్యక్తంలోని అసంతుష్టవాసనలు ఎలా ఆడిస్తే, స్వచ్ఛందాలుగా భావింపబడే యీభావాలు అలా ఆడుతాయి. అంటే అతి వాస్తవికులు కూడ ఈ అవ్యక్త అసంతుష్ట వాసనలు ఎలా ఆడిస్తే అలా ఆడుతారన్నమాట. అంతేకాని వీరనుకున్న స్వేచ్ఛనుకూడా వీరనుభవించటం లేదు. వాసనల ఆవశ్యకాలను గుర్తించి తదనుగుణంగా వర్తించటమే స్వేచ్ఛ కాని, వాటిని గుర్తించకుండా అవి ఎలా ఆడిస్తే అలా ఆడటం స్వాతంత్ర్యంకాదు; కేవలం దాస్యమౌతుంది.

అసలు కావ్యజగత్తూ, స్వప్నజగత్తూ ఒకటికాదు, కావ్యజగత్తులో నియతంగా ఆనందం కలుగుతుంది.స్వప్న జగత్తులో ఆనందం కలగాలన్న నియమంలేదు. చాల స్వప్నాలు దుఃఖ కరంగా ఉంటాయి. ఈ భేదం వల్లనే రెండు జగత్తులకూ ఇతర భేదాలు
116 ఏర్పడుతున్నాయి.

స్వప్న జగత్తులో భావాలుగాని, వేదనలుగాని, నిర్దిష్టాలు కావు. కావ్యజగత్తులో ఈ రెండూ నిర్దిష్టాలు, అందువల్ల మొదటి దానిలో సంతోషమో దుఃఖమో ఆనందమో కలిగితే, రెండోదానిలో నియతముగా ఆనందం కలుగుతుంది. బాహ్యజగత్తును కొంతవరకు మరచి వాసనలు స్వప్నజగత్తులో లడాయికి దిగుతాయి. కావ్యజగత్తులో ఈవాసనలు నిర్దిష్టకార్యాలను నిర్వహించి పోతాయి. బాహ్యజగత్తు చాలవరకు విస్మరింపబడి వాసనల ఇష్టాన్ని బట్టి స్వప్న జగత్తు నిర్మింపబడుతుంది. కావ్యజగత్తులో బాహ్యజగత్తు విస్మృతంకాదు. బాహ్యజగత్తును వాసనల కనుగుణంగా మార్చుకోవడమో, మార్చుకోటానికి వీల్లేక పోతే బాహ్యజగత్తుకు అనుగుణంగా వాసనలను మార్చుకోవటానికి యత్నించటమో జరుగుతుంది.

స్వప్నజగత్తు చాలవరకు బాహ్యజగత్తును విస్మరించటంవల్ల బాహ్యజగత్తు జాగ్రదవస్థలో స్వప్నజగత్తును తుడిచివేస్తుంది. అందువల్ల స్వప్నజగత్తుకు బాహ్యకృతి లేదు. కావ్యజగత్తు బాహ్యజగత్తును విస్మరించదు; కాబట్టి బాహ్యజగత్తులో స్థానం సంపాదిస్తుంది. అందువల్ల కావ్యజగత్తు సృష్టిస్తుంది; స్వప్న జగత్తు చేయ్యలేక పోతూవుంది. బాహ్యజగత్తులో ఎప్పుడు స్థానం సంపాదించిందో కావ్య జగత్తు సమాజంలో విలువ సంపాదించి సరకుగా తయారవుతూవుంది. స్వప్నజగత్తుకు ఇలాంటిది లేదు.

---
జి.వి.కృష్ణరావు

కావ్యజగత్తు ''సకలసహృదయ హృదయసంవేదన సాక్షికం'' బుద్ధిని, ఉపబుద్ధిని అతిక్రమించి అవ్యక్తవాసనలకు 'అపీలు' చేస్తుంది. స్వప్నజగత్తు అలాకాక అవ్యక్త అసంతుష్టి వాసనలనుండి బయలుదేరి ఉపబుద్ధి ఆజ్ఞలకు లోబడి నిలిచిపోతుంది.

కావ్యజగత్తులో వేదనలు తీవ్రతమరూపాలు వహిస్తాయి. స్వప్నజగత్తులో ఇలాంటిది జరిగితే స్వప్నమే ఉండదు. కావ్యజగత్తులోని వేదనలు ఆనందంగా పర్యవసించటంవల్ల కావ్యజగత్తు భగ్నంకాదు. దీనికి షేక్స్పియర్ వ్రాసిన విషాదాంతనాటకాలు, భారతంలోని స్త్రీ పర్వం, రఘువంశంలోని అజవిలాపం, రామాయణంలోని ఉత్తరకాండము, భవభూతి ఉత్తరరామచరిత నిదర్శనాలు.

ఈ కారణా లన్నిటివల్ల, కాడ్‌వెల్ అన్నట్లు,[58] స్వప్నజగత్తును తలక్రిందులుచేస్తే కవిత్వం అవుతుంది. ఈ విషయం నిర్మాణంలో కాని, ఆదర్శంలో కాని కవిత్వానికి వ్యతిరేకం. అందువల్లనే కవిత్వం సామాజికంగా ఉంటే, స్వప్నం వ్యక్తిగతంగా ఉంది.

ఇంతకూ ఈ పర్యాలోకనంతో ఏమి తేలుతున్నది? కావ్యానందం అలౌకికమా, లౌకికమా? ఇప్పటికి తేల్చుకున్న విషయాలతో జోడించి నామతంకూడా చెబుతాను, దానితో విషయం తేలుతుంది.

వాసనావిశిష్టమైన సామాజికజీవి యగు మానవుని మనస్సులో జీవయాత్రానుభూతి స్మృతిపథంలో నిలిచి ఉంటుంది. అంటే, బాహ్యమైన సామాజిక జగత్తు, దాని వల్ల అతనికి కలిగే వేదనలు స్మృతిపథంలో ఉంటూవుంటాయి. జననమరణాలు, వియోగాలు, ఉషాసా సూర్యచంద్రుల సౌందర్యం, పూవులవాసనలు, రంగులు, సమాజంలో బయలుదేరే సంఘర్షణలు మొదలైనవి. వానివల్ల కలిగే వేదనలూ మానవుని మనస్సులో నిలిచి ఉంటాయి. మానవుడు సామాజిక జీవిగా ఉంటూ ఉన్నప్పుడు సామాజిక శబ్దంకూడా అతనిలో జీవిస్తూవుంది.

సమాజంవల్ల జీవిస్తున్న శబ్దంద్వారా కావ్యజగత్తు సమాజంద్వారా సంపాదించిన అనుభూతిని చిత్రిస్తుంది. సామాజిక జీవియైన పాఠకుడు కావ్యజగ్తులో చిత్రింపబడిన అనుభూతికి అందుబాటులో ఉంటే కావ్యజగత్తులోకి వస్తాడు. అంటే పాఠకుని మనస్సులో దాగి ఉన్న ప్రత్యక్షాంశాలు, వేదనలు కావ్యజగత్తు సూచన ప్రకారం

58. "Poetry is kind of inverted dream."
Illusion and Reality. P. 240

ప్రస్తరిల్లచూస్తాయి. మనస్సు అడ్డు పడకపోతే, అంటే మనస్సుకు కావ్యజగత్తు సూచించే అనుభూతి ఇతః పూర్వకంగా గాని, సంభావ్యంగా గాని కనిపిస్తే పాఠకుని మనస్సు కావ్యజగత్తులోకి వస్తుంది. కాబట్టి కావ్యజగత్తు పాఠకుడికి ఇతఃపూర్వకంగాగాని, సంభావ్యంగాగాని ఉండాలి.

ఇలా కావ్యజగత్తును అర్థం చేసుకోవాలంటే పాఠకుని అన్ని వాసనలూ అభివృద్ధి చెందాలి. వాసనలన్నీ చిన్న తనంలోనే అభివృద్ధికావు. ఉదాహరణగా రతిని తీసికొందాము. ఇది పిల్లల్లో ఫ్రాయిడ్ చెప్పినట్లు బీజరూపాన ఉన్నప్పటికి పక్వమైన స్థితిలో ఉండదు. అందువల్ల పిల్లలు శృంగారానుభూతిని ఆస్వాదించలేరు.

ఈ సందర్భములో శాస్త్రకారుల ప్రకృతులనుగూర్చి కూడకొంత చెప్పుకోవలసి ఉంటుంది. శాస్త్రకారులెప్పుడూ వేదనలను సాధ్యమైనంతవరకు దమించుకొని సత్యంకోసం అన్వేషిస్తుంటారు. ఎంతసేపటికి హేతు హేతువుద్భావం కోసం వెదకుతూవుంటారు. ఉదాహరణకు :-



''సనకాది దివిజమస్కరిఫాలగోపీచం
దనపుండ్రవల్లిక ల్నాకి నాకి,
సెలసి హాహాహూహువుల దండియల తంత్రి
ద్రెవ్వ సింగిణులుగాఁ దివిచి తివిచి,
సప్తర్షికృత వియజరవాలుకాలింగ
సమితి ముచ్చెలకాళ్ళఛ జమరి చమరి,
రంభాప్రధానాప్సరఃపృథూరోజకు
కుంభంబు లెచ్చటగన్నఁ బట్టిపట్టి,
తిరుగు హరిపుర సురతరుసరల మరగి
బహుళహాళహాళి భరితకల్బరిగనగర
సగరపురవరపరిభృఢజవనయవన
పృతన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ!'' [59]

అన్న పద్య చదివినప్పుడు వీరికి నవ్వురాదు, భౌతిక శరీరం త్యజించినతరువాతకూడా ఇలాంటి ప్రకృతి ఎలా వుంటుంది? మహమ్మదీయ సైనికులు చచ్చి హిందువుల

59. ఆముక్తమాల్యద, ప్రథమాశ్వాసం: 41

స్వర్గంలోకి వెళ్ళినట్లుందే అని పెదవి విరుస్తారు. అందువల్లనే ప్రాచీనాలంకారికులు శాస్త్రకారులను, ముఖ్యంగా మీమాంసకులను సభలోని స్తంభకుడ్యాలతో పోల్చారు.

పాఠకుడు కావ్యజగత్తులోకి వచ్చినప్పుడు, సామాజిక జగత్తులో ఏవేవి యేయే వేదనలు కలిగిస్తాయో, కావ్యజగత్తువల్ల, కూడ ఆయా వేదనలు రేకత్తుతాయి. అయితే యీవేదనల స్వభావాలు స్వప్నంలో లాగానే తలక్రిందులౌతాయి. కావ్యజగత్తులో ఈ వేదనలన్నీ ఆనందంగా పర్యవసిస్తాయి. ఇది ఎలా జరుగుతుందో చెప్పుకోవాలి.

దుస్స్వప్నంవల్ల మేల్కొన్న తరువాత ఆనందం కలుగుతుంది. త్రాడునుచూచి పామనుకొని భయపడ్డసంగతినితలుచుకొని నవ్వుతాము. ఆప్తుల మరణం జ్ఞప్తికి వచ్చినప్పుడు ఒకొకప్పుడు మన హృదాయాన్ని శోకం తాకదు. మనం పిల్లల ఆట చూస్తూవుంటామనుకోండి. ఆడేవాళ్ళకు చిన్న చిన్న దెబ్బలు తగులుతూ వుంటాయి. వారిలో కొంత ఆవేశం పెరుగుతూవుంటుంది; కొద్దిగా కోపం, పట్టుదల హెచ్చుతూ వుంటాయి. అలాంటప్పుడు మనం కోపంగాని, ఆవేశంగాని, లేక ఆనందించటం సంభవిస్తుంది. ఈ సందర్భాల్లో ఆనందం ఎలా కలుగుతున్నది?

కావ్యజగత్తులోకూడ పై విధంగానే ఆనందం కలుగుతున్నది. అంటే పాఠకుడు కావ్యజగత్తులో లీనమయ్యీ కాని స్థితిలో వుంటాడు. ఇలాంటిస్థితే వేదనలనన్నింటిని ఆనందంగా పర్యవసింపజేస్తుంది. అంటే మన ఆలంకారికులు చెప్పినట్లుగా వేదనలు సాధారణీకృతి పొందుతాయి. ఆ సాధారణీకృతివల్ల పాఠకునికి యీ వేదనలు తనవి తనవికావు, ఇతరునివి ఇతరునివి కావు అన్నట్లుగా ఉంటాయి. ఇలా వుండటంవల్ల సమ్యక్ప్రతీతి, మిథ్యా ప్రతీతి, సంశయప్రతీతి, సాదృశ్యప్రతీతికంటె విలక్షణంగా ఉంటాయి. అందువల్ల సుఖకరంగానో, దుఃఖకరంగానో ఉంటానికి బదులు ఆనంద ప్రదంగా ఉంటాయి. ఈ ఆనందం నిర్లిప్తం. మనకు లోకంలో సాధారణంగా కలిగేది లిప్తమైన సంతోషము.

ఈ విషయం సామాజిక జగత్తులో కలిగే శృంగారాదులకు సంబంధించిన భావాలవల్ల తేటపడుతుంది. ముఖ్యంగా హాస్య సంబంధియైన భావాలు ఈ విషయాన్ని స్పష్టీకరిస్తాయి. మనం కోపంతోగాని, జుగుప్సతో గాని, అలక్ష్యంవల్లగాని, ఇతరుడు అల్పుడనిగాని, మనం ఇతరుని కంటె అధికుల మనిగాని, ఇతరుడు పొరపాటుపడ్డాడని కాని నవ్వవచ్చును. ఇంకా చాలా కారణాలవల్ల నవ్వు కలుగుతుంది. కావ్యజగత్తులో హాస్యంలో ఇలాంటిది ఉండదు. నిర్లిప్తంగా ఉంటుంది. అంటే కావ్యగత హాస్యంలో

క్రోధం జుగుప్స మొదలైనవి ఉండవు. ఇతరులతో కలసి నవ్వుతాము కాని ఇతరులను చూచి నవ్వం.

ఇలాంటి నిర్లప్తతే కావ్యజగత్తుకు ముఖ్యం. ఈ నిర్లిప్తత లేకపోతే కావ్యజగత్తుకాదు. ఇది ప్రతిపాఠకుడూ గమనించి తీరాలి. ఈ నిర్లిప్తతే ఆనందమిస్తుందని మనస్తత్త్వశాస్త్రం నిరూపిస్తుంది.

ఎల్లిక్ అనే మనస్తత్త్వశాస్త్రకారుడు ఇలా వ్రాస్తున్నాడు:

"What is no doubt true is that in the aesthetic experience the distinction between the self and its object in, while not wholly lost, yet at a minimum. We give ourselves to the odjection in contemplation and do not distingish clearly between our own feeling and that which is thought to be suggested by the object ....... Nevertheless the consciousness of the subject object relation cannot, be entirely lost. and in so far as it exists, it is we who seem to be receiving from the object and not vice versa" [60]



ఈ విషయాన్నే సైకాలజీ ప్రొఫెసర్ అయిన శ్రీమతి దేవీ కన్య ఇలా వ్రాస్తూవుంది.

"Bullough used the expression psychical distance as a figurative description for all manner of ways by which personal experience may be projected and made asthetically valid.... Distance does not imply an impersonal purely intellectually interested relation such as that of the scientists. On the contrary, it describes a personal relation, often highly emotionally coloured, but of a peculiar character. Its peculiarity lies in that the personal character of the relation has been, so to speak filtered. It has been cleared of the practical concrete nature of its appeal without however thereby losing its original constitution. The artist may "under-distance" or "over-distance" - the verdict in the case of under-distancing is that the work is "crudely naturalistic, harrowing." "repulsive in its realism". An excess of distance produces the impression of imporbability, artificiality emptiness or absurdity." [61]

బర్గ్సన్ హాస్యరసాన్ని గూర్చి చర్చిస్తూ యిలా వ్రాశాడు :

60. Pleasure and Instinct, P-230.

61. Creative Imagination.

''తాను తాను కానట్లుగా అనిపిస్తుంది; కాని తాను ఇంకొక డౌతాడు. తాను తానే, తాను తాను కాదు. తాను మాట్లాడటం తాను వింటాడు, తాను ప్రవర్తించటం తాను చూస్తాడు. కాని ఇంకొకడు తన శరీరాన్ని గొంతును, అపహరించునట్లుగా తనకు కలుగుతుంది. అలా కాకాపోతే బహుశః మామూలు ప్రకారం తాను మాట్లాడుతాడు ప్రవర్తిస్తాడు; కాని తన్ను గూర్చి తాను, తనతో సంబంధంలేని క్రొత్తవాడి మాదిరిగా మాట్లాడుతాడు. తనలోనుండి తాను బయటికి వెళ్ళిపోతాడు. హాస్యవంతమైన అనేకరంగాల్లో ఇలాంటి భ్రమనే చూస్తున్నట్లుండదా?''[62]

వర్డ్స్వర్త్,[63] కీట్సు, టాల్ స్టాయిలుకూడా కవిత్వానుభూతి జ్ఞప్తికివచ్చిన అనుభూతిలాగా ఉండాలన్నారు. అర్నాల్డు మొదలైన ఆంగ్ల విమర్శకులు కవిత్వానికి ముఖ్యమని చెబుతూ వచ్చిన 'రిస్ట్రెయింట్' ప్రయోజనం కూడ లీనాలీనావస్థ కల్పించటమే.

ఇలాంటి లీనాలీనావస్థ, నిర్లిప్తానుభూతి కలుగుతున్నది కాబట్టే మన కన్యాశుల్కం, ఇబ్సన్‌కవినాటకాలు, యానటోల్ ఫ్రాన్సురచనలు, టాల్‌స్టాయ్, టర్గనీవ్ డాస్టవాస్కీ, మాల్‌రా, జోలాల నవలలు, మపాసా, ఓ హెన్రీ, చకోవ్, టాగూర్ల కథలూ కావ్య జగత్తులోవి. 121

చలంగారి కథలు, తారాశశాంకము, చంద్రరేఖావిలాపము, రాధికాసాంత్వనము, జాయిస్ వ్రాసిన యులిసిస్ కావ్యజగత్తులోకి రావు చలంగారు తమ్ముతాము మరచి 'రిస్ట్రెయింట్' లేకుండా వ్రాసే రచనలు చాలా వున్నాయి. 'బ్రాహ్మణీకం' లోని కొన్ని భాగాలు, 'మైదాన'మంతా ఈ విషయాన్ని సూచిస్తున్నాయి. కవే తన్ను తాను మరచిపోయి వ్రాస్తూవుంటే పాఠకుడు తన్ను తాను పూర్తిగా మరచిపోవటంలో ఆశ్చర్యంలేదు. అందువల్ల చలంగారు చిత్రించే శృంగారం పాఠకుని ఆస్వాదనలో ప్లెటానిక్ ప్రేమగా పర్యవసించటం లేదు. వీరి రచనలవల్ల కేవలం లిప్తమైన సంతోషం కలుగుతున్నది కాని ఆనందంమాత్రం కలగటంలేదు.

కొంతమంది విమర్శకులు చలంగారి రచనల్లో నీతి లేక పోవటంవల్ల ఇవి కావ్యజగత్తులో చేరడం లేదంటారు. ఇంతకన్నా పొరపాటు వేరేలేదు. చలంగారి రచనల్లో నీతి ఉంది. ప్రతి రచనలోనూ ఇది అడుగడుక్కీ తగులుతూ వుంటుంది.

---

62. Laughter, P - 191.

63. Poetry is emotion recollected in tranquility.

యులిసిస్‌ను లోకోత్తరకావ్యంగా పొగడుతూ వున్నారు. దీన్ని చదివి పొగడేవాళ్ళకు నిర్లిప్తిసుఖం, అంటే ఆనందం, కలుగుతున్నదా? యులిసిస్‌లోని నాటకంలో కొంతభాగం తప్ప మరేభాగమూ ఆనందాన్ని యివ్వటంలేదు. ముఖ్యంగా 'మిసెస్‌బ్లూమ్' స్వగతం ఎదురు తన్నుతూ వుంది. జాయిస్ వ్రాసిన యులిసిస్ వల్ల మొత్తం మీద సంతోషం మాత్రమే కలుగుతూవుంది. ఇదికూడా ''ఎంత నేర్పరితనం చూపెట్టాడు!'' అని విస్తుపోవటం వల్లనే. అంటే.

''రాజనందనరాజ రాజాత్మజులు సాటి
తలఁప నల్లయవేమ ధరణిపతికి [64]
అనే పద్యంలాంటిదాన్ని కాని,
''కుజము కుంజరముచేఁ గూలునో కూలదో
కూలుఁ గుంజరము నీ కుజము గూల్చి''[65]

అనే పద్యాన్ని కాని చదివితే కలిగే సుఖమే కలుగుతుంది కాని, పాఠకునికి తన్ను తాను మరచీ మరచిపోని అవస్థ కల్పించి తద్ద్వారా ఆనందం కలిగించటం లేదు.



జాయిస్ రచనలు కవులకు నూతనపంథా చూపించవచ్చును. నిజానికి చూపించాయి కూడాను. అంటే సాహిత్యచరిత్రలో కొంతవరకు జాయిస్ రచనలతో నూతనాధ్యాయం ప్రారంభమైంది. అయినా జాయిస్ రచనలు కావ్యజగత్తులోవి కావు. ఇతని యులిసిస్ పంథాలో నడిచిన వర్జీనియా వుల్ఫ్ నవలలు కావ్యజగత్తులోనివి.

కేవలం 'జర్మన్ బ్లిట్స్‌క్రీగ్' పద్ధతిని పల్లిటీలు కొట్టినంత మాత్రన సాహిత్యం కాదు; జిల్లీ తోటాలగోల సాగించటం సాహిత్య లక్షణం కాదు. పాఠకుడికి లీనా లీనావస్థ కల్పించి ఆనందాన్ని యివ్వాలి.

పాఠకునికి తన్మయావస్థ కల్పించటంవల్లనే థామస్ హార్డీ వ్రాసిన 'జూడ్ ది అబ్స్క్యూర్' లోని కరుణం ఎదురు తన్నుతూ వుంది. ఈ నవల్లో చివరిభాగంలోకి వచ్చేటప్పటికి పాఠకుని మనస్సు ఎసరులాగ మసలు తుంటుంది. జూడ్ మృత్యుశయ్యపై నుండి.

"Let the day perish wherein I was born, and the night in which it was said, there is a man child conceived." "Let that day be darkness; let not God regard it from above, neither let the light shine upon it. Lo, let that night be solitary, let no joyful voice come therein.

---

**64.** శ్రీనాథుడు.

**65.** ఉత్తర హరివంశం, ద్వితీయాశ్వాసం.

"Why died I not from the womb? Why did I not give up the ghost when I came out of the belly? ....... for now should I have lain still and been quiet, I should have slept: then had I been at rest.!"[66].

అని ప్రార్థిస్తూవుంటే ఘోరంగా వుంటుంది. జూడ్ యిలా వుంటే అతని ధర్మపత్ని నడత ఆసందర్భంలో చాలా జుగుప్సాకరంగా వుంటుంది. హార్డీ చిత్రించిన అనుభవం యాథార్థమే కావచ్చును.దాన్ని నేను ప్రశ్నించంలేదు. కాని హార్డీ చిత్రించే విధానాన్నే నేను ప్రశ్నిస్తూవున్నాను. నిజానికి షేక్స్పియర్ ''హామ్లెట్'' లో చిత్రించిన 'పెస్సిమిజం' కంటె హార్డీ ఎక్కువ పెస్సిమీజాన్ని సృష్టించ గలిగాడా!

ఇలాంటి ఆస్వాదనధ్వంసకమైన పెసిమిజమ్ ''ముఖ్యంగా ఆధునిక యూరపియన్ రచయితల్లో పుష్కలంగా వుంది. కవి తన అనుభవాన్ని చిత్రింపగూడదని కాదు. తన అభిప్రాయాలను చెప్పగుడదనికాదు. చిత్రించే విధానాన్ని నే నెద్కుంటున్నాను.

పాఠకుని లీనాలీనావస్థను చెడగొట్టి ఏవగింపజేసేవి ఆధునికుల రచనల్లో చాలా కనిపిస్తున్నాయి. రూపర్టు. బ్రూక్ వ్రాసిన ''ఛానల్ పాసేజ్'' ఒకటి. మన తెలుగులో 'రసినిండిన పుండులో శస్త్రము గ్రుచ్చినట్లు నవ్వితివి'[67] అనేది. ''నా, కాయము సర్వమున్ జనసకాయ వలెన్ బులకల్ ఘటిల్లనో'[68] అనే చరణం, ''కనులు రెండును బండిచక్రమ్ములయ్యె;'' అనేది ''వందగ జయాన పండుకొని వూధవ రాధిక వేపమానయై,'' అనేది పాఠకుణ్ణి చీకాకు పరుస్తాయి. ఇలాంటివి ఎవ్వరి కసహ్యాలు కావు?

మన ప్రబంధకవులకంటే పచ్చిబూతులను ఎవ్వడూ వ్రాయలేడు. అయినా యీ పచ్చి శృంగారవర్ణనలు ముఖ్య ప్రబంధాల్లోనివి పాఠకుని లీనాలీనావస్థను చెడ గొట్టటం లేదు.

''పతిపాణి పల్లవచ్యుత నీవిబంధన
వ్యగ్రబాలాహస్త వనరుహంబు''[69] అనేది కాని,
''తొంగలిఱెప్పల తుదలు గైవ్రాలినఁ
గొసరుఁ జూపులయందు మిసిమిదోఁప''[70] అనేది కాని,

---

66. Jude the Obscure, Book VI Chapter II.

67. వేనరాజు 68. వేనరాజు.

69. శ్రీనాథుడు 70. జక్కన

''సహసానఖంపద స్తనదత్తపరిరంభ
మోహమూలపరిచుంబితాధరోష్ఠము''[71]

అనేది కాని అసభ్యంగా ఉన్నాయా?

సంభోగానంతరం శయ్యనుంచి లేచే నాయికను వర్ణించి పింగళి సూరన ఎలా ఆనందం పరిగిస్తున్నాడో చూడండి :

''అంతఁ గామిని కన్ను లరవిచ్చి సురత సం
క్షుభితవేషము పతి చూడకుండఁ
పనదు చెక్కిలి మొగంబున కడ్డముగఁ జేర్చి
పొరిఁబొరి నది దానఁ బులకితముగఁ
గెంగేల నతని కౌఁగిలి యాగి యొడగొంచుఁ
జేలాంచలము పెఱచేతఁ దడవి
తెచ్చి పాలిండ్లమీఁదికిఁ జొనుపుచు నితం
బావృత్తి యరసి రెండవ చెఱంగు.
కటితటం బెత్తియెత్తి క్రిందటికిఁ బరపి
లోనుగా దానిపై యంచుతో నమరఁగఁ
బొక్కిలిగదించిపట్టి మూఁపున నరవిరి
వదలుతురు మానుకొనుచు లేవంగఁగడఁగె'' [72]

తిక్కన రావణునిచేత 'తామ్రచూడ లీలాచతురానంగ క్రీడాసంగతి నెంగిలి కావింపబడిన' రంభను వర్ణించాడు:

''పగరాజు పై వచ్చి బలువిడి బరిభవిం
పినఁ దలంకిన పురశ్రీవిధమున

---

71. పెద్దన

ఈ పద్యాలు క్లాసులో చెప్పుకోవటానికి అసభ్యంగా ఉంటా యంటారు. ఔను, త:పద్యాల్లోని శబ్దజాలాన్ని మామూలు మాటల్లోకి మార్చగూడదు. మార్చకుండా వుండాలనే కవుల అభిప్రాయం. మార్చవచ్చునని కవి హృదయమేని సాధారణపదాల్లోనే వ్రాసి ఉండేవాడు. అప్పుడీ భావాన్ని ఇంకోవిధంగా చిత్రించవలసి ఉండేది.

72. ప్రభావతీ ప్రద్యుమ్నము 5.53 (తెలుగు)

సమదద్వీపము కేళిసలిపినఁ జాల న
 లంగిని యుద్యానలక్ష్మి కరణి
ఘనలులాయము సాచ్చి తనయిచ్చ నాడినఁ
 గలగిన నెత్తమ్మికొలనిభంగి
గడుబెట్టిదపుగాలి సుడిసిని నెఱిదప్పి
 తిరిగిన మవ్వంపుఁ దీఁగెమాడ్కి
మున్ను గ్రాసేసి యలవడ్డ చెన్ను దప్పి
యెలమిఁ బ్రియుపాలి కేగెడి లలి యడంగి
వేఱచందమై యెంతయు విన్ననయ్యె
నసుర గారించి విడిచిన నమ్మృగాక్షి.'' [73]
ఇంతటిలో వూరుకోడు. తరువాత రంభ ఎలా వెళ్ళిందో వర్ణించాడు :
''వెల వెలఁబాఱుచుఁ గొంకుచు
దలరుచు నడఁ దొట్రుపడుచు దలఁకుచుఁ దనలోఁ
బలుకుచు నెడనెడ నిలుచుచు
నలకూబరుకడకు నింతి నలఁగుచుఁ జనియెఁ.'' [74]



దీనివల్ల పాఠకుడు లీనమైపోవటం కాని, పరాఙ్ముఖుడై పోవటం కాని జరుగుతున్నదా?

కాబట్టి ఆనందప్రదంగా లీనాలీనవస్థను పాఠకుడికి ఏర్పడేటట్లు చేయ్యటానికి కవి తన అనుభూతిని మార్చుకోనవసరం లేదు. అతడు చిత్రించే విధానంలో ఉంటుంది.

ధ్వని పాఠకునికి లీనాలీనావస్థ కల్పిస్తుందని ధ్వనివాదుల నమ్మకం. అభినవగుప్తుడు కూడ తల ఊపాడు. అందువల్లనే ధ్వనివాదులు ధ్వని కావ్యాత్మ అన్నారు. శ్రీరంగం శ్రీనివాసరావుగారి 'అభిసారిక కడసారి' అనే పద్యం ధ్వని ప్రధానంగా వుందికదా! దీనికన్న జుగుప్సాకరంగా మరొక రచన వుందా?

ఇంతకూ వాస్తవికభ్రాంతి, అంటే పాఠకునకు తనది

తనది కాదు, పరుని పరునిది కాదుగా కావ్యజగత్తు ఉంటుంది, అయితే కావ్యానుభూతి పాఠకునికి తనదిగా ఎప్పుడుంటుంది? తనది ఔను, కాదుగా ఎప్పుడుంటుంది?

---

73,74 నిర్వచనోత్తర రామాయణం, 6-7575 (తెలుగు)

కావ్యంలో చిత్రింపబడే అనుభూతి పాఠకుడికి సన్నిహితంగా ఉండాలి. అనుభూతిని చిత్రించేశబ్దాలు సన్నిహితంగా ఉండాలి. ఈ విషయాన్నే శబ్దశాసనుడు 'స్వస్థాన వేషభాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః''[75] అని చెప్పాడు. శబ్దాలుగూడ సన్నిహితంగా వుంటే పాఠకుడు త్వరగా లీన మౌతాడు. అందుకునే నేటికవులు వ్యావహారికి భాషను వాడుతున్నారు.

తనది ఔను, కాదు అనే స్థితిని కలిగించటానికి కవి పాఠకునకు సన్నిహితంగా చేయబడ్డ తన అనుభూతిని కొంత అద్భుతం కలిగేటట్లు చిత్రిస్తాడు. అంటే అలౌకిక విషయాలను అనుభూతితో జతపరచాలని కాదు. అనుభూతిని చిత్రించే విధానంవల్ల కొంత చమత్కారం లేక విస్మయం కలిగేటట్లు చేస్తాడు. ఇలాంటి అద్భుతమే లీనా లీనావస్థకు ముఖ్య కారణం. అందుకనే విశ్వనాథుడు అన్ని రసాల్లోనూ అద్భుత ముంటుందన్నాడు.[76] ఈ అద్భుతమే శృంగారాది అన్నిరసాలకూ ముఖ్యం. లేకపోతే సంతోషమో, దుఃఖమో కలుగవచ్చునుకాని, ఆనందం కలగటానికివీల్లేదు. ముఖ్యంగా కరుణరసంలో ఈ అద్భుతం లేకపోతే రసమే కాకపోతుంది. అందుకనే అరిస్టాటల్ విషాదాంతనాటకాన్ని గూర్చి వ్రాస్తూ, ఉత్తమప్రకృతి గల నాయకునిలో అల్పదోష ముండాలన్నాడు. (దీన్నే ట్రాజిక్ ఎమర్షియా అంటారు). దీనికి తోడు 'లిరిసిజం' ఉండాలన్నాడు. ప్రాచీన విషాదాంత నాటక కర్తలు ఈ అద్భుతం కోసం అలౌకికత్వం, అంటే 'సూపర్ నాచురలిజం' ప్రవేశపెట్టేవాళ్ళు. ఆధునికులు ఈ అలౌకికత్వాన్ని విడిచి అద్భుతంకోసం ఏమేమి చేస్తున్నారో నికాల్[77] చక్కగా చూపించాడు. అద్భుతం తరువాత హాస్యానికి కూడా ఈ విస్మయగుణం ఉంది. అద్భుతం చేసే పని కొంతవరకు ఈ హాస్యం చేస్తుంది.

షేక్స్పియర్ తన విషాదాంత నాటకాల్లో ఈ అద్భుతాన్ని హాస్యాన్ని కరుణంతో కలిపాడు కాబట్టే అవి ఆనందప్రదంగా ఉన్నాయి. హార్డీ తన 'జూడ్ ది అబ్ స్క్యూర్' లో ఈపని చెయ్యలేదు. కాబట్టే అది కావ్యం కాకపోయింది. చలంగారి కథల్లో ఈ అద్భుతం లేకపోబట్టే అవి సంతోషప్రదంగా ఉన్నాయి గాని, ఆనంద ప్రదంగా లేవు.

ఇరవయ్యో శతాబ్దిలో ప్రబలిన 'ప్రాబ్లం–ప్లేస్'లో అద్భుతం కొంత ఉంటున్నది. పైగా సిద్ధాంతాలను చర్చించేటప్పుడు చాల వరకు భిన్నమతాలుకూడా చర్చింపబడు

---

75. ఆంధ్రశబ్ద చింతామణి.

76. సాహిత్య దర్పణము, 3వ పరిచ్ఛేదము.

77. Theory of Drama,

తాయి. అందువల్ల పాఠకుడు విముఖుడు కాడు. దీనికి తోడు హాస్యముంటుంది. షా తన నాటకాల్లో ఈపని చేశాడు. పైగా సిసింద్రీలాంటి చతురోక్తి ప్రతిచోట తాండ విస్తుంది. అందువల్ల షా నాటకాలు తృప్తికరంగా ఉన్నాయి. ('షా'కు డైనమిక్ విట్ లేకపోతేనా – ఏ మయ్యేవాడో అన్నాడు ఆర్చర్.)

విశ్వనాథ సత్యనారాయణగారు 'వేయిపడగ' ల్లో ఇలాంటిది చేయలేదు. ప్రతిచోటా శాస్త్రీయ జ్ఞానలోపం పాఠకుడికి గోచరిస్తుంది. పైగా సామాజిక సమస్యలను చర్చించేటప్పుడు భిన్నాభిప్రాయాలను పాత్రలచేత చర్చింపించరు. ఒకవేళ పాత్రలు ఇతర అభిప్రాయాలను ఎత్తుకొన్నా, ఆయా మతాల్లోని దుర్బలాంశాలనే ఎత్తుకుంటాయి. ముఖ్యాంశాలను, వీరు గుర్తించక పోవటంవల్ల గాని, వీరి సిద్ధాంతాన్ని కూలద్రోస్తూ వుంటంవల్లగాని, ఎత్తుకోరు, అదేపనిగా సనాతన ధర్మాన్ని గూర్చి ఉపన్యాసాలు బనాయింపిస్తారు. దీనివల్ల సనాతనుడు కాని పాఠకునికి అసంతృప్తి, పరాఙ్ముఖత్వం కలిగిస్తాయి. పైగా 'షా' కు ఉన్న సర్వతో ముఖమైన చతురోక్తిలేదు. అందువల్ల వీరి 'వేయిపడగల'ను సాంతంగా చదివే వాళ్ళుకూడా అరుదు. సనాతనుడైన పాఠకునికికూడా కలిగేది సంతోషమేకాని ఆనందం కాదు.



కాగా, కావ్యజగత్తూ, సామాజిక జగత్తూ ఒకటే ననీ, సామాజిక జగత్తునుంచే కావ్యజగత్తు ఉత్పన్నమవుతున్నదనీ, లౌకికమార్గాలనే కావ్యజగత్తు నియతంగా ఆనంద ప్రదంగా చిత్రింప బడుతూవుందనీ, ఇలా చెయ్యటంవల్ల కవి అనుభూతి ఏమాత్రం మార్పుచెందదనీ, తేలుతున్నది.

అయితే కావ్యజత్తుకు కారణభూతమైన సామాజిక జగత్తు ఎప్పుడూ ఒకటేలాగున ఉండదు; మారుతూ వుంటుంది. దీన్ని అధ్యాత్మిక వాదులు సహితం ఒప్పుకుంటారు. వీరు అంగీకరించే మార్పులో అభివృద్ధి అనేది ఉండదు. ప్రాణి పుట్టి, ఎదిగి, చస్తుంది. అంతేకాని, ప్రాణి తరతరాల్లో వచ్చే పరిణామాన్ని మాత్రం అంగీకరించదు. ప్రత్యక్షంగా చారిత్రికంగా కనిపించేదాన్ని ఒప్పుకోకపోవడం రాతిని తన్ని మిధ్య అన్నట్లుగా వుంటుంది.

---

78. ''స్వభావో హ్యయం వాచ్యానాం చేతనాచేతనానాం యదవస్థాభేదా ద్దేశభేదాత్కాల బేదాత్స్వాలక్షణ్యాం లక్షణభేదాచ్చానం తతా భవతి. తైశ్చ తథా వ్యవస్థితైః సద్భిః ప్రసిద్ధానేక స్వభావానుసరణరూపయా స్వభావోక్త్యాఽపి తావ దుపనిబధ్యమానైః నిరవధిః కావ్యార్థః సంపద్యతే'' (ధ్వన్యాలోకము)

సామాజికానుభూతి మారుతూ ఉన్నప్పుడు కావ్యానుభూతికూడా మారుతుంది. ఇలా మారటంవల్లనే కావ్యార్థం అనంతంగాసంపన్న మవుతున్నదని[78] మానవారుకూడా ఒప్పుకున్నారు: అయితే యీమార్పు ఎలా ఉంటుందో, సామాజిక జగత్తులోని యీ మార్పునుబట్టి కావ్యజగత్తు ఎలా మారుతూ ఉంటుందో మనవారు పరిశీలించలేదు. మొత్తంమీద వీరి దృష్టిలో అర్థం ప్రాతదైనప్పటికీ కావ్యంలోకి వచ్చేటప్పటికి చటుక్కున క్రొత్తదై ఊరుకుంటుంది. ఈ భావాన్నే ఆనందవర్ధనుడు చక్కని శ్లోకంలో చెప్పాడు.

''దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్,
సర్వే నవా ఇవాభాన్తి మధుమాస ఇవ ద్రుమాః''

కావ్యజగత్తు ఎలామారుతున్నదో తెలుసుకోవాలంటే, సామాజికజగత్తు ఎలా మారుతున్నదో తెలుసుకోవాలి, సామాజిక జగత్తు ఎలా మారుతున్నదో విశదీకరించగలిగిందినాకు తెలిసినంతవరకు, మార్క్సుమహాశయుడు చెప్పిన చారిత్రక భౌతిక సిద్ధాంత మొక్కటే[79].

మార్క్సు చారిత్రిక భౌతిక సిద్ధాంతం ప్రకారం, సమాజంలోని ఆర్థిక ఉత్పత్తి సంబంధాలనుబట్టి సమాజం మారుతుంది. ఈ సంబంధాలకు పురస్కరించుకొనే,



---

79. చారిత్రిక భౌతిక సిద్ధాంతానికీ, కావ్యజగత్తుకూ సంబంధం లేదని ఫారల్ తన Note on Literary Criticism అనే పుస్తకంలోనూ, ఎడ్మండ్ విల్సన్ Marxism and Literature అనేవ్యాసంలోనూ వ్రాశారు. పైగా మార్క్సు దీన్ని చెప్పాడని అతని Critique of Political Economy అనే పుస్తకం పీఠికలోనుంచి యీ క్రింది వాక్యాన్ని ఉదాహరిస్తున్నారు: "It is well known that certain periods of highest development of art stand in no direct connection with the general development of society, nor with the material basis and the skeleton structure of its organisation.

ఇది మార్క్సుభావాన్ని అర్థం చేసుకోక పోవటమే. అర్థం చేసుకొంటే మార్క్సుభావానికి ఉద్దేశపూర్వకంగా అపార్థం కల్పించటమే. ఎందుకంటే వారు పేర్కొన్న పీఠికలోనే మార్క్సు ఇలా వ్రాశాడు.

"But the difficulty is not in grasping the idea that Greek art, and epos are bound up with certain forms of social development. It rather lies in understanding why they still constitute with us a sources of aesthetic enjoyment and in certain respects prevail as the standard and model beyond attainment."

---

తత్త్వం, శాస్త్రం, నీతి, ధర్మం, చట్టం, కళ, భావం, ఉద్రేకాలు ఏర్పడులాయి. ఇలా ఏర్పడిన వీటివల్ల కొంత వరకే ఉత్పత్తి,సంబంధాలు మారుతాయి. కాని చాల వరకు ఉత్పత్తి సంబంధాలే మార్పును నిర్ణయిస్తాయి.[80] ఉత్పత్తిసంబంధాలను నిర్ణయించేది, చాలవరకు ఉత్పత్తి సాధనాలు. ఉత్పత్తిసాధనాలు యుగయుగంలోను ఒకే మాదిరిగా ఉండవు. ఆర్థిక అవశ్యకంవల్ల మారుతాయి.

ఉత్పత్తి సంబంధాలనుబట్టి వర్గాలు ఏర్పడుతాయి. నూతన ఉత్పత్తి సాధానలతో వర్గాల సంబంధాలు మారుతాయి. నూతన ఉత్పత్తిసాధనాలు ఎందుకొస్తాయి? అనే ప్రశ్న వస్తుంది. మొదట ఏ ఉత్తత్తి సాధనాలుంటాయో అవి పోనుపోను ఫలప్రదంకావు. ప్రజ కంతకూ పోషకములు కావు. కాబట్టి జీవయాత్ర అవిచ్ఛిన్నంగా సాగించటానికి క్రొత్త క్రొత్త ఉత్పత్తి సాధనాలను మానవుడు సృష్టించుకోవలసి వస్తుంది. అంటే పూర్వమున్న ఉత్పత్తి నిర్విఘ్నంగా సాగటానికి అడ్డుతగులుతాయి. అందువల్ల నూతన ఉత్పత్తిసాధనాలు మానవుడు ఉపయోగించవలసి వస్తుంది.

ఉదాహరణపూర్వకంగా చెబితే ఇప్పుడు చెప్పిన విషయం తేలిగ్గా తెలుస్తుంది. ఒక అడవిలో కొంతమంది మనుష్యులున్నారనుకోండి. వారికి ఉత్పత్తిసాధనం విల్లుకాని, ఈటెకాని ఉన్నదనుకోండి. ఈ విల్లును, ఈటెను ఉపయోగించి జంతువులను చంపి ఆ మాంసంతో జీవయాత్ర చేస్తూవుంటారు. నిత్యమూ యిలా జంతువుల్ని చంపి తింటూవుంటే, ఆజంతువులు ఎంతకాల మొస్తాయి? అవి అభివృద్ధి అవుతూ వున్నాయనుకున్నా, మనుష్యులు కూడ అభధివృద్ధి అవుతూ వుంటారు. అందువల్ల కొంత కాలానికి జంతువులు అయిపోతాయి. అలాంటప్పుడు ఏం చేస్తారు? కొత్త సాధనాలను వెదుకుతారు. ఈ వెతకటమనేది తీరా జంతువులన్నీ అయిపోయిం తరువాతనే జరగాలన్న నియమం ఉండ నక్కరలేదు. వారి జీవితాను భూతిలోనే కొత్త సాధనాలు లభిస్తాయి. కాయలు, పండ్లు, ధాన్యంవల్ల కూడ బ్రతుకవచ్చునని తోస్తుంది. చెట్లూ పైరూ పెంచటానికి నాగలి పనికివస్తుందని కనుగొంటారు. ఈ నాగలి ఎప్పుడు అమల్లోకి వస్తుందంటే వేటవల్ల భుక్తి గడవకపోవాలి. అప్పుడే నాగలి ఉత్పత్తి సాధన మవుతుంది.

80 "The political, legal, philospohical, religious, literary and artistic development rests upon the economic. But they all react upon one another and upon the economic basis. It is not the case that the economic situation is the sole cause and everything else only a passive effect There is a reciprocal interaction with a fundamental economic necessity which in the last instance always asserts itself " Engels, Letter to Starkenburg.

నాగలి ఎప్పుడు ఉత్పత్తిసాధనమైందో అప్పుడే సమాజంలోని సంబంధాలు మారుతాయి. గ్రామజీవనం వస్తుంది.

ఇలా ఉత్పత్తిసంబంధాలనుబట్టి సమాజం పరిణామం చెందుతుందనీ, ఉత్పత్తిసాధనాలు ఎవరిపరంగా ఉంటాయో వారు పాలకవర్గంగా ఉంటారనీ, పాలకవర్గానికి అనుగుణంగా అభిరుచి, శాస్త్రం, కళ. నీతి, ధర్మం, తత్త్వం, ఆదర్శం, భావన వుంటాయనీ, యంత్రం బాగా అభివృద్ధిచెంది. ఉత్పత్తిసాగక ఉత్పత్తిసాధనాలు సమాజపరం చెయ్యబడుతాయనీ మార్క్స్ చారిత్రికంగా నిరూపించాడు. ఉత్పత్తిసాధనాలు సమాజపరం చెయ్యబడి 'కమ్యూనిజం' వచ్చింతరువాత ఎలా మార్పు చెందుతుందంటే తన కాపైన తెలియదన్నాడు.

ఈ పరిణామాన్ని బట్టి సామాజిక దశలను ఈ విధంగా విభజించాడు:

(1) ఆదిమ కమ్యూనిష్టు సమాజం. (2) జమీందారీ సమాజం. (3) కాపిటలిష్టు సమాజం, (4) కమ్యూనిష్టు సమాజం.



మనం సామాజిక జగత్తుతో కావ్యజగత్తు ఎలా మారుతున్నదో పరిశీలింతాము. ముఖ్యమైన విషయాలను టూకీగా పరిశీలిద్దాము.

అడవుల్లోను, కొండల్లోను, మృగప్రాయంగా తిరిగే మానవుడు క్రూరమృగాల బాధనుంచి తప్పించుకోటానికి, గుమిగూడి వేటాడి ఆహారాన్ని సంపాదించుకోటానికి, సామాజికజీవి కావలసి వచ్చింది. ఇలాంటి మొదటి దశను ఆదిమ కమ్యూనిష్టు సమాజమన్నారు.

ఈ దశలో ఎచ్చులొచ్చు భావం లేక, అంతా సమంగా ఉండేవాళ్ళు. స్త్రీ పురుష న్యూనతాధిక్యాలు లేవు. ఈ దశలో ఈటె, విల్లు ఉత్పత్తిసాధనాలు.

మానవుడు సామాజిక జీవి కావలసి వచ్చినప్పుడు భాష కావలసివచ్చింది. అప్పటి జీవితంలో ప్రకృతి విచిత్రంగా కనిపించేది. అప్పుడప్పుడు తెగలమధ్య పోరాటాల వస్తుండేవి. లిపి ఇంకా ఏర్పడలేదు. ఇలాంటి సామాజిక జగత్తువల్ల గేయాలు బయలుదేరాయి. ఈ గేయాలు నిరాడంబరంగాను, శబ్దాలంకార బహుళంగానూ ఉండేవి. ప్రకృతివర్ణనలు, తెగల్లోని పోరాటాలు గేయాల్లోని విషయాలుగా ఉండేవి. ఈ గేయాలను తరచు ఒక తెగకాని, కొంతమంది వ్యక్తులు కలసిగాని వ్రాసేవాళ్ళు. ఈ గేయాలే ఆ కాలంలోని చరిత్ర, శాస్త్రం, కవిత్వం.

క్రమేణా వన్యమృగాలు తగ్గి వ్యవసాయపద్ధతి తెలిసేటప్పటికి గ్రామజీవనం ఏర్పడింది. వ్యవసాయంతో కులవిభజన జరగవలసి వచ్చింది. కొందరు వ్యవసాయంచేస్తే, కొందరు వన్యమృగాలనుంచి పంటలను కాపాడితే,కొందరు ఇతర కార్యాలను చక్కపెట్టవలసి వచ్చింది. ఈ వ్యాపారాలన్నీ సరిగా నడవటానికి నాయకుడు కావలసి వచ్చాడు. అంటే వ్యక్తిగతంగా ఆస్తి ఏర్పడటం జరిగింది. దీనివల్ల కుటుంబజీవనం ఏర్పడింది.

వ్యవసాయం అభివృద్ధి చెందేట్పటికి రాజులు బయలుదేరారు. ఈ రాజులు దేవునితో సమానులయ్యారు. భూమికి రాజు అధికారయ్యాడు. కొందరు సైనికులయ్యారు. కొందరు వణిజులయ్యారు. కొందరు తతిమ్మావృత్తులు అవలంభించారు. ఈ సామాజిక వ్యవస్థను నిబెట్టటానికి మత ప్రచారకులు కావలసివచ్చారు. అప్పటికి వర్ణాలు స్థిపడిపోలేదు. వృఞధాతువు నుంచి వచ్చిన యీ వర్ణశబ్దమే ఈ అర్థాన్ని బోధిస్తూవుంది.

ఈ దశలో తీరిక ఉన్నదీ, అధికార మున్నదీ బ్రాహ్మణ, క్షత్రియులకే. నీతి, ధర్మం, భావాలు, సిద్ధాంతాలు, తత్త్వం ఈ ఇరువురికి అనుకూలంగా వుంటాయి. పైగా ఈరోజుల్లో శాస్త్రాంకురాలు రేకెత్తాయి. అయితే యివి కవిత్వాన్నుంచి విడివడలేదు. ఈ దశలోవే వేదాలు, ఇవే అప్పటికవిత్వం, శాస్త్రం, చరిత్ర, తత్త్వం.

వ్యవసాయం బాగా అభివృద్ధిచెంది వర్ణవ్యవస్థ పూర్తిగా నాటుకుపోయింది. రాజు నిరంకుశుడయ్యాడు. బ్రాహ్మణుడు, ''ఈ అధికారం నీకు పరమేశ్వరుడు ప్రసాదించాడు. చాతర్వర్ణ్యం నీవు కాపాడాలి.'' అన్నాడు. నిజమేనన్నాడు రాజు. ''ఆ విషయం నాకు పుట్టక పూర్వమే తెలిసింది. పూర్వజన్మంలో కూడా నేను రాజునే,'' అన్నాడు. ''రైతులకు మిగిలే ఫలసాయం యావత్తూ కోశానికి చేరాలి. శ్రుతిస్మృత్యర్థం వినియోగింపబడుతుంది.'' అన్నాడు.

దీనితో క్షత్రియ బ్రాహ్మణులు అధికారం సర్వతోముఖమై పోయింది. రాజ్యాలమధ్య పోరాటాలు విజృంభించాయి. లిపి ఏర్పడింది. శాస్త్రాలు అభివృద్ధిచెంది కవిత్వాన్నుంచి విడివడ్డాయి. ఆ రోజుల్లో తీరిక ఉన్నది బ్రాహ్మణ క్షత్రియులకే అని చెప్పాం. అధికారంకూడ వీరిద్దరి చేతుల్లో ఉండటంవల్ల శాస్త్రం, కళ, తత్త్వం, భావాలు, నీతి నియమాలు వీరివే. కవిత్వంలోకి వీరే ఎక్కారు.

ఈ యుగంలో 'మైథాలజీ' అభివృద్ధి చెందింది. కవి భావన మహత్తరరూపం తాల్చి కదనుతొక్కింది. రాజనాలు రాలాయి. ఫలితంగా పురాణేతిహాసాలు బయలుదేరాయి. సాహిత్య చరిత్రలో ఇది స్వర్ణయుగం, పడమటినుంచి హోమర్ ప్రభృతులు,

తూర్పునుండి వాల్మీకి ప్రభృతులు అమరగానం చేశారు. ఈ గానసుధాస్రవంతులు నిత్యనూతనమలై, అవ్యయములైనేటికీ మంద్రస్వనాలు వెదజల్లుతున్నాయి. హృదయంలేని శాస్త్రకారులచేత సహితం శిరఃకంపన చేయిస్తున్నాయి.

జమీందారీ ఆర్థికవిధానం హెచ్చినకొలదీ రాజుల అధికారం హెచ్చింది. బ్రాహ్మణుని అధికారం క్షత్రియుల అధికారానికి లోబడింది. రాజులచర్యలు, జీవనం, నీతి సిద్ధాంతం ప్రజలకు ఆదర్శప్రయా లయ్యాయి. వెనకటి ధర్మపన్నాలు విడిచిపెట్టారు. ఇలాంటి పరిస్థితుల్లో కావ్యాలు బయలుదేరాయి. వీటిలో నాయకులు రాజులే. ఈ దశలో వృత్తివిభాగాలు సంపూర్ణంగా ఏర్పడటంవల్ల నాటకాలు బయలుదేరాయి. ఈ నాటకాలూ, కావ్యాలూ పూర్వధర్మాన్ని, మతాన్ని తిరస్కరించాయి. ఆరోజుల్లోని సనాతనలు ''కావ్యాలా పాంశ్చవర్జయేత్,'' అనీ, నాటకాలు ఆడకూడ దనీ అన్నారు. గ్రీసులో కూడా ఇదే జరిగింది. ప్లేటో తన ప్రజారాజ్యంలోనుంచి కవిని తరిమివేస్తానన్నాడు.[81]

జమీందారీ చివరిదశలో వచనం బయలేదేరింది, అయితే యీ వచనం ఆ రోజుల్లో



చాలవరకు పద్యంలాగానే ఉండేది. కదంబరి, హర్ష చరిత్రలు చూస్తే ఈ విషయం తేలుతుంది.

రైతులకు మిగిలే ఫలసాయం Surplus produce) యావత్తూ రాజుల అపహరించి ఉత్పత్తి అభివృద్ధికోసం వినియోగించక, భోగాలకు, యుద్ధాలకు, తమ సొంతపనులకు వినియోగించటంవల్ల రైతుల పని ఇరుకున పడింది. భూమి ఇంకా ఎక్కువ ఫలప్రదమైతేనేగాని రైతులు మొదలైనవారికి జీవనోపాధి గడవకొచ్చింది. భూమివల్ల ఇంకా ఎక్కువ ఆదాయం వచ్చే అవకాశాలు లేక పోయాయి.

ఈ ఆవశ్యకంవల్ల యంత్రాలు బయలుదేరాయి. యంత్రాలవల్ల పట్టణాలు బయలుదేరాయి. రైతులు పట్టణాలకు చేరటంవల్ల రాజులపని సన్నగిల్ల మొదలెట్టింది. యంత్రాలున్న ధనికుల వ్యాపారం సాగకుండ రాజులు అడ్డుపడ్డారు. భూమి ఎప్పుడు ముఖ్యమైన ఉత్పత్తిసాధనం కాకపోయిందో, రాజుల అవసరం లేకపోయింది. వారి చర్యలు ఘోరంగా, సామాజిక అభివృద్ధికి ఆటంకంగా కనిపించాయి. స్వాతంత్ర్యం పేరుతో ప్రజాసామాన్యాన్ని వెనక వేసుకుని 'బూర్జువాయిజీ' రాజుల్ని తొలగించి వేసింది.

ఈ ఆర్థికవిధానంలోని మార్పువల్ల ప్రజాసామాన్యం యొక్క స్థితిగతులు కొంత బాగుపడ్డాయి. పరస్పర సంబంధాలు డబ్బులోకి మార్చబడ్డాయి. యంత్ర పరిశ్రమల

81. Plato's Republic.

వల్ల స్వేచ్ఛావ్యాపారం, స్వేచ్ఛాజీవనం (అంటే కులవృత్తికి అంటిపెట్టుకొని ఉండాలన్న నియమం పోవటం) కొంత హెచ్చాయి. అహం హెచ్చింది. ఈ రోజుల్లో ముద్రణా యంత్రం రావటం ఒకటి, రాకపోకల సౌలభ్యం ఏర్పడటం ఒకటి, విద్య నిమ్నజాతుల్లో కూడ వ్యాపించటం ఒకటీ పరిస్థితుల్ని తలక్రిందులు చేశాయి.

పారిశ్రామిక విప్లవంతోపాటు సాహిత్యరంగంలో 'రొమాంటిక్ రివోల్టు' వచ్చింది. ఈ కవిత్వంలో అహంత నృత్యంచేసింది. సాధారణీకరణం మంటగలుస్తూ వుందని గొథే ఈ సాహిత్యవిప్లవాన్ని తిట్టాడు,[82] కాని నిజానికి ఈ రోగం తరువాత ప్రబలింది.

'రొమాంటిక్ రివోల్టు' ఒకవిధంగా చూస్తే విప్లవనిరోధకం, ఒక విధంగా విప్లవకరంగా వుంది. ప్రకృతి దగ్గరికి మళ్ళా వెనక్కు వెళ్ళాలనటం, సమాజంకంటే ప్రకృతే ముఖ్యమనటం, విప్లవనిరోధకంగా వుంది. స్వాతంత్ర్యవాంఛ, 'లిరిసిజం' విప్లవకరంగా వున్నాయి.

ఈ నాగరికత బూర్జువాయిజీ చుట్టూ పెరగటంవల్ల బూర్జువాయిజీ నాయకపాత్ర వహించింది. ఈ బూర్జువా నాగరికతా, సిద్ధాంతాలూ, తత్త్వాలూ, సాహిత్యంలోకి ఎక్కాయి. అచ్చుయంత్రం రావటంవల్ల 'మధ్యతరగతి' వారికి విద్య లభించింది. ఈ పరిస్థితుల్లో వచనం అద్భుతంగా అభివృద్ధి చెందినది. నవల బయలుదేరింది. శాస్త్రజ్ఞానం అభివృద్ధి కావటంవల్లనూ, ఇతర దేశాలతో సంపర్కం ఎక్కువ కావటంవల్లనూ హృదయ సంకుచితత్వం పోయింది.



నాటకం, పద్యం చాలా మారిపోయాయి. నాటకరంగంలో పెద్ద మార్పు రావటంవల్ల స్వాభావికత్వం ఎక్కువైపోయింది. పద్యం వెనుకటి బెట్టుసరి మానుకొని తేలికమార్గాలు తొక్కింది. ఆంగ్ల సాహిత్యంలో ఈ మార్పుకు వర్డ్స్వర్తు బీజాలు నాటాడు.

మొదటినుంచీ యంత్రాలు వ్యక్తులపరంగా ఉన్నాయి. కొంతకాలం యంత్ర పరిశ్రమలు అభివృద్ధి చెందేటప్పటికి కొత్త పరిస్థితులు ఏర్పడ్డాయి. పరిశ్రమలు బాగా అభివృద్ధిచెందాలంటే తయారైన సరకులు అమ్ముడు పోతూ ఉండాలి. ఉత్పత్తి ఎక్కువ కావటంవల్ల సరకులకు కొత్త మార్కెట్లు కావలసి వచ్చినవి. అందువల్ల సరకులను అమ్ముకోటానికి వలసరాజ్యాలను సంపాదించినా, యంత్రాలు వ్యక్తుల పరంగా ఉండటంవల్లను, ఉత్పత్తిని లాభంకోసం సాగించటం వల్లను, దీనివల్ల పోటీలు రావటంవల్లను తరచు యుద్ధాలు రావటం, ప్రజలకు కొనుగోలు శక్తి పోవటం దీనివల్ల ఉత్పత్తి ఆపటం జరిగింది.

---

82. Classicism is health, and Romanticism a disease.

ఇలాంటి పరిస్థితులవల్ల బూర్జువాయిజీకాక తలిమ్మా ప్రజాసామాన్యంలో అసంతృప్తి, ఆకలి హెచ్చుతాయి. మరీదెబ్బతినేది కార్మికులు. వీరికి బ్రతుకుతెరువు కనిపించదు. పైగా యంత్రాల్లో పనిచెయ్యటానికిగాను ముందే విద్యావంతులుగా చెయ్యబడుతారు. కాబట్టి సామాజిక వ్యవస్థను ఎలా మారిస్తే, సమాజానికంతకూ శ్రేయస్కరంగా వుంటుందో గ్రహించి, విప్లవం తెచ్చి సోషలిజం స్థాపిస్తారు.

తయారైన సరకులు ప్రపంచంలో మూలమూలలకు ఎలా చేరుతాయో, అన్నిదేశాల కావ్యాలుకూడ చౌకసరకులై అలా మూలమూలలకు చేరుతాయి. అందువల్ల కావ్యజగత్తు విపరీతంగా మారిపోతంది. పైగా యీ జగత్తును పోషించేది ప్రజాసామాన్యం కాబట్టి ఇది వారి అభిరుచల కనుగుణంగా వుంటుంది. ఆర్థిక విషమపరిస్థితులవల్ల పాలకవర్గమైన బూర్జువా యిజీమీద అసంతృప్తి, తిరుగుబాటూ బయలుదేరుతాయి. శాస్త్రజ్ఞానం విపరీతంగా అభివృద్ధికావటంవల్ల మత విశ్వాసం తగ్గిపోతుంది. జీవితంలో నైరాశ్య మెక్కువవుతుంది. తీరిక చాలా తక్కువగా ఉండటంవల్ల స్వల్పకాలంలో చదువు కొనే కావ్యాలు బయలుదేరుతాయి. అంటే కథానిక, నాటికలు బాగా అభివృద్ధి చెందుతాయి.

134 నవల, కథానిక, నాటకాల ప్రాముఖ్యం హెచ్చుతుంది. వీటిలో సామాన్య ప్రజాజీవితం, బూర్జువాయిజీ మీది తిరుగుబాటు, జీవితంలోని నైరాశ్యం, సరకుల వ్యామోహంతో బయలుదేరే కళావ్యామోహం ప్రతిబింబిస్తాయి. ఎంత తేలిగ్గా ఉన్నా పద్యాన్ని ఆనందించటానికి కొంత తీరిక, దానిద్వారా అభిరుచి సంపాదించాలి. ఇలాంటిది సాధ్య పడదు కాబట్టి మొత్తంమీద పద్యం నశిస్తుంది.

కెమేరా, రేడియో టెలివిజన్‌లతో సినిమాలు, రేడియో టెలివిషన్ నాటకాలు బయలుదేరుతాయి. శాస్త్రాలు విపరీతంగా అభివృద్ధి కావటంవల్ల కావ్యజగత్తులో కొత్తశిల్పం, Self-consciousness ఎక్కువగా కనిపిస్తాయి. ఫ్యూచరిజం, సర్రియలిజం, కన్‌స్ట్రక్టివిజం మొదలైనవి బయలుదేరుతాయి.

ఆర్థికరంగంలో ఏర్పడే విషమపరిస్థితి కావ్యజగత్తులో కనిపిస్తుంది. విపరీతమైన మార్పులు త్వరత్వరగా రావటంవల్లను, కొత్త తరగతి పాఠకులు రంగంలోకి రావటంవల్లను, జాతీయ సంప్రదాయం పరసాహిత్య సంపర్కంవల్ల నశించటం వల్లను ఏది కావ్యజగత్తో, ఏది కావ్యజగత్తు కాదో తెలియని గందరగోళం ఏర్పడుతుంది. విమర్శకు ఒక ప్రమాణం లేకుండా పోతుంది. ఈనాటి మన సాహిత్యాన్ని చూచినా ఇది గోచరిస్తుంది.

సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడ్డప్పుడు ఉత్పత్తిసాధనాలు సమాజపరం చెయ్యబడుతాయి. అందిరికీ సమానమైన ఆర్థికావకాశాలు ఏర్పడుతాయి. ఇలాంటిది ఒకదేశం లోనే కాక ప్రపంచమంతటా జరుగుతుంది.

జి. వి. కృష్ణరావు

ఇలాంటి ఆర్థిక పరిస్థితులవల్ల ఉత్పత్తి అవిచ్ఛిన్నంగా సాగుతుంది. కాబట్టి ప్రజాసామాన్యానికి తీరిక ఎక్కువౌతుంది. పాలకవర్గమంటూ ప్రత్యేకంగా ఉండదు. అందువల్ల సమాజ జీవితం సాహిత్యంలోకి ఎక్కుతుంది. సమాజం మొత్తాన్ని ఎదుర్కొనే సమస్యలూ అనుభూతీ కావ్య జగత్తులో ప్రతిబింబిస్తాయి. అప్పటికభివృద్ధి పొందే శాస్త్రాలనుబట్టీ, పాఠకుల మనస్తత్వాన్ని బట్టీ కావ్యజగత్తు ఉంటుంది.

కాబట్టిసమాజంతోపాటు కావ్యజగత్తు మారుతూ వుంది. అందువల్ల ఒకదశలో ఉన్న మానవ సమాజం పూర్వదశలోని కావ్యజగత్తును అర్థంచేసుకొని ఆనందించాలంటే కష్టసాధ్యం. సామాజికుడు ఏ దశలోని కావ్యాన్ని చదువుతున్నాడో నాటి సంప్రదాయాన్ని అర్థంచేసుకొని సానుభూతి చూపించగలిగి ఉండాలి. ఇలాంటి చారిత్రిక దృష్టి అలవరచుకొనకపోతే వెనకటి కావ్యాలు కావ్యాలుగా కనిపించవు. ''సంప్రదాయం. లేక చారిత్రిక విమర్శనం లేకపోతే, ఇతఃపూర్వ మానవుడు సృష్టించిన కళాకావ్యాం ఆనందించ టానికి వీల్లేదు. మనం కేవలం వర్తమాన అద్యతనభూతకాలాల్లో నిమగ్నులమై జంతువుల మాదిరిగా ఉంటాము.''[3].

ఇలాంటిది లేకపోతే షేక్స్పియర్ నాటకాలను కాని, భారతాన్ని కాని, రెస్టొరేషన్ కామెడీలను కాని, ప్రబంధాలను కాని, ఆస్వాదించటానికి వీల్లేదు. ఇలాంటి సంప్రదాయాభిజ్ఞత లేకపోవటంవల్లనే ఆధునికులలో చాల మందికి ప్రబంధాలు అసహ్యంగా కనిపించాయి. 

ఆధునిక సాహిత్యాన్ని ఆనందించాలన్నా సమాజంలో పెరగాలి; సమాజాన్ని హృదయగతం చేసుకోవాలి. ఇరవయ్యో శాతాబ్దంలో ఉంటూ, పద్దానుగో శతాబ్దంలో విహరించాలంటే ప్రయోజనంలేదు. ఇదే దోషం శ్రీ ఉమాకాన్తంగారిలో కనిపిస్తుంది. వీరికి తెలుగంటేనే సానుభూతి తక్కువ. చిన్నప్పటినుంచీ సంస్కృత వాతావరణంలో పెరగటంవల్ల, ఇప్పటి - ఇప్పటి సమాజాన్ని సానుభూతి లేక విస్మరించి పూర్వకాలపు వాతావరణంలోకి కాళ్ళు తేలవేయాలంటారు. ఈ దృష్టి 'నేటి కాలపు కవిత్వం' యొక్క ముగింపులోనే కనబడుతుంది. ఏ భారతీయసమ్రాట్టో అవతరిస్తే సాహిత్యం బాగుపడుతుందట. విషయజ్ఞులకు దీన్ని చూస్తే నవ్వువస్తుంది.

ఇంతవరకూ తేలిన విషయాలను సంక్షేపంగా చూదాము కావ్యజగత్తు సామాజిక జగత్తునుంచి ఉత్పన్నమయ్యేదేకాని అలౌకికమైనది కాదు. కావ్యజగత్తులో ఆనందం

---

3 AE Stheties, F 128

ప్రధానం; సామాజికజగత్తులో కాదు. సమాజంలో ఎలా ఆనందం కలుగుతుందో, ఆ విధానాల ననుసరించే కవి తన అనుభూతిని మార్పువెయ్యక చిత్రిస్తాడు. ఇలాంటి కావ్యజగత్తు సామాజికజగత్తుతో పాటే మారుతూవుంటుంది. సామాజికజగత్తునుండి కావ్యజగత్తును వేరుచేసి చూస్తే, అయోమయంగా, అర్థరహితంగా, మంచీ చెడ్డా లేక, ఎందుకో, ఎందుకో, దేనికో దేనికోగా ఉంటుంది.[84] వెనుకటి కావ్యజగత్తును అర్థం చేసుకోవాలంటే సంప్రదాయాభిజ్ఞత ఉండాలి. ఇప్పటి కావ్యజగత్తును అర్థం చేసుకొని ఆనందించాలంటే ఇప్పటే సమాజంలో మునిగి తేలుతూ వుండాలి.

దీన్ని బట్టి ఏది కావ్యజగత్తో తేలింది. నేటి పాఠకునికి సంతోషభిన్నమైన ఆనంద మిచ్చేదే కావ్యం. అంటే, నిర్లిప్త సంతోషమిచ్చినదాన్నే పాఠకుడు కావ్యంగా గ్రహించాలి. ఇది మమ్మటుడన్నట్టు ప్రత్యక్ష హృదయ సంవేదన సంవేద్యం. హృదయకుహరంలో ప్రత్యేక ప్రయత్నం లేక హత్తుకుపోయేది. హృదయవేదనా సంవిధానంలో మార్పుతెచ్చేది. (Psychic values ను మార్చేది) ఉత్తమకావ్యం. వేదనాసంవిధానంలో మార్పు అంటే ఏమిటో చూదాము. ఇదివరకు మనకు విధావా వివాహమంటే ఏహ్యభావముండే
136 దనుకోండి. కావ్యంలో విధావా వివాహాన్ని గూర్చి చిత్రించి అది అవసరమని కవి సూచించటం కాని, చెప్పటంగాని జరుగుతుందనుకోండి. కావ్యాన్ని చదివింతరువాత కవి చెప్పిన సంస్కారం మనలోకూడా కలగాలి. ఇలా చెయ్యగలిగింది. ఉత్తమ కావ్యం.

ఇంతకన్న కావ్యజగత్తుయొక్క న్యూనతాధిక్యాలను నిర్ణయించే పద్ధతి లేదు.

ఏసిద్ధాంతాలు ఎలా ఉన్నా భాష సామాజిక జీవితావశ్యకంవల్ల ఉత్పన్నమైంది. ఇలాంటి భాషాదండంనుంచి ఒక ప్రక్క నుంచి సాహిత్యం, రెండో ప్రక్కనుంచి శాస్త్రం ఉత్పన్నమయ్యాయి. అందువల్ల సాహిత్యం, శాస్త్రం రెండూ సామాజిక జీవితాన్నుంచి బాహిరిల్లేవే.

---

84. ఈ భావాన్ని G.M. Hopkins యీ పద్యంలో చక్కగా చెప్పాడు :

Therefore this masterhood,
This piece of perfect song.
This fault-not. found. with good,
Is neither right nor wrong,
No more than red and blue,
No more than Re and mi,
Or sweet the golden glue,
That's built for by the bee."

సామాజిక జీవితాన్నుంచి విడదీసి చూస్తే, సాహిత్యానికి శాస్త్రానికి స్థానమేలేదు. అసలు అవి సాహిత్యమో, శాస్త్రమో కూడా తెలియదు.

ప్రకృతిలో మార్పు తెగలిగితేనే శాస్త్రము. తేలేక పోతే శాస్త్రంకాదు. మానవ హృదయవేదనలో మార్పు తెగలిగిందే సాహిత్యం. తేలేనిది సాహిత్యంకాదు. అసలు అలాంటిది ఏమౌతుందో ఎవ్వరూ చెప్పలేరు.

సామాజిక జీవితాన్నుంచి సాహిత్యం వెలువడుతుంది. సాహిత్యంలో ప్రతిబింబించేవి కేవలం సామాజిక జీవితాలే.

కవులెంత బ్రహ్మదత్త వరప్రసాదులమని గప్పాలు కొట్టుకొని, ''దిగిరాము దిగిరాము దివినుండి భువికి,'' అని గీర్వాణం పోయినా, వ్రాసేది వారి అనుభూతే, ఈ అనుభూతి సమాజం చేత నిర్ణయింప బడుతుంది. అసలు సంపాదించే అనుభూతి సామాజిక జీవితాన్నుంచే. మానవుడు సమాజంలో లేకపోతే పశుప్రాయుడుగా వుంటాడు. అసలు యిలా బుకాయించను కూడ బుకాయించలేడు.

137

కవి అనుభూతిని నిర్ణయించే సమాజం, సామాజిక జీవితం ఉత్పత్తి సాధనముల సంబంధముచేత నిర్ణయింపబడుతాయి.

అందువల్ల ఉత్పత్తి సాధనాల సంబంధాలనుబట్టి సమాజం మారుతుంది. సమాజంతో సాహిత్యం, ధర్మం, నీతి మొదలైనవి మారుతాయి.

అసలు ఉత్పత్తిసాధనాలు ఏ వర్గంవారి పరలో ఉంటాయో కవిత్వం, నీతి, ధర్మం, సత్యం, భావం ఆవర్గానికి సంబంధించినవిగానే వుంటాయి.

అంటే, ఆదిమ కమ్యూనిస్టు సాహిత్యం, జమీందారీ సాహిత్యం, కేపిటలిస్టు సాహిత్యం, సోషలిస్టు సాహిత్యం అని సాహిత్యం సమాజంతోపాటు పరిణామం చెందుతూ వుంటుంది.

''సాహిత్యానికి పరిణామమేమిటి? అసంభవం, ఒక పరిణామ దశలోవున్న సాహిత్యాన్ని మరొక పరిణామ దశలోవున్న సామాజికుడు ఆస్వాదించటం ఎలా జరుగుతుంది? కాబట్టి సాహిత్యంలో ఇలా భేదాలుండవు. దేశ కాలభేదాలను చంపి సార్వజనీనకంగా వుంటుంది,'' అని కొంతమంది అంటారు. ఇది కేవలం నిరాధారం. చారిత్రిక విమర్శనంవల్లను, సంప్రదాయాభిజ్ఞతవల్లను ఇది జరుగుచున్నదే కాని

దేశకాలాలకు అతిక్రమించి ఉంటం లేదు. మన భారతాన్నే తీసికోండి. ఇప్పటి చదువుకున్న వాళ్ళందరూ దీనిని ఆస్వాదించాలి గదా. ఇప్పటి మన కథకులలోనూ, భావకవులలోనూ, భారతాన్ని ఎంతమంది అర్థం చేసికొని ఆనందించ గలిగిన స్థితిలో ఉన్నారు?

కాబట్టి, సాహిత్యమనేది కేవలం సామాజిక జీవితం మీద అధారపడుతుంది. ఈ జీవితం మారుతూవుంటుంది; కాబట్టి సాహిత్యంకూడా మారుతూ ఉంటుంది. అసలు మార్పునకు కారణం ఉత్పత్తి సాధనాల సంబంధాలు.

మనదేశంలో, ముఖ్యంగా ఆంధ్రదేశంలో, ఒక పిచ్చి వ్యామోహముంది, ''నిరంకుశాః కవయః, నిరంకుశాః కవయః'' అని గద్దిస్తూ వుంటారు. ''మేము భావజీవులం; స్వర్గలోక విహారులం, తుచ్ఛభౌతిక బంధాలు మమ్మ బంధింపవు; కోయిల ఎలా పాడుతుందో, పుష్పాలు ఎలా సుగంధాలను వెదజల్లుతూ వుంటాయో, సముద్రం ఎలా ఘోషిస్తూ వుంటుందో, అలాగే మేమూ పాడుతూ వుంటాము. ఇది మా స్వాతంత్ర్యం, ఇది మా నైజసిద్ధం,'' అంటూ వుంటారు. అయితే ఇలాంటి సంధి పలవరింతలు తగ్గిపోయా యనకోండి.



అసలు ఇది స్వాతంత్ర్య మవుతుందా? ఇంద్రియాలకూ, బుద్ధికీ, అవ్యక్తానికీ, వాసనలకు బద్ధుడై, అవి ఎలా ఆడిస్తే అలా ఆడటం, స్వాతంత్ర్య మవుతుందా?

ఆవశ్యకాల్ని గుర్తించినవాడే స్వాతంత్ర్యం అనుభవిస్తాడు. గుర్తించనివాడు బానిస అయిపోతాడు.

అయితే మనదేశంలో స్వతంత్రుడు కావాలంటే ఏయే ఆవశ్యకాల్ని గుర్తించాలి? ఏమి చెయ్యాలి?

ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాలంటే, హిందూ దేశంలో ముఖ్యంగా ఆంధ్రదేశంలో సామాజిక జీవితం ఎలా వుంది? ఏయే పరిస్థితులు దీన్ని నిర్ణయిస్తున్నాయి? అనే ప్రశ్నలకు సమాధానం తెల్సుకోవాలి.

మొట్టమొదట గుర్తించవలసిన విషయం బ్రిటిషు సామ్రాజ్య ప్రభుత్వం యంత్ర నాగరకంతో హిందూ దేశాన్ని ఏలుతూవుంది. యంత్రోత్పన్నమైన సరకులను ఎగుమతి చేసి హిందదేశాన్ని దోచుకోవటమే సామ్రాజ్యవాదుల ముఖ్య ఆదర్శం. దోపిడి బాగా సాగాలంటే, రాకపోకలకు కావలసిన యంత్రపరికరాలను ప్రవేశ పెట్టాలి. హిందూదేశంమీద బ్రిటన్ రాజకీయ అధికారాల్ని చెలాయించాలి.

బ్రిటన్ ఈ పని యిదివరకు చేసింది. ఇప్పుడు చేస్తూవుంది. ఇక ముందు కూడా భారతీయులు దద్దమ్మలై చూస్తూ వూరుకుంటే చేస్తుంది.

సామ్రాజ్య ప్రభుత్వపు దోపిడివల్ల దేశం పేదరికానికి పాల్పడింది. స్వదేశ సంస్థానాధిపతుల రాజకీయాధికారాన్ని రాల్చివేసింది. యంత్రోత్పన్నమైన సరకులతో పాటు విశ్వసాహిత్యాన్ని ఒక సరకుగా దింపింది. మద్రాసు రాజధానిలో రైతువారీ పద్ధతి ప్రవేశపెట్టింది.

వీటిఫలితాలు అన్నీయిన్నీ కాదు. దేశంలో స్వయం సంపూర్ణంగా, స్వయంప్రకాశంగా ఉన్న గ్రామవ్యవస్థ తలకిందైంది; కులవృత్తులు యథాయథలై కుళ్ళసాగాయి అంటే, అందుకు పూర్వమున్న జమీందారీ పద్ధతికి కూకటివ్రేళ్లు తెగాయి. జమీందారీ నాగరకత తత్త్వం, భావాలు, సిద్ధాంతాలు సాహిత్యం అన్నీ ఒకసారి తల క్రిందులయ్యాయి.

రైతువారీ విధానంవల్ల జమీందారీలుపోయి ఆంధ్రదేశంలో 'మధ్యతరగతి' ఏర్పడింది. ఉన్న పేదరికంలో చదువుకొని రాజకీయంగా, సాహిత్య విషయకంగా, సామాజికంగా చైతన్యం వహించటానికి తగిన ఆర్థిక సదుపాయాలు ఏర్పడ్డాయి; దేశంలో ప్రవేశించిన ముద్రణాయంత్రం, చవక సరకుగా దిగుమతి అయిన విశ్వసాహిత్యం, వారికి తోడ్పడ్డాయి. 

ఫలితంగా జమీందారీ నాగరికముమీద, సాహిత్యం మీద, భాషమీద, ఆదర్శాలమీద తిరుగుబాటువచ్చి మధ్యతరగతికి ఆనుకూల్యం ఏర్పడింది. భాష వ్యావహారికమైంది. (శిష్ట వ్యావహారికం మాత్రమేసుమా) వీరి జీవితమే సాహిత్యంలోకి ఎక్క ప్రారంభించింది. మొట్టమొదటి ఉదాహరణ కన్యాశుల్కం, రెండోది మాలపల్లి; మూడోది రాయప్రోలు సుబ్బారావు. బసవరాజు అప్పారావుగార్ల కావ్యాలు, పద్యాలు. జమీందారీ ఆదర్శాలను వెక్కిరించి కృతకృత్యులైంది ఒక్క కవిరాజు త్రిపుర నేని రామస్వామి చౌదరిగారే, ఆంధ్రసాహిత్యంలో ఇప్పుడుకానీ, పూర్వకానీ, పద్యంలోకానీ, వచనంలో కాని ఎవ్వరూ చెయ్యని, చెయ్యబోని పనిని వీరు భగవద్గీతలో చేశారు. ఆంధ్రకవిత్వం ఎన్నడూ ఎరగని చక్కని 'సెటైర్,' చక్కని హాస్యం వీరివల్ల తెలుగువారికి లభించాయి. గీతాహృదయం బ్రద్దలైంది.

విశ్వసాహిత్యపు సిద్ధాంతాలు చౌకసరకుగా దిగాయని చెప్పాము. వీటిని కొంతమంది మందుబుద్ధులు, దేశ కాల పరిస్థితులను గుర్తించకుండా యథాతథంగా తెలుగుదేశంలో కక్కారు. దీనికి భావకవిత్వం, సర్రియలిజం, సరియైన ఉదాహరణాలు.

ఇవి దేశకాల పాత్రలను తిరస్కరించటంవల్ల ప్రజాదరణం పొందలేకపోయాయి. పైగా చావటానికి వీలులేని పద్యం చచ్చిపోయింది. అసలు సాహిత్యాభిమానమే చాలా తగ్గిపోయింది. అసలు ఈ అభిమానానికి కొన ఊపిరివుంటే, దాన్ని కొంతమంది కథకులు ప్రసాదించారు.

కొంతమంది రాజకీయ రంగరంలోను, సాహిత్య రంగంలోను వెంటనే సోషలిస్టు విప్లవం రావాలంటారు. ఈ మధ్య మొదటిదాన్ని మానుకొని, ప్రజాస్వామిక విప్లవమే రావాలుంటున్నారు. సాహిత్యరంగంలో సోషలిస్టు విప్లవమే రావాలంటున్నారు. సాహిత్యరంగంలో సోషలిస్టు విప్లవ రావాలని వెఱ్ఱికేకలు వేస్తున్నారు. సంధించినవారిలాగా.

వర్గ సంబంధాలను మనదేశంలో పరిశీలించి చూస్తే, కార్మికుల బలం చాల తక్కువగా వుంది. 'మధ్యతరగతి' వారి బలం ఎక్కువగా వుంది. అసలు ఏ విప్లవం రావాలన్నా రాజకీయ చైతన్య ముండాలి. ఇలాంటి చైతన్యం 'మధ్యతరగతి' లోనే వుంది – వుంటానికి అవకాశముంది. పరిశ్రమలు బాగా అభివృద్ధికాలేదు. ఉన్న కొద్దిమంది కార్మికులకుగూడా విద్యాగంధం లేదు.



ఎవరేమి చెప్పినా, అసలు సాహిత్యం చదువుకున్న వాళ్ళకే, అక్షరజ్ఞానమైనా లేనివారికోసం సాహిత్యం వ్రాయబడదు.

యక్షగానాలు, బుర్రకథలు లాంటివి ఎందుకు వ్రాయగూడదని కొంతమంది ప్రాజ్ఞులు ప్రశ్నిస్తూ వుంటారు.

ముద్రణా యంత్రం మూలబడి ఊరుకుంటుందా? మనం వ్రాయటానికి పూనుకోకపోతే మరికొందరిచేత వ్రాయించుకొంటుంది. 'మధ్య తరగతి'. పైగా కార్మికులకంటె ఎక్కువ డబ్బిస్తుంది. దాన్ని ఎవ్వరాపగలుగుతారు.

పైగా, మనకంటే ముందున్న దేశాల సాహిత్య చరిత్ర విప్పి చూచినా, యక్షగానాల లాంటి జానపద సాహిత్యం మళ్ళీ తల యెత్తలేదు. అసలు ఆ దేశాలలో నిర్బంధ విద్యావిధానం ఉంది.

కాబట్టి మనదేశంలో 'మధ్యతరగతి' కోసం వ్రాయాలి. కార్మికులు జీవితాన్ని చిత్రించవచ్చును. కాని ఆ దృష్టి సోషలిస్టు దృష్టిగా ఉంటానికి వీలులేదు. కేవలం ప్రజాస్వామిక విప్లవ దృష్టిగా వుండాలి. అప్పుడే సాహిత్యం ఆదరింపబడుతుంది. అసలు మనకు సాహిత్యమౌతుంది.

జి.వి.కృష్ణరావు

ఈ ఆవశ్యకానికి అనుగుణంగా ఎవడు వ్రాయడో వాడు కవి కాడు. ప్రజాదరణాన్ని పొందలేడు. ''సోవియట్ రాజ్యం వట్టి శూద్ర రాజ్యం,'' అని కూసే ఆజ్ఞుల వ్రాత కవిత్వ మెలా అవుతుంది? ప్రజలు ఎలా ప్రోత్సహిస్తారు? అతడు సామాన్య వ్యక్తికంటె ఎలా అధికుడౌతాడు?

మరొక విషయం: ఆర్థిక సౌమ్యస్థితి, సమ్యక్స్థితి ఏ జాతికుంటుందో, ఆ జాతి సాహిత్యం ముదుపూావులు ఆరుకాయలుగా వుంటుంది. ఇప్పటి ఆంధ్రసాహిత్యం యొక్క శోచనీయస్థితికి పేదరికం ఒక ముఖ్యకారణం. పేదరికం పోతేనే సాహిత్యపు పేదరికం పోతుంది. కాబట్టి ఆంధ్ర సాహిత్యం అభివృద్ధి కావాలంటే పేదరికాన్ని పోగొట్టుకోటానికి పాటుపడాలి. అంటే ఉన్న ఆర్థికవిధానాన్ని మార్చాలి. ఇప్పుడు ఆర్థికవిధానాన్ని మార్చి వేయటానికి సాహిత్యం పనిచేస్తూవుంటే, బాగుపడటానికి ప్రజాదరణ పొందటానికి పాటుపడుతున్న దన్నమాట!

కాగా తేలిన విషయం: ఇప్పుడు ఏర్పడింది 'మధ్య తరగతి'. రావలసింది ప్రజాస్వామిక విప్లవం. సాహిత్యం ప్రజాస్వామికవిప్లవ దోహదాన్ని కల్పిస్తూ 'మధ్యతరగతి' కోసం వ్రాయబడాలి. అప్పుడు నేటిసాహిత్యపు శోచనీయస్థితి పోతుంది. ఆంధ్ర సాహిత్యానికి విశ్వసాహిత్యంలో స్థానం లభిస్తుంది. 141

''జయతి కవే ర్భారతీ''

**గమనిక**

''జి.వి.కె. జీవితం – రచనలు''లో 1992లో పరిస్థితులలో ఇమడలేక అని ముద్రితమైంది. దానిని '1962' అని చదువుకోవాలి. ఇది మిగతా ఆరు సంపుటాలకు కూడా వర్తిస్తుంది.

# కావ్యాలలో నీతి బోధ

పువ్వులలో కొన్ని అందానికి ప్రసిద్ధి, కొన్ని వాసనకు ప్రసిద్ధి, కొన్ని యీ రెంటికీ ప్రసిద్ధి. ఈ కడపటివి చాల తక్కువ. మన దేశంలో వాసనగల పువ్వునకున్న గౌరవం అందమైన పువ్వునకు లేదు. ఈ అర్థాన్నే, ''వాసన లేని పూవు బుధవర్గము లేని పురమ్ము,'' అన్న ప్రాచీనోక్తి చాటుతున్నది.

అలాగే భాషాకృతులలో కూడా కొన్ని రామణీయకానికి ప్రసిద్ధి. మరికొన్ని ఉపదేశానికి ప్రసిద్ధి. ఒక కొన్ని యీ రెంటికీ ప్రసిద్ధి. రామణీయకాత్మక కృతులను కావ్యాలనీ, తత్త్వోపదేశాత్మకాలను శాస్త్రాలనీ, ఉభయాత్మకాలను శాస్త్ర కవ్యాలనీ పెద్దలంటారు. వీనికి సంస్కృతంలోని రామాయణం, బ్రహ్మసూత్రాలు, మహాభారతం క్రమంగా ఉదాహరణాలు.

పువ్వుల అందం వేరు, వాసన వేరు. అలాగే కృతులలో కావ్యాలు వేరు. శాస్త్రాలు వేరు. అందం వాసన కాదు, వాసన అందంకాదు. అలాగే కావ్యం శాస్త్రం కాదు, శాస్త్రం కావ్యం కాదు. కావ్యానికి సహానుభవం, అపరోక్షానుభూతి ప్రధానం, శాస్త్రానికి పరామర్శం, పరోక్షానుభూతి ప్రధానం. హితమూ, నీతి, ధర్మము శాస్త్రానికి విషయాలు. కాబట్టే సాధారణంగా హితోపదేశం, నీతిబోధ, ధర్మ నిరూపణం సాక్షాత్తుగా కావ్యం కాదు. కాని కావ్యాలలో ఇవి కనిపిస్తున్నవి. కావుననే తరచు నీతిబోధకోక్తిని, హితోపదేశాన్ని కావ్యమని ప్రజాసామాన్యం భ్రాంతిపడుతున్నది.



అప్పుడప్పుడు రాజకీయులు కొందరు, ''దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్!'' అన్నది ఉత్తమోత్తమ కావ్యోక్తిగా పేర్కొంటూ ఉంటారు. నిజానికి...

ఏఱకుమీ కసుగాయలు
దూఱకుమీ బంధుజనుల దోషము సుమ్మీ.
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువునాజ్ఞ మేదిని సుమతీ...

అన్న పద్యంలో ఎంతకవిత్వం ఉన్నదో పై దానిలో గూడ అంత కవిత్వమే ఉన్నది.

శాస్త్రం ఎప్పుడూ విధినిషేధపూర్వకం, ఆ విధినిషేధాలను అది ఒకప్పుడు యుక్తి సహితంగా ప్రదర్శించవచ్చును; మరొకప్పుడు యుక్తివిరహితంగా ప్రదర్శించవచ్చును.

దేశమంటే మట్టికాదోయ్ అన్న పాదం నిషేధాత్మకం. దేశమంటే మనుషులోయ్ అన్న పాదం విధి పూర్వకం. ఏఉకుమీ కసుగాయలు అన్న పద్యం నిషేధాత్మకం. ఇచట యుక్తి లోపించినా, యీ వాక్యాలు రెండూ శాస్త్రం కోవకు చెందినవి.

కావ్యం అలాకాదు. తాను ప్రతిపాదించే అనుభూతి పాఠకునిది కాకపోవచ్చును. పాఠకుడు తనకున్న స్థితిగతులలో అలాంటి అనుభవం పొందలేకపోవచ్చును. అయినా కావ్యం అతనిని శరీరసహితంగా తాను చిత్రిస్తున్న వ్యక్తిలోగాని, సన్నివేశాలలోగాని, సంఘటనలలోగాని, స్థితిగతులలోగాని ప్రవేశింపజేసి ఆ సుఖదుఃఖాలు, రాగ ద్వేషాలు, కామ క్రోధాలు అనుభవింపజేస్తుంది. ఇది ఎలా సంభవం? అదే ప్రతిభా మహిమ.

ఇలా అంటే కావ్యం కావ్యమే అవుతుంది, శాస్త్రం శాస్త్రమే అవుతుంది. అప్పుడు ఒక దానిలో మరొకటి ఉండరాదు. కాని కావ్యంలో నీతిబోధ కానవస్తున్నది. ఉదాహరణకు -

ఆడినమాటను దప్పిన
గాడిద కొడుకంచుఁ దిట్టఁగా విని మదిలో
వీఁడా కొడుకని యేడ్చును
గాడిదయును గుందవరపుఁ గవిచౌడప్పా!



అన్న పద్యంచాలు. ఇది నిశ్చితంగా నీతి బోధకమే. ఇందులో కవిత్వం లేకపోవాలి. కాని సహృదయుడైనవాడు ఇందులో కవితాస్పర్శకూడ లేదంటే ఒప్పుకోలేడు. ఇక్కడ కొంత చమత్కారం ఉన్నది. పలికి బొంకినవాణ్ణి గాడిదకొడుకని తిడితే గాడిదకూడా ఇలాంటి దౌర్భాగ్యుడా కొడుకని ఏడుస్తుందట! అదీ బాహాటంగాకాదు. లోలోపలనే. ఎందుకంటే ఒరులతో చెప్పుకొని ఏడ్వాలన్నా కొంత యోగ్యత కావాలి. ఇలాంటి దౌర్భాగ్యుణ్ణి కనటంవలన అదీ లేదు. అందువలన మానాభిమానాలు లేని గాడిదకూడ బావురుమని ఏడ్వలేక లోలోపలనే ఏడుస్తుందట. ఇందులో కవితాస్పర్శలేదని ఎలా అంటాము? కనుక కవిత్వంలో నీతిబోధ, ధర్మోపదేశం ఉండటానికి వీలున్నది. ఈ అవకాశం ఎలా ఏర్పడుతున్నది? ఇది మొదటిప్రశ్న. కావ్యంలోని నీతిబోధకు, శాస్త్రంలోని బోధకు విశేషం ఉన్నదా? ఇది రెండవప్రశ్న. ఉంటే ఆ విశేషమేమిటి? కావ్యం దానిని ఎలా సాధిస్తున్నది? ఇది మూడవ ప్రశ్న.

కావ్యానికి అనుభూతిప్రధానం. చరాచరమైన యీ ప్రపంచమంతా ఈ అనుభవానికి విషయం. కాబట్టి కావ్యానికి విషయం కాని వస్తువేదీ ప్రపంచంలో లేదు. శాస్త్రాలు, వీని అర్థాలూ ప్రపంచంలోనివే కాని బాహ్యాలుకావు. అందువల్ల కావ్యంలో శాస్త్రార్థాలు

ఉంటవి. శాస్త్రమంటేనో అనుభూతార్థాన్ని విభజించి యుక్తితో విధి నిషేధ పూర్వకంగా తత్త్వం నిర్ణయిస్తుంది. అంటే లలితకళానుభూతి ఉపరతమై శాస్త్రార్థ వివేచన ఆరబ్ధమౌతుంది. కాబట్టి శాస్త్రంలో కవిత్వం ఉండదు. ఉంటే అది శాస్త్రంకాదు. కేవలం శాస్త్రాభాసం అవుతుంది. గ్రీకు తత్త్వవేత్త అయిన ప్లేటో రచనల్లో కవిత్వం ఉన్నదని విజ్ఞులు అంటారు. ఆ కవితాస్పర్శ ఉన్నంతమేర శాస్త్రార్థ దౌర్బల్యం ఉన్నదని విమర్శకులు అంగీకరిస్తున్నారు.

ఈ విధంగా కవిత్వంలో, నీతిబోధ, ధర్మోపదేశం, తత్త్వనిర్ణయం ఉంటే ఉండవచ్చును కాని, శాస్త్రంలోమాత్రం కవిత్వం ఉండదు. కవి శబ్దంకూడ ఈ అర్థమే చెబుతున్నది. ఈ శబ్దం సాహిత్య స్రష్టనే కాక శాస్త్రకారుని కూడ తెలుపుతున్నది. పండితుని చెప్పే విద్వదాది శబ్దాలు కవిని చెప్పవు.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యాధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు...



అన్న నన్నయ భట్టారకుని పద్యం ప్రకృతార్థాన్ని పాదుకొల్పుతున్నది. భరతమహర్షి కూడ సర్వశాస్త్రాలు సర్వజ్ఞానాలు నాట్యాంత ర్భూతాలని ఘంటాపథంగా పేర్కొన్నాడు.

ఇక బ్రహ్మసూత్రాలు ప్రఖ్యాత శాస్త్ర గ్రంథంకదా! వానిలో కవిత్వం ఉన్నదని ప్రస్తావించినవారు లేరు. కాబట్టి కావ్యంలో శాస్త్రం ఉరికడవచ్చును. కాని శాస్త్రంలో కవిత్వం ఉండదు.

మరి రెండవ ప్రశ్నకు సమాధానం కావ్యంలో గోచరించే శాస్త్రార్థం శాస్త్రంలో ఉన్నట్లుగా విధి నిషేధ రూపంలో ఉండదు. శాస్త్రం ప్రభువువలె శాసిస్తుంది. కాకకొంత క్రిందిమెట్టుకు దిగి చెప్పటం జరిగితే మిత్రునిలాగా బోధిస్తుంది. కావ్యం అలాకాక ప్రియురాలివలె దానిని హావభావవిలాసాలతోనే వెలారుస్తుంది. దీనినే ఆలంకారికులు కాంతాసమ్మితత్వ మంటారు.

ఈ కాంతాసమ్మితత్వలక్షణాలు ఏమిటి అంటే, ఏ ఆలంకారికుడైనా, విమర్శకుడైనా దిఙ్మాత్రంగా సూచించగలడు కాని సమగ్రంగా పేర్కొనలేడు. అంతమాత్రంచేత అది గోచరించినప్పుడు సహృదయుడు గుర్తింపలేడనరాదు. ఎంత నిభృతరూపం తాల్చినా దానిని, చూడగానే అతని హృదయం స్పందిస్తుంది. మరి దాని సమగ్ర లక్షణాలు ఎందుకు

చెప్పలేడు? కావ్యసంసారం అపారం. నక్షత్రాలను చూస్తున్నాము. వాటని ఎవడు లెక్కించగలడు? షడింద్రియాలతో ఈ ప్రపంచాన్ని దర్శిస్తున్నాము. అయినా దీని తత్త్వాన్ని నిజంగా ఎవడు ఆకళించుకొన్నాడు?

ఈ కావ్యజగత్తూ అంతే. బ్రహ్మతన ఇచ్ఛవచ్చినట్లుగా కర్మానుభోగ్యంగా ఈ ప్రపంచాన్ని సృష్టించాడని మనవారు అంటారు. వ్యావహారిక ప్రపంచ విషయంలో ఇది యథార్థం అయినా, కాకపోయినా, కావ్యజగత్తులో మాత్రం అక్షరాల నిజం. కవి తాను బోధించదలచుకొన్న అర్థానికి అనుగుణంగా పాత్రల గుణకర్మల కవిరోధంగా సహృదయానుభోగ్యంగా కథను కల్పిస్తాడు. ఈ కథ నేరుగా శాస్త్రంలోవలె సప్రమాణంగా విధినిషేధపూర్వకంగా నీతినిగాని, ధర్మాన్ని గాని, తత్త్వాన్ని గాని నిర్దేశించదు. కేవలం వ్యంజితం చేస్తుంది. ఇందుకు మహాభారతమే నిదర్శనం. అందలి ఊర్జితకథ లోకాన్ని ఆశ్చర్యచకితం చేస్తుంది. నానాపాత్రలు, పరశ్శత సన్నివేశాలు, విభిన్నప్రకృతులు, విచిత్ర పరిణామాలు పాఠకుణ్ణి అద్భుతంలో ముంచి తేలుస్తాయి. అతని సంస్కారం, అనుభవం ఎంత ఉన్నదో అంత విస్తృతార్థం గోచరిస్తుంది. సామాన్య మహాకావ్యాలు చదివినవాడు జీవిత తాత్పర్యం, పరమార్థం స్మరించకపోయినా అర్థం చేసికోవచ్చును. కాని ఆంధ్ర మహాభారతం ఆమూలాగ్రం చదివినవానికి తత్త్వజిజ్ఞాస అంకురించకపోతే తప్పకుండా ఆశ్చర్యపడవలసిందే. అతనికి అర్థజ్ఞానం ఉన్నదా అని సందేహించవలసిందే. కురుపాండవ జననం, వైరస్నేహవృద్ధి, సుహృద్ద్యూతానుద్యూతాలు. వనవాసాజ్ఞాతవాసాలు, అష్టాదశాక్షౌహిణులతో జరిగిన యుద్ధం, పరాజయకల్పకమైన పాండవిజయం, భీష్మ ద్రోణ కర్ణ వికర్ణ కృపాశ్వత్థామాదుల ప్రవృత్తి, శ్రీకృష్ణనిర్యాణం, ఎవరిని రసోత్తుంగ తరంగ పంక్తులపై ఉర్రూతలూచవు? ఎవనిని పర్యుత్సుకుణ్ణి చేయవు?

మహాకావ్యార్థం నీతినికాని, ధర్మాన్ని కాని ఎంత కోమలంగా మధురమధురంగా వ్యంజితం చేస్తుందో భారత సుహృద్ద్యూతార్థమే నిదర్శనం. దుర్యోధనుడు పాండవలక్ష్మి సమాపహరణమే ఉద్దేశించాడు కాని ద్రౌపదీ వస్త్రాపహరణం కలలోకూడ తలపెట్టలేదు. విజయోన్మాదం, సంభూతానుసంభూత ఘట్టాలు, ప్రసంగానుప్రసంగాలు హీనమతులను కీలుబొమ్మలను చేసి ఎంతనీచంగా ఆడిస్తాయో, స్థిరసంకల్పులు వాటినే ఆత్మాభ్యున్నతికి ఎంత చక్కగా వాడుకొంటారో ఈ ఘట్టం కంటె ఎక్కువగా ఏ శాస్త్రం ఏ యుక్తిచేత హృద్గతం చేస్తుంది?

ఆయితే కథాముఖాన నీతిబోధం సాగిస్తున్నప్పుడు కవి అత్యంత జాగ్రతి వహిస్తాడు. కథ ఆదిమధ్యాంత సహితంగా అనపేక్షితార్థవ్యపేతంగా నీతిబోధ

కావిస్తాడు. ఉదాహరణకు ధర్మజుడనుద్యూతంలో ఓడిన సందర్భం గ్రహించవచ్చు. నన్నయభట్టారకుడు...

ధర్మసుతు డొడ్డె శకుని క
ధర్మస్థితి నోటువడియె దైవము చెయిదిన్
నిర్మితమయిన శుభాశుభ
కర్మఫలంబెట్లు దేహి గడవంగ నేర్చున్...

అని అంటూ ఒక్క అర్థాంతరన్యాసోక్తి విన్యసిస్తాడు. ఈ సూక్తి ధర్మజుని చరితాన్ని అభిగుప్తంచేస్తూ హృదయంలో గాఢంగా నాటుకొంటున్నది. ఇలాకాక కవి విధిబలీయత్వాన్ని ప్రస్తరించి ఉన్నట్లైయితే అది కవిత్వమై ఉండేది కాదు.

మొత్తముమీద కథాప్రధానాలైన కావ్యాలలో నీతి బోధ, ధర్మోపదేశం సాధారణంగా వస్తువ్యంగ్యం అవుతుంది. ఆయా సన్నివేశాలలో కవి జాగరూకుడై ఉపమాద్యలంకార ముఖాన అత్యంత క్లుప్తంగా నీతిబోధచేస్తాడు. అంతేకాని శాస్త్రంలోవలే బాహాటంగా పరామర్శాత్మకంగా విధి ప్రతినిషేధ పూర్వకంగా మాత్రం ప్రతిపాదించడు. 147

కథలోని పాత్రలద్వారా కూడ నీతిబోధ సంభవమే. వివిధ పాత్రలకు ఆదర్శ స్పర్ధలుకాని మఱొకవిధమైన ఆవశ్యకత కాని ఏర్పడినప్పుడు వానివాని స్థితిగతులనుబట్టి, సంస్కారాలనుబట్టి, సన్నివేశాలను బట్టి, నీతిని శాస్త్రంలోవలె అభిధా తాత్పర్య వృత్తులు ప్రధానంగా చేసికొని విధినిషేధ రూపంతో చెప్పవచ్చును. దీనికి విధురనీతి, ధౌమ్యుని సేవాధర్మనిరూపణం లాఖ్యానం, స్వాభావికంగా భావాలంకార విరహితాలైన ఇలాంటివి ప్రాకరణిక కవిత్వం అవుతాయి. హేంలెట్ రూపకంలో పొలోనియస్ లియార్టిస్‌కు చేసిన హితోపదేశం ఇలాంటిదే. ప్రకరణ ప్రచ్యుతా లైనప్పుడు ఇవి కవితాకోటిలో చేరవు... రసపిచ్చి గల కొంతమంది నవ్యులు కలిత ప్రకరణాలైనా విగళిత ప్రకరణాలైనా ఇలాంటివి కవిత్వం కాదంటున్నారు. వీరు కవితాతత్త్వదూరగులు కావటమే కాక కాళిదాస భవభూత్యాది మహాకవులపట్ల గూడ మహాపచారు లవుతున్నారు.

కథయందలి నాయకజీవనవర్ణన ముఖానగూడ నీతిని, అవినీతిని, సూచించటం కూడ కావ్యాలలో కనిపిస్తున్నది. దీనికి...

''చలిచీమనేనియుఁ జాద్రొక్క శంకించుఁ
బలుకఁడెన్నఁడు మృషాభాషణములు...''
అన్న పుండరీకునికథ యందలి పద్యము,

"బ్రాహ్మణాచారంబు పరిహాసకముసేయు
నగ్నిహోత్ర విధానమన్న నలుగు..."

అన్న గుణనిధి కథ యందలి పద్యమూ క్రమోదాహరణాలు.

మొత్తముమీద శ్రవ్యకావ్యాలలోని నీతిబోధ, కథ కావశ్యకంగా పాత్రల స్వభావ శీల సంభావ్యతలకు అవిరుద్ధమైన మార్గంలో నడుస్తుంది. ఇక దృశ్యకావ్యాలలోని సూక్తి అత్యంత సంగ్రహరూపం పొంది కథాపోషకంగా, నాయకాది స్వభావ శీలోచితంగా ఉంటుంది. కణ్వుడు శకుంతలను అత్తవారింటికి పంపేటప్పుడు సతీధర్మం ఉపదేశించటానికి అవకాశం ఉన్నది. కాని కణ్వుని మహర్షిత్వం, దృశ్యకావ్యత్వం పాటించి కవి యీ సందర్భంలో అత్యంత సంగ్రహంగా గంభీరంగా మహాతపస్వి చేత ఇలా అనిపిస్తాడు:

శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తం సపత్నీజనే
భర్తుర్విప్రకృతాపి రోషణతయా మాస్మ ప్రతీపం గమః
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే, భాగ్యే ష్వనుత్సేకినీ
యాన్త్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః

148 కవి నేరుగా నీతిబోధాచరణతత్పరు డైనప్పుడు అతని ఉక్తి ఏదో ఒక అర్థాలంకారంతో మిళితమై ఉంటుంది. లేదా ఉజ్జ్వల భావాభివ్యంజకంగా ఉంటుంది. మొదటి దానికి వేమనపద్యాలు నిదర్శనం, తరచుగా ఇవి దృష్టాంత సహితాలని విదితమే. ఇంక రెండవదానికి లక్ష్యాలు:-

తరగల్ పిప్పలపత్త్రముల్ మెఱుఁగు టద్దంబుల్ మరుద్దీపముల్
కరి కర్ణాంతము లెండమావుల తతుల్ ఖద్యోతకీట ప్రభల్
సురవీధీ లిఖితాక్షరంబు లసువుల్ జ్యోత్స్నాపయః పిండముల్
సిరులందేల మదాంధులౌదురు జనుల్ శ్రీ కాళహస్తీశ్వరా!

ఈ పద్యమందలి రూపకాలు, విస్మయభావమూ యీ సూక్తిని శాస్త్రోక్తినుంచి వేరు చేస్తున్నవి.

అంతా సంశయమే శరీరఘటనంబంతా విచారంబె లో
నంతా దుఃఖపరంపరార్జితమె మేనంతా భయభ్రాంతమే
యంతా నంతశరీరశోషణమె దుర్వ్యాపారమే దేహికిన్
జింత న్నిన్నుదలంచి పొందరు నరుల్ శ్రీ కళహస్తీశ్వరా.

ఈ పద్యంలో అలంకారంలేదు. కాని యిందలి భావధ్వని చిమ్మచీకటులు గ్రమ్మె లోకనిస్పృహ యీ వాక్యను కవిత్వం, చేస్తున్నవి.

నీపైఁ గావ్యము చెప్పుచున్న యతఁడు స్త్రీపద్యముల్ వ్రాసి యి
మ్మా్మ పాఠం బొనరింతునన్న యతఁడున్ మంజు ప్రబంధంబు ని
ష్ఠాపూర్తిం బఠియింతునన్న యతఁడున్ సద్బాంధవుల్ గాక...
అని యిలాగే రచయిత శేషంపూరించి ఉంచే యిది కావ్యేతరోక్తి అయ్యేది కాని –
చీ! పృష్ఠాగత బాంధవంబు నిజమా శ్రీ కాళహస్తీశ్వరా...

అన్న సంజీవనితో కవి పద్యానికి ప్రాణం పోస్తున్నాడు. పరుసవేది సోకిన లోహంవలె పద్యమంతా పచ్చి బంగారమై పోయింది.

ఈ రీతిగా కావ్యంలోని నీతిబోధ శాస్త్రంలోని నీతిబోధవలె కాక విలక్షణంగా ఉంటుంది. కవి ప్రతిభ అనంతం. దాని విలాసాలను చేరీజు వేయలేము. కొన్ని చోట్ల అది శాస్త్రవాక్యాలనే యథాతథంగా స్వీకరించి ప్రకరణ కల్పనం ద్వారా కావ్యత్వం పొందిస్తుంది. కొన్నిచోట్ల ఆ సూక్తులను పాత్రశీల మనస్తత్త్వవ్యంజకంగా వినియోగించి కవిత్వంగా మార్చివేస్తుంది. కొన్ని చోట్ల అనుపానాలతో మందులను వాడే వైద్యునివలె ఉపమానాది అలంకారాలలో రంగరించి నీతులను ఆస్వాద్యం చేస్తుంది. మరి కొన్ని చోట్ల అనిర్వచనీయ చమత్కారంతో మేళవిస్తుంది. మరికొన్ని చోట్ల భావపరితప్తంచేసి నీతిని కరగి పోస్తుంది. ఇలా కవితాప్రతిభ ఎన్నో విచిత్రదోహదాలు కల్పించి నీతిని చివురింపజేస్తుంది. అంతేకాని శాస్త్రమట్లు కావ్యం నేరుగా యుక్తి యుక్తంగా విధి నిషేధముఖాన నీతిని వెలార్చదు.

ఇంకొక్క విశేషం, ఉష్ణమండలమందలి పువ్వులు ప్రాయికంగా సుగంధ బంధురాలు; సమశీతోష్ణ మండల మందలి పువ్వులు వర్ణ సంస్థాసుందరాలు. అలాగే ధర్మగ్లాని యుగాలలో పుట్టిన కావ్యాలు హితోక్తి ప్రపూర్ణాలు, ధర్మ విశ్రాంతి యుగాలలో పుట్టిన కావ్యాలు రసమయాలు.

# సాహిత్య భవితవ్యం

న సంసారస్య నిర్వాణా త్కించి దస్తి విశేషణం ।
న నిర్వాణస్య సంసారా త్కించిదస్తి విశేషణమ్ ॥
నిర్వాణస్య యా కోటిః కోటిః సంస్మరణస్య చ।
న తయో రంతరం కించి త్సుసూక్ష్మమపి విద్యతే॥

– మూలమాధ్యమిక కారికలు

''సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్'', అని భర్తృహరి కాబోలు అన్నాడు. ఈ వాక్యం కొన్ని సంవత్సరాల క్రిందట విడ్డూరంగా కనిపించింది. ''ప్రజాస్వామిక రాజ్యాలలో వ్యక్తులకు రాజ్యాలు లభించవు. కాని, మంత్రిపదవులు, శాసనసభాసభ్యత్వాలు, రాయబారుల పదవులు, ఇంకా ఇతర పదవులు కోరుకోవచ్చును; లభించనూవచ్చు. కాని అవి అక్కరలేదు. కవిత్వం ఒకటి ఉంటే చాలు ననుకోవడ మేమిటి? ఇది ఆలోచించి అంటున్న మాటేనా?'' అని నాడు అనిపించింది. ఏ కొలదిమంది మాత్రమో తక్క తక్కిన సమాజమంతా నేడు ఇలాగే భావిస్తున్నది.



ఇంతకూ కవిత్వానికిగాని, ఇతర లలితకళలకుగాని ఇంత ఉత్తమస్థానం ఇవ్వవచ్చునా? ఇవ్వవచ్చునంటే ఎందుకు ఇవ్వాలి? ''చాలుం జాలు గవిత్వముల్ నుడువుచో సత్యంబు సాధింతురా?'' అని మరొక కవి ప్రశ్నిస్తున్నాడు. ఈ వాక్యం భర్తృహరి తాత్పర్యాన్ని అనుగమిస్తున్నదా? ఖండిస్తున్నదా?

కవిత్వ మంటే ఏమో చెప్పుకొనక యీ ప్రశ్నలకు సరియైన సమాధానం పొందలేము. మరి కవితానిర్వచనానికి ప్రయత్నించట మంటే మహాకూపంలో పడటమే. అత్యంత ప్రాచీనకాలం నుంచి నేటివరకూ ఎందరో మనీషులు కవిత్వాన్ని ఎన్నో విధాల నిర్వచిస్తూ వచ్చారు. అవి సంవాదకమై అందరికీ ఆమోదనీయమైన నిర్వచనం కనిపించటంలేదు. ఒకవేళ అలాంటిది ఉన్నదేమో తెలియదు. కాని కవిత్వం విన్నప్పుడు గుర్తించవచ్చు ననుకుంటాను.

'ఇంతకూ కవిత్వాన్ని గుర్తించే మార్గాలేమిటి? అంతరాత్మ ఏమైనా చెబుతుందా? ఏమని చెబుతుంది? ఆ రహస్యం కొంచెం మాకు గూడ చెప్పండి', అని అనవచ్చును. ఎవరు ఎలా వెక్కిరించినా ఏది కవిత్వమో ఏది కాదో చెప్పవలసింది హృదయమే. అయితే ఎవరి హృదయం చెప్పాలి? నా హృదయమా, మీ హృదయమా, సమాజహృదయమా?

నా హృదయం మీకు గాని, మీ హృదయం నాకు గాని, సమాజహృదయం మనకుగాని చెప్పలేదు. ఎవరి హృదయం వారికే చెబుతుంది. తన హృదయం తనకు ప్రమాణం కాని. అన్యహృదయం కాదు. పరప్రత్యయనేయబుద్ధులు పొందేది శాస్త్రార్థమైతే కావచ్చును గాని, కావ్యానుభూతి మాత్రం కాదు.

సరే, కవిత్వవిషయంలో హృదయం ఏమి చెబుతుంది? శబ్దపూర్వకమైన రచన విన్నప్పుడుగాని, చదివినప్పుడుగాని, సమాధ్యవస్థ ఏర్పడాలి. ఆ సమాధ్యవస్థ కల్పించిన రచన కవిత్వ మౌతుంది. కల్పించదో, కవిత్వం కాదు. ఇప్పుడు సమాధ్యవస్థను నిర్వచిస్తేనే కాని, తాత్పర్యం బోధపడదు.

గ్రహణము, గ్రాహ్యము, గ్రహీత అన్న భేదాలు పోయి గ్రహణం మాత్రం మిగిలి ఉన్న స్థితిని సమాధి అంటారు. ఇలా అనగానే ఏదో మాటల గారడీ ప్రారంభమైనట్లు కనిపిస్తుంది. దృష్టాంతం చెప్పుకొంటే ఈ చిక్కు తొలగుతుంది.

''ఒకసారి ద్రోణుడు తన శిష్యుల అస్త్రవిద్యాకౌశలం తెల్సుకొనగోరి పిట్టబొమ్మను చెట్టుకొమ్మకు గట్టి ధర్మరాజాదులను బిలిచి – 'మీరు ఆ పిట్టపై గురిపెట్టుకొని సిద్ధంగా ఉండండి. నేను చెప్పినప్పుడు కొట్టండి.' అని హెచ్చరించాడట. అంత అందరూ విండ్లెక్కు పెట్టుకొని సిద్ధంగా ఉన్నారట. అప్పుడు ద్రోణుడు ధర్మరాజును సంబోధించి ''పిట్టతల కనబడుతున్నదా?'' అని ప్రశ్నించాడట. 'ఆఁకనిపిస్తున్నదండీ', – 'మరి నేనో' – 'ఆఁ' – 'మరి నీ తమ్ములు?'– 'ఆ –,' వెంటనే ఆచార్యుడు అర్జునుని సంబోధించి – 'పిట్టతల కనబడుతున్నదా?' అని అడిగాడట. అతడు 'అవు' నన్నాడట. 'మరి నేనో' అని ప్రశ్నించగా 'లే' దని ఆ శిష్యుడు చెప్పాడట.'' అర్జునునకు అప్పుడు ఏర్పడినదానిని సమాధ్యవస్థ అంటారు.

ఇలాంటి సమాధ్యవస్థ కల్పిస్తున్నదానిని కవిత్వ మని చెప్పుకోవచ్చును. అంటే పాఠకుడు బాహ్యప్రపంచం మరచిపోయి రచనలో నిమగ్నుడు కావాలి. ఇలా అన్నప్పుడు ఒక ప్రశ్న అంకురించవచ్చును. లెక్కలు చేసుకొనే విద్యార్థి శాస్త్రవిషయం గాఢంగా ఆలోచించే శాస్త్రకారుడు, పనిలో నిమగ్నుడైన శ్రామికుడు బాహ్యప్రపంచాన్ని మరచిపోతున్నారు. వారికి ఆ స్థితిని కల్పిస్తున్నవి కూడ కవిత్వమవుతవా?

కావు – అవి బాహ్య ప్రపంచాన్ని మాత్రమే మరపిస్తున్నవి. కాని, సమస్య ఒకటున్నది; నేను ఉన్నాను, చేస్తున్నాను, అన్న వాటిని మరపించటం లేదు. గ్రహణ, గ్రాహ్య గ్రహీతృభేదం ఉంటున్నది.

కొన్ని సందర్భాలలో 'నేను' అన్న జ్ఞానం లోపించవచ్చును. తన్ను తాను మరచిపోయి ఒక విషయాన్ని గూర్చి ఆలోచించవచ్చును. అప్పుడుగూడ గ్రహణము, గ్రాహ్యము అన్నవి రెండూ, ఉంటున్నవి. కవిత్వ మని చెప్పబడే రచన చదువుతున్నప్పుడు పాఠకుడు తన్ను తాను మరచిపోతాడు. ఆ స్థితిలో తన సంగతి స్ఫురించదు. ఆరోగ్య వంతునకు శ్వాసప్రశ్వాసాలు గమనంలో ఉంటవా? కావ్యపఠనంలో గూడ అంతే. కావ్యార్థం మాత్రమే పాఠకుని మనోముకురంలో భాసిస్తుంది. అలా భాసిస్తున్నప్పుడు పాణినీయ ధ్వన్యాలోకాదులు పాటింపబడుతున్నవని కాని, ఉల్లంఘింపబడుతున్న వని కాని, కాళిదాసాదులు అనుకరింపబడుతున్నా రని కాని తోచదు. గుణదోషాదులు గూడ ప్రత్యక్షంగా కనిపించవు, ఆసక్తులమై ఒక పుస్తకం చదువుతున్నప్పుడు అల్పమైన అక్షర స్ఖాలిత్యాన్ని గమనించము. అది జి.పి. బాడిలో అచ్చయిందా, ఇ.బి. బాడిలో అచ్చయిందా, పాయింట్ టైపులో అచ్చయిందా అన్న విషయం స్ఫురించదు. ఇలాంటివే కావ్యానుభవానపకర్షకాలైన గుణదోషాలు.

ఆ భాసించే అర్థము ఏమిటి? అది ప్రత్యక్షాది ప్రమాణ సిద్ధమైన జ్ఞానం కాదు. రజ్జుసర్ప భ్రాంతి వంటి భ్రాంతి కాదు. ఒక్కొక్కప్పుడు ఇదా, అదా అన్న సంశయం కలుగుతుంది. సాహిత్యానుభూతి అలాంటి సంశయప్రతీతి కాదు. స్వప్నంలో గజతురగాదులను చూస్తాము. కావ్యంలో భావింపబడుతున్న అర్థం అలాంటిది కాదు. కనుకనే ప్రాచీనులు కావ్యమందు ఆస్వాదింపబడే అర్థం లౌకికపదార్థవ్యతిరిక్త మనీ, అది అనుకార, ప్రతిబింబ, ఆలేఖ్య, సాదృశ్య, ఆరోపః అధ్యవసాయ, ఉత్ప్రేక్షా, స్వప్న, మాయా, ఇంద్రజాలాది విలక్షణ మనీ, పాఠకునకు కలుగుతున్న అనుభవం సమ్యక్ జ్ఞాన, భ్రాంతి సంశయ అనవధారణ, అనధ్యవసాయ, విజ్ఞానభిన్న వృత్తాంతాస్వాదనరూప సంవేదన మనీ అన్నారు.

ఇలాంటి అనుభవమే కాక రామాయణం, భారతం, షేక్స్పియర్ నాటకాల వంటి రచనలు మరికొంత విశేషానుభవం కలిగిస్తున్నవి. వానిని పూర్తిగా చదివేటప్పటికి పాఠకుడు ఆ యా పాత్రలందు తన్మయీభావస్థానీయావస్థ పొందటమే కాక విషయరహితమైన స్థితి పొందుతున్నాడు. ఆ స్థితి ఆర్యనాగార్జునుడు పేర్కొన్నట్లు చతుష్కోటి (సదసదుభయానుభయాంతాలు) వినిర్ముక్తం. అందు ఏ దృష్టి ఉండదు. అదే నిర్వాణం. అట్టి స్థితి కేవలం కరుణం వల్లనో శాంతం వల్లనో మాత్రమే ప్రాప్య మేమో ననిపిస్తున్నది. కనుకనే, కరుణం ఒక్కటే రసమని భవభూతి, శాంతమే మహారస మని అభినవగుప్తుడు పేర్కొన్నారు. వీరిరువుర కంటె అత్యంత ప్రాచీనుడైన నాగార్జునుడు కావ్యతత్త్వాన్ని ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గానీ ప్రస్తావించక పోయినా సర్వోపశమాన్ని ఉపదేశించటం

వల్ల అతని మతంలో శాంతమే రసరాట్టని చెప్పుకోవచ్చును. కావ్యం వల్ల పొందబడుతున్న ఈ స్థితి సుషుప్తి, అపస్మారం, మదిరాపానవైవశ్యం మున్నైనవాటి కంటె ఎలా విశిష్ట మని అనిపించవచ్చును. సుషుప్త్యాద్యవస్థలలో పంచేంద్రియవ్యాపారం ప్రవర్తిల్లదు. కావ్యాస్వాదనకాలంలో జ్ఞానేంద్రియాలు జాగరూకాలై ఉంటవి. చక్షురక్షర సంయోగాదులు సాగుతుంటవి. అనౌచిత్యం, అసంభావ్యత పొడకట్టగానే మనసు ఎదురు తిరిగి బాహ్యాజగత్తులోకి వచ్చిపడుతుంది. కనుక కావ్యానుభూతికి, సుషుప్త్యాదులకూ పోలిక లేదు.

ఇంతకూ ఇలాంటి కావ్యానుభవం దేనికి? కూడు పెడుతుందా? గుడ్డ ఇస్తుందా? జాతిని వీర్యవంతం చేస్తుందా?

కావ్యానుభూతి అలౌకికం. ఇలాంటి అనుభవం శాస్త్రాల వల్లగాని, ఇక్షురసాస్వాదన వంటి భౌతిక భోగాలవల్లగాని లభించదు. ఈ అనుభవం అనన్యం. శాస్త్రాదులు అసంవృతిని (infinity) ఆమోదిస్తవి కాని, ఆ అసంవృతిస్వరూపం అవి బోధపరచలేవు. కావ్యం అలా కాక పాఠకుణ్ణి మూర్తప్రపంచం నుంచి అమూర్త ప్రపంచానికీ, ఆ అమూర్త ప్రపంచం నుంచి అసంవృతికీ చేరవేస్తుంది. అలా చేరవేయబడుతున్నప్పుడు పాఠకుడు పొందే ఆనందం ఇష్టార్థప్రాప్తివల్ల కలుగదు. విమానంలో ఎక్కి తిరిగితే రాదు. చంద్రమండలంలో మొదటి సారిగా అడుగు మోపినా పొడమదు. సహృదయుడు పొందే ఆ అనుభవం అనుభవైక వేద్యం.

భోజ్యపదార్థాలకు ఉప్పు రుచి కల్పిస్తున్నట్లే మానవజీవితానికి లలితకళలే అర్థం, విలువ కల్పిస్తున్నవి. కసాయివృత్తి యందు సాధారణంగా మనకు జుగుప్స కలుగుతుంది. ఆ కసాయివృత్తి పాటించిన ధర్మవ్యాధునికి లోకపూజ్యత సంప్రాప్తించింది. వ్యాసభారతి లేకపోతే అది సాధ్యపడేదా? అలాగే దొంగలను, దొంగతనాన్ని మనం క్షమించము. డాస్టవస్కీ 'అనెస్ట్‌తీఫ్' అన్న కథ వ్రాసి ఆ పశ్యతోహరునికి మనచేత అశ్రుతర్పణం విడిపించాడు. లేడీ మాక్బెత్ అన్న కథతో మరొక రష్యన్ రచయిత దారుణబంధకి పై మన కరుణావృష్టి కురుపించాడు. మనదేశంలోని సామాన్యప్రజానీకానికున్న విలువలన్నీ భారత రామాయణాలవల్ల కలిగినవే. శాస్త్రం వస్తువుల ప్రయోజనం నిర్ణయిస్తే, కవిత్వాది లలితకళలు వాటికి విలువలను కల్పించి వ్యవస్థీకరిస్తున్నవి.

కావ్యం పాఠకునకు తన్మయీభావం కలిగిస్తున్నది. కనుక అది అతని సంకుచిత దృష్టిని పటాపంచలు చేసి మనోవైశద్యం కల్పించి పశుత్వం దగ్గరనుంచి పశుపతిత్వం దాక సానుభూతితో గ్రహింపజేస్తున్నది.

తన మూల సిద్ధాంతాలకు విరుద్ధాలైనప్పుడు ప్రియురాలి ఉపదేశాలనైనా పాటకుడు ప్రియతర వచనాలతో తప్పుకొనిపోవచ్చును. కాని కావ్యమందట్లు గాదు. కావ్యార్థమే హృదయమవైపోతుంది. నాగార్జునుని పరిభాషలో చెప్పవలసివస్తే సంసారానికి మూలభూతమైన దృష్టి సమూలం నశించకపోయినా శిథిలమవుతుంది. ఈ ప్రమాదం గుర్తించి ప్లేటో తన దృష్టి కనుగుణంగా వ్రాయని కవులను తన ఆదర్శ రాజ్యం నుంచి బహిష్కరిస్తానన్నాడు. మన అదృష్టం బాగుండి అతనికి ఆ అధికారం సంక్రమించలేదు. నియంతృక రాజ్యాధినేతలు, లలిత కళలకున్న ఈ శక్తిని గుర్తించి వాటిని అనుశాసిస్తున్నారు. దీనివలన లలిత కళాఖండాలు లోపించి వాటి ఆభాసాలు మాత్రమే అచటి ప్రజలకు లభిస్తున్నవి.

పురుషార్థాల పార్యంతికఫలం ఆనందమే కదా! ఆ ఆనందాన్ని సాహిత్యం అప్పటికప్పుడే సహృదయునకు అందిస్తున్నదని అభినవగుప్తుని ఆభాషణం. అలాకాదు, కావ్యం ఉపదేశమే ఇవ్వాలనటమంటే అమృతం అక్కరలేదు. మకరందమే కావాలని కోరటమే కదా.

ఈ సందర్భంలో మమ్మటుడు జ్ఞప్తికి రాకమానడు.

''కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే

154 సద్యఃనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశ యుజే''

అని ఆయన అన్నాడు. కీర్తి, అర్థసిద్ధి, వ్యవహారజ్ఞానము, అమంగళపరిహరణము కవిత్వప్రయోజనా లని అందలి అభిమానం కొలదీ ఆయన పేర్కొన్నాడు. కాని వాస్తవానికి ఇవి నైకాంతికాలు. కవులకు మార్గాలు చూపిన మహాకవులు నామరూపాలు లేకుండ నశించినట్లు చరిత్రనుబట్టి అనుమానించవలసి వస్తున్నది. హోమరు భిక్షాటనం చేసి జీవించినట్లు ప్లేటో చెబుతున్నాడు వ్యవహారజ్ఞానం, శివేతరక్షతి శాస్త్రాలవల్లనూ సిద్ధిస్తవి. కనుక ఆయన పేర్కొన్న ప్రయోజనాలలో అసందిగ్ధమైనది 'సద్యఃపరనిర్వృతి' ఒక్కటే.

మరొక విశేషం - ఏ శాస్త్రానికైనా, ఏ విద్యకైనా మూలం భావన. ఈ భావనను వర్ధిల్లజేసేవి స్వప్నాలు, కవిత్వాది లలితకళలు మాత్రమే. ఇంతకూ కవిత్వాది లలితకళలవల్ల అలౌకిక అసంపృత్యనుభవం, జీవితార్థవత్త, దృష్టిశైథిల్యం, సహానుభవం, సద్యఃపరనిర్వృతి, భావుకత లభిస్తవి.

ఇంతవరకూ సిద్ధాంతాన్ని బట్టి నిష్పన్నమైన కావ్యస్వరూపం చెప్పుకున్నాము. కాని సిద్ధాంతానికీ, ఆచరణకూ తేడా ఎప్పుడూ ఉంటుంది. త్రిభుజంలోని మూడు కోణాల మొత్తం 180 డిగ్రీలు ఉండాలి. కాని, కొలిచి చూచినప్పుడు కొంత వ్యత్యాసం కనిపించటం విద్యార్థుల కనుభవసిద్ధమే. అలాగే కవిత్వ విషయంలో గూడ.

---
జి.వి.కృష్ణరావు

మనస్సు లక్క వంటిది. లక్కకు ఘనత్వము, శైథిల్యం, ద్రవ్యత్వము అని మూడు అవస్థలున్నవి. ఘనత్వావస్థలో లక్క ఏ ముద్రనూ స్వీకరించదు. శైథిల్యావస్థలో వేసిన ముద్రను స్వీకరిస్తుంది. కాని, గట్టి ఒరపిడి కలిగితే ఆ ముద్ర నిలువదు. ద్రవాత్వావస్థలో మరొక ద్రవ్యకణం అందులోపడి ఘనీభవించినప్పుడు ఆ కణం రాపిడికి రాలక అందే నిలిచిపోతుంది.

మనస్సుకు గూడ ఈ అవస్థలు చెప్పుకోవచ్చును. కొన్ని రచనలను, కబుర్లు విన్నట్లు వింటాము. శబ్దాలంకార ప్రధానమైన పద్యకవిత్వం, ఆమూలాగ్రం చదివించటం ఒక్కటే విశేషంగా గలిగిన కథలు, నవలలు, నాటకాలు ఈ కోవలో చేరుతవి. కొన్ని రచనలు చదువుతున్నప్పుడు మనశ్శైథిల్యం కలుగుతుంది. ఈ స్థితిలో బాహ్యప్రపంచం మరచిపోతాము. కాని తన్మయీభావం కలుగదు. అహంతకు ద్రుతి ఉండదు. వర్ణకకవిత, తెలుగు ప్రబంధాలు (తన్మయీభావం కలిగించే ఘట్టాలు వినా), షా నాటకాలు, పాఠకుల వ్యక్తిత్వాలను మరపింపక చదివించే కథలు, నవలలు, నాటకాలు, ఈ కోవకు చెందుతవి. ఈమాట కొందరికి కోపకారణం కావచ్చును. కాని ఎవరి అనుభవాన్ని వారు పరిశీలించుకొని పఠనసమయంలో అహంతలయించినదో, లేదో, గుర్తుకు తెచ్చుకోవాలి. తన్మ్యులై వర్ణనీయార్థంలో కరగిపోయామనుకొంటే ఈపైని చెప్పినది అయథార్థమే.



ఇంక మూడవజాతి రచనలు సమాధ్యవస్థను కల్పించి, అహంతను లయింపజేసి, తమ తమ పాత్రలలోనో, సన్నివేశాలలోనో, వర్ణనీయార్థాలలోనో దాదాపు మిళితం చేసివేస్తవి. ఈ స్థితిలో మనస్సు పూర్తిగాకరిగిపోయిన లక్క వలె రచనా ప్రతిపాద్యాలైన అర్థాలన్నింటినీ తనలో లీనం చేసుకొంటుంది. ఇలా లీనమైపోయిన అర్థాలు ఆమరణం మనసులో నిలిచిపోతవి. ఉత్తరకాలంలో తిరిగి ద్రవత్వం పొందినప్పుడు గూడ వెనుకటివాటిని కోల్పోక క్రొత్తవాటిని గ్రహిస్తుంది. ప్రాతవాటితో క్రొత్తవాటిని చేర్చుకొని, పరిపుష్టి పొందుతుంది. ఈ స్థితిని కల్పించే రచనలకు లక్ష్యాలుగా కాళిదాసుని కావ్యాలు, సంస్కృతనాటకాలు, టాల్‌స్టాయ్, డాస్టవిస్కీ, చెకొవ్, టాగూరుల ఉత్తమ కథలు, వేలూరి శివరామశాస్త్రిగారి 'డిప్రెషన్ చెంబు', ఇబ్సన్, యు.జి. ఓనిల్,సింజ్, ఓకేసీల రూపకాలు పేర్కొనవచ్చును.

ఇక నాల్గవ జాతి రచనలు సబీజ సమాధ్యవస్థ కల్పించి క్రమక్రమంగా నిర్బీజ సమాధ్యవస్థకు కొనిపోతవి. ఈ రచనలు పాఠకునకు తన్మయీభావం కలిగించి కట్టకడపట విషయరహితమైన సమాధ్యవస్థ కల్పిస్తవి. సంస్కృతంలో భారత, భాగవత రామాయణాలు, తెలుగులో భారతం, ఇంగ్లీషులో షేక్స్‌పియర్ విషాదాంతనాటకాలు,

ముఖ్యంగా హామ్లెట్, - కాఫ్కా వ్రాసిన ట్రయల్, కాజిల్ అన్న రచనలు ఈ కోవకు చెందుతవి. ఈ జాతి రచనలు ఉత్తమోత్తమాలు.

మొత్తంమీద సాహిత్యంగా పరిగణింపదగిన రచనలను నాలు తరగతులుగా విభజించవచ్చును. మనఃకాఠిన్యం సడల్చక ఆసక్తిని మాత్రం కలిగించే రచనలు సామాన్యాలు, మనశ్శైథిల్యం మాత్రమే కలించేవి మధ్యమాలు. చిత్తద్రుతి కలిగించి తన్మయీభావ మాపాదించేవి ఉత్తమాలు, నిర్బీజసమాధ్యవస్థ కల్పించేవి ఉత్తమోత్తమాలు.

ఈ విభాగం సామాజికుల హృదయస్పందనం పై ఆధారపడుతున్నది. మరి యీ హృదయాలు, మనస్సులు ఒకే స్థాయిలో ఉండవు. కొందరి మనస్సులు సుశ్లథాలు, సుద్రవాలు; మరికొందరివి యీషచ్ఛ్లథాలు, ఈషద్ద్రవాలు; వేరొక కొందరివి దుశ్శ్లథాలు, దుర్ద్రవాలు. దీనికి తోడు ఆగంతుకాలైన ఆధివ్యధులు, కఠోరదృష్టులు, విప్లవాలు స్వాభావిక మానసిక స్వాస్థ్యం చెరిచి కావ్యార్థాలను యథాతథం గ్రహించనీయవు; ఈ చిక్కులన్నీ పరిహరించటం కోసమే. ''యేషాం కావ్యానుశీలనాభ్యాసవశా ద్విశదీభూతే మనోముకు రే వర్ణనీయ తన్మయీ భావయోగ్యతా తే సహృదయ సంవాదభాజః సహృదయాః'' అని అభినవగుప్తుడు నిర్వచించాడు ఈ నిరుక్తిలోని కావ్యశబ్దాన్ని కొందరు
156
సంస్కృతకావ్యానికి పరిమితం చేయాలంటారు. వీరు– ''గుణాః ప్రమాణం న దిశాం విభాగః'', అన్న సూక్తిని విస్మరించి సంవృతిని వరిస్తున్నారు. కనుక అభినవగుప్తుని నిర్వచనం యథాతథం గ్రాహ్యం.

ఈ సందర్భంలో మరొక అంశం సంస్మరణీయం. మానవుని మనస్సు కొంతవరకు అతని వయస్సు మీద ఆధారపడుతున్నది. బాల్యంలో వీరాద్భుతాలు రుచించినంతగా శృంగారాదులు రుచించవు. యౌవనంలో శృంగారాదులు మరులు కొలిపినంతగా అద్భుతాదులు మరులు కొలుపవు. కౌమారంలో కరుణాదులు నచ్చినంతగా ఇతరాలు నచ్చవు. వార్ధకంలో శాంతాదులు హత్తినట్లు శృంగారాదులు హత్తవు.

ఇంతవరకు పేర్కొన్న అంశాలను గమనించినప్పుడు రచనలోని ఉత్తమోత్తమాది భేదాలను అసందిగ్ధంగా సర్వజన సమాదరణీయంగా నిర్ణయించడం దుష్కరమని బోధపడకమానదు. వ్యవస్థాభిలాషియైన సహృదయుడు రచనలలోని తారతమ్యాలను నిర్ణయించుకొనేటప్పుడు తన వయస్సును, అభిమతాలను స్మరించి, వాటికి విపరీతాలై ఇంతకు పూర్వం అవస్థలలో కలుగుతున్నవాటిని బట్టి ఆ యా కోవలకు చెందిన కృతులుగా పరిగణించవలసి ఉంటుంది. వయస్సు మున్నగువానికి అనుగుణాలైన రచనల

విషయంలో పాఠకుడు తన నిర్ణయాన్ని ప్రామాణికంగా భావించుకొనకపోవటం మేలు. దీనివలన ప్రమాదానికి తావుండదు.

విశిష్ట అనుభవనిష్పాదక మైన సాహిత్యప్రపంచానికీ, లౌకికప్రపంచానికీ సంబంధం ఏమిటి? లౌకిక ప్రపంచవాసియైన కవి అలౌకికానుభవ ప్రతిపాదకమైన సాహిత్య సంసారానికి ఎలా ప్రజాపతి అవుతున్నాడు?

సాహిత్యం శబ్దరూపి. శబ్దాలు, అర్థాలు లౌకికాలు. వీటి గుణదోషాలూ లౌకికాలు. రసదోషాలు కూడ లౌకికాలే. కనుక సాహిత్యం గూడ లౌకికం కావాలి. ఇలా అన్నప్పుడు కొన్ని సందేహాలు కలుగకమానవు. కవిత్వంలో ఆకాశ్కుల గుర్రాలు, చల్లని నిప్పులు, పగటి వెన్నెలలు మున్నైనవి ఉంటవి. లోకంలో కనిపించే కార్యకారణభావం కావ్యలోకంలో కనిపించదు. లోకంలోని వస్తువులు సుఖమో, దుఃఖమో, మోహమో కలిగిస్తుంటే, కావ్యంలోని అర్థాలు ఆనందంమాత్రమే కలిగిస్తున్నవి. కనుక సాహిత్యం లౌకిక మెలా అవుతుంది?

స్వప్నంలో ఈ విశేషాలు కనిపిస్తున్నవి. అయితే ఎల్ల స్వప్నాలు ఆనందప్రదాలు కావు. కాని కాదాచిత్కంగానైనా ఆనందప్రదస్వప్నాలు కలుగకపోవడం లేదు. ఇలాంటి స్వప్నం కూడ అలౌకికం కావాలి. కాని స్వప్నం కూడ లౌకికమే. సాపేక్షాలు, లేదా హేతు ప్రత్యయసంజాతాలన్నీ లౌకికాలే. జాగ్రదవస్థలో ప్రాప్తించిన అర్థాలే సంస్కారరూపాన ప్రాజ్ఞునిలో (unconscious) నిలిచి ఉండి నిద్రితుని తీరని కోరికలచే ప్రేరితాలై తైజసుని (preconscious) శాసనాన్ని బట్టి వ్యత్యయం పొంది స్వప్నంలో గోచరిస్తున్నవి. అంతేకాని, అభావం నుంచి ఉత్పన్నం కావటం లేదు. కనుకనే యోగదర్శనం స్వప్నాన్ని భావితస్మర్తవ్యంగా పరిగణిస్తున్నది.

కనుక స్వప్నం వలెనే కావ్యమూ లౌకికమే. లౌకికమైన కావ్యం అలౌకికమైన అనుభూతిని ఎలా కలిగిస్తున్నది? ఈ ప్రశ్న కార్యకారణభావం వలెనే అత్యంతక్లిష్టం. వివాదాస్పదం. బీజం వలన అంకురసిద్ధి అనుభవప్రసిద్ధం. అలాగే కావ్యపఠనం వలని అలౌకికానుభవం కూడ.

---

1. జాగరితస్థానో బహిష్ప్రజ్ఞః .... స్థూలభుగ్వైశ్వానరః స్వప్నస్థానోఽంతః ప్రజ్ఞః ప్రవివిక్తభుక్తైజసః – యత్ర సుప్తో న కంచన కామం కామయతే న కంచన స్వప్నం పశ్యతి తత్ సుషుప్తం సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభుక్ చేతోముఖః ప్రాజ్ఞః –

మాండుక్యం : 3 – 5 మంత్రాలు

అయితే, కావ్యావిర్భావానికీ, స్వప్నోద్భవానికీ కొంత సాదృశ్యం కనిపిస్తున్నది. అదూరవర్తి అయిన (స్వప్నానికి క్రిందటి పగటివేళ గాని, మూడు నాలుగు రోజులలోపల గాని జరిగిన) జాగ్రదవస్థాంతర సన్నివేశం అవలంబనంగా గొని స్వాపి అనవాప్త కామం ప్రాజ్ఞ నిలీన సంస్కారాలలో తనకు అనుకూలమైనవాటిని మేలుకొలిపి వైశ్వానరునకు (conscious) అవిరుద్ధమైన చతుర్విధాభినయం పట్టించి, తైజసుని సమక్షంలో నాటక మాడిస్తుంది. ఈ నాటకానికి తీరని కోరిక కవీ, సూత్రధారుడూ అవుతున్నది. కోరికకు ఇష్టమైన సంస్కారాలు నటులు. ప్రాజ్ఞతైజసులు సామాజికులు. ఈ నాటక ప్రయోగంతో సంతృప్తిపొందుతున్నది. ప్రాజ్ఞతైజసులు మాత్రమే. ప్రాజ్ఞునకు దీనితో సంబంధం లేదని మాండూక్యం చెబుతున్నది. ఫ్రాయిడ్ ఉన్నదంటాడు. ప్రాజ్ఞునకు సంబంధం ఉన్నదా లేదా అన్న విషయం మనకు ముఖ్య కాదు. వైశ్వానరునకు మాత్రం ఇందు కర్తృత్వం కాని, భోక్తృత్వం కాని లేదు. ఇది అటు మాండూక్యానికీ ఇటు ఫ్రాయిడ్‌కు సమ్మతమే. ఈ హేతువు వలన మందవేదనాలైన స్వప్నాలు వైశ్వానరుని ధారణలో నిలువవు. తీవ్రవేదనాలైన స్వప్నాలు వైశ్వావనరునకు గుర్తుంటవి. స్వప్నాలు తీవ్రతర వేదనాలైనప్పుడు అతడు మేల్కొంటున్నాడు. వైశ్వానరునకు గుర్తున్న స్వప్నాలు అర్థరహితంగా విచిత్రంగా కనుపిస్తవి. సంగ్రహంగా చెప్పాలంటే స్వప్నాలు ప్రాయికంగా తీవ్రతమ వేదనాలు కావు. పైగా జాగ్రదవస్థాబాధితాలు అవుతున్నవి. వాటిలో సాధారణీకృతి ఉండదు. స్వాపి కోరుకొన్నప్పుడు కోరుకొన్న తీరున కొరుకొన్న స్వప్నాలు పొందలేడు. అంటే స్వప్నాలు స్వాపి ఇచ్ఛానువర్తులుకావు. వాటిని అతడు శాసించలేడు. అతడు వలదనుకొన్నా స్వప్నాలు రావచ్చు.

ఇక కావ్యావిర్భావం - జీవితంలో విన్న విశేషం కాని, కన్న విశేషంకాని రచయితను ఆకర్షిస్తుంది. ఒక్కొక్కప్పుడు అది అతనిని కలవరపెట్టవచ్చును. అలాంటి విశేషాన్ని రచయిత విడువక మననం నుస్తాడు. ఆ మననంతో ఒక విధమైన దృష్టి, భావతీవ్రత రచయితలో బయలుదేరుతుంది. దృష్టి ప్రబలమై విస్పష్టమైనకొలది ప్రాజ్ఞభూమిలో భావనలు మోసులెత్తుతవి. ఇలా బయలుదేరుతున్న భావనాంకురాలను వైశ్వానరగత ఔచిత్యానౌచిత్య జ్ఞానం. గుణదోష వివేచనాశక్తి పరిశీలిస్తూ అనర్థాలను సమయించి తక్కినవానికి బలం సమకూరుస్తుంది. దీనితో భావతీవ్రత అధికమవుతుంది. అంటే తాపక శక్తి పెరుగుతుంది. తపనం అతిశయించినకొలది జతుసదృశమైన మనస్సు క్రమంగా కాఠిన్యం కోల్పోయి శిథిలమై ద్రవించిపోతుంది. ఈ క్రమంలోనే అహంత శిథిలమై ద్రవించగా వర్ణనీయార్థం విస్పష్టతరమై చిత్రీకృతి పొందుతుంది. అంటే మథిత పయోధినుంచి లోకోత్తరవస్తువు లుద్భవించి దేవదానవులను అద్భుతానందాలలో

ముంచినట్లు మథితప్రాజ్ఞ సముద్భూత వర్ణనీయార్థాను లోకోత్తరాలై భాసిస్తూ ప్రాజ్ఞ, తైజస, వైశ్వానరులను ఆనందపరవశులను చేస్తవి. సంగీత, లయ, తాళ వృత్త వశంగతుడైన నటుడు మౌళిస్థకుంభ పరిరక్షణలో ప్రేలుమాలనట్లు రచయిత ఆ స్థితిలో రచనాక్రియను మానడు. తనకు కలుగుతున్న అనుభవాన్ని అతడు వ్రాస్తాడు. అయితే రచయిత ఎప్పుడు వ్రాస్తాడు? అనుభవం కలిగిన తరువాత దానిని గ్రంథస్థం చేస్తాడా? కాక రచనకు ఉపక్రమించిన తరువాత ఆ అనుభవమే రచనను నడుపుకొని పోతుందా?

ఈ ప్రశ్నలకు ఇదమిద్ధమని సమాధానం చెప్పలేము. ఇవి రచయిత స్వభావం మీద రచనమీద ఆధారపడుతవి. ధారణ కలిగిన రచయిత తన కృతి చిన్నదైనప్పుడు ముందు ఆ అనుభవం పొంది ఉత్తరకాలంలో దానిని గ్రంథస్థం కావించవచ్చును. లేదా, కృతి పరిమాణంతో నిమిత్తం లేక అనుభవం పొందుతూ రచన సాగించవచ్చును. కాక మనస్సులో జరుగవలసిన వ్యాపార మంతా కాగితం మీదనే సాగించవచ్చును.

రచయిత కావిస్తున్న యీ సృష్టికీ, స్వాపి పొందుతున్న స్వప్నానికీ కొన్ని సాధర్మ్యాలు, మరికొన్ని వైధర్మ్యాలు ఉన్నవి. కావ్యార్థాలు స్వప్నార్థాలు జాగ్రదవస్థాంతర అర్థాలమీద ఆధారపడుతున్నవి. జాగ్రదవస్థ, లోకమూ లేక కవిత్వమూ లేదు, స్వప్నమూలేదు. ఈ రెండింటియందునూ బాహ్యజగత్తువిస్మృత మౌతున్నది. కావ్య స్వప్నార్థాలు రెండూ విచిత్రాలు, లౌకిక ధర్మాతిక్రామకాలు, ప్రమాతకు పారవశ్యకారణాలు. ఈ రెంటి ఆవిర్భూతికీ మూలం ప్రాజ్ఞుడే. ఒకసారి పొంది కలను యథాతథంగా స్వాపి వేరొకసారి పొందలేడు. అలాగే రచయిత ఒకసారి సృష్టించిన అనవధారితకృతిని వేరొకసారి యథా తథంగా సృష్టించలేడు. కాకున్న ఆ తాత్పర్యంతో వేరొక కృతిని సృష్టించవచ్చును.

ఇక వైధర్మ్యాలు - స్వాపి తన తీరని కోరికకు దాసుడై కలలు కంటున్నాడు. కవి నిజద్రవణీయ దృష్టిప్రచోదితుడై రచన సాగిస్తున్నాడు. స్వాపికి కల అనివార్యం. అందలి వేదనలూ అనివార్యాలే. కృతిసముద్భూతి అట్టిది కాదు. రచయితకు ఇష్టం లేనప్పుడు రచనను నిలిపివేస్తాడు. రచన పూర్తిగా అతని సంకల్పవికల్పాల మీదనే ఆధారపడుతున్నది. కనుకనే 'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః యథాఽస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే' అని ప్రాచీనులు పేర్కొన్నారు. స్వప్నం వైయష్టికం, దురవబోధం, మార్మికం, జాగ్రద వస్థాబాధితం. కావ్యార్థం విశ్వజనీనం, సుజ్ఞానం, అర్థవంతం జాగ్రదవస్థాఽ బాధితం, స్వప్నం కుంభగత నశ్వరదీపమైతే, కావ్యం స్నేహాస్నిగ్ధవర్తులను వెలిగించే బాహ్యారత్నదీపం.

కవి శ్రుతదృష్టార్థ ప్రబుద్ధుడై ద్రవణీయ నవ్యనవ్యదృష్టితో సమాధ్యవస్థ పొంది కృతి నిర్మిస్తున్నాడు. కావ్యార్థం ప్రాజ్ఞునిలో నుండి బయలుదేరి తైజస, వైశ్వానరగత సంస్కార

పరిష్కృతమై పరిపూర్ణరూపం పొందుతున్నది. కవి తన రచనలోని వైశ్వానరగత సంస్కార పరిష్కృతాంశం మాత్రమే వివరించగలడు గాని ప్రాజ్ఞసముద్భూతాంశం వివరించలేడు. అంటే ప్రతిభా సముత్పన్నాంశం వివరించలేడు. దానిని మరొకనికి నేర్పనూలేడు. ఛందోవ్యాకరణాలంకారాదిశాస్త్రాలు గూడ ఇక్కడ తమ అశక్తతను అంగీకరించక తప్పదు. 'రాజన్ భోజనం దేహి' అన్న నీరసవాక్యాన్ని ఏ శాస్త్రం కవిత్వంగా మారుస్తుంది? ఒక్క కవిహృదయం మాత్రమే ఆ పని చేయగలదు. అయితే కవులందరూ ఒకేతీరున దానిని కవిత్వంగా మార్చలేరు. కవివ్యక్తి భిన్నత్వం పొందుతుంది.

ఇక లోకానికీ, కవిత్వానికీ, కవికీ, లోకానికి ఉన్న సంబంధం పరిశీలనార్హం. లోకానికి ఆద్యంతా లున్నట్లు గోచరించదు. విశ్వం యొక్క గమ్యంకాని విశ్వగతవిషయసంఖ్యా ప్రయోజనాలు కాని బోధపడవు. ఈ విషయాన్ని విజ్ఞానశాస్త్రాలన్నీ ముక్తకంఠంతో ఘోషిస్తున్నవి. తత్త్వశాస్త్రాలలోని కొన్ని మతాలు దీనిని అంగీకరించక పోవచ్చును. అయితే ఇవి నాగార్జునుడు, శంకరుడు, కాంటు మున్నైనవారి ప్రశ్నలకు సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది. ఏది ఎలా ఉన్నా ఆకాశాన ఎన్ని నక్షత్రాలున్నవో, ఎందుకున్నవో ఎవరు చెబుతారు? అగ్నికి ఔష్ణ్యం, జలానికి శైత్యం, పృథివికి గంధవత్త్వం, శిఖలకు ఊర్ధ్వప్రసారణం దేనికి అంటే సమాధానం దొరకదు. ఆయా గుణకర్మలు వానికి స్వాభావికాలని సరిపెట్టుకోవాలి. ఇలాంటి లోకం కార్యకారణబద్ధమై విభిన్న ప్రవృత్తులకు హేతువవుతున్నది. సాహిత్యసంసారం అపారమే కాని ఏకకావ్య ప్రతిపాదితప్రపంచం ఆదిమధ్యాంతసహితం – అందలి సన్నివేశాలు, పాత్రలు, పరిమితాలు, స్వప్రయోజనాలు. లౌకికనియతి, కార్యకారణభావం కావ్యంలో ఉల్లంఘితాలవుతాయి. నదీ ప్రవాహంలో తామర లుంటవి. అగ్నులు చందనశీతలా లవుతవి. శిలలు ద్రవిస్తాయి. చెట్లు అశ్రుపాతం కావిస్తాయి. సహృదయులు విభిన్నప్రవత్తు లయినా కావ్యం నియతంగా ఆనందం కలిగిస్తున్నది.

లోకానికి, సాహిత్యానికి, ఇన్ని వ్యత్యాసాలున్నా లోకం కావ్యానికి మూలమౌతున్నది. సూర్య కిరణం స్ఫటిక విశ్లేషితమై వర్ణసప్తకాన్ని ప్రసవిస్తున్నది గదా. ఇక కవికీ లోకానికీ ఉన్న సంబంధం – లోకానుభవ సంపత్తివల్ల కవికి రాగాది రంజిత ద్రవణీయదృష్టి ఏర్పడుతున్నది. శ్రుత దృష్ట లౌకికార్థం వల్ల యీ దృష్టి ప్రబుద్ధమై కవికి సమాధ్యవస్థ కల్పిస్తున్నది. ఈ యవస్థలో అతని దృష్టి ప్రాజ్ఞ నిలీన లౌకికానుభూతులకు ఆత్మానుగుణ

---

2. ''కావ్యార్థనిష్ఠారత్యాద్యాః స్థాయినః సంతి లౌకికాః
దదృష్టభృనిష్ఠాస్త్వపరే తత్సమా అప్యలౌకికాః॥''
– భక్తిరసాయనం : తృ ఉ. 4

దేశ, కాల, పాత్రాదికముతోబాటు ఆదిమధ్యాంతాలు కల్పించి కవిచే వాటిని ఆస్వాదింపజేస్తూ కృతిని రచింపజేస్తుంది. ఇలా శబ్దనిబద్ధమైన కృతి లౌకికం, ఆస్వాదనలో మాత్రమే ఇది ప్రాచీనులు పేర్కొన్నట్లు అలౌకికం[2].

అనుభవసంపన్నుడైనా కవి ద్రవణీయ దృష్టివిరహితుడై సమాధ్యవస్థ పొందక కావ్యం నిర్మించలేడు. ఇందులో ఏది లోపించినా కావ్యత్వం లోపించక తప్పదు. పరినిష్ఠిత సమచిత్తులు లోకాన్ని ఆనందమయంగా దర్శించి పరవశులు కావచ్చును. కాని, అలాంటివారు కావ్యనిర్మాతలు కాలేరు. గాఢదృష్టికవితులు కర్మణ్యులు అవుతారే కాని, తన్మయీభావం పొందలేరు. తన్మయీభావయోగ్యత లేకపోవటంవల్ల వీరు కృతి నిర్మించినా అది శుష్కకాష్ఠం అవుతుంది కాని కావ్యం కాదు. కావ్యాస్వాదనకు దృష్టి అక్కరలేదు. కాని తన్మయీ భావయోగ్యత మాత్రం అవసరం.

ఆధివ్యాధిపీడితులు, క్షుత్పిపాసార్థితులు అయినవారు యోగానికి వలెనే కావ్యనిర్మాణాస్వాదనలకు అనర్హులు. అశక్తులు. ఈ పరిశీలనను బట్టి సాహిత్యభవితవ్యాన్ని గూర్చి ఏమి చెప్పుకోవాలి?

కావ్యావిర్భూతికి సమాహిత ద్రవణీయదృష్టి ఆవశ్యకం. కావ్యాస్వాదనకు పాఠకుని యందు తన్మయీభావయోగ్యతాస్తిత్వ ముఖ్యం. ప్రకృతస్థితిగతులు వీటికి ఎంతవరకు పోషకంగా ఉన్నాయి?

**1914 నుండి ఇంతవరకూ వాటిల్లిన ప్రపంచ యుద్ధద్వితయం వల్ల ప్రపంచ మేధావుల విశ్వాసాలు, ఆదర్శాలు, లక్ష్యాలు బదాబదలై అనవస్థితి పొందాయి ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి పూర్వం రచయితలకు సోషలిజంలోనో, కమ్యూనిజంలోనో, పరిష్కృత ప్రజాస్వామ్యంలోనో విశ్వాసం ఉండేది. అణ్వాయుధాలు వచ్చినవెనుక ఆ విశ్వాసం సడలిపోయింది. సాయుధసంఘర్షణ పరిహరించగలిగిన విశ్వకల్యాణప్రద లక్ష్యం కోసం రచయితలు అన్వేషణ సాగిస్తున్నారు. ఇంతవరకూ వారికి ఒక విస్పష్టదృష్టి ఏర్పడలేదు. విస్పష్టదృష్టి లేనప్పుడు రచన ఎలా వెలువడుతుంది? వెలువడినా అందులో జీవం ఎలా ఉంటుంది?**

వెనుకబడిన దేశాలకు ఈ చిక్కు లేకపోవచ్చును. అచటి రచయితలకు సోషలిజం లోనో, కమ్యూనిజంలోనో, ప్రాచీనజాతీయవ్యవస్థా సముద్ధరణంలోనో వ్యవస్థిత దృష్టి ఉండవచ్చును. నిజానికి అలాగే ఉన్నది. అయితే ఆ దృష్టి ఆ ప్రాంతీయులకు నచ్చవచ్చు నేమో కాని, అది విశ్వజనీనం కానొల్లదు. కనుక అట్టి రచనలు విశ్వజనాదృతి పొందజాలవు.

నిజానికి ఆ కృతులు ఆ యా దేశపు ఎల్లలు దాటి అవతలికి పోవు. దీనినిబట్టి అగ్రగామి దేశాలలోగాని, వెనుకబడిన దేశాలలోగాని ఉత్తమ కృతులు వెలువడటానికి బొత్తిగా అవకాశాలు లేవని భావించరాదు. సత్కావ్యావిర్భావానికి అవకాశాలు తక్కువని చెప్పటమే ప్రకృత తాత్పర్యం.

ఇక రెండవ అంశం.... కావ్యత్వం ఆస్వాదనతో గాని నిరూఢం కాదు. నేటి ప్రజలకు భౌతికభోగాలలో ఉన్న ఆసక్తి మరి దేనిలోనూ లేదు. ప్రభుత్వాలు గూడ తమ ప్రజలు సగటున తలఒకటికి వాడుకొనగలుగుతున్న విద్యుచ్ఛక్తి, వస్త్రాలు, ఆహారపదార్థాలు, మందులు, కార్లు, నివేశనప్రదేశాలు, రేడియోలు మున్నుగా గల వస్తువుల పరిమాణాలను బట్టి తాము సాధించిన అభ్యుదయాన్ని నిర్ణయిస్తున్నవి. బాధావిమోచన మేదైనా సేవ్యమే నని, పరమౌషధ మనీ రోగి భావిస్తున్నట్లే. అధికారమో, ఐశ్వర్యమో, తత్సాధనమో అనుగ్రహించేదేదైనా అభిలషణీయమని ఈనాడు సామాన్యప్రజానీక మంతా భావిస్తున్నది. ఇప్పటి జీవిత వ్యవస్థ కూడ ఐశ్వర్య, అధికారరూప సద్యఃఫల మివ్వని కర్మను పూర్తిగా త్రోసివేస్తున్నది. కావ్యంవల్లగాని, తక్కిన లలితకళాఖండాలవల్ల గాని లోకోత్తరానుభూతి కలుగుతున్నదే కాని లౌకికమైన సద్యఃఫలం కలగడం లేదు. కనుక భౌతికభోగలాలసమైన ప్రజానీకం కావ్యాస్వాదనకు దూరమౌతున్నది.

162 భౌతిక భోగాలు పరమార్థాలైనప్పుడు తృష్ణ పెచ్చరిల్లక తప్పదు. దాని వలన వ్యగ్రత సంశయం, ఆందోళన, భీతి కలుగుతున్నవి. వీటివల్ల మైత్రి, కరుణ లోపిస్తున్నవి. ఈ లోపం వల్ల పాఠకులు కావ్యపఠనకాలంలో పొందవలసిన సమాధ్యవస్థ పొందలేకపోతున్నారు. ఈ దుఃస్థితికి రాజకీయపక్షాభినివేశాలు అపూర్వదోహదం కల్పిస్తున్నవి. వివిధదేశాలలో కమ్యూనిస్టుపార్టీలు అవతరించినతరువాత మత, సాంఘిక, సాంస్కృతిక రంగాలు స్వాతంత్ర్యం కోల్పోయాయి. తమ పక్షాలను బలపరుచుకోవటానికి కమ్యూనిస్టు పార్టీలు, విజ్ఞానశాస్త్రాల తత్త్వంనుంచి లలితకళల తత్త్వం దాకా నిర్వచిస్తూ తదనుగుణంగా ఉన్నవే యోగ్యాలనీ, విరుద్ధాలన్నీ అభ్యుదయ నిరోధకాలనీ ప్రచారం ప్రారంభించాయి. ఆ పక్షాలను చూచి తక్కిన రాజకీయపక్షాలు గూడ తమ తమ ఆశయాలకు అనుగుణమైన దురభిమానాలు రేకెత్తిస్తున్నవి. దీని మూలాన ప్రజలలో సహనం, తన్మయీభావయోగ్యత క్షీణిస్తున్నవి. ప్రాచీనులు జరన్మీమాంసకాదులను సభాంతర స్తంభ కుడ్యపసదృశులనీ, రసాస్వాదనకు అయోగ్యులనీ అన్నారు. ఇవాళ అలాంటివారు రాజకీయపక్ష దురాశ పరులంటే అతిశయోక్తి కాదేమో.

రాజకీయ పక్షాలకు నేడు రాజ్యం కూడ తోడవుతున్నది. అంతర్గత శాంతి, న్యాయ సంరక్షణమూ, విదేశ దండయాత్రా ప్రమాద నిరోధమూ మాత్రమే తన కర్తవ్యమని

19వ శతాబ్దాంతం వరకూ భావిస్తూ వచ్చిన రాజ్యం 20వ శతాబ్ది ప్రథమపాద అంతిమభాగం నుంచి వివిధరంగాలలో విశేషాధికారాలను స్వాయత్తం చేసుకొని విశ్వరూప ప్రదర్శనం ప్రారంభించింది. అమెరికా (యు.ఎస్.ఎ.) వంటి రాజ్యం కూడ సాంస్కృతిక రంగంలో ప్రవేశించి తన విధానానికి సమ్మతాలైన కృతులనే ఇతర దేశాలలో ప్రచారం చేస్తున్నది. ఇక కమ్యూనిస్టు రాజ్యాలు నిర్వహిస్తున్న పాత్ర చెప్పనక్కరలేదు. ఆ దేశాలలో ప్రభుత్వానికి వంతపాడే కృతులే ప్రచురణభాగ్యం పొందుతున్నవి. ఎదురు తిరిగిన రచయితలు కారాగారాలకు వెళ్ళక తప్పటంలేదు. భావస్వాతంత్ర్యం లేనిచోట ఉత్తమ కృతులు ఎలా వెలువడుతవి? విప్లవానికి పూర్వం తన సాహిత్యంతో ప్రపంచాన్ని ఉర్రూతలూచిన రష్యా ఆ విప్లవానంతరం చెప్పుకోదగిన కృతులను ఉత్పాదించలేకపోయింది.

ప్రజాస్వామిక రాజ్యమైన భారతదేశంలో గూడ ప్రభుత్వం రాష్ట్రస్థాయిలోను, అఖిల భారతస్థాయిలోను అకాడమీలను నియమించి అధికారాన్ని ప్రస్ఫుటం చేస్తున్నది. కొన్ని రాష్ట్రాలు పాఠ్యగ్రంథాలను గూడ తామే ప్రకటిస్తూ ప్రాథమిక విద్య నుంచి ఉన్నత విద్య వరకూ గల చదువుసంధ్యలను గుప్పిట బిగించుకొన్నవి. విశ్వవిద్యాలయాలు కూడ మరెంతో కాలం స్వతంత్రంగా ఉండవు. అయితే కమ్యూనిస్టు రాజ్యాలలో ఉన్న కఠిన శాసనాలు ఇంతవరకూ లేకపోవటం ఒక్కటే అభినంద్యం. ఇక మన అకాడమీలచే సమాదృతి పొందుతున్న కావ్యాల విశిష్టత ఎవరికి వారే ఊహించుకోవచ్చును. ముంజేతి కంకణం ఉండగా అద్దం దేనికి?

ఇంతకుముందు పేర్కొన్నవాటి కంటె ప్రబలమైన విశేషం మరొకటి ఉన్నది. ఉత్తమకృతుల ఆవిర్భావానికి సమాజంలో కొంత నిలకడ అవసరం. సాంకేతిక విద్యావిజృంభణంతో మున్నెన్నడూ ఊహించనంత త్వరితంగా ఏ ఒక దేశముందో కాక, ప్రపంచమంతటా విపరీత పరిణామాలు వస్తున్నవి. వెనుకటి సామాజిక వ్యవస్థలన్నీ బదాబదలయ్యాయి. నిన్నటి స్థితిగతులు నేడు లేవు. నేడున్నవి రేపుండవు. ఈ పరిణామం అంతకూ తీవ్రతరం, శీఘ్రతరం అవుతున్నది. భౌతిక సుఖలాలసుడైన మానవుడు, ఈ విపరీత త్వరిత పరిణామాలకు స్వాగతం చెబాతాడే కాని శ్రేయోదాయకాలు కావని నిరోధం కల్పించగలడా? మన దేశం శాంతిని కాంక్షించి, సైనిక వ్యయం తగ్గించుకొని తాను కోరుకొన్న మార్గాన జీవించటానికి యత్నించింది.

కాని చైనా తన సైన్యాలను పంపి దురాక్రమణ జరిపింది. దీనితో ఆత్మరక్షణకోసం మనదేశం సైన్యాన్ని పెంచుకోవలసి వచ్చింది. అత్యయిక స్థితిని ప్రకటించి చైనా అనుసరించిన మార్గాలే అనుసరించి యుద్ధసన్నద్ధం కావలసివస్తున్నది. స్వాతంత్ర్యం కాపాడుకోదలచిన

దేశాలకు సాంకేతిక విద్యాబలిష్ఠ రాజ్యాలప్రమాదం నుంచి రక్షించుకోవాలంటే ఆ సాంకేతిక విద్యాభివృద్ధికంటే గత్యంతరం ఉన్నదా? ఏది ఎలా ఉన్నా ప్రపంచవ్యాప్తంగా విపరీత పరిణామం మహాప్రవాహం వలె వచ్చి పడుతున్నప్పుడు ఏకైకంగా వ్యక్తులు గాని, రాజ్యాంగం గాని దానిని నిరోధించటం అసంభవంగా కనిపిస్తున్నది.

స్థితిగతులు ఇంత త్వరితంగా మారుతున్నప్పుడు రచయితకు గాని, పాఠకునకు గాని విస్పష్టదృష్టి, విలువలు ఉండటానికి వీలున్నదా? ఈ ఇరుపక్షాలు విభ్రాంతాలై ప్రతిదీ తాత్కాలికమని భావించవా? ఇంతమాత్రాన లలితకళాసృష్టి మొదలంట స్తంభించిపోతుందని చెప్పలేము. చెప్పరాదు. కాని జీవితం నిలకడ లేక త్వరిగతిని మారుతున్నప్పుడు తదనుగుణమైన మార్పులే సాహిత్యంలోను తక్కిన లలితకళలలోను వస్తవి. సమాధ్యవస్థాపాదకాలైన కృతులకు అవకాశం తక్కువ. తదాస్వాదనశక్తి గూడ సన్నగిలక తప్పదు. వెనుకటిలోవలె నవ్యకృతులు ఇక మీదట నాలుగు కాలాలపాటు నిలవటం అసంభవంగా కనుపిస్తున్నవి. ఇంతకు మున్ను సమాదృతాలైన కృతులనే అయినట్లు, కానట్లు – విశ్వవిద్యాలయాలు ఆదరించవచ్చును. క్రొత్తగా వెలువడే రచనలు స్వల్పకాలం నిలిచి ఆమీద విస్మృతి పథంలో లీనమైపోతవి. ఈ రచనలయందలి వస్తుశిల్పాలు గూడ పత్రికావార్తలవలె ఉద్వేజకాలుగా ఉంటవి. అంటే పత్రికా రచనమే (Journalism) సాహిత్యంగా చెలామణి అవుతుంది. ఈ లక్షణాలు ఇప్పుడే కొంతవరకు గోచరిస్తున్నవి.

# రష్యాలో రైతు

సాహిత్యంలో వాస్తవిక వాదానికి రష్యన్ రచయితలను చెప్పిన తరువాతే ఎవరినైనా చెప్పాలి. అసలు వాస్తవిక వాదం మొదట రష్యన్ సాహిత్యంలో పుట్టి, తరువాత ప్రపంచ సాహిత్యాలన్నిటిలోకీ వ్యాపించిందంటే ఏమాత్రం అతిశయోక్తి లేదు. వాస్తవిక వాదానికి విశిష్టత ఉత్తమస్థానం కల్పించింది, పెంపొందించింది రష్యన్ రచయితలే. 1920 నుంచి పుష్కిన్, గొగోల్‌టర్గన్, టాల్‌స్టాయ్, డాస్టావస్కి, చకోవ్, గోర్కీ మొదలైన రష్యన్ రచయితలు జీవం పోశారు.

ఈ వాస్తవిక వాదానికి ఆదర్శం కేవలం నిత్యనైమిత్తికాలను వర్ణించుటం కాదు. మానవునిలోవున్న పశుత్వాన్ని, నైచ్యాన్ని, అజ్ఞానాన్ని అర్థరహితంగా చిత్రించటంకాదు. సాహిత్యానికి పరమావధి ఉంది. మాక్సింగోర్కి అన్నట్టుగా సాహిత్యం మానవుణ్ణి తన్నుతాను అర్థం చేసుకోవటానికి తోడ్పడాలి. అతనిలో ఆత్మవిశ్వాసం పెంపొందించాలి. సత్యం తెలుసుకొందామన్న తహతహలు కలిగించాలి. తనలో ఉన్న లోటుపాట్లను తెలుసుకొని వాటిని సమూలంగా పెకలించటానికి తోడ్పడాలి. తనలోని మంచిని తెలుసుకొనేటట్లు చేయాలి. తనలో పశుత్వ మున్నందుకు లజ్జ, అన్యాయం జరుగుతున్నందుకు క్రోధం, అధర్మాన్ని ప్రతిఘటించటానికి ధైర్యం పెంపొందించాలి. మానవునిలో నైతికబలం, సౌందర్య పిపాస, జీవితంపై అనురక్తి కలిగించాలి.

ఇలాంటి ఆదర్శాలు ప్రధానమైనప్పుడు, వ్యక్తి, సంఘం వ్యక్తి గుణావగుణాలు జ్ఞానాజ్ఞానాలు, ప్రవర్తన, భాష, సంఘాచారాలు, సంస్థలు, వాటిలోని కీడు, మేళ్ళు ధర్మాధర్మాలు, యథాతథంగా స్వీకరించక తప్పదు. ఇవి క్షణికాలనీ, మాయా కల్పితాలనీ, పురాకృత సుకృతాకృత ఫలాలనీ, దైవలిఖితమనీ, మంచి చెడ్డలకు భగవంతుడుండగా మనకెందుకు లెమ్మనీ ప్రాలుమాలటానికి వీలులేదు. వ్యక్తివిశిష్టమైన సంఘమంతా ఆమూలాగ్రం సాహిత్యానికి వస్తువైపోతుంది.

సంఘమంటే రష్యాలో నాటికీ నేటికీ అధిక భాగంరైతులే! రైతులేకపోతే 1918 వరకు ముప్పాతిక సంఘం లేదనే చెప్పాలి. అందువల్ల సాహిత్యంలో వాస్తవిక వాదం కోసం పోరాడుతూ వచ్చిన రష్యన్ రచయితలు తమ రచనలలో సర్వసాధారణంగా రైతుకు ప్రాధాన్యం ఇస్తూ వచ్చారు. పెక్కుకథలలో నాటకాలలో, నవలలలో రైతులే నాయకులు, కొన్ని రచనలలో రైతులు కనిపించకపోయినా, వారిస్థితి గతులు, కష్టనిష్ఠురాలు, సాధక బాధకాలు, గుణావగుణాలు, పరంపరా సంబంధంగానైనా చిత్రించబడటం జరిగింది.

ఈ వాస్తవిక వాదం రసపుష్టికోసమని యదార్థ జీవితాన్ని తారుమారు చేయడం కాని, తమ సిద్ధాంతాలకోసం అతిశయోక్తులు తెల్పటంకాని, అభూత కల్పనలు చేయటంకాని, కృత్రిమత్వం ప్రవేశపెట్టంకాని జరగలేదు. రైతును వర్ణించినా, కార్మికుణ్ణి చిత్రించినా, విద్యావంతుణ్ణి ఉల్లేఖించినా, జమీందారును ప్రస్తరించినా, అతని మనోవాక్కాయ కర్మలలో గోచరించే వాస్తవికత్వాన్ని, దానివల్ల సంఘానికి మానవత్వానికి జరుగుతున్న ఉపకారాపకారాలను యథాతథంగా చిత్రించారు.

రష్యన్ వాస్తవిక వాదంలోని విశిష్టత తెలుసుకోవాలంటే మన పూర్వీకుల రచనలను తీసుకొంటే తేలిపోతుంది. మన పూర్వకవుల్లో రైతులనుగూర్చి వ్రాయకపోలేదు. హాలుడు గాథాసప్తశతిలో ఎక్కువభాగం గ్రామ జీవితాన్ని గూర్చి వ్రాశాడు. కేవలం రైతులను గూర్చి వ్రాసిన గాథలు ఇరవైకిపైగా ఉన్నాయి. భార్యను కోలుపోయిన రైతును గూర్చి దున్నే దున్నే యెద్దును పోగొట్టుకున్న నిర్భాగ్యుణ్ణి గూర్చి, తడిపుడకలతో పొయ్యి మండక అవస్థపడే యిల్లాలిని గూర్చి వ్రాశాడు. అయితే మన సంప్రదాయం సూచిస్తున్న అర్థాన్ని బట్టిచూస్తే అవి కేవలం శృంగారం ఒలికించడం కోసం వ్రాసినవే గాని మరొకటిగాదు. సంప్రదాయాన్ని ఆవల ఉంచి ఉన్నవి ఉన్నట్టుగా అర్థం చెప్పుకొన్నా, రైతు మనః ప్రపంచంలో కాని, బాహ్యప్రపంచంలో కాని జీవన్మాత్రుడుగానైనా పడే సంఘర్షణ
166 కనిపించదు. మృచ్ఛకటికంలో దొంగదగ్గరనుంచి రాజుదాకా చిత్రించాడు. కాని అతని దృష్టి ఒకటే. ఈ జీవితమంతా వట్టిమాయ. వట్టే మట్టిబండి. తెలుగు సాహిత్యంలో చూదామా, బసవ పురాణం, ఆముక్త మాల్యద, పాండురంగ మహాత్మ్యం రైతు శ్రమజీవితాన్ని అసలు స్పృశించకపోలేదు. కేవలం భక్తికి దైవదీక్షా ప్రచారంకోసం రైతుజీవితాన్ని పేర్కొన్నది. ఆముక్తమాల్యద ఆవులమందలవెంట పరిగెత్తే ఆబోతులను, రైతుస్థితిగతులను పేర్కొన్నది. పాండురంగ మహాత్మ్యం పల్లెటూరిజీవి కాపును వర్ణించింది. అయితే రైతు మనస్సును, సంఘంలో అతడు గడిపే జీవితాన్ని అతని సమస్యలను విశదంగా కాని, సూచన ప్రాయంగా గాని వర్ణించలేదు.

1830 నుంచి వచ్చిన రష్యన్ సాహిత్యం, నిత్యజీవితాన్ని, సమస్యను కూలంకషంగా చిత్రించింది. అనూచానంగా వస్తూవున్నంతమాత్రాన దోషాలను వదల్లేదు. అవగుణాలు ఎక్కడ ఉన్నా, జమీందారులలో ఉన్నా, విద్యావంతులలో ఉన్నా, కార్మికులలో ఉన్నా, కర్షకులలో ఉన్నా కడిగివేసింది. మానవత్వంలో ఉన్న ఉదాత్తతను, సంఘంలో రావలసిన మార్పులను, ఉద్ఘోషించింది. తాను తెలుసుకొన్న సత్యాన్ని లోకానికి చాటటానికి రష్యన్ మహారచయితలంతా ప్రభుత్వం ఆగ్రహానికి గురి కావలసి వచ్చినా, ఈషణ్మాత్రం కూడా వెనుకంజ వేయలేదు. పుష్కిన్ నిర్బంధానికి లోనయ్యాడు. గోగోల్ పుస్తకాలను ప్రభుత్వం

నిషేధించింది. తుర్గనీవ్ సైబీరియా ప్రవాసాన్ని కొంచెంలో తప్పించుకున్నాడు. టాల్‌స్టాయ్ ప్రభుత్వ ఆగ్రహానికి గురయ్యాడు. డాస్టవస్కీ ఉరిశిక్షను కొంచెంలో తప్పించుకొన్నాడు. గోర్కీ కారాగారవాసం అనుభవించాడు.

1880 నుంచి వెలువడిన సాహిత్యం పరిశీలిస్తే కర్షకుడు, కార్మికుడు, మధ్య తరగతివాళ్లు, భోగలాలసత్వంలో ఆనాడున్న జమీందారులు కన్నులకు కట్టినట్లు కనిపిస్తారు. గంభీర ఘోషతో పరుగులెత్తే జీవిత సముద్రం సక్షుబ్ధమహోతరం గాలతో ప్రత్యక్షమౌతుంది. అంత విస్పష్టంగా రష్యన్ చరిత్ర కూడా ఆ జీవితాన్ని మనకు ప్రత్యక్షం చేయలేదు. అసలు ఇలాంటి వాస్తవిక వాదానికి నాంది ప్రారంభించింది గోగోల్ లాంటి మహారచయితలే. వీరి రచనలలో కేవలం వాస్తవిక వాదంమాత్రమే కాదు రోమేంటిజం కూడా మిళితమై ఉంది. ముఖ్యంగా గోగోల్ తన రచనలలో ప్రభుత్వంలో ఆపాదమస్తకం వ్యాపించి ఉన్న కుళ్లును, రైతులు జమీందారుల క్రింద పడుతున్న బాధలను హాస్యాస్పదంగా చిత్రించాడు. రైతుల బానిసత్వం నిర్మూలించటానికి కత్తి ఝుళిపించాడు.

గోగోల్ తన కథల సంపుటిలో రైతుల అజ్ఞానాన్ని, అంధ విశ్వాసాన్ని చాలా హాస్యాస్పదంగా చిత్రించాడు. వారిమీద అవ్యాజానురాగం కలిగించేటట్లు చేశాడు. అతని హాస్యానికి రాతి ప్రతిమలైనా కరగిపోవలసిందే. అతని రచనలను అచ్చులో కూరుస్తూ కంపోజిటర్లుకూడా పొట్ట చెక్కలయేటట్లు నవ్వుకొంటూ ఉండేవాళ్ళట. దానితో పని చెరుపు గలిగి మేనేజరు వాళ్ళను కూకలేస్తూ ఉండేవాడట ఈ రచయితే తరువాత 'మృతజీవాలు' అనే నవలను వ్రాశాడు. అది అన్నివిధాల విశిష్టమైనదని చెప్పాలి. వస్తువును బట్టి, శిల్పాన్ని బట్టి ఇందులోని శిల్పం అలంకారశాస్త్రానికి తీర్చటానికి వీలులేని ఒక మహాసమస్య.

మృతజీవాలు అన్న నవలలోని ప్రధానవస్తువు యిది. చిచ్ చికోవ్ అనే ఒక జమీందారు వుంటాడు. అతనికి ఎక్కువ ఆస్తి సంపాదించి తన సమాజంలో అగ్రగణ్యుడు కావాలని కోరిక. ఈకోరిక కలిగేనాటికే దేశంలో అంటువ్యాధులు బయలుదేరి నిస్సహాయులైన రైతులు వేలకువేలు చచ్చిపోతారు. ఆనాటి రష్యన్ రైతుకూ, యీనాటి రష్యన్ రైతుకూ ఎక్కడా సంబంధం లేదు. రష్యన్ రైతులు అప్పట్లో మూడు రకాలుగా ఉండేవాళ్ళు. కేవలం జమీందారుబానిసలు. వీళ్ళనే సెర్ఫ్స్ అంటారు. వీరూ, వీరుదున్నేభూమి, జమీందారు ఆస్తులే. భూమిని అమ్మినట్టుగానే, ఈ బానిసలను అమ్ముకోవచ్చును. భూమికి మనం శిస్తుకడుతున్నట్టుగానే జమీందారులు ప్రభుత్వానికి ఈ బానిసలకని పన్నుకట్టేవారు. పోతే రెండో తరగతివాళ్ళు స్వతంత్రకర్షకులు. సొంత ఆస్తులు ఉండేవి.

అయినా జమీందారుకు లోబడి ఉండవలసిందే. మూడో తరగతి ఉమ్మడి సాగుచేసికొనే రైతులు. వీళ్ళూ జమీందారులకు లోబడి ఉండవలసిందే.

కథానాయకుడైన చిట్ చికోవ్‌కు ఈ బానిసలను కొనాలని ఉద్దేశం. బ్రతికినవాళ్లను ఉట్టి ఉడియంగా ఎవరూ ఇవ్వరు. చచ్చినవాళ్లనైతే తృణమో పణమో యిస్తే తనకు అమ్మివేస్తారు. ఎందుకంటే సెర్ఫ్స్‌పైన జమీందార్లు ప్రభుత్వానికి పన్నుకట్టాలి. జనాభా లెక్కలు పది సంవత్సరాల కొకసారి కాని తీసుకోరు. ఈమధ్యలో రైతుబానిసలు బ్రతికి ఉన్నా చచ్చిపోయినా మళ్ళీ జనాభాలెక్కలు తీసుకొనేటంతవరకూ ప్రభుత్వానికి పన్నుకడుతూ ఉండవలసిందే. చచ్చిపోయిన రైతులపై కట్టవలసిన పన్నుబాధ తొలగించుకోటానికి ప్రతి జమీందారు సహజంగా ప్రయత్నిస్తాడు. బ్రతికి ఉన్న వాళ్లను కొనుక్కొంటే లాభంవుంది. వాళ్ళచేత వెట్టిచాకిరీ చేయించుకోవచ్చును. చచ్చినవాళ్ళను కొని ప్రయోజనమేమిటి అన్న సందేహం తప్పకుండా కలుగుతుంది. చిట్ చికోవ్ అద్వితీయ ప్రతిభాశాలి. నామమాత్రపు ధరలకు చచ్చిపోయిన రైతులపేర్లను, వాటికి సంబంధించిన రిజిష్టరుపత్రాలను కొని వాటిని తీసుకువెళ్ళి స్టేట్‌లాండ్‌లార్డ్ బ్యాంకుకు తనఖాపెట్టి పెద్ద మొత్తంగా పుచ్చుకొని పరారై రష్యాలో మరొక రాష్ట్రంలోనే ఆస్తిపాస్తులు కొనుక్కొని గౌరవంగా బ్రతకాలని ఉద్దేశం. ఈ మహా ప్రారంభానికి కథా నాయకుడు బయలుదేరాడు. గవర్నరును తదితర ప్రధాన ఉద్యోగులను, పెక్కుమంది జమీందార్లను సందర్శిస్తాడు. బేరంసంగతి అసలుగుట్టు బయటపడకుండా తగుజాగ్రత్త పడతాడు. కాని క్రమక్రమంగా ఆసంగతి చివరికి ఒక్కసారి గుప్పుమంటుంది. చిట్‌చికోవ్ అకస్మాత్తుగా జారుకొంటాడు.

ఇదీకథ. అలంకారికులుకోరే కథా నిర్మాణం, విధించే ఆధిమధ్యాంతాలు లేవు. కేవలం కథానాయకుడు కలుసుకొన్న ఉద్యోగస్థులపాత్రలు, జమీందారుల భూమికలు కళ్లకుగట్టినట్లుంటాయి. జమీందారునైచ్యం, అమానుషత్వం, లుబ్ధత్వం బట్టబయలౌతాయి. రైతులసంగతి సాక్షాత్తుగా చిత్రితంకాక పోయినా విస్పష్టంగా వ్యజ్యమానము లౌతాయి.

ఈనవల చదువుతుంటే మన పెదవులు నవ్వుతుంటాయి. హృదయం కరుణాతిరేకంతో గిజగిజ లాడిపోతుంది. మనకు తెలిసినంతలో ఏదో ఒక రసం ప్రతీత మౌతుంది. రసంతో రసాంతర ప్రతీతమౌతుంది. రసంతో రసాంతర ప్రతీతి కావటం అపూర్వం. ఒకేకావ్యం రెండు, మూడు, నాలుగు అర్థాలిచ్చేటట్లు వ్రాశారు కాని, ఒకేకావ్యం రెండురసాలు కలిగేటట్లు వ్రాయలేదు. అలంకారిక శేఖరుడైన పండితరాయలు

రసాంతర్యానికి కొలది లక్ష్యాలు చూపించాడు. కాని, ద్విరస ప్రధానకావ్యాలను అతడు పేర్కొనలేదు. అసలు అతర్కితోపపన్నమైన ఆ ప్రతిభతో ఊహించను కూడా ఊహించ లేక పోయాడు.

మొత్తంమీద ఇలా ప్రారంభమైన రష్యన్ వాస్తవిక వాదం తుర్గనీవ్, టాల్‌స్టాయ్ డాస్టవిస్కీ, చకోవ్, గోర్కీ, గ్రిగోరొవిచ్, మేరిమార్కోవిచ్, డేనిలివిస్కీ, పిసెంస్కీ, రైషెట్‌నికోవ్ మొదలైన వారి చేతుల్లో పడి మరీ సానలు దేరింది.

తుర్గనీవ్ రచన అన్నిట్లోను ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగానైనా రైతుల జీవితాన్ని సమస్యలను స్పృశించటం, చిత్రించటం కనిపిస్తుంది. ముఖ్యంగా అతని స్పోర్ట్స్ మన్స్‌గోడ్ బుక్ అనే కథల సంపుటిలో జమీందారుల క్రింద రైతులు పడుతున్న అవస్థలు చక్కగా కనిపిస్తాయి. రచయిత కథాచిత్తుగా జరిగే ఘోరాతి ఘోరాలను వర్ణించలేదు. నిత్యజీవితంలో రైతులు జమీందారులవల్ల పడుతున్న బాధలను వర్ణించాడు. రైతులపై సానుభూతి కలిగించటానికని వాళ్లను కొండమీద కూర్చోబెట్టలేదు. జమీందారుల జాతికి జాతే జనషాదానవులని చిత్రించలేదు. ఈ అన్యాయానికంతా మూలం జమీందారీ విధానంలో ఉందనీ, ఆ విధానం రద్దు కావాలనీ సూచించాడు.

టాల్‌స్టాయ్ రచనలలో, రైతు జీవితాన్ని స్పృశించని రచన లేదనటంలో 169 అతిశయోక్తి లేదు. ముఖ్యంగా రైతు జీవితాన్నే ప్రధాన కథావస్తువుగా తీసుకొని వ్రాసినవాటిల్లో ది మార్నింగ్ ఆఫ్ ఎ లాండేడ్ ప్రొప్రైటరీ, ది కొసక్స్ అన్న నవలలలో పోలికుష్కాలు బృహత్కథ, ది పవర్ ఆఫ్ డార్‌నెస్ అన్న నాటకం ముఖ్యమైనవి. మానవత్వం, సత్యం. దయ, శౌచం, ప్రేమ, విశ్వకల్యాణం అతడు హృదయపూర్వకంగా సాహిత్య కుసుమంలో కురిపించాడు. చిత్తశుద్ధిగా ఆచరించాడో, విశ్వసాహిత్యంలో అజరామరస్థానం సంపాదించాడు.

అతని ఏ చిన్నరచన తీసుకొన్నా వాస్తవికతత్వ గ్రహణంలో, చిత్రణలో ఎంత నిశితత్వం ఉందో స్పష్టంగా గోచరిస్తుంది. ఉదాహరణకు పోలికుష్కా కథనే తీసుకోండి. భూస్వామి, సెర్ఫ్, స్వతంత్ర కర్షకుడు, ఉమ్మడి సాగుచేసే రైతుల జీవితం స్పష్టంగా కనిపిస్తుంది.

భూస్వామిని అమే ఎస్టేటు తరపున ముగ్గురు సైనికులను పంపించవలసిందని తాఖీదు వస్తుంది. ఇద్దరు దొరుకుతారు. మూడో మనిషి దొరకడు. ఆ మూడో మనిషిని తన రైతులలోనుంచి ఏరి అయినా పంపించాలి. లేదా స్వతంత్రంగా ఉంటున్న రైతు కుటుంబాలలోనుంచి ఒకరిని ఏరి పంపించాలి. డట్‌లోవ్ కుటుంబంలో యుద్ధానికి

ఎదిగిన కుర్రవాళ్లు ముగ్గురుంటారు. తతిమ్మా కుటుంబాలన్నీ ఒంటి సంసారాలు. లేకపోతే మగవాళ్లు ఇద్దరు ఉంటారు. ముగ్గురున్న కుటుంబాన్ని వదలి ఇద్దరున్న కుటుంబంలోనుంచి మనిషిని పంపించటం ఏమి ధర్మం? అందువల్ల డట్లోవ్ కుటుంబంలోనుంచి ఒకరిని పంపించాలి. లేదా భూస్వామిని తన క్రింద రైతులలో ఒకరిని పంపించాలి.

భూస్వామిని హృదయం చాలా మెత్తనిదిలెండి. ఎవరికీ తాను స్వయంగా అపకారంచేసి పాపంకట్టుకోవటం ఇష్టంలేదు. ఆమె రైతులలో పోలికుష్కా అనే వ్యక్తుడొకడున్నాడు. వాడు త్రాగుబోతు. చిన్న చిన్న దొంగతనాలు చేస్తాడు. వాణ్ణి క్రిందటిరోజుననే క్షమించింది. బైబిల్ చెప్పిన ధర్మసూత్రాలు బోధించింది. ఎలా పంపిస్తుంది? పైగా అతనికి భార్య అయిదుగురు పిల్లలు. వాణ్ణి పంపిస్తే సంసారం ఏమౌతుంది. ఆ పిల్లలు తన కాళ్లకాడపడి అఘోరించరూ? అందువల్ల దయార్ద్రహృదయురాలైన భూస్వామిని తన మేనేజరునే ఎవరినో ఒకరిని చూచి పంపించమంటుంది. మేనేజరు మూడో మార్గం సూచిస్తాడు. ఖరాయాబిల్సు చెల్లిస్తే మరొకణ్ణి సైన్యంలోకి పంపించవచ్చునంటాడు. ఆ దయామయునికి ఈ ముక్క వినిపించదు. మేనేజరు నిర్ణయానికే ఆ సమస్యను వదులుతుంది.



తరువాత పోలికుష్కాను పట్టణంలో ఒక వర్తకుడు 1500 వందల రూబుల్సు ఇవ్వవలసివుంటే ఆమొత్తం తెమ్మని పంపిస్తుంది. లాటరీ ప్రకారం డట్లోవ్ రైతు తన తమ్ముడి కొడుకును యుద్ధానికి పంపించ వలసి వస్తుంది. పాపం సైన్యంలోకి పోవలసిన ఆ నిర్భాగ్యుడికి అంతకుముందు కొలది రోజుల క్రిందటే పెండ్లయింది. వాడి అవస్థ చెప్పటానికి వీలులేదు. అతడు పెదతండ్రిని తిడతాడు పిసినిగొట్టు అంటాడు. తండ్రి తన కొడుకును సైన్యంలోకి పంపక తండ్రిలేని తన్ను పంపుతున్నాడంటాడు. నిజానికి డట్లోవ్ వద్ద కాస్తోకూస్తో డబ్బు ఉంది. దాన్ని తమ్ముడు కొడుకును విడుదల చేయించటానికి వినియోగిస్తే కుటుంబం ఏమిగాను, పెండ్లి కావలసిన కొడుకున్నాడు. ఇంట్లో తినవలసిన వాళ్లు అయిదుగురున్నారు. పొలం పండుతుంది, ఎండుతుంది. ఎలా జరగాలి? అందువల్ల అతడు తమ్మునికొడుకును విధిలేక సైన్యంలో చేర్పించటానికి ప్రక్కన ఉన్న పట్టణానికి తీసుకు వెళ్లుతాడు.

పోలికుష్కా వర్తకుడివద్ద డబ్బుముద్ర శుద్ధిగా పుచ్చుకుని అడబ్బు కవరును చినిగి పోయిన టోపీలో దూర్చి, భూస్వామిని వద్దకు గుర్రపుబండీలో తిరిగివస్తూంటాడు. మరీ ఊరిదగ్గరకు వచ్చి, డబ్బుకోసం టోపీ తడువుకుంటే కనిపించదు. ఇంటికి వెళ్లటానికి

ముఖంచెల్లదు. మళ్లీ గుర్రాన్ని వెనక్కి తిప్పి వచ్చిన దారంతా రోజుల్లా వెతుకుతాడు. కాని కనిపించదు.

మరునాడు పోలికుష్కా యింటికి చేరుకొంటాడు. భార్య చూడకుండా అతడు ఉరి పోసుకొని చచ్చిపోతాడు. ప్రక్కవాళ్లెవరో పనిమీద లోపలికి వెళ్లి అతని శవాన్ని చూసి, కేక వేస్తారు. నీళ్ల తొట్టిలో పసిపిల్లను స్నానం చేయిస్తున్న భార్య ఆ సంగతి తెలిసి చేతిలో పిల్లను నీళ్లతొట్లోనే వదలి భర్త శవం దగ్గరకు వస్తుంది. పసిపిల్ల నీళ్లతొట్లో పడి చచ్చిపోతుంది. భూస్వామిని ఆదరాబాదరా వచ్చి చచ్చిపోయిన ఆ శిశువును పోలికుష్కాను కళ్లారచూడలేక యింట్లోకి తిరిగి వెళ్లిపోతుంది.

డట్లోస్ తమ్ముడికొడుకును ఆఫీసులో అప్పగించి యింటికి వస్తూవుంటే డబ్బు సంచీ కనిపిస్తుంది. దానిమీద చిరునామాను ఎవరిచేతనో చదివించుకొని, భూస్వామిని డబ్బని తెలుసుకొంటాడు. నేరుగా ఆమె యింటికి వెళ్లి, యివ్వటానికి ప్రయత్నిస్తాడు. ఆ పాపిష్టిడబ్బేకదా యింతచేసింది నా కక్కరలేదు. అది నీవే తీసుకొమ్మని యజమానురాలు చెబుతుంది.

డట్లోవ్ ఆ డబ్బు తనకేనని నిర్ధారణ చేసుకొన్న తరువాత ఇంటికి పరిగెత్తుతాడు. మరునాడు ప్రొద్దున్నే 400 రూబిల్సు ఇచ్చి, మరొకణ్ణి సైన్యంలో చేర్పించి తమ్ముడు కొడుకును విడిపించుకొస్తాడు.

ఇందులో భూస్వామినిని వ్యక్తిగతంగా నిందించింది ఏమీ లేదు. జమీందారు వర్గంవారి నీతిలోని నైచ్యాన్ని టాల్‌స్టాయ్ సుస్పష్టం చేశాడు. డట్‌లోవ్‌కంటె భూస్వామిని ఏవిధంగా ఉత్తమురాలు? నిజంగా మొదట్లోనే 400 రూబిల్సు తనవికాదని యిచ్చివేసి ఉంటే పోలికుష్కాలు అతని పసిపాప చచ్చిపోయి ఉండేవాళ్లు కాదు. పైగా డట్లోవ్ కుటుంబంలో అలజడి ఉండేదికాదు. తీరా భూస్వామిని ఏమన్నా ఒడకట్టుకొన్నాదా అంటే అదీ లేదు. 1500 రూబిల్సు వదులుకొంది.

ఈ రచనను బట్టి రష్యన్ రచయితలు వాస్తవికవాదంలో ఏమెట్టుకు వెళ్లారో, స్పష్టంకాకపోదు. 1861 సెర్ఫ్‌డం రద్దయినదంటే యీ రచయితలే కారణం అనడంలో అతిశయోక్తిలేదు.

విప్లవానంతరం కూడా రైతుకు ఉమ్మడి వ్యవసాయంలో ఎన్నో ప్రశ్నలు బయలుదేరాయి. వాటిని రైతులు ఎలా ఎదుర్కొన్నారో షొలొకోవ్ వైట్ ఫ్లోస్ దిద్యాన్ అనే నవలలో చిత్రించాడు. తరువాత మొన్నటి ప్రపంచ సంగ్రామంలో ఫౌజా

దురాక్రమణను రష్యన్ రైతులు ఎలా ప్రతిఘటించారో ఇంద్రధనస్సు నవలలు, ముసలి అవ్వవంటి కథలు చాటుతున్నాయి.

సాహిత్యం బాగుపడాలన్నా, సంఘం పరాకోటినందుకోవాలన్నా వాస్తవికవాదం అత్యంత ప్రధానం. రైతు, కార్మికుడు, విద్యావంతులు - వీళ్ల జీవితాలు సమగ్రంగా, నిశితదృష్టితో చిత్రించటం అవసరం, ఇంతకువినా అభ్యుదయానికి మార్గంలేదు.

- ఆల్ ఇండియా రేడియోవారి అనుమతిన

**జ్యోతి 15.3.1948**

# నా సాహితీయాత్ర

ఓయమ్మ నీ కుమారుడు

మాయిండ్లను పాలు పెరుగు మననీడమ్మా

పోయెద మెక్కడికైనను

మాయన్నల సురభులాన మంజులవాణీ

ఇది నేను మున్ముందట నేర్చుకున్న పద్యం. ఆరుబయట వెన్నెట్లో తన ప్రక్కన కూర్చుండబెట్టుకొని మా పినతల్లి చెప్పింది. మా అమ్మనోట కూనిరాగమైన ఎన్నడూ వెలువడలేదు. ఆమె నాకు జోలపాటైనా పాడివుంటుందా అని సందేహం. పాడివుంటే నా జీవితం మరొకవిధంగా వుండేదేమో!

మా అమ్మకు చదువురాదు. మా నాన్న అతి కష్టంతో సంతకం చేసేవాడు. అలాంటి కుంటుంబంలో చదువుసంధ్యలకు ఎంతవరకు అవకాశం ఉంటుంది? అయినా అయిదవ యేట నన్ను బడికి పొమ్మన్నారు. చెట్లూ చేమలు తనిఖీ చేయటానికి నేరుగా పొలాలకు పోయాను. నాకు చదువు అంటుతుందని మావాళ్ళెవరూ అనుకోలేదు. 

ఒకసారి మా మేనత్త మా యింటికి వచ్చింది. ఈ రాకతో కథ అడ్డం తిరిగింది. ఆమె నన్ను తన స్వగ్రామం పట్టుకు పోయింది. అచటి పొలాలు క్రొత్తవి. తిప్ప కాయలతోడు దొరకలేదు. అందువల్ల రేపుమాపులు బడికి పోక తప్పింది కాదు. వయసు ముదిరినవాళ్ళకు చదువు తొందరగా వస్తుందంటారు. కాని నాకది వర్తించలేదనే చెప్పాలి. లెక్కలు మాత్రం చురుకుగా చేస్తుండేవాణ్ణి. తెలుగు మాత్రం పేచీ పెట్టింది. పద్యం నోటికి వచ్చేది కాదు. దానిని అప్పగించటానికి తరచుగా గోడకుర్చీ వేయవలసి వచ్చేది. నలుగురిలో అంత అవమానం ఎలా సహించేటట్లు? ఆ ఊరినుంచి పారిపోతే చెర విరగడవుతుంది. నిజమే కాని, మానాన్న, మేనత్తా పడనిస్తేగా!

గోరుమట్టుపై రోకటి పోటన్నట్లు దానికి మరొకటి తోడయింది. నా వ్రాతలో చేపలన్నీ చాపలుగా బాబులందరూ బూచులుగా మారేవారు. వాక్యంలో వర్ణలోపాగమ ప్రత్యయాలు అన్నీ ఇన్నీ కావు. ఇలాంటి ముద్రారాక్షసాలు మృచ్ఛకటికాలుగా తయారయేవి. వాటినిచూచి పెద్దవాళ్ళు కడుపుబ్బ నవ్వుకునేవాళ్ళు. ఇలా నవ్వుల పాలైనప్పుడు పై ప్రాణాలు పైనే పోయేవి. అసలు తెలుగు అన్నది లేకపోతే ఎంతబాగుండును అనిపించేది.

హైస్కూలులో చేరినతరువాత స్థితిగతులు మారాయి. ఎందుకు మారాయో గుర్తుకు రావటం లేదు. కాని తెలుగులో నా స్థితి అంత అధ్వాన్నంగా లేదు.

ఆ రోజుల్లో నవలలు ముఖ్యంగా అపరాధపరిశోధక నవలలు ఎక్కువగా వెలువడుతుండేవి. వేసంగి సెలవుల్లో స్వగ్రామం వెళ్ళినప్పుడు రోజుకు ఒక నవల చొప్పున చదివేవాణ్ణి. మా వూరి లైబ్రేరియను విస్తుపోయేవాడు. నమ్మలేక కథ అడిగేవాడు. నేను చెప్పేవాణ్ణి. అతడు మరొక పుస్తకం యిచ్చేవాడు. ఇలా మూడేళ్ళలోనూ మూడువందల నవలలైనా చదివి ఉంటాను.

''డిటెక్టివు నవలలు చదివితే పిల్లలు చెడిపోతారు, భాష రాదు, సరియైన సాహిత్యాభిరుచి కలుగదు, ఆలోచన వక్రిస్తుంది, భావనాశక్తి వికసించదు, ప్రాలుమాలిక పెంపొందుతుంది. వివేకం మందగిస్తుంది.'' అని అంటారు. కాని నాకు మాత్రం ఈ నవలలు ఎంతో ఉపకరించాయి. పద్యకావ్యపఠనం ప్రారంభించాను.

ఒకసారి.

ఓ పార్థ నిన్ను నమ్మితి
బావని రక్షింపకిట్ల పార్థుడవైతే
నా పాలి పారిజాతము
గోపాలక చక్రవర్తి గొని రానైతిన్.

174 అన్న పదాన్ని '' ఓ రామ నిన్ను నమ్మితి'' అంటూ నకిలీ పద్యం వ్రాసి సహాధ్యాయికి చూపించాను. అతడు ఊరకుండవచ్చునా? లేదు, దాన్ని లాగుకొని పోయి మా తెలుగు మాష్టారుకు చూపించాడు. నాకోసం కబురు వచ్చింది. భయపడుతూ అధ్యాపకుల గది వద్దకు వెళ్ళాను, ఏమిరా, అప్పుడే కవిత్వంకూడా మొదలుపెట్టావా? పట్టుమని పది పద్యాలైనా నోటికి వచ్చునా? అంటూ నన్ను క్రిందికి మీదికీ ఆయన ఒకసారి చూచాడు జొట జొట నాకు కన్నీళ్ళు కారసాగాయి. ఆయన తన దృష్టిని మరల్చికొని నా పద్యాన్ని దిద్దుతూ'' నడక బాగానే ఉన్నది. కాని తప్పులున్నాయనుకో, అయినా కావ్యాలు లక్షణ గ్రంథాలు క్షుణ్ణంగా చదువుకోకుండా పద్యం చెబటం తప్పు, అది నరక హేతువు, తెలిసిందా? గట్టిగా చదువుకో'' అంటూ దిద్దిన పద్యం నాకు ఇచ్చివేశారు.

అది మూడవ ఫారం చదువుతున్నప్పుడు జరిగిన సంఘటన. నాటినుంచి కావ్య పఠనం వ్యాకరణాధ్యయనం స్వయంకృషితో సాధించాను. దానివల్ల ఎన్నో భ్రమప్రమాదాలకు లోనయ్యాను. పద్యరచనయే కవిత్వం, సమాసజటిలతే ప్రౌఢిమ అనుకునేవాణ్ణి. అంతేకాని సాహిత్యమనేది.

శబ్దార్థశాసనజ్ఞాన మాత్రేణ్తైవ న వేద్యతే
వేద్యతే స హి కావ్యర్థ తత్త్వజ్ఞైరేవ కేవలమ్॥

అని, నాడు తెలుసుకోలేకపోయాను. అసలు యిలాంటి ప్రస్తావనే ఎదురుపడలేదు.

కాకపోతే నా స్కూలుఫైనలు క్లాసులో ఒకటి జరిగింది. శాస్త్రిగారు క్లాసులో కాంపోజిషను పుస్తకాలు ఇచ్చివేస్తూ నన్నుదగ్గరకు పిలిచి దీర్ఘసమాసపదరచన మంచిది కాదు. అర్థకైవల్యం ముఖ్యం. ప్రయోజనమేదో ఉంటే తప్ప ఝటితిస్ఫూర్తి కలిగించని పదం వాడరాదు. రచన యెప్పుడూ అరటి పండొలిచి అందించినట్లుగా ఉండాలి. అదే గొప్పరచన. దీర్ఘ సమాసక్లిష్ట రచన నుంచి ఎంత తొందరగా బయటపడితే అంత మంచిది అన్నారు. చిరునవ్వుతో వెలువడిన ఆ మాటలు ఇప్పటికీ నా చెవుల్లో గింగురుమంటూనే ఉన్నవి.

యస్. యస్. యల్. సి. క్లాసునుంచి బయటపడేనాటికి ఒక నవల ఒక శతకం వ్రాశాను. ఆ రచనలకు కవియశఃప్రార్థిత్వమే కారణం.

ఆ సంవత్సరం వేసంగి సెలవులలో ఒక కాలేజి విద్యార్థి సరిక్రొత్త కవిత్వమంటూ భావకవిత్వోద్యమంలో వెలువడిన రెండు మూడు ఖండకావ్య సంపుటులు పట్టుకువచ్చాడు. ఈ పద్యాలు ఎంత బాగున్నవో చూడుమని కొన్ని పద్యాలు వినిపించాడు. లాక్షణికత్వమే కవిత్వమని భావించే నాకు అవి కవిత్వంగా వినిపించలేదు. వ్యాకరణస్ఖాలిత్యాలు అర్థముక్త పాదాలు ఘోరదోషాలు పొడకట్టాయి. అవి కవి భావుకత కాని, రచనాలాలిత్యం కాని, నాకు ఆనాడు పొడకట్టలేదు. ఉమాకాంత విద్యా శేఖరుల విమర్శనం అక్షరాల నిజమనుకున్నాను. అంతే కాని కవితాస్వాదనకు సహృదయత ఎంతో అవసరమని గ్రహించలేకపోయాను. అన్నిటికీ అందరూ అధికారులు కారని తెలుసుకోటానికి మరికొంతకాలం పట్టింది. 

కాలేజిలో చేరిన క్రొత్తలో పద్యరచన మీదనే దృష్టి పడింది. ఆ రోజుల్లో వరూధిని అన్న ఖండకావ్యం వెలువరించాను. అవధానవిద్య అంత కష్టమైనది కాదు. అని సహాధ్యాయులకు నిరూపించటానికి అష్టావధానం శతావధానం చేయవలసివచ్చింది. అయితే వీటివల్ల అలవడిన జల్లినేత వదల్చుకోటానికి కొన్ని యేండ్లు పట్టింది.

డిగ్రీ క్లాసులో వుండగా కీర్తిశేషుడు గోపీచంద్‌తో పరిచయమేర్పడి స్వల్పకాలంలోనే అది స్నేహంగా పరిణమించింది. అతడు ప్రతిభాశాలి. పాశ్చాత్యసాహిత్యాభిలాష ఆధునిక సాహిత్యరీతులు అతని వల్లనే అలవడ్డాయి. అప్పటిదాక మూఢ దేశభక్తి ఉండేది. కాని నిర్దిష్టరాజకీయలక్ష్యం కనిపించేది కాదు. యం. యన్. రాయ్. రచనలనూ, మార్క్సిజాన్ని గోపీచంద్ పరిచితం చేశాడు. దానితో నా దృష్టి మారింది. జీవితానికి ఒక మార్గం, రచనకు ఒక లక్ష్యం ఏర్పడ్డాయి. వ్యావహారిక భాషావాదం ఎంతో సముచిత మనిపించింది. అదిమొదలు నా ముఖ్యరచనలన్నీ వ్యావహారిక భాషలోనే సాగాయి.

ఆ రోజుల్లో తెనాలి సాహిత్యకేంద్రంగా ఉండేది. ప్రాచీన మార్గానుయాయులే కాక చక్రపాణి, కొడవటిగంటి, గోపీచంద్ వంటి కథారచయితలు పెక్కుమంది ఇక్కడే

వుండేవాళ్ళు. సాయంకాలం మందుల షాపులోనో మరోకచోటనో కలుసుకునేవాళ్ళు. సాహిత్య విమర్శలు కథాలక్షణాలు ప్రముఖ రచయితల గుణ అవగుణాలు అనుషంగికంగా చర్చకు వచ్చేవి. ఎవరి అభిప్రాయాలు వారివి. ఐకకంఠ్యం ఉండేది కాదు. అయినా ఆ చర్చలు ఎంతో ఉపయోగకారులుగా వుండేవి. ఈ కాలంలోనే కొన్ని కధానికలు ఏకాంకికలు వచ్చినాయి. ఆస్కార్‌వైల్డు సలోమాని సునీధ అన్నపేరుతో అనువదించాను. 1937లో డిగ్రీపుచ్చుకొని కాలేజీనుంచి బయటపడ్డాను. ఉద్యోగం అవసరమైయింది. కాని ఇచ్చే నాధుడే కనబడలేదు. అప్పటినుంచి రోజుకు గంటలెన్ని? ఇరవైనాలుగని ఎలా చెప్పారు అని వితర్కం మనస్సులో ప్రారంభమయింది.

కాశీఖండంలో వ్యాసుడు గుండెల్లో నుంచి పెకలి వచ్చి నా కన్నుల ముందు తారాడసాగాడు. చలితాధరుడై కంపితకంఠంతో శాపజలం అందుకొని.

మా భూ త్రైపూరుషీ విద్యా
మా భూ త్రైపూరుషం ధనమ్
మా భూ త్రైపూరుషీ భక్తిః

అనబోతున్న మూర్తి కనిపించింది. మహర్షి శతధాభిన్నంగా వైచిన భిక్షాపాత్ర నా భావనాపథంలో రెండురోజులు నిలిచిపోయింది. ఆ సాక్షాత్కారఫలమే నా భిక్షాపాత్ర. ప్రచురణార్థం దానిని వరుసగా కొన్ని పత్రికలకు పంపించాను. ఏ సంపాదకునకు అది రుచించినట్లు లేదు. అనుభూతితత్త్వకటాహంలో నుంచి వెలువడిన నా మొదటి రచన భిక్షాపాత్ర. పత్రికాలోకం నా భిక్షాపాత్రను నాకే అర్పించింది.

నిరుద్యోగంతో విసుగెత్తిపోయి పై చదువుకోసం కాశీలో తేలాను. ట్యూషన్లతో పొట్టపోసుకుంటూ యం. ఏ. ఆంగ్లసాహిత్యాధ్యయనం ప్రారంభించాను. విశ్వవిద్యాలయభాండాగారం అందుబాటులో ఉండేది. ఏ పుస్తకం కావాలన్నా దొరికేది. లిటరేచర్, లిటరరీ క్రిటిసిజం, పాలిటిక్సు చదువుకోటానికీ మంచి అవకాశం లభించింది.

ఆ అధ్యయనఫలమే కావ్యజగత్తు, భరతుని నుండి పండితరాయల దాక, ప్లేటో నుంచి మార్క్స్ దాక ఉన్న మహామనీషుల సూక్తులను ప్రామాణికంగా ఉదహరించి కావ్య వస్తువు రూపం ఎలా పరిణామం పొందుతుందో మార్క్సిస్టు దృక్పథంతో వివరించాను. అది అప్పటి యువలోకంలో కొంత సంచలనం కలిగించి ఉండవచ్చు. నేటి తెలుగు సాహిత్యం అన్నది కూడ అప్పటి రచనే అయితే, కొన్ని సంవత్సరాల తరువాత అది దినపత్రికలో వరుసగా వెలువడింది. ఆధునిక సాహిత్య ఉద్యమాలను, వాటికి మూలమైన సామాజిక స్థితిగతులను, ఉద్యమకర్తల రచనలను, వీటి గుణగణాలను దానిలో పరామర్శించాను. దానివల్ల కొందరి మనస్సులను నొప్పించటం మాత్రం జరిగింది.

ధనాభావంవల్ల యం. ఏ పరీక్షకు కూర్చొనకుండానే ఇంటికి తిరిగివచ్చాను. మళ్ళీ నిరుద్యోగం ఎదుర్కొన్నది. అతికష్టంమీద ఈసారి దినపత్రికలో సబ్ ఎడిటర్ పని సంపాదించాను. అక్కడ పనిచేస్తున్నప్పుడే 'జఘనసుందరి'ని వ్రాయటం జరిగింది. నీతిమాలిన పచ్చి శృంగారమే దాని లక్ష్యమని ఇటీవల ఒక విద్వాంసుడు పత్రికలో విమర్శించాడు. ఆ సమీక్షనుబట్టి మూలాన్ని పసికట్టిన వేలూరి శివరామశాస్త్రిగారు నాకా పుస్తకం పంపలేదేమి? ఇంటికి పోగానే తప్పక పంపించు, అని నాకాదేశించారు. నా రచన అరణ్యరోదనం కాదనుకున్నాను.

రెండవ ప్రపంచయుద్ధం ముగిసింది. రాయ్ చెప్పినట్లు ప్రపంచప్రజాస్వామ్యం పాసిస్టు రాజ్యాలను ఓడించి విజయం చేపట్టి భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రసాదించబోతున్నది. ఆ సందర్భాన రాడికల్ డెమొక్రటిక్ పార్టీ డెహ్రాడూన్‌లో ఏర్పాటు చేసిన రాజకీయ మహాసభకు హాజరయ్యాను.

ఇది నా జీవితంలో మరొక పెద్దమలుపు. ఆ సమావేశంలో యం. ఎన్. రాయ్ కమ్యూనిస్టు బైబిలును, భూలోక స్వర్గసీమలోని స్థితినీ, నిశితంగా విమర్శించి పక్షరహిత ప్రజాస్వామ్యాన్ని ప్రతిపాదించే నవ్యమానవవాదాన్ని నిరూపించాడు. పీడిత మానవప్రపంచానికి దానికంటె వేరు శరణ్యం లేదన్నాడు. అధి కారకాంక్షతో అవినీతి కొడిగట్టి రాజకీయ పక్షాలు మానవస్వాతంత్ర్యాన్ని ఎలా భక్షిస్తవో వివరించాడు. ఆయన 177
ప్రతిపాదించిన ప్రతి అంశమూ యుక్తియుక్తంగా కన్పించింది.

ఆ ఉపన్యాసం నాకు దిగ్భ్రాంతి కలిగించింది. నేనింతకాలం పేడబొమ్మలు పెట్టుకొని పూజిస్తున్నానా? ఈ తెలివి నాకెందుకు కలగలేదు? ఈ సంగతి ఎందుకు ఆలోచించలేకపోయాను? నాయకులు చెప్పే ప్రతిమాటకూ తల ఆడించటమేనా నా పని? గంగిరెద్దుకూ నాకూ తేడా ఏమిటి?

తాత్విక చింతన లేక స్వతంత్ర విచారం పొడవుదని తేలిపోయింది. ''తద్విజిజ్ఞాసస్వ'' అన్నవాక్యం హృదయ కుహరంలో ప్రతిధ్వనించింది. తత్వశాస్త్రాధ్యయనానికి అదేనాంది. ఈరచనలో పెక్కు చిక్కులు ఎదుర్కోవలసి వచ్చింది. లోతుకుపోయి విషయం చర్చిస్తే సామాన్యపాఠకునకు అర్థం కాదు. మరీ స్థూలంగా పోతే కట్టుకథలు, పిట్టకథలూ చెప్పవలసి వస్తుంది. అందువల్ల మధ్యేమార్గం పట్టాను. అయినా అతడు వ్రాస్తే అంతంత మాత్రం వాళ్ళకు అర్థం కాదు అన్న అపప్రథ తప్పలేదు.

పత్రికారంగం నుంచి విరమించుకోదలచి డాక్టరేట్ కోసం పరిశోధనకు దిగి ఖ్రిఖిజ్బిట జీ ఓజ్బాపిఞ్మిచ్చిధ్రయు అన్న ఆంగ్లవ్యాసం వ్రాశాను. ''అయితే మీరు తెలుగుకు ఎందుకు వచ్చారు?'' అని పరీక్షకు లొకరు ప్రశ్నించారు. తల నాకు గిర్రున తిరిగింది. అడిగేవానికి

చెప్పేవాడు లోకువ కదా మరి!

ఎలాగైతేనేమి విశ్వవిద్యాలయం పట్టమిచ్చి పంపించివేసింది. డాక్టరేట్ డిగ్రీ పుచ్చుకోకపూర్వం ఉద్యోగం లేదు. పాఠ్యగ్రంథమువ్రాసి యిస్తామని ఒక ప్రచురణకర్త వద్ద డబ్బు పుచ్చుకున్నాను. కీలుబొమ్మలు గ్రాంధిక భాషలో వ్రాయాలని ప్రారంభించాను. మొదటి ప్రకరణం వ్రాసేటప్పటికి రచన ఎదురు తిరిగింది. గ్రాంధిక భాషలో వ్రాయటం దుశ్శకమనిపించింది. తీసుకున్న డబ్బు ప్రచురణ కర్తకు తిరిగి ఇచ్చివేసి నవలను ముగించి ప్రచురణార్థం పత్రికా సంపాదకులకు పంపించాను. భిక్షాపాత్రకు పట్టినగతే కీలుబొమ్మలకు పట్టింది. ఉపాధి లేక గొట్టుమిట్టాడుతున్నప్పుడు నిస్పృహ కలగటంలో ఆశ్చర్యం లేదు. 'శప్తముశప్త మింక మనసాదిగు లొందకు మాతృ భూమికై' అని అనుకొన్నాను. నిజానికి కీలుబొమ్మల తాత్పర్యం కాదు.

స్వాతంత్ర్యమంటే ఏమిటి? మానవుడు దానిని యెలా కోల్పోతున్నాడు! తిరిగి దానిని సాధించే మార్గమేమిటి? ఆర్థిక సామాజిక రాజకీయహేతువు లెంతవరకు మానవజీవితాన్ని మార్చివేస్తున్నవి? వ్యక్తుల కర్తవ్యమేమిటి? ఈ జిజ్ఞాసను రేకెత్తించటమే కీలుబొమ్మలలక్ష్యం. ఈ నవలను మెచ్చుకుంటూ ఒకరు కథ సుఖాంతం చేస్తే ఇంకా ఎంతో బాగుండేది అన్నారు. కృతజ్ఞత నివేదించుకుంటూ వెంటనే సమాధానం వ్రాశాను. మీ కోరిక చెల్లించివుంటే మీ వద్ద నుంచి యీ ముక్క అయినా నాకు లభించి ఉండేది కాదన్నాను.



కాలేజీలో అతి కష్టం మీద ఉద్యోగం దొరకింది. ఈ ఉద్యోగంలో వుండగా మాధ్యమిక వాదంలో కుతూహలం కలిగింది. అతికష్టంతో నాగార్జునులగ్రంథాలను వ్రాసికొని వచ్చి విగ్రహవ్యావర్తని, రత్నావళి, ఇంకా ఏడు రచనలను పద్యాలుగా అనువదించాను. అయితే ప్రయోజనమేమున్నది? ఆ వ్రాతపతులన్నీ దొంగలపాలయినవి. ఎలాగో ఓపిక చేసుకొని విగ్రహవ్యావర్తిని మాత్రం తిరిగి అనువదించి విపులభూమికతో ప్రకటించాను. కాలేజీలో పని చేస్తున్నప్పుడు ప్లేటో వ్రాసిన రిపబ్లిక్‌ను తెనిగించాను.

1962లో తిరిగి నిరుద్యోగం ప్రాప్తించింది. మళ్ళీ చిక్కులు. పాపికొండలు అన్న నవలను ప్రారంభించి కొంతమేర దినపత్రికలో ప్రకటించాను. ఇంతలో రేడియోలో ఉద్యోగం ప్రాప్తించింది. నవలారచనకు విఘాతం కలిగింది. తరువాత రెండు మూడు పద్యరచనలు, భాసుని ప్రతిమానాటకానికి అనువాదం, ఉదబిందువులు అన్న కథానిక సంపుటి ప్రకటించాను. తరువాత ''బొమ్మ ఏడ్చింది'' ఇది యీ జీవుని ఆవేదన.

ఇంతవరకూ వాక్కులు బాలకులు వినోదించే దండపాశికలే కదా అని పండితులు అనవచ్చును. దానికి మీరేమంటారు? అంటే ఓమితి బ్రూమః

*(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)*

---

జి.వి.కృష్ణరావు

# రచయిత బాధ్యత

ఒకానొక రచనలోని ఒక పాత్ర అంటుంది.... 'తన కోసం ఏడ్వటం దుఃఖం, లోకం కోసం ఏడ్వటం కవిత్వం; ఉభయులకోసం ఏడ్వటం ధర్మం' అని. చమత్కారం కోసమే అన్నా యీ మాటలో ఎంతో సత్యమున్నది. నిజానికి ప్రపం విఖ్యాతి పొందిన కవులంతా లోకం కోసం స్పందించి ఆవేదించినవారే.

క్రౌంచ మిథున విషయక శోకమే వాల్మీకి నోటినుంచి శ్లోకంగా వెలువడి అదికావ్యంగా అవతరించింది. సుప్రసిద్ధ నాటకకర్తయైన ఇబ్సన్ తన కాలంనాటి సమాజంలోని అనిష్టస్థితి గతులను, వ్యవస్థలను, సమస్యలను చిత్రించి ప్రజలను పర్యుత్సుకులను చేశాడు.

**సమాజ చిత్రణ**

పుష్కిన్ మొదలుకొని గోర్కీ వరకు అనల్పసంఖ్యాకంగా ఉన్న రష్యన్ రచయితలు తమ సమాజంలోని ఎచ్చులొచ్చులను, వ్యసనాలను, దుర్భరదారిద్ర్యాన్ని, అవినీతిని, అధర్మాన్నీ తూర్పారబట్టారు. సంస్కారవంతుల హృదయాలలో మారుమ్రోగుతున్న ఆదర్శ సంఘర్షణా ఘాతాలను కార్యశూరులు నేత్రాలలో మెరుస్తున్న నూతన వ్యవస్థా పూర్వక ఆశాజ్యోతులను చిత్రించి యావజ్జాతిని ఉర్రూతలూచారు.

ఆ కవులు గతించారు. ఆనాటి స్థితిగతులు అంతరించాయి. అయినా ఆయా కృతులు నేటి సహృదయుల హృదయాలలో మెదలుతూనే ఉన్నై. ఉత్తమ కావ్యాలుగా ఆకృతి పొందుతూనే వున్నవి.

కాని నేడు వెలువడుతున్న ఆంధ్ర సాహిత్యం పరిశీలిస్తే యీనాటి మన జీవితం, అందులో ఉబుకుతున్న ఆశా నైరాశ్యాలు, అంకురిస్తున్న సమస్యలు గోచరిస్తున్నవా? మన సరిహద్దులలో శత్రుసైన్యం తిష్ఠవేసింది. దేశంలో దారిద్ర్యం ఆక్రోశిస్తున్నది. ఒక ప్రక్క జనసంఖ్య పెరుగుతున్నది. మరొక ప్రక్క పంట పెంపుదలకై రైతు సతమతమవుతున్నాడు. వేరొక ప్రక్క పారిశ్రామికాభివృద్ధికై ప్రయత్నాలు సాగుతున్నవి. ఇంకొకప్రక్క అవినీతి బుసకొడుతున్నది. క్రొత్తప్రాతల కలయికతో ప్రాత విలువలు రాలిపోతున్నవి. క్రొత్త విలువలు చివురొత్తలేకపోతున్నవి ప్రాచీన కుటుంబవ్యవస్థ అస్తవ్యస్త మవుతున్నది. ఏది దారి? ఏది గమ్యం? అని విద్యావంతులు విప్రతిపన్నులవుతున్నారు. విభిన్న పక్షనాయకులు విభిన్న శంఖాలూదుతున్నారు. కొందరు వినగలుగుతున్నారు

- కొందరు వినలేకపోతున్నారు. కొందరు అర్థం చేసుకొంటున్నారు. కొందరు అర్థం చేసుకోలేకపోతున్నారు. అయినా భారతం యీ నినాదాలతో బూరటిల్లుతూనే వున్నది.

కాని ఈ ఉద్వేగాలు, ఆరంభాలు, సంరంభాలు, సందేహాలు, శక్తతలు, అశక్తతలు అనాసక్తతలు మన సాహిత్యంలో ప్రతిబింబిస్తున్నవా?

ఈనాటి కొన్ని రచనలు గతాన్ని త్రవ్వి త్రవ్వి ఎగరోజుతున్నవి. కొన్ని అన్యదేశీయులను అనుకరించి అరణ్యరోదనం చేస్తున్నవి. కొన్ని ప్రణయకలాపాలను పాడి పాడి డస్సిపోతున్నవి. కొన్ని వైయష్టిక సమస్యలను పనవి పనవి వానప్రస్థం వెళ్లుతున్నవి. కొన్నిట అరపులేకాని కరపులుండవు. కొన్నిట గూళ్ళే కాని పూరిళ్లుండవు. కొన్నిట శబ్దాలు గారడీలు, కొన్నిట ప్రాసల బురుడీలు.

లోకాన్ని అవగతం చేసుకోవటం

ఇవి ఈనాటి మన సాహిత్యంలో సాగుతున్న సాము గరిడీలు.

మరి కారణం?

180 ఇక్కడ ఇప్పుడు యీ పంచేంద్రియాలకు గోచరమవుతున్న లోకాన్ని దర్శించలేక మన రచయితలు ఎప్పుడో ప్రవర్తిల్లు లోకాలను సంస్మరిస్తున్నారు. ఒకవేళ ఇప్పటి మన ఈ లోకాన్ని దర్శిస్తున్నా అవగతం చేసుకోలేకపోతున్నారు. అవగతం చేసుకొన్నా స్వార్థప్రాకారం లోపల నాలుగు కంబాలాట ఆడుతున్నారేకాని యీలోకంకోసం స్పందింపలేకపోతున్నారు. ఇప్పటి మన యీ లోకాన్ని అవలోకించి అవగతం చేసుకొని దీనికోసమే ఆవేదన పొంది నివేదింపగలిగినపుడే రచయిత కవి ఔతున్నాడు, కానినాడు కవియశఃప్రార్థి అవుతున్నాడు.

# కవిత్వము - సంఘము

## నవ్య సాహిత్యపద్ధతులు

ఆధునికయుగం సాహిత్యసిద్ధాంతాల్లో ఒయ్యారాలు పోతూవుంది. మున్నే యుగంలోనూ ఇప్పుడు వస్తున్నన్ని సాహిత్యపద్ధతులు రాలేదు. ఈ నూతన సిద్ధాంతాలను పురస్కరించుకొని వస్తున్న సాహిత్యం నేటి జర్మన్ జైత్రయాత్రలాగు పాఠకుడి కళ్ళకు బయర్లు కమ్మిస్తోంది.

ఒక ప్రక్కనుంచి కళకోసమే కళ అనీ, మరో ప్రక్కనుంచి సాంకేతికవాద (Symtolism) మనీ, ఇంకా మరోదిక్కు నుంచి ఇంప్రెషనిజ మనీ, పోస్టు ఇంప్రెషనిజ మనీ, ఎక్స్ప్రెషనిజమనీ, ఇంకోదిక్కు నుంచి సర్ రియలిజమనీ వస్తున్నాయి. కవిత్వాన్ని గూర్చి ఆలోచించదలచుకొన్నవాళ్ళూ, సాహిత్యం వ్రాసేవాళ్ళూ ఈ సిద్ధాంతాలు తప్పక తెలిసికోవాలి.

ఆధునిక సాహిత్య సిద్ధాంతాల్లో ముందు కళ కోసమే కళ అనే పద్ధతి వచ్చింది. ఈ వాదమే సాంకేతిక పద్ధతికి దారి తీసింది. తరువాత వచ్చిన ఇంప్రెషనిజాలు, ఎక్స్ప్రెషనిజం, ఇమేజిజం, క్యూబిజం, ఫ్యూచరిజం, డాడిజం, సర్ రియలిజం అనేవి సింబాలిజంలో నుంచి వచ్చినవే. 181

అసలు ఈ సిద్ధాంతాలనే యిసుళ్ల పుట్ట 1890లో పగిలింది. కళకోసమే కళ అనే సాహిత్యపద్ధతి మొట్టమొదట ఫ్రాన్సులో బయలుదేరి వాల్టర్ పేటర్ అనే ఆంగ్లేయవిమర్శకుడిద్వారా ఇంగ్లండుకు వ్యాపించింది. తరువాత ముప్పై సంవత్సరాలకు మన దేశానికి వచ్చింది. ఈ సిద్ధాంతంప్రకారం కవితాప్రపంచం భౌతిక ప్రపంచంతో సంబంధం లేక స్వతంత్రంగా వుంటుంది. కేవలం కళాదృష్టితోనే కవితాప్రపంచంలో విహరించాలి. కవితానుభూతి ఆత్మ ప్రకృతులకు భిన్నమైవుండే దేవుడిలాగ సాంఘిక సిద్ధాంత జీవికలకు భిన్నమై వుంటుంది. కవిత్వం పేరు ప్రతిష్ఠలకూ, ధనసంపాదనకూ, నీతి బోధించటానికీ కాక, కేవలం కళకోసమే ఉంటుంది.

ప్రస్తుతానికి ఈ వాదాన్ని ఒప్పుకుందాం. అయితే కవిత్వం ఎలా వుంటుంది? మానవుడు తన జీవితాన్నుంచి విడివడి ఆలోచించగలడా? హృదయంలో అతనికి తెలియకుండానే తీవమైన అనుభవాలు కళను ఆనందించేటప్పుడు పనిచేయకుండా వుంటాయా? అసలు అది సాధ్యమా? నిజంగా మానవుడు అలా చూడగలిగితే,

ప్రాచీనతమములైన కళలను ఎందు కానందించలేకపోతున్నాడు? ఈ ప్రశ్నలకు సమాధానం లేదు.

నేను కేవలం కళకోసమే వ్రాశానన్న ఆస్కార్ వైల్డుయొక్క 'పిక్చర్ ఆఫ్ డోరియన్ గ్రే' కూడ జీవితంలోనుంచి బయలుదేరిందే. ఆ పుస్తకంలోనిది ప్రత్యేక ప్రపంచం కాదు. దానిలో ప్రాపంచిక జీవితం, శ్రేయస్సు ఉన్నాయి. ప్రాపంచికానుభూతి గలిగిన పాఠకుడే ఆ పుస్తకాన్ని చదివి ఆనందించగలుగుతున్నాడు. కాబట్టి యీ వాదన నిలవదు.

ఈ సిద్ధాంతం తరువాత వచ్చినది సింబాలిజం. దీని ప్రకారం కావ్యంలో చిత్రంపబడే అనుభూతి వ్యక్తికమనీ, దాన్ని శబ్దం ద్వారా ప్రకటించటానికి సాధ్యం కాదనీ కేవలం నాదంవల్లను, రంగువల్లను, ఆకృతివల్లను (Form) స్ఫురింపజేయవలసినదేననీ చెబుతారు. ఇది ధ్వనిపద్ధతికి చాలా దగ్గర్లోవుంది. రెండూ వాచ్యార్థంకంటె వ్యంగ్యార్థమే ముఖ్యమంటాయి. రెంటికీ ప్రమాత, అంటే రసికుడు, లేక సహృదయుడు కావాలి. అయితే ధ్వనికారుడి మతంలో కావ్యగతమైన అనుభూతి సాధారణీకరణాన్ని వరిస్తుంది. సింబాలిజంప్రకారం కావ్యానుభూతి కేవలం వ్యక్తికం. అందువల్ల శబ్దాన్ని తిరస్కరించి కేవలం నాదం మీద ఆధారపడవలసి వచ్చింది. కాబట్టి సింబాలిస్టుకవిత్వమంతా సాంకేతికమయమై చాలావరకు అర్థంకానిదైనది.



తరువాత వచ్చిన సిద్ధాంతాల్లో ఎక్స్ప్రెషనిజం ఒకటి ముఖ్యం. ఈ సిద్ధాంతం కాపిటలిస్టులు చెప్పే ఆధ్యాత్మికవాదంలోనుంచి మొలకెత్తింది. దీన్ని మొలకెత్తించింది క్రోచే అనే ఇటలీ దేశస్థుడు. ఈతని సిద్ధాంతంప్రకారం జ్ఞానం రెండు విధాలు. ఒకటి: ఇంద్రియాలద్వారా లభించేది (Logical) రెండు: ఇంద్రియాతీతమైనది (Intvitive) ఇంద్రియాతీతమైన జ్ఞానం దేశ, కాల, ఇంద్రియాలకు బద్ధమైనది కాదు. ఇది స్వయంజ్యోతి. ఇలాంటి ఇంద్రియాతీతమైన జ్ఞానమే కళ. ఈ కళ వ్యక్తికమైన అనుభూతులను ప్రకటిస్తుంది. ఇది మనస్సులోనే జరుగుతుంది. ఈ అనుభవం వ్యక్తికం కావటంవల్ల పునురుక్తం కాజాలదు. కళ దేశకాలబద్ధం కాని ఇంద్రియాతీతజ్ఞానం కావటంవల్ల క్షీణాభివృద్ధులూ, మ్యావతాధిక్యతలూ లేని పరంజ్యోతి.

అంటే, కాళిదాస భవభూతుల కావ్యాలొక్కటే; నన్నయ తిక్కన కృతులు ఒక్కటే; పెద్దన తిమ్మనకావ్యాలూ ఒక్కటే. ఒకటి గొప్పది కాదు, రెండోది తక్కువది కాదు. ఈ మాట వింటే ప్రతి పాఠకుడూ, ప్రతివిమర్శకుడూ నవ్వుతాడు. కాని క్రోచే సిద్ధాంతమదే.

నిజంగా కళనుగూర్చి అతడు క్రొత్తవిశేషాలు ఏమన్నా చెప్పాడా అంటే, యిలా

అన్నాడు: కళ అంటే ఇంద్రియాతీతమైన జ్ఞానం; అంటే వ్యక్తికానుభూతి ప్రకటన; అంటే సౌందర్యం, సౌందర్యమంటే కళ. ఇలా నాలుగుస్తంభాలాట ఆడతాడు క్రోచే.

ఇక ఫ్యూచరిజం, డాడిజం కేవలం అరాజక సిద్ధాంతాలకు సంబంధించిన సాహిత్య సిద్ధాంతాలు. పూర్వపు కావ్యాలను ధ్వంసం చేయటమే ప్రధానోద్దేశం. ఇవి పూర్వ కావ్యాలను అర్థంచేసికోటానికి కాని, రసస్వరూపాన్ని నిర్దేశించటానికి కాని పనికిరావు.

తరువాత సర్ రియలిజం బలయుదేరింది. బోడితలకూ మోకాలికీ ముడిపెట్టి నట్టుగా, ఈ సాహిత్య సిద్ధాంతం ఫ్రాయిడ్ సిద్ధాంతానికీ, మార్క్సిజానికీ లంకెవేసింది. రాజకీయరంగంలో మార్క్సిజమే ఆదర్శమన్నారు. శృంగారమే అన్నిటికీ మూలమనే (దీనికి మన దేశంలో భోజుడు బీజం వేశాడేమోననిపిస్తుంది) ఫ్రాయిడిజం స్వీకరించి అంతరాత్మకు అనుభూతిమీద పెత్తన మిచ్చారు. కావ్యానుభూతికి చమత్కారం, లేక అద్భుతం ముఖ్యమన్నారు. ప్రాచీనాలంకారికుడైన విశ్వనాథుడు రసానికి చమత్కారం, లేక అద్భుతం ప్రాణమని ఎప్పుడో చెప్పాడు. కొత్తదన మొక్కటే రసం కాజాలదు. పైగా, ఈ చమత్కారజీవి అయిన కావ్యాన్ని అంతరాత్మ శాసిస్తూ వుండటంవల్ల పాఠకుడు కావ్యాన్ని ఆనందించ లేకపోతున్నాడు. ఈ అంతరాత్మతో వ్యక్తిత్వం ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుతూ వుంది. సాధారణీకరణం తొలగిపోతున్నది.



పైగా, ఈ సిద్ధాంతం కావ్య పరిణామాన్ని తెలపలేకుండా వుంది.

ఈ విధంగా **1890** నుంచి **1930** దాకా వచ్చిన యీ సిద్ధాంతాలు కలుపు మొక్కలు పెంచటానికి వచ్చినవే కాని పూర్వకావ్యాలనుకాని ఇప్పటి కావ్యస్వరూపాన్ని కాని, ముందు రాబోయే కావ్య స్వరూపాన్ని కాని అర్థం చేసికొని ఆనందించటానికి తోడ్పడటం లేదు. ఇవన్నీ అహానికి ప్రాముఖ్యత యిస్తూ వున్నాయి.

అయితే కవిత్వం యొక్క స్వరూపం ఎలా అర్థమౌతుంది? దీనికి మార్గం ఉందా? ఈ విషయమే ముఖ్యం.

శబ్దాత్మకమైన భాషతో. కావ్యం నిర్మితమౌతుంది. ఏ సిద్ధాంతాలు ఎలా చెప్పినా, భాష సాంఘిక జీవనంతో వచ్చింది. సాంఘిక జీవనం లేక భాష ఉండదు. పరస్పర అభిప్రాయాలు తెలిసికోవలసిన ఆవశ్యకత ఉన్నప్పుడే భాష ఉంటుంది. ఈ ఆవశ్యకత సాంఘిక జీవనం ఉన్నప్పుడే వస్తుంది. ఏ విషయాన్నైనా ఆలోచించటానికీ, ఆలోచనా శక్తిని పెంపొందించటానికీ భాషే ముఖ్యం. భాష లేకపోతే మానవుడు ఆలోచించలేడు.

సాంఘిక జీవనంతో ఉత్పన్నమైన భాష సంఘంతోపాటే మారుతూ వుంటుంది.

శబ్దం నశించదనే మీమాంసకుల స్ఫోటసిద్ధాంతాన్ని యీ విషయంలో ఆదరించటానికి వీల్లేదు. పూర్వపు తెలుగు ఇప్పటి కెంత నాశనమయింది? తెలుగులో తూర్పు పడమర శబ్దాలున్నాయి; తలిమ్మా రెండు దిక్కు ల్నీ తెలియజేసే శబ్దాలు నశించాయి.

అసలు కళ అనేదికూడ సాంఘిక జీవనం ఉన్నప్పుడే ఉంటుంది. సాంఘిక జీవనం లేకపోతే కళ అనేదే ఉండదు. చీమలూ, తేనెటీగలూ సాంఘిక జీవులు కాబట్టి వాటికి కళ ఉంది. జూలియన్ హక్స్లీ చీమల్ని గూర్చి వ్రాస్తూ, అవి సాంఘిక జీవులు కాబట్టి వాటికి కళ ఉన్నదన్నాడు.

కాబట్టి కళను కాని, కవిత్వాన్ని కాని సంఘాన్నుంచి విడదీసి విమర్శించి ఇదమిత్థమని తేల్చుకోటానికి వీల్లేదు. ఒకవేళ విడదీస్తే అగమ్య గోచరమౌతుంది. మారకంలేని కరెన్సీ నోటుగతి పడుతుంది.

మానవుడు సాంఘికజీవి కానట్లైతే, భాష, కళ, కావ్యం ఉండేవికావు. వ్యక్తిత్వం ఉండేది కాదు. అతడు జంతువులాగానే, కేవలం శారీరకంగానే, ఇతరులకంటె భిన్నుడుగా కనిపించేవాడు. కళకూ, కవిత్వానికీ హేతుభూతమైన సంఘం ఎల్ల కాలం ఒక్క రీతిగా ఉండదు. దీన్ని అంతా అంగీకరిస్తా రనుకుంటాను. ఈ సంఘంతో పాటే మానవుడి అనుభూతి మారుతూ వుంటుంది. క్రొత్త అనుభూతితో ప్రాత అనుభూతిమీద మానవుడు కొంతవరకే సానుభూతి చూపించగలడు. ఈ సానుభూతి రెండనుభవాల భేదాన్ని పట్టి వుంటుంది. వెనకటి రోజుల్లో, ఆ నాటి సంఘానికి ఋగ్వేదం కావ్యం. ఈ రోజున దానిలోని ఋక్కు లకు అర్థం చెప్పుకోగలిగినా, కవిత్వ మని ఆనందించలేము. ఈ విషయ మన్ని కళలకూ అన్వయిస్తుంది. ప్రాచీన కాలంలో చిత్రకారుడు లేడిని రెండు కాళ్ళతోనే చిత్రించాడు. ఆ బొమ్మను చూచి ఆనందించటం మనవల్ల సాధ్యపడుతుందా?

ఈ అనుభూతి భేదంవల్లనే పూర్వకావ్యాల్లోని ఒక ప్రత్యేకరసం ఆధునికులకు మరొకరసం కావచ్చును. నాచనసోముడు వ్రాసిన ఉత్తర హరివంశంలోని ''జడలు కంపలుపట్టి జరుగ నీకున్నచో'' అనే సీసపద్యం రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారికి నవ్వు తెప్పించింది. నిజంగా ఆ పద్యం కేవలం కరుణ రసఘట్టంలోనిది. షేక్స్పియరు వ్రాసిన ''మాక్‌బెత్'' అనే నాటకంలో Porters' scene (పోర్టరు సీను) డీక్వెన్సీ అనే విమర్శకుడికి పూర్వమున్న వారికి హాస్యఘట్టంగా తోచి '' ఇది విచార్యము'' అన్నారు.

మరో విషయ ముంది. మొట్టమొదటి కావ్యాల్లో హాస్యం అట్టే కనిపించదు. ఆ రసం మానవసంఘంతో అభివృద్ధి చెందుతూ వస్తున్నది. ఆ రసం మానవసంఘంతో అభివృద్ధి చెందుతూ వస్తున్నది. అందుకనే ప్రాచీనాలంకారికులు – గ్రీసు దేశస్థులు కానీ, మన దేశస్థులు కానీ – హాస్యానికి ప్రాముఖ్యత యివ్వలేదు.

కాగా, ఒకటి: కళనుగాని, కవిత్వాన్నిగాని సంఘాన్నుంచి విడదీయటానికి వీల్లేదు. రెండు: మానవ సంఘం మారుతూ వుంది. సంఘంతోపాటు భాష, అనుభూతి, కావ్య మారుతూ వస్తున్నాయి. ఈ మార్పును అంగీకరిస్తేనే కాన్ని అన్ని యుగాల కావ్యాలనూ అర్థం చేసికోటానికి కాని, కవిత్వతత్వం కొంత గ్రహించటానికి కాని వీలుతేదు.

అయితే, సంఘం ఎందుకు మారుతున్నది? ఇదివరకు ఎలా మారింది? ఇకమీదట ఎలా మారుతుంది? ఈ విషయాలను తెలిసికొంటే కవిత్వం సంగతి కూడా తేలుతుంది. ''కోవేత్తి కవితాతత్వ మీశ్వరోవేత్తివా నవా'' అనికాల్లారజాపుకో నక్కరలేదు.

ఈ మార్పును వివరించ గలిగింది చారిత్రక భౌతిక సిద్ధాంత మొక్కటే. కొంతమంది మార్క్సు చెప్పిన యీ సిద్ధాంతం సాహిత్యానికి ఏ మాత్రమూ అన్వయించ దంటారు. ఇది పొరపాటు. మూడో మార్క్సిస్టుల్లాగా భౌతిక సిద్ధాంతాలు అన్వయిస్తే ప్రయోజనం లేదు.

కాబట్టి కొంచెం జాగ్రత్తగా అన్వయిస్తే కవిత్వతత్వాన్ని అవగాహన చేసికోటానికి ఒక చారిత్రక భౌతిక సిద్ధాంతమే తోడ్పడుతుంది. ఈ దృక్పథంతోనే సాహిత్యాన్ని అవలోకించాలి. అట్లుకాక కవిత్వాన్ని సంఘాన్నుంచి వేరుచేసి చూస్తే నాలుగు స్తంభాలాట ఆడవలసి వస్తుంది.

# నాదశక్తి

కరెన్సీ నోటును అర్థం చేసికోటానికి ఎంత లోతుకు పోవాలో శబ్దసంగతి తెలిసి కోటానికి అంతకన్నా లోతుకు పోవాలి. కేవలం ధ్యానంవల్ల శబ్దతత్వం తెలియదు. శబ్దాన్ని లోకాన్నుంచి విడదీయక, లోకోత్పన్నమని ఆలోచించినప్పుడే దాని తత్వం తేలుతుంది.

శబ్దానికి అభిధ, లక్షణ, వ్యంజన అనే అర్థశక్తులు మూడు ఉన్నాయని ధ్వనికారుడు విపులీకరించి చెప్పాడు. ఈశక్తులవల్ల విషయాలను, భావాలను తెలియజేయవచ్చును. పాఠకుడిలో అనుగుణములైన వికారాలను కలిగించవచ్చును. వచనకావ్యాలు ఈ పనే చేస్తున్నాయి.

ఈ మూడు విధాలైన అర్థశక్తులే కాక శబ్దానికి నాదశక్తి మరోటి వుంది. చాలా మంది విమర్శకులు ఈ నాదశక్తిని అర్థశక్తులతో కలగాపులగం చేస్తున్నారు. దీన్ని వేరు చేసి చూడటం ముఖ్యం.

శబ్దానికుండే యీనాదశక్తి ఉచ్చారణలోనే వుంటుంది. అర్థశక్తులవల్ల కలిగే వికారాలను
 కొంతమంది నాదశక్తివల్లనే కలుగుతున్నాయని భ్రాంతిపడతారు. యాబర్ క్రోంబీ అనే ఆంగ్ల విమర్శకుడు బేర్ (అంటే ఎలుగుబంటి) అనే శబ్దనాదమే భీతి కొలుపుతుందన్నాడు. దానికి ఓ కట్టుకథ కూడా చెప్పాడు.

సృష్ట్యాదిలో ఆదాము, అవ్వ అనే దంపతులకు జంతువులను వేరువేరుగా తెలుసుకోవలసి వచ్చింది. తప్పనిసరై వారు వివిధ జాతులకు నామకరణం చెయ్యాలన కున్నారు. జంతువు లన్నిటినీ ఒక దొడ్డికి తోలిం తరువాత గేటులో అవ్వ నుంచుంది. ఒక్కొక్క జంతువును ఆదాము బయటికి తోలాడు. అవ్వ '' ఇది ఆవు, ఇది మేక, ఇది గేదె, ఇది బేర్'' అంది. ''అది బేర్ అని నీకెలా తెలుసు?'' అని ప్రశ్నించాడు. ఆదాము ''దాని ముఖమే చెప్పుతున్నది'' అన్నది అవ్వ.

కాని భీతి అనేది బేర్ అనే శబ్దంలో లేదు. అది కేవలం అర్థాన్ని పురస్కరించుకొని వచ్చిందే.

క్రిస్టఫర్ కాడ్వెల్ మతప్రకారం శబ్దానికి రెండు గుణాలు ఉంటాయి: ఒకటి, అర్థం; రెండు, శబ్దంవల్ల కలిగే వికారాలు. అయ్య, నాన్న, తండ్రి; అప్ప, అబ్బ, బాబు, అమ్మమొగుడు సమానార్థకాలేను. కాని ఆ శబ్దాలవల్ల కలిగే వికారాలు వేరు అంటాడు.

ఇది సరికాదు. ఈశబ్దాల తాత్పర్యం ఒకటే; కాని అర్థాలు వేరు. భిన్నభిన్నంగా ఉన్న అర్థాలను పురస్కరించుకొనే భిన్న భిన్న వికారాలు కలుగుతున్నాయి.

నాదంవల్ల కలిగే వికారాలు అర్థంవల్ల కలిగే వికారాలకంటే భిన్నమైనవి. బుల్ బుల్, బిల్ కుల్, క్లేరిబెల్, లిల్లీ అనే శబ్దాలు అర్థం తెలియనివారికైనా ఒక రకమైన వికారాన్ని కలిగిస్తాయి. Buzz, Hiss, Murmur అనే శబ్దాలనాదమే వాటి అర్థాన్ని తెలుపుతూ వుంది. తెలుగులోని గుస గుస యిలాంటిదే.

"Tiger, Tiger, Burning bright" అనే చరణానికి అర్థం తెలియకపోయినా కావలసిన వికారం కలుగుతుంది. శాఫో కవయిత్రి వ్రాసిన "Golden sandaled dance" అనే చరణం, షెల్లీ వ్రాసిన "Sweet as a singing rain of silver dawn" అనే చరణం అల్లాంటిదే.

ఒకసారి ఇంగ్లీషు తెలియని వాడిదగ్గిర -

"Water water every where

Not a drop to drink."

అన్న పద్యాన్ని చదివి నీ కేమనిపిస్తున్నదంటే, ఏదో అవస్థ పడుతున్నట్టు కనిపిస్తుందన్నాడు. ఇది కేవలం నాదశక్తివల్ల కలిగిందే. 

జయదేవుని గీతగోవిందమంతా ఈ నాదశక్తికి లక్ష్యంగా చూపించవచ్చును. మరీ అష్టపదులు ఈ విషయంలో లోకోత్తరాలు.

ఇలాంటి నాదశక్తిని గ్రహించి సంపూర్ణంగా వినియోగించుకొన్నది తెలుగుకవుల్లో కవిబ్రహ్మ ఒక్కడే. ఈ శక్తి ఒకటి ఉందని నన్నయకు తెలియదు; ఎఱ్ఱాప్రగడ ఎరగడు. జాగ్రత్తగా చూస్తే నన్నయకు సంగీతజ్ఞానం లేదేమో అనిపిస్తుంది. అయితే పద్యం హాయిగా నడుస్తుందే అంటే దానికి సంగీతజ్ఞానం అక్కరలేదు.

అర్థాన్ని త్యజించి కేవలం నాదం కోసమే జాగ్రత్తపడితే సంగీతమౌతుంది కాని కవిత్వం కాదు. ఆధునికుల్లో ముఖ్యంగా 'ఇమేజిస్టు'లు, 'సర్ రియలిస్టు'లు నాదం ద్వారా రససిద్ధి చేకూర్చటానికి శబ్దాలు పోగు చేస్తున్నారు, విచిత్ర శబ్దాల్ని సృష్టిస్తున్నారు. ఇలాంటివి జేమ్సుజాయిస్ వ్రాసిన యులిసిస్‌లో కోకొల్లలుగా ఉన్నాయి.

కవిబ్రహ్మ అర్థవంతమైన శబ్దాల నాదశక్తిని విరివిగా వాడుతాడు. ద్రౌపది కీచకుణ్ణి

''దుర్వారోద్యమ బాహువిక్రమరసా

స్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర్మథనవి
ద్యాపారగుల్ మత్ప్రతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు వినుదో
ర్లీలన్ వెసం గిట్టి –''
ఏదో చేస్తారు సుమా అంటుంది. ఈ పద్యనాదమే ఆమెకోపాన్ని వెళ్లగ్రక్కుతుంది.
ఉత్తరుడు –
''భీష్మ ద్రోణ కృపాది ధన్వి నికరా
భీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాప విసరా
కీర్ణంబు శాస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలా
త్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్వాకలితంబు సైన్యమిది నే
జేరంగ శక్తుండనే.''

188 అని బృహన్నలతో అంటాడు. నిజంగా భయపడటానికి కారణముందని ఆ పద్య నాదమే తెలుపుతూ వుంది.

నన్నయకవిత్వంలో ఈ నాదశక్తి కనిపించదు. నిండుసభలో పాంచాలిని భంగపరచినప్పుడు భీముడు ప్రతిజ్ఞ చేస్తాడు:

''ధారుణి రాజ్యసంపదము
దంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరుదేశమున
నుండఁగఁ బిల్చిన యిద్ధరాత్ముఁ దు
ర్వార మదీయ బాహుపరి
వర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సు
యోధను నుగ్ర రణాంతరంబునన్''

గీటుంచిన బాగాల్లో తప్ప భీముని ప్రతిజ్ఞ ప్రతిజ్ఞగానే కనిపించదు.

భావాని కనుగుణంగా తిక్కన పద్యాలెప్పుడూ కదంతొక్కుతూ వుంటాయి. అర్జునుడు ఇలా అన్నాడు అని సంజయుడు చెప్పే –

''గాండీవ గుణరవం బొండొండు చెలఁగంగ
శరపరంపర లాకసంబు గప్ప.''

అనే పద్యం పోయినకొలదీ జెర్రిలాగా పరుగెడుతూ అర్జునుని భావాలను వినిపిస్తోంది. ఇది టెన్నీసన్ "Break, break" అనే పద్యాన్ని తల దన్నుతూవుంది. కవిబ్రహ్మ నాదబ్రహ్మ కావటంవల్ల 'గాండీవ' అని వాడి చరణాన్ని తీరిగ్గా పెండ్లినడకలు నడవకుండా, 'గాండీవ' అని త్రుంచివేసి నడకలో కర్కశత్వాన్ని తీసుకొచ్చాడు. ఎత్తుగీతంలో చిన్న చిన్న పదాలు వేసి పద్యధాటీపాటవాన్ని ఇనుమడింపజేశాడు. ఇలా భావాని కనుగుణంగా ఎప్పుడూ పద్యాన్ని నడపగలిగింది తెలుగులో తిక్కన ఒక్కడే. అతడు ప్రతి ఘట్టంలోనూ ఈ నాదశక్తిని వాడుతాడు. స్థిమితంగా యుక్తియుక్తంగా మాటాడవలసినప్పుడు గడబిడ లేకుండా చిన్నచిన్న వాక్యాలతో అతని పద్యం నడుస్తుంది.

'' ఈవంశంబున కెల్ల నీవకుదురిం
దెవ్వారి చందంబు లె
ట్లై వర్తిల్లిన కీడు మేలు తుది నీ
యం దొందెడుం గాన సం
ద్భావం బారసి లోనిపొత్తు వెలి వృత్తంబున్ జనస్తుత్యముల్
గావింపందగు నీక యొప్పిదమునన్
గౌరవ్యవంశాగ్రణీ!''
మనుచరిత్రలో రెండె ఆశ్వాసం మొదట్లో
ప్రవరుడితో పాటు,
''.... ....... .....
అంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠద
భంగతరంగ మృదంగ నిస్స్వన
స్ఫుటనటనానురూప పరిపుల్లక లాప కలాపి జాలమున్
కటకచరత్కరేణుకర
కంపిత సాలము శీతశైలమున్''

# తెలుగు భాషలో మొదటి నవల కందుకూరి "రాజశేఖర చరిత్ర"

"ఏవో నాలుగు నవలలు వ్రాశాను కాబట్టి దేశంలో నలుగురికీ నాపేరు తెలుసు. కాని నేను కవిత్వం చెబుతానని తెలియదు" అని ఒకరచయిత అంగలార్చాడు. మీరొక విద్వాంసుడు యుద్ధానంతర సాహిత్యస్థితిని చర్చిస్తూ నవల, కథ మున్నైన గద్యరచనలనే పూర్తిగా పరిహరించాడు. ఇటీవల ఇంకొక మిత్రుడు "ఏ నవల ఆయురార్ద్య మయినా ఐదు సంవత్సరాలే. కాదంటే మరొకటి రెండు సంవత్సరాలు కలుపుకో"మ్మని హెచ్చరించాడు.

నవల అన్నా, కథ అన్నా ఈ నాటి పండితలోకంలో ఉన్నసామాన్యాభిప్రాయం యిది. ఎన్నో అనూదితరచనలు, స్వతంత్ర రచనలు వచ్చిన తర్వాత గూడ ఇలాంటి అభిప్రాయం ఉన్నదంటే, 1880 నాటి స్థితి ఎలా ఉండేదో తేలికగా వూహించుకోవచ్చు.



కందుకూరి వీరేశలింగంగారు మరొక విధంగా భావించారు. అంతమాత్రాన వారు తెలుగుపండితులు కాదందామా, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచననైషధం వ్రాశారు. సంస్కృతం కాని, కవిత్వతత్త్వం కాని తెలియని వారంటే, అభిజ్ఞాన శాకుంతలం అనువదించారు. సాహిత్యవిమర్శకుల్లు కారంటే ఆంధ్రకవుల చరిత్ర వ్రాసి ఆయాకవుల కవితా తారతమ్యాలు చక్కగా నిరూపించారు. నవలయందు ఇప్పటివారికున్న సంకుచిత భావం, తిరస్కార దృష్టి. వారికే ఉంటే తెలుగు వారికి మొదటి నవల 1880 లో లభించి ఉండేది కాదు.

వీరేశలింగంగారు ఆంగ్ల కవుల నవలలు చదివారు. ముఖ్యంగా "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు" చూచారని అదే "రాజశేఖర చరిత్రకు" ఉద్బోధక మైందని వారి పీఠిక సూచిస్తున్నది. తెనుగులో ఇంతకు పూర్వం ఇలాంటి రచనలు లేవనీ, ఇకముందైనా అలాంటివి రావటం అవసరమనీ, వారు గుర్తించారు. అంతే కాని అప్రాచ్యమైనది అనుపాదయే మని వారు అనుకోలేదు. "గుణాః ప్రమాణం నదిశాం విభాగః" అన్న సూక్తి వారు జీర్ణించుకొన్నారు.

వీరేశలింగంగారు సహృదయులు కాబట్టి "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు" చదివి. ఆనందించారు. అలాంటిది తెలుగులో కావాలనుకొన్నారు. అయితే "ఆరచన సాహిత్య మవుతుందా? సాహిత్యమైతే ఏకోవకు చెందుతుంది?" అన్న ప్రశ్నలు కూడ వారికి కలిగి ఉంటవి.

జి.వి.కృష్ణరావు

హృదయాన్ని స్పందింపజేసేన రచన సాహిత్యమెలా కాకపోతుంది? దండి దగ్గరనుంచి జగన్నాథునివరకు కావ్యమంటే ''ఇష్టార్థ వ్యవచ్ఛిన్న పదావళి'' అనీ ''రమణీయార్థ ప్రతిపాదక శబ్ద'' మనీ ముక్తకంఠంతో ఘోషించారు. కాబట్టి నవలకు కావ్యత్వం నిస్సందేహంగానే సిద్ధిస్తుంది. కాని అది ఏకోవకు చెందుతుందనేదే ప్రశ్న.

నవలను కథ అనలేము. ఆఖ్యాయిక అనీ అనలేము. అది ముక్తకాదిలో చేరుతుంద నటానికి వీలుపడదు. ఇక పరిశేషన్యాయం చొప్పున మహా ప్రబంధం, లేదా ప్రబంధం కావాలి. ప్రబంధం అనగానే అష్టాదశ వర్ణనలు,పద్యగద్యమయత్వం జ్ఞప్తికి వస్తాయి. ఈ లక్షణాలు నవలలో లేవే అన్న సంశయం అంకురిస్తుంది. అయితే ఆలంకారికులు ప్రబంధానికి నిర్దేశించిన లక్షణాలను తెలుగు ప్రబంధాలు ఎంతవరకు పాటించాయి? ప్రాచీనులు చెప్పిన పెక్కు లక్షణాలు లేకపోయినా. మనుచరిత్ర మున్నై వాటిని ప్రబంధాలనే చెప్పుకొంటున్నాము. అలాగే కేవలవచన నిబద్ధమైన నవలను వచన ప్రబంధమని ఎందుకనరాదు?

నవలకు కథ ముఖ్యం గాని వర్ణనలు ముఖ్యం గావు. ''ప్రబంధానికి వర్ణనలు ప్రధానాలవుతున్నవి కాని, కథ ప్రధానం కాదుగదా'' అన్న ఆక్షేపణ ఈ సందర్భంలో తోచవచ్చును. వాస్తవానికి ప్రబంధం వెర్రితలలు వేసే రోజులలోనే కథకు క్షయరోగం సంక్రమించింది, కాని ఆరంభదశలోనే అంకురించలేదు. భామహుడు, భోజుడు, దండి, విశ్వనాథుడు మొదలైన ఆలంకారికులు కథా ప్రాముఖ్యం గుర్తించి శ్లిష్టసుసంధిత్వం మహా ప్రబంధగుణంగా ఏనాడో పేర్కొన్నారు. కనుక నవలను ప్రబంధ మనటానికి ఎలాంటి ఆక్షేపణ లేదు. 191

నవలకున్న ఈ స్థానాన్ని గుర్తించటంలోనే వీరేశలింగం గారి విశిష్టత గోచరిస్తుంది. ఆవిశిష్టతవల్లనే తెలుగువారికి మొదటి సారిగ 1880 లోనే నవలరూపంలో ''రాజశేఖర చరిత్ర'' లభించింది.

నవలలోని ఇతివృత్తం పౌరాణికం కాని, ఐతి హాసికం కాని, రాజకీయం కాని, సామాజికంకాని మరొకటి కాని కావచ్చు. కేవలం ప్రఖ్యాతకథనే స్వీకరించాలని కాని, లేదా కల్పితాన్నే గ్రహించాలని కానీ లేదు. ఇలాంటి నియమం లేనప్పుడు సాధారణంగా రచయిత ఏఐతిహాసిక కథనో, ఏ పౌరాణిక గాథలో స్వీకరించడం కద్దు. వీరేశలింగంగారు మాత్రం ఆపని చేయక సామాజిక ఇతివృత్తాన్ని స్వీకరించారు. ఇది రాజశేఖర చరిత్రలో కనుపించే మరొక విశేషం.

కథా చిత్రణకు సామాన్యంగా రెండు మూడు మార్గాలున్నవి. మొదటిది నాట్యధర్మి. రెండవది లోకధర్మి. మూడవది ఉభయ ధర్మి. ఇతివృత్తం సామాజికమైనప్పుడు రచనా పద్ధతి లోకధర్మాన్ని ఆశ్రయిస్తుంది. అయితే రచయిత ఆమూలాగ్రం ఆధర్మాన్ని, ఆశ్రయించి నిర్వహించడం అరుదు. కష్టసాధ్యం కూడ. రాజశేఖర చరిత్ర కేవలం లోకధర్మాన్ని పురస్కరించుకొని సాగింది. ఇది మరొక ప్రత్యేకత.

ఆనుషంగికంగా మన ప్రాచీన ప్రబంధాలు అష్టాదశవర్ణనలకు తావిస్తే, నవలలు దేశకాల స్థితిగతులను అభివర్ణిస్తున్నవి. రాజశేఖర చరిత్ర అలాకాక ప్రజల ఆచార వ్యవహారాలను ప్రదర్శించి, వాని బాగోగులను పరిమార్శిస్తున్నది. జ్యోతిషంలోని వెర్ర రమ్మకం. జపహోమమంత్ర తంత్రాల యందలి ఆసక్తి, పంచాంగపు టేలుబడి, బైరాగుల మీది భక్తి, నీళ్లరేవులో అమ్మలక్కల ప్రసంగాలు, వైష్ణవులలోని సంకుచిత కలహాలు, స్వాముల దుండగాలు, జ్యోతిష్కుల వంచన, భూతవైద్యుల తంతులు, మాంత్రికుల మాయో పాయాలు, సువర్ణవిద్యలో విశ్వాసం, గ్రహణకాల మందలి ప్రజల మూఢాచారాలు, జాతకాలు, బాల్యవివాహాలు, ఆతురసన్న్యాసాలు, అభిచారికక్రియల యందలి అంధవిశ్వాసం, స్త్రీ విద్యా శూన్యత, అస్పృశ్యతమున్నైన వాటిని కనులకు కట్టినట్లు వర్ణిస్తున్నది. ఇది కూడ మరొక ప్రత్యేకత అని చెప్పాలి.



రాజశేఖర చరిత్ర కావ్యత్వ పరిశీలనకు కథ ముఖ్యం.

రాజశేఖరుడు సంపన్నుడైన గృహస్థు. పండితుడు. మాణిక్యాంబ అతని భార్య - సుబ్రహ్మణ్యం, రుక్మిణి, సీత అతని సంతానం, రుక్మిణి పెండ్లికి అతడు శక్తికిమించిన ఖర్చు చేస్తాడు. బంధు ప్రీతికి లోనై మరికొంత సొమ్ము వమ్ము కానిస్తాడు. స్తుతి ప్రియత్వానికి దాసుడై పాత్రాపాత్ర వివేచన చేయక, దానధర్మాలు విపరీతంగా చేస్తాడు. అతిథి అభ్యాగత పూజకు విరివిగా వెచ్చిస్తాడు. వీటి అన్నిటిలో అతడు పేదవాడవుతాడు. పేదరికం తిరిగి అతనికి ద్రవ్యాశ కల్పిస్తుంది. అతడు యోగిని ఆశ్రయించి బంగారం చేయించు కోవాలినియత్నించి, ఉన్న వెండి బంగారాలు వూడ్చుకుంటాడు. ఎటు చూచినా అతనికి అప్పులే. ఏవైపు తిరిగినా అపహాసాలే. స్నేహితుల తప్పుకుంటారు. ఆశ్రితులు అదృశ్యులవుతారు. చేసేది లేక రాజశేఖరుడు మడి మాన్యాలు, ఇళ్ళుల వాకిళ్లు కుదువబెట్టి, డబ్బు తెచ్చి అప్పు సప్పులు తీర్చుకుంటాడు. పువ్వులమ్మిన అంగట్లో కట్టెలమ్మలేక సకుటుంబంగా అతడు కాశీయాత్రకు బయలు దేరుతాడు.

మార్గమధ్యంలో వడసోకి పడిపోయిన రామరాజునకు శీతలజల మిచ్చి రాజశేఖరుడు ప్రాణందానం చేస్తాడు. తరువాత అతనిని దొంగలు ముట్టడిస్తారు. రామరాజు సాయంతో

ఆవిపత్తు గడిచి పోతుంది. రుక్మిణినని మాత్రం రాజశేఖరరడు కోల్పోతాడు. బ్రతుకు జీవుడా అంటూ అతడు కుటుంబంతో భీమవరం చేరి, అచట కాపురం పెడతాడు. చేతిలోని నాలుగు కాసులు కరిగిపోతుంటవి. జీవనోపాధి కోసం రాజశేఖరుడు ఆలోచిస్తాడు. రాజబంధు వయిన శోభనాద్రిరాజువల్ల సాయం లభించదు. కొడుకు సుబ్రహ్మణ్యాన్ని ఉద్యోగ సంపాదనార్థం పిఠాపురం పంపుతాడు.

శోభనాద్రిరాజు రాజశేఖరుని వంచించి సీతను దుర్మార్గుడు, తన కాశ్రితుడూ అయిన పద్మరాజునకు ఇవ్వటానకి ఒప్పించి, ద్రవ్యసహాయం చేస్తాడు. రామరాజు మారువేషంతో వచ్చి, ఆ వివాహానికి విఘాతం కల్పిస్తాడు. తరువాత క్రమంగా రాజశేఖరునకు వాస్తవం తెలుస్తుంది. అతడు సీతను పద్మరాజు కివ్వటానికి నిరాకరించి, శోభనాద్రిని ధిక్కరిస్తాడు. శోభనాద్రిరాజు తన అప్పు తీర్చలేదన్న మిషతో రాజశేఖరుని కారాగారంలో బంధిస్తాడు. అతని రెండవ కుమార్తె సీతను తన భటుల చేత అపహరింప జేస్తాడు.

సుబ్రహ్మణ్యం పిఠాపురంరాజుగారి ఆస్థానంలో ప్రవేశం సంపాదిస్తాడే కాని ఉద్యోగం మాత్రం వెంటనే పొందలేకపోతాడు. నీలాద్రిరాజు అన్న దొంగ. రాజకోశాగారం కొల్లగొట్టగా సుబ్రహ్మణ్యం అతనిని పట్టుకొని రాజానుగ్రహం సంపాదిస్తాడు. విచారణార్థం దొంగను పెద్దాపురం గొని పోవటానికి రాజుచే నియుక్తుడై వెళ్లుతూ దారిలో ఉన్న భీమవరం పోయి తండ్రిని కలుసుకొంటాడు.



అప్పటికి పెద్దపురంరాజు రాజశేఖరునిపై ఉన్న అభియోగం విచారించి, నిర్దోషి అని తేల్చి, అతనిని కారాగారంనుంచి విడిపిస్తాడు. ఆసమయానికే రుక్మిణి పురుషవేషంతో సీతను ధూర్తుల నుంచి రామారాజు ఉపాయంతో తప్పించి తండ్రి వద్దకు కొనిపస్తుంది. దేశాంతరగదు డైన అల్లుడు - నరసింహ స్వామి కూడ - అంటే రుక్మిణి భర్తకూడ - మామవద్దకు చేరుకొంటాడు.

రామరాజే పెద్దాపుర మహారాజు. కనికరించి రాజశేఖరుని మడి మాన్యాలు విడిపించి, అతని పిల్లలు వివాహానికి వలసిని ధన సహాయం చేస్తాడు. అప్పటినుంచి రాజశేఖరుడు, అతనికుటుంబం సుఖంగా ఉంటారు.

ఈ ఇతివృత్తంలోని రాజశేఖరునిక కారాగార వాస సంఘటనకు, రామరాజు - శోభనాద్రారాజు పాపయ్య అన్న పాత్రలకు ''వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు దోహద మిచ్చింది. తక్కిన దంతా వీరేశలింగం గారి స్వతంత్ర సృష్టి.

**1880** నాటికి భారత సాహిత్యంలోనేమి ఆంగ్ల సాహిత్యంలోనేమి ప్రబంధానికి ఏమహారాజో, ఏధీరోదాత్తుడో నాయకుడుగా ఉండేవాడు. రాజశేఖర చరిత్రలోని

నాయకుడు అలా కాడు. అతడు సామాన్య గృహస్థుడు. అతనిలో లోకోత్తరగుణ సంపత్తి లేదు కాని, సామాన్య మానవుల కున్న గుణగణాలున్నాయి. వాటికి తోడు స్తుతిప్రియత్వం, అపాత్రదానం వంటి అల్పావగుణాలున్నవి. వాటివల్ల అతడు కష్టాలపాలవుతాడు. సామాన్య మానవ దుర్లభాలైనగుణ సంపత్తి అభివర్ణించి, తదభిముఖత్వం కలిగించటం మేలు, రాజశేఖర చరిత్ర ఈ పని చేస్తూ మరొక ప్రత్యేకతను చాటుతున్నది.

రాజశేఖర చరిత్రలోని భాష గ్రాంథికమే. అయినా వ్యర్థ సమాసాటోపం, శుష్కపాండిత్య ప్రకర్ష లేక వ్యావహారిక భాషకు సన్నిహితమై సరళంగా సాగుతూ, మామూలు పాఠకునికైనా తేలికగా అర్థమవుతున్నది. ఇప్పటి పెక్కుమంది రచనలలో వలె రాజశేఖర చరిత్రలో చ్యుత సంస్కారాలు, అన్వయరాహిత్యాలు, అసభ్యవర్ణనలు లేవు.

ఇన్ని విశేషాలున్నా రసపిపాసువులకు రాజశేఖర చరిత్రలో హృదయంగమమైనది దామోదరయ్య విషాద వృత్తాంతమే. జీవితం కోసం అతడు భూతవైద్యుడవుతాడు. జ్వరపీడితులు, జబ్బుగొన్నపిల్లలు, అతని చేత విభూతి పెట్టించుకొని స్వాస్థ్యం పొందుతారు. దానితో గొప్పభూతవైద్యుడన్న ఖ్యాతి అతనికి వస్తుంది. ఆఖ్యాతి వల్ల అతని దురహంకారం పెరుగుతుంది.

194 ఒకసారి ఈడిగ వాని ఇంటిముంగలి కొబ్బరి చెట్టున బొండాలు చూచి, నాలుగు కోసి, తన ఇంటికి పంపవలసిందని దామోదరయ్య అతనిని ఆజ్ఞాపిస్తాడు. డబ్బు లిస్తేనే బొండా లిస్తానని అతడంటాడు. ''నీ చెట్టును ఏమి చేస్తానో చూడు.'' అని దామోదరయ్య బెదిరిస్తాడు. కాని ప్రయోజనం ఉండదు. ప్రతిక్రియ చేయకపోతే వూళ్లో తాను చులకనవుతానని దామోదరయ్య ఒక నడిరేయి కొడుకు చేత బియ్యపు కడుగు నీరు పాత్రలో పట్టించుకొని పోయి, ఈడిగవాని చెట్టెక్కి, మొవ్వు చిదుకపొడిచి కడుగు నీరు పోసి, మూడవ కంటికి కనిపించకుండ ఇంటికి తిరిగి వస్తాడు.

నాలుగైదురోజులలో కొబ్బరి చెట్టు నిలువున ఎండిపోతుంది. అదంతా తన ప్రయోజన మనిదామోదరయ్య గప్పాలు కొడతాడు. ప్రయోగం చేసి అతడే తన చెట్టును చంపాడని ఈడిగవాడు నలుగురికి చెప్పుకొని ఏడుస్తాడు. వూరంతా నిజమే నననిమ్ముతుంది. ఇంతలో కోమటివారి అబ్బాయికి జ్వరం వస్తుంది. పెద్దలు సోదె అడిగితే జ్వరం ప్రయోగం వల్ల దాపురించిందని మాలెత చెప్పుతుంది. వారు దామోదరయ్యను అనుమానిస్తారు. భూతవైద్యులను పిలిపించి, ప్రతిక్రియ చేయించినా కోలుకొనక చనిపోతాడు.

నాటినుంచి ప్రజలకు దామోదరయ్య అంటే ఎక్కడ లేని భయం. రోగులున్న

ఇండ్లలోని విధవలకు దేవతలు ఆవేశించి, ప్రయోగ మని పలికే వారు. ''నే నెరుగను మొర్రో'' అని దామోదరయ్య మొత్తుకొంటాడు. కాని ఎవరూ నమ్మరు. వూళ్లో ఎవరికి ఏరోగం వచ్చినా అది దామోదరయ్య ప్రయోగంగా కనిపిస్తుంది. అందువల్ల సంఘం అతనిని వెలివేస్తుంది. నీళ్లకు రానివ్వరు. చాకలి, మంగలి అతనిపనులు మానివేస్తారు. ఈస్థితిలో అతని భార్యకు రోగం వస్తుంది. అష్టమిత్రుడు కూడ సంఘానికి భయపడి ఆమెకు మందు ఇవ్వడు. ఎలాగో ఆమెకు కొంతస్వాస్థ్యం చేకూరిన తరువాత అతడామెను పుట్టింటికి పంపిచేస్తాడు.

అయినా సంఘం అతనిని క్షమించదు. తెల్లవారిలేచేసరికి అతని గుమ్మంలో ఎముకలు, కుండపెంకులు మొన్నైనీ అశుద్ధపదార్థాలు ప్రత్యక్షమయ్యేవి. దామోదరయ్య ఎలాగో శుద్ధిచేసుకోనేవాడు. బయటికి పోవాలంటేనే అతనికి భయం. అహోరాత్రులు తలుపులు బిగించుకొని అతడు ఇంట్లోనే కూర్చునేవాడు. అది చూచి గ్రామస్థులు హడలి పోతారు. దామోదరయ్య ఏదో పాతాళహోమం చేస్తున్నాడని వణకిపోయి, అతని కొంపకు చిచ్చు పెడతారు. ఆ ఇంటిలో పాటు దామోదరయ్య కూడా భస్మపటలమై పోతాడు.

దామోదరయ్య పాత్ర చిత్రణలో కనిపించే స్వాభావికత్వం, జీవం, రాజశేఖరుని చిత్రణలో కాని, తక్కిన పాత్రల చిత్రణలో కాని కనిపింపవు. రచయిత అభివర్ణించిన ఆచారవ్యవహారాలు, ఈనాటికీసమాజంలో కనిపిస్తున్నా కథకు ఆవశ్యకాలు కాక దాడిమ బీజాలకు తమ్ముళ్లవుతున్నవి.

ఏది ఎలా ఉన్నా కావ్యదృష్టితో చూచినప్పుడు రాజశేఖర చరిత్ర అంత సంతృప్తికరంగా లేకపోవచ్చును. కొందరు దానికి కావ్యత్వమేసిద్ధిపం దని అనవచ్చును. కాని వచన ప్రబంధ చరిత్ర కారులు మాత్రం ముందు రాజశేఖర చరిత్రను పేర్కొని, ఆ తరువాతనే తక్కిన రచనలను పేర్కొనవలసి ఉంటుంది.

ఆంధ్రప్రభ, 6-1-1963.

# శబ్దవివేకము

## ఆఋఅణాలు

### వర్ణక్రమము

1. ఒకే హల్లుపై రెండచ్చులుండవు.
   గృుహము, మృుగము - ఇట్లు వ్రాయుట తప్పు.
   గృహము, మృగము - అని వ్రాయవలయును,
2. ఆచ్ఛిక పదములందు ఋకారము లేదు.
   కృంగెను, వాకృచ్చెను - ఇత్యాదులు దుష్టములు.
3. ఈ క్రింది పదములందలిది ఋకారమే కాని అన్యము కాదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| ఋక్కు | రుకు |
| ఋజువు (తిన్నని) | రుజువు |
| ఋణము | రుణము |
| ఋషి | రుషి |
| ఋతువు | రుతువు |
| ఋషభము | రుషభము |
| ఋగ్వేదము | రుగ్వేదము |
| కృష్ణుడు | క్రుష్ణుడు |
| కృప | క్రుప |
| జృంభణము | జ్రుంభణము |
| కృషి | కృుషి |
| ఘృతము | ఘ్రుతము |
| నృపుడు | న్రుపుడు |
| నృత్యము | న్రుత్యము |
| పృథివి | ప్రుథివి |
| బృహస్పతి | బ్రుహస్పతి |
| భృత్యుడు | భ్రుత్యుడు |

| ఒప్పు | తప్పు |
|---|---|
| తృణము | త్రుణము |
| దృష్టి | ద్రుష్టి |
| మృదువు | మ్రుదువు |
| మృత్యువు | మ్రుత్యువు |
| శృంఖలము | శ్రుఖలము |
| శృంగము | శ్రుంగము |
| సృగాలము | స్రుగాలము |
| హృదయము | హ్రుదయము |
| సంస్కృతము | సంస్క్రుతము |
| అమృతము | అమ్రుతము |
| ప్రకృతి | ప్రక్రుతి |
| వికృతి | విక్రుతి |

4. ఈక్రింది పదములలోనిది ర కారమే.

| ఒప్పు | తప్పు |
|---|---|
| క్రూరుఁడు | కౄరుఁడు |
| క్రుంగు | కృంగు |
| ద్రుతము | దృతము |
| ద్రుపదుఁడు | దృపదుఁడు |
| ధ్రువుఁడు | ధృవుఁడు |
| ధ్రువము | ధృవము |
| క్రుద్ధుఁడు | కృద్ధుఁడు |
| గ్రుక్క | గృక్క |
| త్రుటి | తృటి |
| భ్రుకుటి | భృకుటి |
| శ్రుతి | శృతి |
| శ్రుతము | శృతము |
| స్రుక్కు | సృక్కు |
| స్రుతి | సృతి |
| మ్రుక్కడి | మృక్కడి |

| ఒప్పు | తప్పు |
|---|---|
| త్రుంచు | తృంచు |
| గ్రుడ్డి | గృడ్డి |
| విశ్రుతము | విశృతము |
| శుశ్రూష | శుశౄష |
| శత్రువు | శతృవు |
| పుత్త్రుఁడు | పుతృఁడు |
| అక్రూరుఁడు | అకౄరుఁడు |

5. ఒ ఓ లతో గూడిన మకార యకారము లీక్రింది విధముగా నుండును.
మొ, మో, యొ, యో

6. సున్నతో పఙ్క్తి ప్రారంభము కాదు.
అంతరంగము. ఇట్లు వ్రాయుట తప్పు.

7. శబ్దస్వరూపము ననుసరించి ఖ, ఘ, త, థ, ధ, శ,. స, ల వర్ణక్రమ మెఱుంగునది.



| ఒప్పు | తప్పు |
|---|---|
| మేఘము | మేఖము |
| మూర్ఖుఁడు | మూర్ఘుఁడు |
| వ్యాఘ్రము | వ్యాఖ్రము |
| ప్రకాశించు | ప్రకాసించు |
| అభ్యసించు | అభ్యశించు |
| నివసించు | నివశించు |
| ప్రవేశించు | ప్రవేసించు |
| దాస్యము | దాశ్యము |
| రహస్యము | రహశ్యము |
| రాశి | రాసి |
| రాసులు | రాశులు |
| దర్శించు | దర్సించు |
| నిరసించు | నిరశించు |
| ప్రశంస | ప్రశంశ |
| హింసించు | హింశించు |

| ఒప్పు | తప్పు |
| --- | --- |
| వికసించు | హింశించు |
| వికసించు | వికశించు |
| ఉపదేశించు | ఉపదేసించు |
| నశించు | నసించు |
| కృశించు | కృసించు |
| నిశ్వసించు | నిశ్వశించు |
| ఉచ్ఛ్వసించు | ఉచ్ఛ్వశించు |
| విశ్వసించు | విశ్వశించు |
| ఉద్దేశించు | ఉద్దేసించు |
| ఆస్తి | ఆస్థి |
| ప్రశస్తి | ప్రశస్థి |
| స్థితి | స్తితి |
| స్తుతము | స్థుతము |
| ప్రస్తుతము | ప్రస్థుతము |
| స్థలము | స్తలము |
| స్థానము | స్తానము |
| ప్రస్తావము | ప్రస్థావము |
| సిస్తు | సిస్థు |
| అంతస్తు | అంతస్థు |
| విస్తారము | విస్థారము |
| నేస్తము | నేస్థము |
| వస్తువు | వస్థువు |
| సృష్టి | సృష్ఠి |
| వ్యాపారస్థుఁడు | వ్యాపారస్తుడు |
| సెలవు | శెలవు<br>శలవు |
| సెనగ | శనగ<br>శెనగ |
| మాంసము | మాంశము |

| ఒప్పు | తప్పు |
| --- | --- |
| ఆలస్యము | ఆలశ్యము |
| మధుసూదనుఁడు | మధుసూధనుఁడు |
| దృష్టము | దృష్ఠము |
| వసిష్ఠుడు | వసిష్టుఁడు |
| సూర్యరశ్మి | సూర్యరస్మి |
| పసిఁడి | పశిఁడి |
| కుష్ఠవ్యాధి | కుష్టువ్యాధి |
| హాస్యము | హాశ్యము |
| పేరుప్రతిష్ఠలు | పేరు ప్రతిష్టలు |
| వికాసము | వికాశము |

8. భూతకాలిక క్రియాజన్య విశేషణమునందుండునవి ఒకార తకారములేకాని ఠకార థకారములు కావు.

| ఒప్పు | తప్పు |
| --- | --- |
| కష్టము | కష్ఠము |
| నష్టము | నష్ఠము |
| భ్రష్టము | భ్రష్ఠము |
| దుష్టము | దుష్ఠము |
| గ్రస్తము | గ్రస్థము |
| శస్తము | శస్థము |

9. సంస్కృతాంధ్రములందు టకార విశిష్ట సకారములేదు.
నష్టము కష్టములే కాని నస్టము కస్టములు కావు.

10. తమ ప్రత్యయార్థమున వచ్చునది ఠకారమేకాని టకారము కాదు.

| ఒప్పు | తప్పు |
| --- | --- |
| శ్రేష్ఠము | శ్రేష్టము |
| గరిష్ఠము | గరిష్టము |
| వరిష్ఠము | వరిష్టము |
| బలిష్ఠము | బలిష్టము |
| భూయిష్ఠము | భూయిష్టము |
| కోపిష్ఠము | కోపిష్టము |
| పాపిష్ఠము | పాపిష్టము |

11. అచ్చికమున నదంతములైన తాలవ్య చజలు లేవు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| జేన | జాన |
| చేఁద | చాద |
| చేఁప | చాప |
| జెముఁడు | జముఁడు |
| చెదరు | చదరు |
| చెలఁగు | చలగు |
| చెలమ | చలమ |
| జెఱ్ఱి | జఱ్ఱి |

12. ఐదంతములైన చజలు అచ్చికంబున లేవు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| జేజేలు | జైజైలు |

13. తత్సమంబుల యందలి ఐ ఔలకు అయి, అవులు రావు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| ధైర్యము | ధయిర్యము |
| స్థైర్యము | స్థయిర్యము |
| చైత్రము | చయిత్రము |
| ఔదార్యము | అవుదార్యము |
| ఔన్నత్యము | అవున్నత్యము |

201

14. ద్విరుక్త ర కారము శకట రేఫమే.

కఱ్ఱ, గొఱ్ఱె, మఱ్ఱి, వెఱ్ఱి, తొఱ్ఱి ఇత్యాదులు

15. తెలియనపుడు అర్ధానుస్వార శకట రేఫములను వ్రాయకుండునది.

16. అచ్చికంబుల మొదట యకారము, వు వూ వొ వో లు లేవు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| అతఁడు | యతఁడు |
| ఆతఁడు | యాతఁడు |
| ఇతఁడు | యితఁడు |
| ఈతఁడు | యీతఁడు |
| ఎవఁడు | యెవఁడు |

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| ఏతఁడు | యేతఁడు |
| ఉప్పు | వుప్పు |
| ఊరు | వూరు |
| ఒకటి | వొకటి |
| ఓర్పు | వోర్పు |

17. ఐత్వము తావత్తుల బేధ మెఱుంగునది.

పైరు - కత్తెర

## పదప్రకరణము

1. ప్రథమైక వచన ముువర్ణకమునకు పద్వాదులు పరం బగునపుడు తప్పునున్నరాదు.
అశ్వము, అన్నము, ద్వారము, గుల్మము, భయంపడు.
2. తిజలందలి ముువర్ణకమునకు పూర్ణానుస్వారము లేదు.
ఉన్నామము - ఉన్నాం
3. ఈక్రింది శబ్దముల స్వరూప మెఱుంగునది.



| ఒప్పు | తప్పు |
|---|---|
| సాయంత్రనము | సాయంత్రము<br>సాయింత్రము |
| స్వాతంత్ర్యము | స్వాతంత్రము<br>స్వాతంత్రియము |
| ప్రాముఖ్యము | ప్రాముఖ్యత |
| ఐక్యము | ఐక్యత |
| ఆధిక్యము | ఆధిక్యత |
| ప్రావీణ్యము | ప్రావీణ్యత |
| వాద్యము | వాయిద్యము |
| భేదము | బేధము |
| స్తంభము | స్థంభము |
| శబ్దము | శబ్ధము |
| విద్య | విధ్య |
| బాధ | భాద |

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| బోధ | భోద |
| ధనుస్సు | ధనస్సు |
| అర్జునుఁడు | అర్జనుఁడు |
| అశ్వత్థామ | అశ్వద్ధామ |
| క్ళృప్తము | క్లుప్తము |
| విద్యుత్తు | విధ్యుత్తు |
| గృహస్థుఁడు | గృహస్తుఁడు |
| శూన్యము | సూన్యము |
| సులభము | శులభము |
| శుభము | సుభము |
| సింహము | { శింహము<br>సింహ్వము |
| సీత | శీత |
| ఆజ్ఞ | { ఆఙ్ఞ<br>ఆగ్న |
| వాఙ్మయము | వాంఙ్మయము |
| | { వాంఙ్ఞయము |
| వాఙ్మలము | వాంఙ్మలము |
| | వాంగ్మాలము |
| ఆధ్వర్యవము | అధ్వర్యము, ఆధ్వర్యము |
| చిహ్నము | చిన్హము |
| వహ్ని | వన్హి |
| సంయమి | సమ్యమి |
| సొంతము | స్వంతము |
| సంబంధము | సంభంధము |
| పుస్తకము | పుస్తుకము |
| ద్రౌపది | ద్రౌపతి |
| విరాటపర్వము | విరాట్పర్వము |
| శపథము | శబధము |

| ఒప్పు | తప్పు |
|---|---|
| శ్మశానము | స్మశానము |
| ఛాందసుఁడు | చాదస్తుఁడు |
| జ్యేష్ఠము | జ్యేష్టము |
| జ్యౌతిషము | జ్యోతిషము |
| వార్ధకము | { వృద్ధాప్యము<br>వార్ధక్యము |
| ఆకర్షణీయము | ఆకర్షనీయము |
| దుస్స్థితి | దుస్థితి |
| రుజువు | (సాక్ష్యము) ఋజువు |
| పఱుచు | (పడు ప్రేరణకు) పఱచు |
| చెఱుచు | (చెడునకు) చెఱచు |
| మాటలాడు | మాట్లాడు |
| ఒద్ద | వద్ద |
| ఉండి | ఉంచి |
| చాపల్యము | చాపల్యత |
| కౌశలము | కౌశల్యత |
| ఆవశ్యకత | అవశ్యకత |
| బీదలు | బీదుకులు |
| దుర్వ్యసనము | దుర్యసనము |
| స్మృతి | స్పృతి |
| బాంధవ్యము | భాందవ్యము |
| మిగిలిన | మిగతా |
| తక్కిన | తతిమ్మా |
| ఆచారము | ఆశారము |
| నటకులు | నటుకులు |
| వీధివెంట | వీదమ్మట |
| రాత్రులు | రాత్రిళ్లు<br>రాత్రింతలు |
| విచ్ఛిన్నము | విశ్ఛిన్నము |

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| నాయిక | నాయకి |
| పౌరాణికములు | పురాణికములు |
| అవసరము | ఔసరము, అవుసరము |
| అభిమన్యు యుద్ధము | అభిమన్య యుద్ధము |
| అవస్థ | అవస్త |
| అనావశ్యకము | అనవసరము |
| మనుష్యుఁడు | మనిషి |
| మానిసి | |
| అమాయికత్వము | అమాయకత్వము |
| క్రిందట | క్రితము |
| చాల | చాలా |
| కూడ | కూడా |
| ద్వారమున | ద్వారా |
| అంతయు | అంతటిని |
| ఎంతయు | ఎంతటిని |
| కొంతయు | కొంతటిని |
| బయట | బయిట |
| జనసమ్మర్దము | జనసమర్దము |
| అధికముగా | అతిగా |
| పిమ్మట | తదుపరి |
| వంటి | లాంటి |
| ఆలాగు | అలా, అలాగ |
| ఈలాగు | ఇలా, ఇలాగ |
| ఏలాగు | ఎలా, ఎలాగ |
| వానిని | వాడ్ని, వాణ్ణి, వాడిని |
| | వాన్ని |

(అతఁడు, ఆతఁడు, ఇతఁడు, ఈతఁడు, ఎతఁడు, ఏతఁడు అను వాని రూపముల నెఱుంగునది.)

| ఒప్పు | తప్పు |
| --- | --- |
| సర్వత్ర | సర్వత్రా |
| వ్యయప్రయాసములు | వ్రయప్రయాసలు |
| కొమార్త | కుమార్త |
| కొమరిత | కుమార్తె |
| ప్రపంచములో నెల్ల | ప్రపంచములోకెల్ల<br>ప్రపంచములోకల్ల |
| నిశ్చయము | నిశ్ఛయము |
| బొమ్మ | బుమ్మ |
| సూత్రధారులు | సూత్రదారులు |
| శిక్ష | సిక్ష |
| శిఖరము | సిఖరము |
| విరుద్ధము | విరుద్దము |
| శీలము | సీలము |
| శాసనము | శాశనము |
| శాస్త్రము | సాస్త్రము |
| పగలంతయు | పగలంతా<br>పగలెల్లా<br>పగలల్లా |
| పరిశుభ్రత | పారిశుభ్రత |
| ప్రజాస్వామిక దేశము | ప్రజాస్వామ్య దేశము |
| ఉత్పాదకుఁడు | ఉత్పత్తిదారుఁడు |
| హరిశ్చంద్రుఁడు | హరిశ్శంద్రుఁడు<br>హరిచ్చంద్రుఁడు |
| ఉదాహరణము | ఉదహరణము |
| ఉదాహరించు | ఉదహరించు |
| ప్రొద్దుక్రుంకు | ప్రొద్దుగూకు |
| కూర్చుండు | కూర్చొను |

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| వివేకము | వివేకత |
| జీవనోపాధి | జీవనోపాది |
| చెవి | చెవ్వు |
| పెండ్లికొడుకు | పెళ్ళికొడుకు |
| కాశ్మీరము | కాష్మీరు |
| మంచిచెడుగులు | మంచిచెడ్డలు |
| | మంచిచెడులు |
| ప్రలాపములు | ప్రేలాపనలు |
| పాటుపడుజనులు | పాటకజనులు |
| పాటగాఁడు | పాటకుడు |
| దారిద్ర్యము | దారిద్రము |
| ఉద్యోగస్థుఁడు | ఉద్యోగస్తుఁడు |
| పెద్దమ్మవారు | పెద్దమ్మోరు |
| మధ్య | నడిమద్య |
| దుస్స్వప్నము | దుస్వప్నము |
| బేతాళుఁడు, వేతాళుఁడు | భేతాళుఁడు |
| మరల | మళ్ల |
| తిరిగి | తిరుగా |
| దగ్గర | దగ్గిర |
| దాసోహమ్మను | దాసోహంబను |
| యావజ్జనము | యావన్మంది |
| సిందూరము | శింధూరము |
| అస్తమయము | అస్తమానము |
| ప్రముఖుఁడు | ప్రాముఖ్యుడు |
| ఉపవాసము | వుపోష్యము |
| శూద్రుఁడు | సూద్రుడు |
| పద్యము | పత్యము |
| దృష్టాంతము | దృష్టాంతరము |

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| శీతకాలము | సీతకాలము |
| బావి | భావి |
| శుభ్రము | సుభ్రము |
| పాఠశాల | పాటశాల |
| మదాంధుఁడు | మధాందుఁడు |
| బంధువు | భందువు |
| గారాబము | గారాభము |
| వాగ్దానము | వాగ్దానము |
| దయ్యము | దెయ్యము |
| సౌఖ్యము | సౌక్యము |
| ఆశ్చర్యము | హాశ్చర్యము |
| శుక్రవారము | సుక్రవారము |
| గంటలు | గెంటలు |
| ప్రాయశ్చిత్తము | ప్రాయచ్చిత్తము |
| చికిత్స | చికిచ్చ |
| అందునకు | అందుక్కు |
| ఇందునకు | ఇందుకు |
| ఎందునకు | ఎందుకు |
| లేకయే | లేకనే |
| కర్మము | ఖర్మము<br>కర్మ<br>ఖర్మ |
| యజ్ఞము | యగ్నము |
| బ్రాహ్మణుఁడు | బ్రామ్మణుఁడు |
| చెఱుచు | చెఱచు |
| జాగరూకత | జాగరుకత |
| తగులఁబడు | తగలడు |
| మఱియు | మఱి |
| ఉచ్చారణ | ఉచ్చారణ |

జి.వి.కృష్ణరావు

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| బాగుగానుండవలయును | బావుండాలి |
| ఏయొకతప్పు | ఏవక్క తప్పు |
| ఆరోజులలో | ఆరోజుల్లో |
| తత్త్వము | తత్వము |
| ఉజ్జ్వలము | ఉజ్వలము |
| ప్రజ్వలము | ప్రజ్జ్వలము |
| మహత్త్వము | మహత్వము |
| భస్మపటలము | భేస్మపటలము |
| జాగ్రత్త | జాగ్రత, జాగర్త |
| తతక్షణము | తక్షణము |
| నాగరకత | నాగరీకత |
| నాగరకము | నాగరీకము |
| పూర్వులు } | |
| పూర్వికులు } | పూర్వీకులు |
| రజతము | రజితము |
| వ్రాసి | వ్రాశి |
| సేవకుఁడు | శేవకుఁడు |
| కౌంచెము | కౌంచవము |
| చంద్రుఁడు | చెంద్రుడు |
| ఏనుఁగు | ఏనుగ |
| రీతిచే | రీత్యా |
| అన్నము | వణ్ణము |
| ముఖమునుండి | ముఖతా |
| ఒకవేళ | బహుశా |
| గుణవంతుఁడు | గుణమంతుఁడు |
| దేవుఁడు | దేముఁడు |
| బాలురు | బాలులు |
| సమర్థులు | సామర్థులు |
| సామెత | సామితె |

| ఒప్పు | తప్పు |
|---|---|
| రెండు | రొండు |
| నిండ | నిండా |
| అక్షతలు | అక్షింతలు |
| పూర్ణిమ | పౌర్ణమి |
| సౌహార్దము | సౌహార్ద్రము |
| బాష్పములు | భాష్పములు |
| వ్యయము | వ్రయము |
| బాలెంత | బాలింత |
| చేసిరి | చేశిరి |
| శాశ్వతము | శాశ్వితము |
| దుఃఖము | దుఖ్ఖము |
| వరాహావతారము | వరహావతారమ: |
| చెవుడు | చెముడు |
| ఎలుక | ఎలిక |
| వెలుపలికి | వెలపలకి |
| తునుకలు | తునకలు |
| లెక్క | లెఖ్ఖ |
| అవలంబించు | అవలంభించు |
| వెండ్రుకలు | వెంట్రుకలు |
| మధ్యాహ్నము | మద్యాన్నము |
| చదలేఱు | చెదలెరు |
| చెమరించుట | చమరించుట |
| ఆకస్మికముగ | అకస్మాత్తుగా |
| వర్ణము | వర్నము |
| నిర్నిద్రము | నిర్ణిద్రము |
| ఫల్గునుడు | ఫల్గుణుడు |
| నడువడి | |
| నడవడి } నడవడిక } | నడువడిక |

జి.వి.కృష్ణరావు

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| నీవు | నువ్వు |
| ఆలోచించు | ఆలోజించు |
| యోచించు (ఆలోచించు) | యోజించు |
| కలవు | కలువు |
| దోహదము | ద్రోహదము |
| ప్రమాదావస్థ | ప్రమాధావస్థ |
| బాధ్యుఁడు | భాద్యుడు |
| అట్లే | అటులనే |
| అటులే | |
| భోజనముచేయు | భోంచేయు |
| నిప్పు | నుప్పు |
| సత్యాసత్యములు | నిజానిజములు |
| ఊహా పోహములు | ఊహాపోహలు |
| వానితోపాటు | వానితోబాటు |
| సాంఘికము | సాంఖికము |
| అనుసరించు | అనుచరించు |
| నిర్మాతలు } | నిర్మాణకులు |
| నిర్మాపకులు | |
| ఎదిరించు | ఎగర్తించు |
| రాష్ట్రము | రాష్ఠ్రము |
| ఒడుదొడుకులు | ఒడుదుడుకులు |
| అస్పృశ్యత | అస్ప్రుశ్యత |
| చాంచల్యము | చాంచల్యత |
| సంపాదించు | సంపాయించు |
| తమఛాయ | తమచ్ఛాయ |
| జనాకర్షణము | జనాకర్షణీయము |
| యౌవనము | { యౌవ్వనము / యవ్వనము |
| అచటికి | అచటకు |

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| కంటిజబ్బులు | కళ్లజబ్బులు |
| రామణీయకము | రామణీయకత |
| పారిశుద్ధ్యము | పారిసుద్ధ్యత |
| ఇంకను | ఇంకా |
| అర్హత | అర్హము |
| కనిపించు | కనుపించు |
| కనిపెట్టు (వెదకిపట్టుట) | కనుపట్టు |
| కానిపించు | కానుపించు |
| కాన్పించు | |
| వినిపించు | వినిఫించు |
| క్రొత్త | కొత్త |
| ప్రాఁత | పాత |
| విద్యుచ్ఛక్తి | విద్యుచ్ఛక్తి, విద్యుశ్శక్తి |
| పారిశ్రామికాభివృద్ధి | పారిశ్రామిక యభివృద్ధి |
| సమాజోపకారులు | సమాజయుపకారులు |
| వ్యాపార రూపమున | వ్యాపార రూపేణ |
| క్రమముగ | క్రమేపి |
| శాస్త్రరీతిచే | శాస్త్రరీత్యా |
| ప్రమాదవచమున | ప్రమాదశాత్తు |
| పిమ్మట | తదుపరి |
| అందువలననే యాతఁడు | అందువలనే నాతఁడు |
| తెలియకయే | తెలియకనే |
| ఏలయొ | ఏలనో |
| ఆలంకారికుఁడు | అలంకారికుఁడు |
| సంప్రదాయము | సాంప్రదాయము |
| అయినన్ | అయితే |
| ముండ్లు | ముళ్లు |
| కావలి | కావిలి |
| కొఱవి | కొరివి |

| | |
|---|---|
| కావడి | కావిడి |
| పైని | పైన |
| వ్యావసాయకము | వ్యవసాయకము |

4. ఈడు మున్నగు శబ్దము ఐజాదులు.

| | |
|---|---|
| ఈడు | ఇసుక |
| ఎడ | ఒడి |
| ఓడలు | ఓర్పు |
| ఒకటి | ఏరు |
| ఏతము | అన్నము మొదలగునవి. |

5. వెళ్ళు మున్నగునవి హళాదులు.

| | |
|---|---|
| వెళ్లుట | పోవుట |
| వెనుక | వెన్ను |
| వేషము | వెలితి |
| విషము | వదలు |
| వదులు | వంకర |
| వజ్రము | వక్క |
| వంత | వంట |
| వచ్చు | వత్తి |
| పట్టు | వరి |



## విభక్తి ప్రకరణము

1. ఈ క్రింది ఏక వచనములకు బహువచన రూపముల నెఱుంగునది.

| ఏక | బహు |
|---|---|
| బాలుఁడు | బాలురు |
| ధీశాలి | ధశాలులు |
| దయాళుఁడు | దయాళురు |
| కూఁతురు | కూఁతులు |
| పల్లు (దంతము) | పండ్లు |
| పండు | పండ్లు |
| కన్ను | కన్నులు |

| | |
|---|---|
| ముల్లు | ముండ్లు |
| ఇల్లు | ఇండ్లు |
| పెండ్లి | పెండ్లిండ్లు |
| కొడవలి | కొడవండ్లు - మొదలగునవి |
| ఊరు | ఊరులు, ఊళులు |
| పేరు | పేర్లు, పేళులు |
| త్రాడు | త్రాళ్లు |
| ఱాయి | ఱాలు |
| వ్రాయి | వ్రాలు |
| మ్రాను | మ్రాఁకులు |
| ఏఁడు | ఏండ్లు |
| కొలను | కొలఁకులు |
| వలను | వలఁకులు |

2. కుషష్ఠి పరంబగునపుడుదంత శబ్దములకు నగాగమంబగు.

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| రామునకు | రాముకు |
| అందునకు | అందుకు |
| విందుకు | విందునకు |
| వనమునకు | వనముకు |
| నిజమునకు | నిజముకు |
| పొలమునకు | పొలముకు |
| గ్రామమునకు | గ్రామముకు |

3. ఈ నగాగమంబున ముగామమునకు లోపము, పూర్వ స్వరమునకు దీర్ఘము, విధించుట మంచిదికాదు.

నిజానికి, పొలానికి, గ్రామానికి ఇవి తప్పులు

4. యొక్క షష్ఠికి లోపంబు బహుళంబు.

| | |
|---|---|
| వానియొక్క గుఱ్ఱము | వాని గుఱ్ఱము |
| వానియొక్క విద్య | వాని విద్య |

5. పంచమీ 'వలన' 'కంటె' లకు బదులు 'వల్ల' 'కన్న' లు ప్రయోగింప కుండుట మేలు.

| | |
|---|---|
| వానివలనఁదప్పులేదు | వానివల్ల తప్పులేదు |
| వానికంటె నతఁడుఘనుడు | వానికన్న నతఁడు ఘనుడు |

6. విభక్తిపై మఱియొక విభక్తి నిలువదు.

ఇతర దేశములలో కంటె మనదేశమునందు విద్యావ్యాప్తి తక్కువ.

7. కాడ్వాదులకుఁ బ్రథమేతర విభక్తులు పరంబగునపుడు టి ఆదేశం బగు.

| | |
|---|---|
| కాడు | కాటికి |
| వీడు | వీటికి |
| నాడు | నాటితో |
| నాఁడు | నాటికి |
| అన్ని | అన్నిటికి |

8. కన్న్వాదులకు 'ంటి' చేరును.

| | |
|---|---|
| కన్ను | కంటికి |
| మిన్ను | మింటికి |
| తొల్లి | తొల్లింటి కంటె |
| అన్ని | అన్నింటి యందు |
| కొన్ని | కొన్నింటికి |
| ఎన్ని | ఎన్నింటికి |

9. కాల్వాదులకు 'ఇ' చేరును.



| | |
|---|---|
| కాలు | కాలికి |
| ఊరు | ఊరికి |
| చేను | చేనికి |
| మ్రాను | మ్రానిమీఁద |

10. గోయి మొదలగువానికీ 'తి' చేరును.

| | |
|---|---|
| గోయి | గోతియందు |
| నేయి | నేతికి |
| నూయి | నూతికి |
| చేయి | చేతికి |

11. అంద ఱెందఱు కొందఱులకు 'ఇ' గాగమంబు లేదు.

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| అందఱను | అందఱిని |
| కొందఱుచేత | కొందఱిచేత |
| ఎందఱకొఱకు | ఎందఱికొఱకు |

12. వాటిని, వీటిని, వేటిని, ఏటిని యిత్యాదు లసాధువులు.

13. సంఖ్యావాచకములను యథాప్రయోగముగ నెఱుంగునది.

| ఒప్పు | తప్పు |
|---|---|
| పదునొకటి | ఇరువది |
| పండ్రెండు | ఇరువదియొకటి |
| పదుమూఁడు | ముప్పది |
| పదునాలుగు | నలువది |
| పదునైదు | ఏఁబది |
| పదునేను | అఱువది |
| పదునాఱు | డెబ్బది |
| పదునేడు | ఎనుబది |
| పదునెనిమిది | తొంబది |
| పందొమ్మిది | నూఱు |

14. నేను తాను లు ప్రథమైక వచనాంత ద్రుతప్రకృతికములు.



| ఒప్పు | తప్పు |
|---|---|
| తాను | తను |

15. నన్ను, తన్ను, మిమ్ము, మమ్ము అనునవి ద్వితీయాంతములు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| తన్ను | తనను |
| మిమ్ము | మిమ్ములను |
| మమ్ము | మమ్ములను |

16. అతను, ఇతను, ఎతను అను రూపములు దుష్టములు.

## ధాతుప్రకరణము

1. అలుగ్వాదు లుత్వ విశిష్టములు.

| | |
|---|---|
| అలుగు | ఆవులించు |
| ఉతుకు | ఉమకు |
| ఎగురు | ఎమగు |
| కలుపు | కొఱకు |
| చదువు | చితుకు |
| చిదుకు | చెరుగు |

| | |
|---|---|
| తగులఁబడు | తఱుము |
| దేవురించు | నిలుచు |
| నిలువరించు | |
| పగులు | పలుకు |
| పితుకు | పిలుచు |
| పిదుకు | పెరుగు |
| పెఱుగు | మెదుగు |
| | వడుకు |
| విడు | వదులు (బిగువుతప్పు) |
| వ్రాయు | విడుచు |

2. అగల్వాదు లత్వ విశిష్టములు.

| | |
|---|---|
| అగలు | అగపడు |
| అదల్చు | అలయు |
| ఒరగు | ఒఱగు |
| కదలు | |
| కసరు | కెలకు |
| కొసరు | కడచు |
| చెదరు | తడవు |
| తొలకరించు | నమలు |
| | పెనగు |
| ముసరు | మెదలు |
| మెలఁగు | మెఱయు |
| మొలచు | వగచు |
| వడలు | వడఁకు, వణఁకు |
| వదలు (వీడు) | విసరు |
| వెతకు, వెదకు | |

3. భావార్థక ట కారమునకు అట మడము లా దేశములు కావు.

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| చేయుట | చేయటము, చేయడము |
| కోయుట | { కోయటము<br>కోయడము |

| ఒప్పు | తప్పు |
| --- | --- |
| వ్రాయుట | వ్రాయటము |
| | వ్రాయడము |

4. 'యు'దంత ధాతువులకు శత్రర్థకమున 'స్తున్న' 'స్తూన్న' 'స్తూవునన', అనునవి చేరవు.

చేయుచున్న — { చేస్తున్న / చేస్తూన్న / చేస్తూవున్న

5. నుక్చు కారమునకు 'ంటు' 'ంటూ' లురావు.

| ఒప్పు | తప్పు |
| --- | --- |
| కొనుచు | కొంటు, కొంటూ |
| తినుచు | తింటు, తింటూ |

6. "చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారం" బగు.

నిలుతువము (పిలుచు+దు+ము =పిలుతుము

7. కోతురిత్యాదు ల సాధువులు.



| ఒప్పు | తప్పు |
| --- | --- |
| కోయుదురు | కోతురు |
| చేయుదురు | చేతురు |

8. చూదామాదులు దుష్టములు.

చూదాము, కోదాము, వ్రాదాము

9. ధాతూత్వమునకు వ్యతిరేకార్థంబున నత్వంబగు.

చేయుము+ అనియెను = చేయుమనియెను

చేయుము+ అనియెను = చేయమనియెను (వ్యతిరేకార్థము)

10. ఇచ్చునకు వ్యతిరేకార్థ కాదులందు ఈ, ఈయ లాదేశంబగు.

| ఒప్పు | తప్పు |
| --- | --- |
| ఈఁడు | ఇవ్వఁడు |
| ఈయఁడు | ఇయ్యడు |
| ఈయని | { ఇవ్వని / ఇయ్యని |

11. తృవర్ణ కార్థంబున ఏదంతరూపములు లేవు.

జి.వి.కృష్ణరావు

| | |
|---|---|
| పోవువాఁడు | పోయేవాఁడు |
| వచ్చువాఁడు | వచ్చేవాడు |
| వచ్చెడివాఁడు | వచ్చేవాడు |
| వచ్చెడువాఁడు | వచ్చేవాడు |
| | వచ్చేటివాడు |

12. ఆగమ చ కారంబున కద్విరుక్తంబునకు ముత్తు పరంబగునపుడు 'ప' అగు.

| | |
|---|---|
| వచించు (ధాతువు) | వచింపుము |
| వచింపుఁడు | వచింపఁగల |
| వచింపఁబడు | వచింపని |
| వచింపమి | వచింపను |
| వచింపక | వచింపకుము |
| వచింపవే | వచింపరే |
| వచింపుమ | వచింపుమా |
| వచింపుమి | వచింపుమీ |
| వచింపుమయ్యా | వచింపవో |
| వచింపవో | వచింపలేదు |
| | ఇత్యాదులు |
| ఒప్పు | తప్పు |
| కల్గింపక | కల్గించక |
| పోషింపవలయు | పోషించవలయు |
| ప్రోత్సహింపవలయు | ప్రోత్సహించవలయు |
| చర్చింపరానిది | చర్చించరానిది |
| సంచరింపలేము | సంచరించలేము |
| ఆనందింపఁగలుగు | ఆనందించఁగలుగు |
| పరిగణింపఁబడు | పరిగణించబడు |
| రాణింపలేదు | రాణించలేదు |
| ప్రవర్తింపరు | ప్రవర్తించరు |
| సంపాదింపఁగల | సంపాదించగల |
| | సంపాయించగల |
| చెల్లింపని | చెల్లించని |
| అంగీకరింపదు | అంగీకరించదు |

13. ''ఖండబిందువుమీఁది సిద్ధచ కారమునకు ముత్తుపరంబగు నపుడు ప
కారంబు ప్రాయికంబుగ నగు,''

| | |
|---|---|
| తలఁచు | తలఁపుము |
| తలఁపుండు | తలఁపఁగల |

ఇట్లు పైదానిలోవలె మిగిలిన రూపంబు లెఱుంగునది.

14. స్వార్థంబునవచ్చు కొనునకు 'క' రాదు.

| | |
|---|---|
| తీసికొని | తీసుక |
| చేసికొని | చేసుక |

15. 'యు'దంత ధాతువులకు కొను అనుప్రయుక్తం బగునపుడు 'ఇ' కారంబ

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| తీసికొని | తీసుకొని |
| చేసికొని | చేసుకొని |

16. చేదర్థకమున అన్వాదులకు 'అంటే' మొదలగు రూపములు లేవు.

| | |
|---|---|
| అనినన్ | అంటే |
| కనినన్ | కంటే |
| తినినన్ | తింటే |
| వినినన్ | వింటే |



17. పోవుచు ఇత్యాదులు సాధువులు

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| పోవుచుండఁగా | పోతావుండగా |
| వెళ్ళుచుండఁగా | వెళ్లుతూవుండగా |

18. ప్రేరణముపైఁ బ్రేరణములేదు.

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| ప్రేరేఁచు | ప్రేరేపింప జేయుట |
| రంజించు | రంజింపజేయు |

19. ఈ క్రిందివాని సాధుత్వా సాధుత్వముల నెఱుంగునది.

| | |
|---|---|
| ఒప్పు | తప్పు |
| చూపుచున్న | చూపుతున్న |
| వేఱుగాఁ జెప్పవలెనా | వేరేచెప్పాలా |

| ఒప్పు | తప్పు |
|---|---|
| | తెలసికొను |
| తెలిసికొను | తెలుసుకొను<br>తెలుచుకొను |
| చెందింపవలెను | చెందించాలి |
| ఒప్పు | తప్పు |
| చూచి | చూసి<br>నుంచొని |
| నిలుచుండి | నుల్చొని<br>నిల్చొని<br>నిల్చోని |
| కొనరాదా | కొనక్కొసరాదా |
| ఉన్నది | ఉంది<br>ఉంటుంది |
| ఉండును | ఉంటవి<br>ఉంటాయి |
| మఱచిపోయి | మర్చిపోయి |
| తీయుట | తీచుట |
| అనియే చెప్పవలెను | అనే చెప్పాలి |
| నడుపు | నడిపింపజేయు |
| కలుగఁజేయు | కలిగింపజేయు |
| తలఁపరు | తలుఁపరు |
| విడుచు | విడచు |
| అగపడని | అగుపించని |
| కఱపుట | కఋపుట |
| అప్పగించు | వప్పగించు<br>ఒప్పగించు |

## సంధి ప్రకరణము

1. దుష్టసంధికంటె విసంధి మేలు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| అదుష్టము | తప్పు |
| రాముఁడు ఉత్తముఁడు | రాముడు యుత్తముఁడు |

2. స్త్రీ వాచక తత్సమ సంబోధనాంతముల మీఁది యత్వమునకు సంధిలేదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| అమ్మ+చ్చెను = అమ్మయిచ్చెను | అమ్మిచ్చెను |
| సీత+అనియెను = సీతయనియెను | సీతనియెను |
| రాముఁడ+ ఇటురమ్ము = రాముఁడయిటురమ్ము | రాముఁడిటురమ్ము |

3. "క్త్వార్థంబైన యిత్తునకు సంధి" లేదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| చూచి+అనియెను = చూచియనియెను | చూచనియెను |

4. సంధి లేనిచో యడాగమమేగాని వుడాగమము లేదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| ఏ+ ఊరు = ఏయూరు | ఏ వూరు |

5. సంధి లేనిచో ద్రుతంబుమీది యచ్చునకు యవులు రావు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| అచ్ఛోట+ఉండెను=అచ్ఛోట నుండెను | అచ్ఛోటయుండెను |
| | అచ్ఛోటవుండెను |
| వారిలోనున్న | వారిలోయున్న |
| వానిపై నాధారపడును | వానిపై యాధారపడును |
| విశ్వాసముతోనుండి | విశ్వాసముతో యుండి |
| భర్తతోనుండక | భర్తతోయుండక |
| గొప్పగానుండెను | గొప్పగాయుండెను |
| ఏలయన నీచిత్రము | ఏలనన యీ చిత్రము |
| చాల నుపయోగము | చాలయుపయోగము |
| ఒక్కరుఁగూడనుండరు | ఒక్కరుఁగూడయుండరు |
| ప్రతియేటనెన్నియో | ప్రతియేటయెన్నియో |
| కావుననట్టి | కావునయట్టి |
| చూచుటవలన నారోగ్యము | చూచుటవలన యారోగ్యము |
| తెరమీఁదనాడు | తెరమీదయాడు |



6. సమాసంబున చేత, తోడ, వలనల కిత్వంబగు.

నీ చేతి ప్రోపు
విద్యవలని లాభములు
నీతోడి చెలిమి.

7. అసమాసంబున నీ యత్వంబు లేదు.
దుర్జనుని వలన హాని గలుగును. ( ఒప్పు)
దుర్జనుని వలని హాని గలుగును (తప్పు)
తోఁడిమానవుఁడు తోఁటిమానవుఁడు

8. ప్రథమము మీఁది పరుషములకు గసడదవా దేశమే గాని గజడద బా దేశము లేదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| వాఁడు+చనియెను= | వాఁడు సనియెను వాఁడు జనియెను<br>వాఁడు చనియెను |
| అతఁడు +పోయెను = | అతఁడు వోయెను అతఁడు బోయెను<br>అతఁడుపోయెను |

9. తెలుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| వాఁడు + క్రూరుఁడు = వాఁడు క్రూరుఁడు | వాఁడు గ్రూరుఁడు |

10. మధ్యమ పురుష క్రియలయం దిత్తునకు సంధి యగు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| వచ్చితిరి+అపుడు = వచ్చితిరపుడు | వచ్చి తిరియపుడు |
| వచ్చితి + అపుడు = వచ్చితపుడు | వచ్చితియపుడు |
| వచ్చితివి + అపుడు = వచ్చితి వపుడు | వచ్చితివి యపుడు |

11. ఈక్రింది వానినిబట్టి ద్రుత ప్రకృతికము తెలుసుంగునది.

క. చూచెన్ జూచును జూచెదఁ
జూచెడినిన్ జూచుగాతఁ జూచుడుఁ జూడన్
జూచుతఁ జూచెడుఁ జూచుచుఁ
జూచినఁ జూడంగఁ జూడఁ జూతును ననఁగా

క. అతని నాతని చేతన్
ఆతనిచే నతనితోడ నాతనితోఁబై
నాతని కొఱకున్ వలనను
నాతనికంటెను నతనికి నాతనియందున్

క. ఆతనిలోన మనంబున

నాతనిలోపల నవంగనగు ద్రుతయుతముల్
ఈతెగ నేనును దానును
నేతురు వలెఁ బోలెను ద్రుతనియతము లెల్లన్

## విశేషణ విశేష్యములు

1. ఈక్రింది విశేష్యంబులకు విశేషణరూపంబు లెఱుంగునది.

| విశేష్యము (None) | విశేషణము (Adjective) |
|---|---|
| సౌఖ్యము | సుఖము |
| కాఠిన్యము | కఠినము |
| ప్రాముఖ్యము | ప్రముఖము (మొదలగునవి) |
| ఐక్యము, ఏకత | ఏకము |
| మాధుర్యము | మధురము |
| దారిద్ర్యము | దరిద్రము |
| ప్రాధాన్యము | ప్రధానము |
| సౌందర్యము | సుందరము |
| ఆనుకూల్యము | అనుకూలము |
| ప్రావీణ్యము | ప్రవీణము (మొదలగునవి) |
| ఆనుగుణ్యము | అనుగుణము |
| మార్దవము | మృదువు |
| క్రౌర్యము | క్రూరము |
| స్థైర్యము | స్థిరము |
| చాంచల్యము | చంచలము |
| రామణీయకము | రమణీయము |
| అతఁడు సుఖముగానున్నాఁడు | (ఒప్పు) |
| అతఁడు సౌఖ్యముగానున్నాఁడు | (తప్పు) |

2. ఈక్రింది విశేషణంబులకు విశేష్య రూపంబు లెఱుంగునది.

| విశేషణము (Adjective) | విశేష్యము (Noun) |
|---|---|
| చెడ్డ | చెడుగు |
| చక్కని | చక్కన |
| బాగుగా | బాగు |
| ముది | ముదిమి |
| పేద | పేదఱికము |

# సమాస ప్రకరణము

1. సంస్కృత పదముతో ఆచ్ఛికము సమసింపదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| ఆర్థికపుఁజిక్కులు | ఆర్థికచిక్కులు |
| పెక్కుచోట్ల | అనేకచోట్ల |
| ఒప్పు | తప్పు |
| పెక్కురంగులు | అనేకరంగులు |
| పెక్కువంతులు | అనేకవంతులు |
| పెక్కుమార్పులు | అనేకమార్పులు |
| పలురకములు | అనేకరకములు |
| పెక్కుసార్లు | అనేకసార్లు |
| అనేకులు | అనేకమంది |
| పెక్కురెట్లు | అనేకరెట్లు |
| పెక్కురు గొప్పరచయితలు | అనేక గొప్పరచయితలు |
| పెక్కు పొరపాట్లు | అనేక పొరపాట్లు |
| పెక్కు మైళ్ళు | అనేకమైళ్ళు |
| పెక్కు తెలివితేటలు | అనేక తెలివితేటలు |
| పెక్కు కాపీలు | అనేక కాపీలు |
| రాజకీయపుఁ జిక్కులు | రాజకీయ చిక్కులు |
| రాజకీయపు నేరము | రాజకీయ నేరము |
| రాజకీయ పక్షము | రాచకీయ పక్షము |
| రాజకీయవాదము | రాచకీయవాదము |
| రాజకీయదోషి | రాచకీయ నేరస్థుడు |
| రాజకీయ బాధితుఁడు | రాచకీయ బాధితుడు |
| శుద్ధమైనతప్పు | శుద్ధతప్పు |
| కృష్ణరాయభారము | కృష్ణరాయబారము |
| అవిశ్వాసము | అపనమ్మకము |
| అపవాదము | అపవాదు |
| మిక్కిలి యిబ్బంది | మహాయిబ్బంది |
| గొప్పచిక్కు | మహాచిక్కు |

| ఒప్పు | తప్పు |
|---|---|
| గొప్పకోరిక | మహాకోరిక |
| మిక్కిలిమంచి | మహామంచి<br>మహోమంచి |
| మహారాజు | మహరాజు |
| మహారాజ్ఞి | మహారాణి |
| మహానవమి | మహర్ణవమి |
| మహాదశ | మహర్దశ |
| మిక్కిలి గొప్పవాఁడు | మహగొప్పవాడు<br>మహాగొప్పవాడు |
| సాధారణవస్త్రములు | సాధారణదుస్తులు |
| సామాన్య నియమములు | సామాన్య కట్టుబాట్లు |
| మిక్కిలి యాఁకలి | అతియాకలి |
| మిక్కిలి వాఁగుడు | అతివాఁగుడు |
| అతివిశ్వాసము | అతినమ్మకము |
| అతినిద్ర | అతినిద్దుర |
| అతివిచిత్రము | అతివాన |
| అతివర్షము | అతివింత అతివాన |
| అత్యావశ్యకము | అత్యవసరము |
| పెద్దగాలి | అతిగాలి |
| మిక్కిలి తెలివి | అతితెలివి |
| కుంకుముబొట్టు | కుంకుమబొట్టు |
| దుస్సహవాసము | దుస్సావాసము<br>దుష్టసావాసము |
| చెడునడత | దుర్నడత |
| చెడ్డయలవాటు | దురలవాటు<br>దుష్టలవాటు |
| నిస్సత్తు | నిస్సత్తువ |
| మేలిసేద్యము | ఉత్తమసేద్యము |
| ఉత్తమ కార్యము | ఉత్తమపని |
| ఉత్తమ కక్ష్య | ఉత్తమ తరగతి |

| ఒప్పు | తప్పు |
|---|---|
| దోషారోపణము | నేరారోపణము |
| పౌరస్వత్వములు | పౌరహక్కులు |
| పౌరశాసనము | పౌరచట్టము |
| ప్రభుత్వపుఁ జిక్కులు | ప్రభుత్వ చిక్కులు |
| ప్రభుత్వ శాసనము | |
| ప్రభుత్వపుఁ జట్టము | ప్రభుత్వ చట్టము |
| ప్రభుత్వపుఁ దీర్మానము | ప్రభుత్వ తీర్మానము |
| ప్రభుత్వ సహాయము | ప్రభుత్వసాయము |
| ప్రభుత్వపు సిబ్బంది | ప్రభుత్వ సిబ్బంది |
| ప్రజల హక్కులు | ప్రజాహక్కులు |
| శాసనసభ తీర్మానము | శాసనసభా తీర్మానము |
| సంఘస్వత్వము | సంఘహక్కు |
| సంఘశృంఖలలు | సంఘసంకెళ్లు |
| సంఘనియమములు | సంఘకట్టుబాట్లు |
| సంఘముపోకడ | సంఘపోకడ |
| స్వాతంత్ర్య స్వత్వము | స్వాతంత్ర్యహక్కు |
| స్వాతంత్ర్యశాసనము | స్వాతంత్ర్యచట్టము |
| వట్టిదండుగ | శుష్కదండుగ |
| ముఖ్యమైనలోటు | ముఖ్యలోటు |
| ఛాయాచిత్రము | చాయచిత్రము |
| క్రొత్తమెఱుఁగు | నూతన మెఱుగు |
| క్రొత్తయేర్పాట్లు | నూతనయేర్పాట్లు |
| జీవితావశ్యకతలు | జీవితావసరములు |
| వ్యవసాయపుఁబంట | వ్యవసాయపంట |
| మిక్కిలిమేలు | బహుమేలు |
| మిక్కిలిమంచి | బహుమంచి |
| బహుస్వల్పము | బహుకొద్ది |
| మిక్కిలి తక్కువమంది | బహుకొద్దిమంది |
| యావజ్జనము | యావన్మంది |
| ఎక్కువ గారాబము | అధిక గారాబము |
| | బహుగారాబము |

| ఒప్పు | తప్పు |
|---|---|
| సగమాఁకలి | అర్ధాకలి |
| వేఁటకొఱకు | వేటార్థము |
| యావజ్జీవ కారాగారవాసము | జన్మఖైదు |
| పేచిలేకుండ | నిష్పేచి |
| పూచిలేకుండ | నిష్పూచి |
| కపటమార్జాలము | కపటపిల్లి |
| వినాయకచతుర్థి | వినాయక చవితి |
| జీవితనౌక | జీవితపడవ |
| దేవునిగుడి | దైవగుడి |
| పూలదండ | పుష్పదండ |
| కుటుంబభారము | కుటుంబబరువు |
| మానవశాసనములు | మానవచట్టములు |
| ఆరోగ్యసూత్రములు | ఆరోగ్యచట్టములు |
| ప్రతిదినము | ప్రతిరోజు |
| మూఢవిశ్వాసము | మూఢనమ్మకము |
| మానవునిహద్దులు | మానవహద్దులు |
| విచిత్రవర్ణములు | విచిత్రరంగులు |
| గాఢవిశ్వాసము | గాఢనమ్మకము |
| ప్రజలమేలు | ప్రజామేలు |
| రాజకీయపక్షము | రాజకీయపార్టీ |
| అపరాధ శుల్కము | అపరాధరుసుము |
| ప్రపంచ విచిత్రములు | ప్రపంచ వింతలు |
| భార్యాసుతులు | భార్యాపిల్లలు |
| శబ్దరహిత చిత్రము | శబ్దరహిత సినిమా |
| ఐదువన్నెలు | పంచవన్నెలు |
| ఐదురంగులు | పంచరంగులు |
| మధ్యకక్ష్య | మధ్యతరగతి |
| కాశ్మీర దృశ్యములు | కాష్మీరు దృశ్యములు |
| నడిమి రకము | మధ్యరకము |
| ధనిక నిర్ధన ఘట్టన | ధనిక బీదఘట్టము |

జి.వి.కృష్ణరావు

| ఒప్పు | తప్పు |
|---|---|
| భార్యాభర్తలు | భార్యభర్తలు |
| ఆర్థికపు మార్పులు | ఆర్థిక మార్పులు |
| చరిత్రాత్మక విషయములు | చరిత్రాత్మక సంగతులు |
| సంసారపు జిక్కులు | సంసార చిక్కులు |

2. ఈక్రింది సమాసదోషములను పరిహరించునది.

| ఒప్పు | తప్పు |
|---|---|
| అర్ధరాత్రము | అర్ధరాత్రి |
| దుస్సాధము | దుస్సాధ్యము |
| దుర్భేదము | దుర్భేద్యము |
| దుర్గమము | దుర్గమ్యము |
| దుష్కరము | దుష్కార్యము |
| యథేచ్ఛము | యధేచ్ఛ |
| అమాయికుఁడు | అమాయకుఁడు |
| గర్భదారిద్ర్యము | గర్భదరిద్రము |
| అనిష్టము | అయిష్టము |
| మధ్యేమార్గము | మధ్యమార్గము |
| మహాభాగ్యము | మహద్భాగ్యము |
| మధురాయమాణము | మధురాయమానము |
| కృష్ణాజినము | కృష్ణాజనము |
| మాతాపితలు, పితరులు | మాతాపితరులు |
| ప్రజాభ్యుదయకరచిత్రములు | ప్రజాభ్యుదయ చిత్రములు |
| మధురపుమాటలు | మాధుర్యపుమాటలు |
| మానవనిత్య జీవితము | నిత్యమానవజీవితము |



## వాక్య ప్రకరణము

1. గద్య వాక్యమున సాధారణముగా కర్తా కర్మ క్రియలు వరుసగా వచ్చును.
రాముఁడు రావణునిఁ జంపెను

2. వాక్యము వీలైనంత కుఱుచగా నుండుటమేలు.

3. క్రియావచనము కర్తృగామి.
ఉదా: ఎవరు ప్రవర్తింతురు (ఒప్పు) ఎవరు ప్రవర్తించును (తప్పు)

4. ''తిర్యగ్గడంబులు వాచ్యంబులగునపుడు భూత తద్ధర్మార్థక క్రియల ప్రథమ బహువచనంబున కేకవచనంబగు.''

| | |
|---|---|
| చిలుకలుపలికెను | చిలుకలుపలుకును |
| వర్షములుకురిసెను | వర్షములుకురియును |

5. మధ్యమ పురుషక్రియకు ప్రథమపురుషక్రియ రాదు.

| | |
|---|---|
| మీరువచ్చితిరి | మీరువచ్చిరి |

6. ''అన్య యుష్మదస్మచ్ఛబ్ద కార్యంబు లుత్తరోత్తరంబులు బలీయంబులు.''

వారు, నీవు, నేను వచ్చితిమి.

వారు, నీవు వచ్చితిరి.

వాఁడు, నీవు ధన్యులరు.

7. సముచ్చయార్థకమునకు దీర్ఘము రాదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| వాఁడును, నేను వచ్చితిమి | వాడూ, నేనూ వచ్చితిమి |
| చూచియుఁజూడక | చూచియూచూడక |



8. ''అనేక కర్తృక క్రియకు సమీప కర్తయొక్క లింగవచనంబులగు''.

తమ సేనలును వారును విశ్రమించిరి.

వాని బంధుమిత్రులు, జీవధనంబులును దప్పిజెందవు.

# భగవద్గీత

శాస్త్రం సమాజానికనుగుణంగా ప్రవృత్తిని మలచునట్లే, కావ్యం పాఠకుని హృదయ సంవేదనాన్ని మారుస్తుంది. ఇలా మార్చలేనిది కావ్యం కాదు.

హృదయ సంవేదనావిధానాన్ని మార్చాలంటే కావ్యం కొన్ని ముఖ్య సూత్రాలకు బద్ధం కావాలి. సమాజ అనుభూతిని, సామాజిక హృదయ సంవేదనా తత్త్వాన్ని కావ్యం గుర్తించాలి. సమాజానికి ప్రకటించదలచిన అనుభూతిని కూలంకషంగా అవలోకన చెయ్యాలి. ఇలా అవలోకన చేసి ప్రకటించే అనుభూతి సమాజానికన్ని విధాలా శ్రేయస్కరమై, తాత్కాలికంగానైనా విస్మరించరానిదై ఉండాలి. పైగా ఈ అనుభూతి సమాజానికి అందుబాటులో ఉండాలి. ఉండేటట్లు చెయ్యాలి.

ఈ సూత్రాలను అనుసరించి ప్రకటింపబడిన అనుభూతి, పాఠకుని హృదయ సంవేదనా విధానంలో మార్పు తేగలుగుతుంది. అప్పుడే కావ్యమౌతుంది. అలాంటి కావ్యాన్ని సమాజం వదలుకోలేదు. మీదుమిక్కిలి శిరసావహించి పూజిస్తుంది.

శ్రీ రామస్వామిగారు తెలుగు లోకాన్ని సమగ్రంగా చూచారు వర్ణ విభేదాలతోను, 23
మూఢ విశ్వాసాలతోను అదపదలై శృంఖలాబద్ధమై తెలుగు సమాజం దారిద్ర్యదేవతా నృత్యంతో అవురసవురవుతూ వుంది. ప్రతి వానికీ తెలుసు దారిద్ర్యబాధ. ప్రతివానికీ తెలుసు పారతంత్ర్యక్లేశం. ప్రతివానికీ తెలుసు ప్రస్తుత దుస్థితి పోవాలి అవి

అయితే, యీ దుస్స్థితి సమాజాని కెలా ప్రాప్తించింది? ఎలా తొలగించడానికి వీలవుతుంది?

కవియైన రామస్వామిగారు హృదయంతో ఆలోచించారు. దుస్సహంగా ఉన్నంత మాత్రాననే ఉన్న వ్యవస్థ పోదు. ఈ వ్యవస్థాతత్త్వాన్ని గ్రహించాలి. ఎక్కడ లోటులున్నాయో తెలుసుకోవాలి. ఎలాంటి వ్యవస్థ శ్రేయస్కరమో నిశ్చయించుకోవాలి. ఆపైని ఆ వ్యవస్థను నెలకొల్పటానికి ప్రయత్నించాలి. అప్పుడే దుస్సహంగా ఉన్న సంస్థను కూలద్రోసి శ్రేయస్కరమైన వ్యవస్థను స్థాపించడానికి వీలవుతుంది.

కవి ప్రక్కన ఉన్న వానితో ''అబ్బా, దారిద్ర్యం ఎముకలనే కరకర కొరుకుతూ వుంది అని అని వుంటాడు. ప్రక్కనున్న వాడు జీతించి ఉన్న భారతీయత్వంతో మొదట బాధపడి, తరువాత ముఖం చిట్లించి ''ఔను... కాని యిదంతా నిజమా? మాయ కేవలం మాయ?

ఇలా పరస్పర మనోవికారాలను త్రుంచికొని కర్మ నాచరిస్తాము. అది కర్తవ్యకర్మ అవునో కాదో ఎలా తేలుతుంది? శ్రుతిస్మృతులున్నాయిగా, ఫీజు పుచ్చుకోకుండానే సలహా యిస్తాయి.

ఇవి యేమి చెపుతున్నాయి? నాలుగు వర్ణాలను భగవంతుడు సృష్టించాడు. క్షత్రియుడు యుద్ధం చేయటం, బ్రాహ్మణుడు యజ్ఞ్నాదులు చేయడం, చేయించటం, వైశ్యులు సేద్యం వాణిజ్యం చేయటం, శూద్రులు ఆస్తితో (ఉంటే) సహా భార్యలను పై వర్ణాల వారికి అర్పించుకుని, నిత్యపాదసమ్మర్దనం చేయటం చెయ్యాలి. ఈ కర్మలన్నీ ఒకటే. ఒకటి నీచం కాదు, మరొకటి గౌరవప్రదం కాదు; ఒకటి దుఃఖకరం కాదు, మరొకటి సుఖకరం కాదు.

అలాగయితే బ్రాహ్మణుడే శూద్రధర్మం, శూద్రుడు బ్రాహ్మణ ధర్మం ఎందుకు నిర్వహించకూడదు అంటే -

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్

స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయానహః

బాగుంది - అయితే చేయువలసిన పని ముగుసిందీ, లేనిదీ ఎలా తెలుస్తుంది? నిష్కామంగా కర్మచేసినా ఫలప్రద మయ్యేటట్లు చేయ్యాలిగా? అంటే ఫలాన్ని దృష్టిలో ఉంచుకొని సఫలమయ్యేటట్లు కర్మ మాచరించాలి. ఫలాన్ని దృష్టిలో ఉంచుకొని కర్మను చేస్తున్నప్పుడు నిష్కామకర్మ ఎలా అవుతుంది? ఇలా కామాన్ని విసర్జించి కర్మను చేస్తూవుంటే కొంతకాలానికి మానవుడు కూడా పశువులాగా తయారై కేవలం వాసనా ప్రేరితుడై కర్మకు దిగడా? 233

అయితే కర్మ ప్రవృత్తిలో కలిగే వేదనలకు చలించని హృదయం చట్రాయిగా తయారుకాదా? అవుతుంది. అసలు సుఖదుఃఖాలు పోవాలి. ద్వంద్వానికి అతీతుడు కావాలి.

ఆకటి నకనకలు, భోగాల కలకలు వట్టివే! మూఢత్వం వల్ల అలా అనిపిస్తాయి. పైగా యివి పూర్వ జన్మకర్మ ఫలాలు, అనివార్యంగా వస్తాయి. ఈ వ్యవస్థను తప్పించడానికి వీలులేదు. ఇదే ధర్మం.

ఈ ధర్మం ఎప్పుడెప్పుడు కుంటుపడుతుందో

అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహం

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం

ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే,

ఒహో! అందుకనే హిట్లర్ అవతార పురుషుడు ప్రపంచోద్ధరణకు మరాణహోమం ప్రారంభించాడు.

కవి హృదయంలో ఒక్కసారి అసహ్యాభావం అనుకంపం కలిగాయి. కలం గరగరలు శరపరంపరలుగా బాహిరిల్లాయి.

ఏతఁడౌనర్జునౌ భగవ
ద్గీతాపారాయణమ్ము కృతలక్షణుఁడై
యాతనికిముక్తిమోక్షము
లేతెంచుం దప్పకుండ నెదురెదు రగుచున్

గీత బయలుదేరింది - బోద్ధ కృష్ణుడు కాడు బ్రాహ్మయ్య, శ్రోత అర్జునుడు కాడు బాలచంద్రుడు.

కవి ఇలా తలక్రిందులు చేయటంలో సారస్యముంది. వందల సంవత్సరాల నుండి గీత సామాజికుని శల్య శల్యంలోను, కుల్యకుల్యంలోను జీర్ణించి వుంది. ఇలాంటిదాన్ని కదిలించాలంటే సామాన్య విషయం కాదు. ఒకవేళ ప్రయత్నించినా పాఠకుని నమ్మించలేడు. అందువల్ల తెలుగులకు చిరపరిచితమైన పలనాటి వీరచరిత్రను స్వీకరించాడు. అందులో బ్రహ్మయ్య కూడ ధర్మసంస్థాపనకు ప్రయత్నించాడు. బాలచంద్రుడు 'దూడూ బసవన్నా అంటే తలపూపేవాడుకాడు. గడుగ్గాయి; నచ్చనిదాన్ని వెక్కిరించటానికి మొనగాడు. కొన్ని ధర్మాలను బ్రహ్మానాయుడు, మిగతా వాటిని బాలచంద్రుడు దులిపివేస్తారు.



శ్రీరామస్వామిగారు ముఖంలో ఎక్కడా హాస్యరేఖ కనిపించకుండా ఎంతో నిష్ఠతో మొదలెట్టినట్లుగా గీతా ప్రారంభం చేస్తారు.

ధర్మాత్ములు మా వారల
ధర్ములు మరిదేవ భూతధాత్రీశ్వరులున్
ధర్మక్షేత్రంబు, మహా
కర్మక్షేత్రంబు నైన కదెంపూడిన్
చతురంగబలమ్ములతోఁ
బ్రతిపక్షజిగీష రెండు వాగుల మగలూ
ర్జితగతి రండు విడిసి యు
ద్ధతులై యేమేమి చేసి రవతల ఁజెవుమా!

ఈ పద్యాలు చదవగానే,

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవ:

మామకా: పాణ్డవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ!

అనే గీతా ప్రారంభ శ్లోకం జ్ఞప్తికి వస్తుంది. అయితే 'ధర్మాత్ములు మా వారల, ధర్ములు మలిదేవభూత ధాత్రీశ్వరులున్', అవి కవి ఎప్పుడు ప్రారంభించాడో అప్పుడే చెబుకు అంత వినిపిస్తుంది.

యుద్ధ సన్నద్ధమై తీర్చి నిలిచిన ఇరువాగుల సైన్యాలనూ చూచి బాలచంద్రుడు విషాదభరంతో బ్రహ్మన్నతో –

పురుష వినాశనంబున ( ప్రభూతకులక్షయమౌను.

కులధర్మము చెడిపోయిన

కులనాశము తప్పఁబోదు కులనాశముచేఁ

గలుగును ధర్మగ్లానియు

నిలయము నీవేలతెచ్చి పెట్టెదు తండ్రీ!

సంకరుల యన్నమన్నన్

సంకటపడియైనఁ జేయసాఁచరుకొంచెం

బంకింపరు పిండములన్

గొంకెదరు తిలోదకంబుఁగొనఁగా బితరుల్.

అంటాడు. కవి గీటించిన దానిలో కొట్టుడిచాడు. దీనికి పలనాటి కృష్ణుని సమాధానం తప్పకుండా వినాలిసిందే!

చావు పిమ్మట మర్త్యులు జన్మమెత్తు

దాఁకఁ దలఁదాఁచి కొనటకై ధర్మసత్ర

మొందు పితృలోకమను పేర నుంచి నాని

పాడుపేన్గు మూఁకలగోడు ( జూడలేక!

పాపాత్ములఁ బుణ్యాత్ముల

స్థాపింతునె యొక్క యింట తన్నుకచావన్

మాపులుతెపులు కుత్తూ

యాపాటి యెఱుంగలేనె యాశుఁడనయ్యున్.

పండవి భూములలో జల
ముండని మరుభూములందు నుండంగాఁబో
పొండవి యాజ్ఞాపింతునె
కొండొక దేశము సృజింపఁగూడదె నాకున్
పండినఁ బండకయుండిన
నుండిన లోకంబులోన నుండుచుఁ గడుపున్
నిండించి కొనవలయుఁదే
తెండన ఁ బిండంబులెవరు దెత్తురు పుత్రా!
అలుమగలొక్కపరి తెగటారకున్న
మగఁడు లేనట్టి మగనాలు మగువలేని
యట్టి మగవాఁడు పితృలోకమందుఁగ్రొత్త
కాఁపురములు సాఁగింతురే కలసి మెలసి
ఇలా పరలోకాలను వెక్కిరించిన బ్రహ్మయ్య కొంతదూరముపోయిన తరువాత

కేపం పునార్యజుష్టం బకీర్తికరము
నాకసుఖ వినాశనకరం బైన శోక
మూని నీవు వైక్లబ్యంబు నొందుచుంటి
వేల విషమసమయ మందు బాలచంద్రులనీ, మరొకచోట
కానఁ గాలమాసన్నమై కదనభూమి
నిలిచి యుండిన యాసైన్య వివహమెల్ల
విక్రమస్ఫూర్తిఁ జెండాడి విజయమంది
స్వర్గధామంబు పొందుము పణముగాఁగ

అనీ అంటాడు. ఇలా ఇతడు వెనకముందులు చూడకుండా గట్టిగా అబద్ధాలాడుతూ వుంటే పాఠకునికి చిరునవ్వు కలుగుతూ వుంటుంది.

జాతి వధ ఎలా చేసేది అని బాలచంద్రుడంటే, ఆత్మచాపదు, శాశ్వతం అని బ్రహ్మయ్య ఏమంటాడో చూడండి.

తొట్రుపాటునఁ గాల్జార దుమికియేటఁ
బడినఁజప్పున దేహమంబు తడియుఁగాని

తడియఁబోవ దాత్మ నవరంధ్రములు మూసి

యుంచినను సరే మఱి మూయకుంచినసరె,

గేటించిన భాగం చదివేటప్పటికి చప్పున నవ్వొస్తుంది. ఆత్మయొక్క అమృతత్వం ఎగిరిపోతుంది.

'ధర్మ సంస్థాపనార్థయ సంభవామి యుగే యుగే'. అని పలనాటి కృష్ణుడు అంటే, బాలచంద్రుడు -

సంకల్ప సిద్ధులేలా

సంకట పడుచుం గృశింప సంసారములో

గ్రుంకుచుఁ బరమాత్మా!

అవి అంతే విశ్వాసంతో అడుగుతూ ఉంటే నవ్వు వస్తుంది. దీనికి

లీలామాత్రుడనైనన్

కాల క్షేపంబువలదె? కదలక కాల్పొ

కాలుంచుకొనుచు నేనే

లీలం గూర్చుండనేర్తు లిపలేకుండన్?

అని రాయిగుద్ది చెబుతూవుంటే మరీ నవ్వొలాము.

విభూతి యోగాన్నంతా అమాంతం కవి యెలా యెగరగొడతాడో చూడండి.

మెకముల 'హిపోపోటమసు'ను

సుకములలో ఁబల్లెనాఁటియుకమును జాలన్

జెకు ముకిఱాయిని నేనే

శకటములందెల్ల ధూమశకటము నేనే

(తుది చరణానికి ఒక ఫుట్‌నోటు: 'నేఁడావిరితో రైలుబండ్లు నడుపఁబడుచున్నట్లు నాఁడు పొగతో బండ్లు నడుపఁబడెడివి కాఁబోలు. ఇది మరీ బాగున్నది.)

వెలుగుల రక్కాసవెలుగును

బులుగులలో రామబందువులుగును నేనే

కలుఁగులఁబుట్టకలుఁగును

తెలుగులలో నెల్ల మాల తెలుఁగును నేనే

ఆసలలో నడియాసను

కృష్ణరావుగారు కావ్య జగత్తును రచించేనాటికి కళనుగాని, కవిత్వాన్నిగాని సంఘం నుండి విడదీయటానికి వీలులేదని, మారే సమాజంతోపాటు భాషా, అనుభూతి, కావ్యము మారుతూ వస్తున్నాయని, సాంఘిక పరిణామాన్ని చారిత్రక భౌతిక సిద్ధాంతమొక్కటే వివరింపగలుగుతుందనీ అని గట్టిగా నమ్మారు. శబ్దం నశించదనే మీమాంసకుల స్ఫోట సిద్ధాంతాన్ని ఆదరించటానికి వీలులేదని బల్లగుద్ది చెప్పారు. ఫ్రాయిడ్ స్వప్న సిద్ధాంతాలకు భారతీయాలంకారికులు వివరించిన రసానుభూతికి ముడి పెట్టి, వారు, పాఠకుడు కావ్యజగత్తులో లీనా లీనావస్థను అంటే నిర్లిప్తతానుభూతిని పొందుతున్నాడని, ఈ స్థితే వేదన లన్నింటిని అణచి ఆనందంతో పరవశింప చేస్తుందని మనస్తత్వశాస్త్రాధారాలతో సిద్ధాంతీకరించారు.

''ఉత్పత్తి, సాధనాల సంబంధాలనుబట్టి సమాజం మారుతుంది. సమాజంతో సాహిత్యం, ధర్మం, నీతి మొదలైనవి మారుతాయి. ఉత్పత్తి సాధనాలు ఏ వర్గం వారిపరంలో వుంటాయో, కవిత్వం, నీతి, ధర్మం, సత్యం, భావం ఆ వర్గానికి సంబంధించినవిగానే వుంటాయి'', అనే మార్క్స్ సిద్ధాంతాలను సాధనాలుగా స్వీకరించి కృష్ణరావుగారు ఆంధ్ర సాహిత్య పరిణామాన్ని వివరించారు. ఆంగ్లేయ పరిపాలనా కాలంనాటి సామాజిక పరిణామాన్ని వెల్లడించి చివరికి వారు ''ఇప్పుడు ఏర్పడింది మధ్యతరగతి రావలసింది ప్రజాస్వామిక విప్లవం, సాహిత్యం ప్రజాస్వామిక విప్లవదోహదాన్ని కల్పిస్తూ, మధ్య తరగతి కోసం రాయబడాలి'' అని శాసించారు. కార్మికుల సంఖ్య ఆనాటికి మనదేశంలో తక్కువ అని భావించిన కృష్ణరావుగారు ''వారి జీవితాన్ని చిత్రించవచ్చును. కాని ఆదృష్టి సోషలిస్ట్ దృష్టిగా వుండటానికి వీలులేదు. కేవలం ప్రజాస్వామిక విప్లవ దృష్టిగా వుండాలి, అని అన్నారు. కావ్యజగత్తులో కృష్ణరావుగారు చారిత్రక భౌతిక సిద్ధాంతానికి, ప్రజాస్వామ్యానికి, సాహిత్యానికి, లంకె వేయాలని ప్రయత్నించారు. తదనంతరకాలంలో ఈ ధోరణిలో సాహిత్య తత్త్వాన్ని పరిశోధించటానికి వారు స్వస్తిచెప్పారు.

అక్కడి నుండి వారిసాహిత్యతత్త్వాన్వేషణలో రెండోదశ ప్రారంభమయింది. ఆదశ పరిపూర్ణంగా వారి కళాపూర్ణోదయ సిద్ధాంత ప్రబంధంలో సాక్షాత్కరిస్తుంది. కృష్ణరావుగారి సాహిత్య వేత్తృత్వంలో ఆనందవర్ధమని ధ్వని సిద్ధాంతం ప్రముఖంగా గోచరిస్తుంది. సాహిత్య సిద్ధాంతాలలో అనుల్లంఘనీయమైన దర్శనం ఏదైనా వున్నదంటే అది ధ్వన్యాలోకమే అని వారు ఒక సందర్భంలో పేర్కొన్నారు. ఫ్రాయిడ్ స్వప్న సిద్ధాంతాలు, ధ్వని సిద్ధాంతము ప్రకృతిని బట్టి ఒక కోటివే అని వారు సోదాహరణంగా వివరించారు. ఈవివరణ విధానం ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగిస్తుంది. వాస్తవానికి ఉత్తమ కావ్యంలో వాక్యార్థం ఒకటి,

తద్విలక్షణమైన వ్యంగ్యార్థం మరొకటి వుంటున్నట్లే, స్వప్నంలోకూడా వ్యక్తార్థం ఒకటి, అంతరార్థం మరొకటి ఉండును అని కృష్ణరావుగారు చెప్పారు. ఫ్రాయిడ్ చెప్పిన 'మేనిఫెస్ట్ డ్రీమ్' అంటే అభివ్యక్త స్వప్నం వాక్యార్థంతో సమానం. అభివ్యక్త స్వప్నంలోని అంతరార్థం అంటే లేటెంట్ డ్రీమ్ కంటెంట్ కలగనే వాని జీవితాది ప్రకరణం తెలియనివానికి బోధపడదు. కావ్యంలో కూడా వాక్యార్థం గ్రహించినంతమాత్రాన కావ్యాత్మ అర్థం కాదు. ప్రకరణం మొదలైనవి ఊహించగలిగిన సహృదయునికే అది అర్థం అవుతుంది.

కృష్ణరావుగారు రచనలను అనుభూతిని పురస్కరించుకొని నాలుగు భాగాలుగా విభజించారు. కొన్ని రచనలను కబుర్లు విన్నట్లువింటాం. శబ్దాలంకార ప్రధానమైన పద్యకవిత్వము, ఆ మూలాగ్రం చదివించటం ఒక్కటే విశేషంగా కలిగిన కథలు, నవలలూ, నాటకాలు, ఈ జాతిలో చేరతాయి. మరికొన్ని రచనల వల్ల మనశ్శైథిల్యం కలుగుతుంది. బాహ్య ప్రపంచం మరచిపోతాము. కాని తన్మయీభావం కలుగదు. తెలుగు ప్రబంధాల లోని కొన్ని ఘట్టాలు, పాఠకుల వ్యక్తిత్వాలను మరపింపకుండా చదివించే కథలు, నవలలూ, నాటకాలు ఈ కోవలోకి చేరుతాయి. ఇక మూడో జాతి రచనలు సమాధ్య వస్థను కల్పించి అహంతను లయింప చేసి, పాత్రలలో సన్నివేశాలలో వర్ణనీయార్థాలలో పాఠకుడు దాదాపుగా లీనమయ్యేటట్లు చేసి వేస్తాయి. కాళిదాసు కావ్యాలు, సంస్కృతనాటకాలు, వేలూరి శివరామశాస్త్రిగారి డిప్రెషన్ చెంబు మొదలైన కథలు ఈ తెగ క్రిందికి వస్తాయి. నాలుగో జాతిరచనలు పాఠకునకు తన్మయీభావం కలిగించి చివరకు విషయరహితమైన సమాధ్యవస్థ కలిగిస్తాయి. కవిత్రయ మహాభారతం దీనికి తార్కాణం. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో ఒక ప్రకరణలో ''శబ్దార్థశాసన జ్ఞానమాత్రేణైవనవేద్యతే, వేద్యతే సహికావ్యార్థ తత్త్వజ్ఞై రేవకేవలమ్'' అనివక్కాణించాడు. వ్యాకరణము, నిఘంటువు గ్రహించినంతమాత్రాన కావ్యార్థం అవగతం కాదు. కావ్యతత్వవేత్తలకే అంటే సాహిత్యవేత్తలకే అది బోధపడుతుంది. Dr. G.V. కృష్ణరావు అటువంటి సాహిత్యవేత్త.

(ఆలిండియా రేడియో, విజయవాడ వారి సౌజన్యంతో)

# డా. జి.వి. కృష్ణరావు సాహితీ వ్యక్తిత్వం

అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

మనిషి తన చరిత్రను తాను సృష్టించుకొంటాడు. తాను సృష్టించుకొన్న ఈ చరిత్రకు వెలుపల అతడు ఏమీకాడు. అతనికి అర్థం ఉండదు, అంటే మనిషి ఎలాగో పుడతాడు, అంటే అస్తిత్వంలోకి విసరివేయబడతాడు. అలా విసరివేయబడి తరవాతే అతడు తనకు తాను అర్థం కల్పించుకొంటూ, చరిత్రను సృష్టించుకొంటూ, తనను తాను అధిగమిస్తూ, తాను ఏమిగా మారదలచుకొన్నాడో, తయారవ్వాలనుకొన్నాడో, అలా తయారయ్యే దశలో ప్రగతిస్తూ ఉంటాడు. ఏ దిశలో ప్రగమించాలి? ఏ అర్థాలు తన జీవితానికి కల్పించుకోవాలి? అనేది అతని నేపద్యం, వారసత్వం, పరిసరాలు, మనశ్రమ, పట్టుదలలపై ఆధారపడి ఉంటుంది.

అలా అస్తిత్వంలోకి 1914లో విసరివేయబడిన ఓ వ్యక్తి గవని వెంకట కృష్ణరావు అతడు సాహితీ ఆకాశంలో తన జీవన తారను మిల మిల మెరపింపజేశాడు. తన సాహితే శిల్పాన్ని చెక్కాడు గీచాడు. ఆ గీతల క్రమాన్ని మీ ముందుంచుడమే ఈ ప్రసంగధ్యేయం.



డా. జి.వి. కృష్ణరావు తెనాలి ప్రక్కనే ఉన్న కూచిపూడిలో జన్మించినా, ఆయన జీవితంలో అధికభాగం తెనాలిలోనే గడిచింది. తెనాలి నేపధ్యాన్ని అతడు నిశ్వసించాడు. తెనాలి ఆరోజుల్లో ఒక సాహిత్య కేంద్రం. ఒక కళాకేంద్రం ఒక రాజకీయ కేంద్రం. ఒక నాటకరంగస్థలి. ఒక చైతన్య కేంద్రం. ఏ ఉద్యమం ప్రపంచంలో ఎక్కడ మొదలైనా దాని గాలి తెనాలిలో వీచేది.

కృష్ణరావుకు అటువంటి తెనాలిలో, గోపీచంద్‌తో పరిచయమేర్పడి అది స్నేహంగా పరిణమించింది. గోపీచంద్ ప్రభావంతో పాశ్చాత్య సాహిత్యం. మనోవిజ్ఞానం తలమునకలు వేశాడు జి.వి. కృష్ణరావు. ఆధునిక సాహిత్య రీతులు, విమర్శ, ప్రక్రియలను గోపీచంద్ ద్వారానే అలవర్చుకొన్నాడు. పనిలో పనిగా మార్క్స్‌ను, యమ్. యన్. రాయ్‌నీ పరిచయం చేసిందిగూడ గోపీచందే.

''అప్పటిదాక మూఢదేశభక్తిలోపడి కొట్టుక పోతున్న నేను కళ్ళు తెరచాను. నిర్దిష్ట రాజకీయ లక్ష్యం లేని నాకు కొత్త వెలుగు గోచరించింది'', అని ఆయనే చెప్పుకొన్నాడు.

తెనాలిలో అప్పుడున్నది గోపీచంద్ ఒక్కడేకాదు. చక్రపాణి, కొడవటిగంటి లాంటి దిగ్గంతులు చాలమంది ఉన్నారు. వీరంతా ఒక మందులు షాపులో కూర్చొని సాహిత్య విమర్శ చేస్తూ ఉండేవారు ఆకాలంలోనే కొన్నికథలు, ఏకాంకికలు రాశారు. ఆస్కార్ వైల్డ్ 'సలోమిని' 'సునీథ' అన్న పేరుతో అనువదించారు.

డిగ్రీ పుచ్చుకొన్న ఆయనకు ఉద్యోగవేటలో నిరాశఎదురై దారీతెన్నూ తోచని సమయంలో, ఏడు రోజులనుంచి బిక్షదొరకని వ్యాసుడు శాపజలాన్ని అందుకొని, చలితాధారుడై కంపిత కంఠంతో, ''మా భూ త్రైపూరుషి విద్యా, మా భూ త్రైపూరుషకుధానమ్, మా భూత్రై పూరుషీ భక్తిః'' అని శపించబోతున్న మూర్తి ఆయన కన్నుల ముందు నిలువెత్తుగా నిలబడింది. రెండు రోజులు అదేమూర్తి, కన్నుతెరచినా, కన్ను మూసినా. ఆ సాక్షాత్కారమే భిక్షాపాత్ర. ప్రతిపత్తిక వలదన్న ఆ భిక్షాపాత్ర 1953లో ఆంధ్ర విశ్వవిద్యాలయ రంగస్థలిమీద, ప్రయోక్త కూర్మావేణుగోపాల స్వామి, అప్పటి రిజిస్ట్రారు, నేతృత్వంలో ప్రదర్శితమైంది. 5000ల మంది దానిని తిలకించారు. ఆ తరువాత అది పదుహేరు జాతీయ భాషలలోకి అనూదితమై రేడియో నాటికగా ప్రసారితమైంది. ఈ నటికలో''



'కావ్య జగత్తు'లో ఆయన భరతుని నుంచి పండితరాయలుదాక, ప్లేటో నుంచి మార్క్సుదాక మహామనుషుల సూక్తులను ప్రామాణికంగా ఉదహరించి, 'కావ్యవస్తు రూపం' ఎలా పరిణామం పొందుతుందో మార్క్సిస్టు దృక్పథంతో వివరించారు. ఫ్రాయిడ్ స్వప్న శిల్పాన్ని ధ్వని సిద్ధాంతంతో ముడివేశారు. తరవాత మార్క్సిస్ట్ దృక్పథంనుంచి విముక్తులయ్యారనుకోండి. ఈ 'కావ్యజగత్తు'ను M.A. వారికి ఉస్మానియా విశ్వవిద్యాలయం పాఠ్యగ్రంథంగా ప్రవేశపెట్టింది అప్పట్లో

దూర దృష్టి లేక. భారతజాతికి చాతుర్వర్ణ్యం విధించాను. రాబోయేతరాల వారికి ఈ వర్ణ ఉక్కు చట్రం నుంచి బయటపడే వీలు లేకుండా చేసాను. బీదలకు ద్రోహం చేసే కర్మ సిద్ధాంతాలను అవతారవాదాన్ని బోధించి వారిచే దాస్యం అంగీకరింపచేశాను. ఇక భారతజాతికి నిష్కృతి లేదు'' అంటూ వ్యాసుడు వాపోయాడు.

''మార్క్సు చెప్పిందానికి తల ఊపాను. రాయ్ చెప్పిన దానికి తల ఊచాను. ఎవరు ఏది చెప్పినా, 'డు' 'డు' బసవన్నలా, తల ఊపేవనేనా? గంగిరెద్దుకు నాకూ తేడా ఏమిటి? నేనింతకాలం పేడబొమ్మలను పెట్టుకొని పూజిస్తున్నానా?'', అని ఆయన

తన్ను తాను ప్రశ్నించుకొన్నాడు. ''తద్విజిజ్ఞాసస్వ'' అన్న వాక్యం ఆయన హృదయ కుహరంలో ప్రతిధ్వనించింది. తాత్విక చింతన లేక స్వతంత్ర విచారధార పొడుమదని, గ్రహించి, తత్త్వ శాస్త్రాలను మథించాడు.

కళాపూర్ణోదయం పై ఆయన సిద్ధాంత వ్యాసాలకి డాక్టరేట్ ఇవ్వడం జరిగింది. కట్టమంచివారు అంతకు ముందే కళాపూర్ణోదయం పై కొన్ని తీర్పులు ప్రకటించారు. కట్టమంచివారి తీర్పులే తుది తీర్పులు కావని ఫ్రాయిడియన్ మనో విశ్లేషణ శాస్త్ర చికిత్సతో, కొత్త అందాలను లోతులను వెలికి తెచ్చాడు, కృష్ణరావు.

కలకాలం తెలుగులో నిలిచే నవలలు ఏవి? అనే ప్రశ్నకు, ఆ చంటి జానకి సమాధానంగా, మాలపల్లి, ఏకవీర, కీలుబొమ్మలు, చివరకు మిగిలింది, అ సమర్థుని జీవయాత్ర, అల్పజీవి ఇవి ఎల్లకాలం నిలుస్తాయని తేల్చారు.

పత్రికలన్నీ కీలుబొమ్మలను ప్రచురించ నిరాకరించాయి. తెలుగు స్వతంత్రంగాబోలు ప్రచురించింది. దీనికి తెలుగులో రెండు నాటకీకరణలు వచ్చాయి. కన్నడంలోకి అనూదితమైంది. ఈ మధ్య అంటే మూడు నాలుగు నెలల క్రితం పపెట్స్ అనే పేరుతో మాక్మిలన్ కంపెనీ ఆంగ్లంలో ప్రకటించింది.

స్వాతంత్ర్యం అంటే ఏమిటి? మానవుడు దానిని ఎలా కోల్పోతున్నాడు? తిరిగి దానిని సాధించే మార్గమేమిటి? వ్యక్తుల కర్తవ్యం ఏమిటి? ఈ జిజ్ఞాసను రేకెత్తించడమే కీలుబొమ్మలు లక్ష్యం.

1947లో రాయ్, మార్క్సు సిద్ధాంత వైఫల్యాన్ని నిరూపించేసరికి అంతకుముందు మార్క్సు తత్వంతో ప్రభావితుడైన కృష్ణరావు సమాలోచనాశక్తికి, కొరడా దెబ్బ తగిలింది. ఇహ అక్కడనుంచి గోపీచంద్‌తో కలిసి ప్రాక్పశ్చిమ తత్త్వవేత్తల్ని ప్రశ్నించడం మొదలుపెట్టాడు. ఫలితం ప్లేటో, అరిస్టాటిల్, కాంట్, హెగెల్‌లను తెలుగులో పరిచయం చేయసంకల్పించారు. ప్లేటో, కాంట్‌లు మాత్రమే వచ్చాయి. కాలేజీలో ఉపన్యాసకులుగా పనిచేసే రోజుల్లో మాధ్యమిక వాదం మీద కుతూహలం కలిగి, అతికష్టంతో నాగార్జున కృతులను తీసుకొచ్చి అనువదించారు. అయితే అవన్నీ దొంగలపాలైనవి. నాగార్జునుని విగ్రహవ్యావర్తనిని మాత్రం తిరిగి విపుల వ్యాఖ్యతో అనువదించి, ప్రచురించారు. ఈ సమయంలోనే ప్లేటో రిపబ్లిక్‌ని ఆదర్శరాజ్యంగా సెంట్రల్ అకాడెమీ అనువదింప జేసింది.

ఆయన చివరి రచన ''బొమ్మ ఏడ్చింది.'' 1973లో వచ్చింది. ఇందులో, మతానికి రాజ్యానికి సంబంధం ఏమిటి? రాజ్యం మత విషయాలలో జోక్యం చేసుకోవచ్చా? వ్యక్తి జీవితాన్ని రాజ్యం ఏమేర ప్రభావితం చేయవచ్చు? స్వేచ్ఛ, స్వాతంత్ర్యం,

---

జి.వి.కృష్ణరావు

ప్రజాస్వామ్యం, లౌకికవాదం, అసమ్మతి హక్కు, విప్లవం, మహాకరుణ అంటే బుద్ధకరుణ పై నాగార్జునాచార్యుని అభిప్రాయాలు ఏమిటి? - అనే ప్రశ్నలను అంటే ముఖ్యంగా అటువంటి విలువలను దృష్టిలో ఉంచుకొని బొమ్మ ఏడ్చింది'' అనే నాటకాన్ని రాశారు. ఇంతకు ఆ ''బొమ్మ ఎవరు? ఎందుకు ఏడ్చింది. శాంతి, దాన, వీర, క్షాంతి, ధ్యాన, ప్రజ్ఞలనే షట్పారమితులే బౌద్ధుల ఆరాధ్యదేవత అయిన షట్పారమితాదేవి: ఆషట్పారమితా దేవే ఆ బొమ్మ. ఆ ఆరు పారమితులు దేశంలో లోప్తమైనప్పుడు, వాటికి క్షోభ కలిగినప్పుడు, ఆ బొమ్మ ఏడుస్తుంది.

గౌతమీ పుత్రశాతకర్ణికి తల్లి లౌకికతత్వాన్ని బోధిస్తుంది. నాయనా, నీకేది కావాలో చెప్పు. అంతర్ముఖులకు మతం కావాలి. బహిర్ముఖులకు రాజ్యం కావాలి. రాజ్యంలో ఒకేమతం, ఒకే ఆదర్శం ఉండాలనే లేదు. మన రాజ్యం సంకుచితం కాదు. భిన్న మతాలుంటాయి. వీటన్నింటిని అణచడం సాధ్యమా? నిన్ను బౌద్ధం స్వీకరించమనడం లేదు. మత తత్వం, దురవగాహణం, రాజులుదాని జోలికి పోరాదు. ఉపేక్ష వహించాలి. ద్వేషంతగదు. ఉపేక్ష పాపంకాదు.

ఇక నాకు జి.వి.కె. తో అత్యంత సాన్నిహిత్య సంబంధం దాదాపు పాతిక సంవత్సరాలు పాటు ఉంది. ఆయనతో నేను అప్పుడప్పుడు జరిపిన సాహితీ సంభాషణలనుంచి నేను గ్రహించిన ఆయన సాహితీ తత్వాన్ని ఇప్పుడు ఆవిష్కరిస్తాను. 

ఆయన మధ్య తరగతి లేదా దిగువ మధ్య తరగతికి చెందినవాడు. ఆయన మధ్యతరగతి తత్వం పాపికొండలు, ఉదబిందువులు, కీలుబొమ్మలలో ప్రదర్శితమైంది. ఆయన ''మధ్యతరగతి నీతిని'' ''మిడిల్ క్లాస్ మొరాలిటీ''ని రాడికల్ హ్యూమనిస్టు మానవకలశంతో గ్రహించి, వాటిల్లో మాను షార్థాన్ని ప్రతిపాదించాడు.

కృష్ణరావుగారి ఉద్దేశంలో, రయితను రచనకు పురికొలిపే ప్రేరకం సార్వత్రికంగా ఏ ఒకటీకాదు. ఒకటి ఒకరిని ప్రేరేపిస్తే, వేరొకటి వేరొకరిని ప్రేరేపిస్తుంది. మొత్తంమీద రచయితకు అనుభవం ముఖ్యం. అనన్యమైన అనుభవాన్ని రచయిత పొందినప్పుడు, అది అతనిని రచనోన్ముఖుని చేస్తుంది. కాని రచయితఅయినవాడు, ఈ అనుభవాన్ని యథాతథంగా చిత్రించాడు. అవ్యక్తకాన్ని విషయం - లేటెంట్ డ్రీమ్ కంటెంట్‌నుంచి వ్యక్త స్వప్నం బిఫెస్ట్ డ్రీమ్ కంటెంట్ - ఎలానిష్పన్నమవుతుందో, అలా 'వైచిత్రి'తో రచయిత అనుభవం నుంచి రచన ఉప్పతిల్లుతుంది. ఆత్మాభివ్యక్తీకరణ లాలస రచనకు దోహదం చేస్తుంది. రచయిత తన వైయక్తిక పరిమితులను అధిగమించి, అనుభవాన్ని సాధారణీకరిస్తాడు. ఆత్మాభివ్యక్తీకరణేచ్ఛ ఎందుకు కలుగుతుంది? అది ఉద్బోధకం.

పరిచ్ఛిన్నమైన, వ్యక్తిగతమైన, జీవితాన్ని దాటి, పరిచ్ఛిన్నమైన సార్వజనీనతను చేరవలెననే తపన రచనకు గలహేతువు. ఆత్మ సాత్కృతి గావించుకోవాలనే దాహం రచయితకు కారణం.''

మరి ఇంతవరకు చెప్పింది అందరికీ వర్తించేదే. కాని కృష్ణరావుకు వర్తించేది ఏమిటి? ఆయనకు సమాజం సమస్యాగ్రస్తం, దానిని పరిష్కరించాలి. ఎక్కువమంది పరులు ఆలోచనా విధానాలను, వారి ఊత పదాలను, నినాదాలను వినివిని, గాను గెద్దుగాడిలో పడి, అవి తమ స్వంతాలే అని భ్రమ పడతారు. అటువంటి గానుగెద్దు ఒరవడి నుంచి భ్రాంతి నుంచి, వారిని మేల్కొల్పాలని, ఆయన ఆవేదన. ఇది ఆయన రచనకు ప్రేరకం.

సాహిత్యానికి ధర్మానికి ఆయన దృష్టిలో తేడా ఇలా ఉంటుంది. లోకం కోసం ఏడిస్తే అది కవిత్వం, తన కోసం ఏడిస్తే అది స్వార్థం, తనకోసం లోకం కోసం ఏడిస్తే అది ధర్మం, రెండింటికోసం ఏడ్చినట్లు నటిస్తే, అది రాజకీయం'

కొంతమందికి, జీవితం, కళ, వేరు, వేరు. కాని కృష్ణరావుకు అవి రెండు వేరువేరు కావు. జీవిత ప్రవాహానికి ఆద్యంతాలు లేవు. అదిసాపేక్షం. అనంతసంసారాన్ని అర్థం చేసుకోవటానికి మరొకటి' కావాలి. పైగా అది వైయక్తికంకాదు. ఆద్యంత సుసాతమై నిరపేక్షమై స్వప్రకాశమై తృప్తినిచ్చే 'జీవితశకలమే' కళ. సాహిత్యం సమాజానికి దర్పణమూకాదు, అనుకరణమూ కాదు. అది ఇంద్రజాలమూ కాదు. ''ఇలా ఉంటుంది. ఇలా ఉండదు,'' అని చెప్పడానికి వీలులేనిది. జీవితపు విలువలను నిర్దేశించి వెలుగునిచ్చేది కళ. దీని పరమార్థం నిరవధిక మధురానుభూతి – పరిమితులు లేని నిర్లిప్త సుఖం – ఆనందం.

కృష్ణరావు తన రచనల ద్వారా దర్శింపజేసిన జీవితార్థాన్ని గురించి నేను ఇలా అంటాను: జీవితాన్ని సహజంగా చిత్రించడం ఎవరికీ సాధ్యం కాదు. మనిషి, సహకార, సానుభూతులతో, బుద్ధికరుణతో జీవించాలి. 'దృష్టి లేక సృష్టి లేదు' మంచి చెడుగులు లేక కవిత్వం లేదు. మాటల గారడీలో పడి, రోకంటి పాటలను తమ స్వతంత్ర ఆలోచనలుగా ఎంచి, బానిసగా స్వతంత్ర విచార ధారను మనిషి కోల్పోయి, బ్రతుకుతున్నాడు. అలాగై కూడ తాను స్వతంత్రజీవితాన్ని సాగిస్తున్నాననే భ్రమకు మనిషిలో నవుతున్నాడు. ఈ వంచన నుంచి విముక్తి కలుగచేయడం రచయిత ధర్మం. దీని కోసమే డా. జి.వి. కృష్ణరావు తన రచనా వ్యాసంగాన్ని సాగించాడు.

(ఆకాశవాణి. హైదరాబాద్ వారి సౌజన్యంతో)

''శ్యామలకేదో మహాప్రవాహంలో కొట్టుకొని పోతున్నట్లయింది. అప్రయత్నంగా ఆమె చేతులు అతడి కంఠావలంబనం పొందాయి. తెలివంది చూచుకొనేటప్పటికి లలాటతిలకం రక్తముక్తాయితమై నాసాగ్రాన వ్రేలుతున్నది.''

ఇక్కడ సమాసస్వభావాన్ని గూర్చి కొంత తెలుసుకొనటం అవసరం. శబ్దం అర్థానికి శరీరం; అర్థం శబ్దానికి ఆత్మ. ఈ శబ్దార్థాలు అవినాభూతాలు. సమాసంలో విభిన్నశబ్దాలు, విభిన్న అర్థాలు ఏకాకృతిని పొంది మరొక రమణీయార్థాన్ని బోధిస్తాయి వ్యస్తపదాలు సమాహృతిని చెంది ఏకపదంగా తమను భాసింపచేసుకొంటాయి. అట్లే వాచ్యార్థాలు సమస్తస్థితిని పొంది ఏకార్థబోధకాలు అవుతాయి. అప్పుడు సమాసం భావుక హృదయాలను రసస్నిగ్ధం చేస్తుంది. ఇక్కడ 'లలాటతిలకం, రక్తముక్తాయితం, నాసాగ్రం' అనే అలతి అలతి సమస్తపదాలు వ్యస్తదేహులుగా ఉన్న శ్యామలాధర్మారావుల సమాసస్థితిని, సాత్త్వికభావోదయాన్ని రామణీయకంగా అభివ్యంజితం చేసి సహృదయులను ఆనందపరవశులను చేస్తాయి. రచయిత అవకాశం వచ్చిన ప్రతి సన్నివేశంలో ఇట్టి దృశ్యాలను మధురభావోద్దీపకంగా చిత్రించి మనకు సాక్షాత్కరింపజేస్తారు. ఈ నవలలో రచయిత ప్రదర్శించిన వ్యంగ్యవచోవైభవం అనితరసాధ్యము. వక్రోక్తులు, వ్యంగ్యాత్మక సంభాషణలు ఈ నవలలో పరశ్శతాలు. వాటిని వివరించబూనుకుంటే మరొక సమాలోచనవ్యాసం అవుతుంది. ఆపనిని భావుక విమర్శకులకు వదిలివేయటమైనది.



ఈ నవలకు 'పాపికొండలు' అన్నపేరు పెట్టటంలోనే రచయితకు గల ప్రతిభ ద్యోతమానం అవుతుంది. పాపికొండలు మధ్య గోదావరి సన్నగా, మహావేగంగా, సుడిగుండాలతో భయంకరంగా ప్రవహిస్తూ ఉంటుంది. ఆ కొండల మధ్య, ఒక నిర్ణీతమార్గాన జాగ్రత్తగా నావికుడు నౌకను నడుపుకొనలేకపోతే, ఆ నావ సుడిగుండాలలో పడి విశకలితం అవుతుంది; ఆ ప్రవాహంలో పడి కొట్టుకొనిపోతుంది. గలగలమంటూ ఆనందంతో పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహించే ఆ గోదావరి – ఆ జీవనది – పాపికొండలు కారణంగానే అంత భయంకరంగా, అంత ప్రాణోపద్రవకరంగా ఉంటుంది.

అలాగే, ఈ నవలలోని పాత్రల జీవనస్రవంతికి అధికారతృషితులయిన కొందరు వ్యక్తులు అడ్డుగోడలై నిలుస్తారు. వారి జీవితాలలో సుడిగుండాలు లేపుతారు. ఆ జలావర్తాలలో పడి ఎందరో బలి అయిపోతారు అనీ. వాళ్ళు కొంత జాగరూకతతో, కొంత వివేకంతో ప్రవర్తించి ఉన్నట్లయితే, కొంత సంయమంతో వ్యవహరించి ఉన్నట్లయితే వాళ్ళ జీవిత పర్యవసానం అంత దుఃఖభాజనం అయి ఉండేది కాదనీ ధ్వనింపచేయటానికే రచయిత నవలకు ఆ పేరు పెట్టారు.

ఏవంవిధ వ్యంగ్య మర్యాదతో డా॥ జి.వి.కృష్ణరావు ఎన్నో సద్రచనలు చేశారు. ఈ నవలలో వారు తల్లిదండ్రులు, సంతానం, అధికారులు, అధికృతులు, ప్రేయసీప్రియులు మున్నగువారి సంబంధాలను ఔచిత్యసముపేతంగా, మర్యాదబద్ధంగా, రసోల్బణంగా, సహజ రమణీయంగా చిత్రించి, పాఠకులలో స్వతంత్రము, వివేకసంపన్నమూ అయిన ఆలోచనను ఉద్దీప్తం చేసిన కవికుశలుడు. జి.వి.కె. భౌతిక శరీరం నేడు లేదు. కాని,

''ఉపేయుషా మపి దివం సన్నిబంధాయినాం।
ఆస్త ఏవ నిరాతంకం కాంతం కావ్యమయం వపుః॥''

అన్న అలంకారిక వచనానుసారం కృష్ణరావు మనోహరమయిన కావ్యశరీరాన్ని ధరించినాక లోకంలో విహరిస్తుంటారని అనటంలో అతిశయోక్తి లేదు.

''జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః''

# జి.వి.కె.తో ముఖాముఖి

(ఈ 'ముఖాముఖి' లో హితశ్రీ, శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ అన్నపరెడ్డి వేంకటేశ్వరరెడ్డి పాల్గొన్నారు. జి.వి.కె.తో వీరి ముగ్గురికి పావు శతాబ్దంపాటు అత్యంత సన్నిహితసంబంధం ఉంది. ఇంకా నాలుగు రోజులలో శ్రీ అరవిందసాహిత్యసేవాసమితి, తెనాలి. శ్రీ గుళ్ళపల్లి సత్యనారాయణగారి ఆధ్వర్యంలో బ్రహ్మాండమైన సన్మానసభ జరుపనున్న సమయంలో, 26 మార్చి, 1979న ఈ గోష్ఠి నిర్వహణం జరిగింది.

ఈ గోష్ఠికి అక్షరరూపకల్పన చేసింది జి.వి.కె. మూర్తి మత్స్యాచిత్రణం గావించింది శ్రీ రెడ్డి.

ఇది జి.వి.కె. చివరి వాగ్రూప రచన) — సంపాదకుడు

★ ★ ★ ★ ★



ఆ రోజు ఉదయం కాఫీ త్రాగిన తరవాత ఏమీ తోచడం లేదు. బట్టలు వేసుకొని సైకిలు ఎక్కాను ఎక్కడకు వెళ్ళాలో నిర్ణయించుకోకుండానే. నిర్ణయం మనం తీసుకోకపోతే ఆ పని అలవాటు చేస్తుంది. అనేక సమస్యలను అలవాట్లు పరిష్కరిస్తాయి. ఆరోజూ అదే జరిగింది. నిష్క్రియాత్మకంగా, నిరుద్దేశపూర్వకంగా కూర్చున్న నన్ను సైకిలు అలవాటు చొప్పున జి.వి.కె. గారింటి ముఖం పట్టించింది. జీవితకాలం ఎన్ని క్షణాలు! అన్ని క్షణాలలో ప్రతిక్షణమూ నేను జీవిస్తున్నానా? ఆ మాటకొస్తే ఎవరైన ప్రతిక్షణమూ జీవిస్తారా? నామాత్రానికి నేను ప్రతిక్షణమూ ఉంటున్నానే గాని జీవించడం లేదు. అలా జీవించని కొన్ని క్షణాలు గడిచేసరికి జి.వి.కె.గారి వాకిలి ముంగిట వాలాను.

ఆయన ఎక్కడో దూరాకాశంలోకి అవలోకిస్తూ తూర్పుముఖంగా మునిగాళ్ళ వేసుకొని సోఫాలో కూర్చొని ఉన్నారు. నాకు సందేహం కలిగింది. ఈయనైనా జీవితంలో ప్రతిక్షణమూ జీవిస్తున్నాడా అని? శుష్కించి, ఎముకలగూడై ఆ దేహం నిష్క్రియాత్మకతను ప్రదర్శిస్తున్నా, ఆయన ఏకాగ్రత, కేంద్రీకృత అవధానం, సమాధ్యవస్థ దానిని కాదంటున్నాయి. సమాధ్యవస్థ ఎంత క్రియాత్మకం! బహుశ ఆయనైనా నాకంటె ఎక్కువ క్షణాలు జీవిస్తున్నాడేమో! ప్రతిక్షణం కాకపోయినా, కనీసం మరిన్ని క్షణాలు జీవించే ఆ జీవి దేనిని గురించి ఆలోచిస్తున్నాడు?

చివరి అంకెను తిప్పిన తరవాత మొదటి నాలుగు అంకెలను గుర్తుపెట్టుకొని, వేటితో కలిపి మొత్తం అయిదు అంకెల సంఖ్యను ప్రయోగించే టెలిఫోన్ డయలింగ్ వ్యవస్థకు స్ఫోటసిద్ధాంతంలోని 'ఆకాంక్ష'కు మధ్య ఉన్న సంబంధాన్ని గురించా? అప్పటి ఆచార్యనాగార్జునుడు ఇరవయ్యోశతాబ్ది ఐన్‌స్టైన్ సిద్ధాంతిని ముందుగా ఊహించాడా లేదా అనా? కవితాశిల్పానికి ఫ్రాయిడ్ స్వప్నశిల్పానికి మధ్య సారూప్యతల గురించా? ''అపోహ'' వాదం ధ్వనిసిద్ధాంతాన్ని పరామర్శించే తీరు గురించా? మరి దేనిని గురించి?

ఆలిండియారేడియో, విజయవాడ నుంచి పదవీవిరమణ చేసిన తరవాత, ఈ పదవీవిరమణకు ఆనుషంగిక అంత్యానికి మధ్య ఉన్న వానప్రస్థంలో ఈయన జీవిస్తున్నాడా? యువతను ఆదరించే ఈ ప్రపంచకంలో, ప్రయోజకత్వానికి పట్టంకట్టే ఈ ప్రపంచంలో, విజయాన్ని కొలబద్దగ పరిగణించే ఈ ప్రపంచంలో పదవీవిరమణ తరవాత అనుషంగిక అంత్యంకోసం ఎదురుచూచే అందరిలాగే జీవిస్తున్నాడా?

కాదు, తన మేధాసంపత్తితో ప్రతిక్షణమూ జీవిస్తున్నానని, జీవితం అమూల్యమైనదని, నిరాశానిస్పృహలకు తావు లేదని, అనుషంగిక అంత్యం సమీపించేవరకు సృజనాత్మకంగా క్రియాత్మకంగా, ప్రభావోత్పాదకంగా జీవించవచ్చని ఋజువు చేస్తున్నారని అనిపించింది ఆయన ఏకాగ్రత చూస్తుంటే.

నవల, నాటిక, కావ్యం, దర్శనం, కథ, కథానికలలో దేనిలో అయినా గంభీరవిషయాన్ని లోతుగ తేలికగా చెప్పి, దర్శనాలలోగూడ మధ్య మధ్య వక్రోక్తి హాస్యాలను జోడించి, రసెల్ అనిపించుకున్న కావ్యానుశీసనుడా ఇతడు?

గ్రామీణ మధ్యతరగతి జీవితాన్ని విశ్వసించి, ''కీలుబొమ్మలు''లో ''పాపికొండలు''లో ''ఉదబిందువులు''లో మధ్యతరగతి నీతి (Middle class Morality)ని రాడికల్‌హ్యూమనిస్టు మానకలశంతో గ్రహించిన మానుషార్థప్రతిపాదకులా ఈయన?

సమాజంలో ఆహారం అందరికీ సమంగా అందనంత కాలం, వ్యాసుడైనా ఈశుడైనా ''భిక్షాపాత్ర''ను బద్దలుకొట్టి కమ్యూనిస్టు అవుతాడని తమ వ్యాసనిష్క్రాసనంలో చెప్పింది వీరేనా?

నాగార్జునపర్వతాన్ని ఏకకేల కీలించి, మానకలశుని దర్శనం 'విగ్రహవ్యావర్తని'ని. తెలుగులో, తెలుగుగడ్డ కందించి, అందులో సత్కార్యవాదులకు 'అన్నమలములభేదా'లని విప్పిచెప్పిన పరమదార్శనికుడా?



---

జి.వి.కృష్ణరావు

అటు ప్లేటో, అరిస్టాటిల్, కాంట్, హ్యూమ్, హెగెల్‌ల దర్శనాలను, ప్రాచీన భారత దర్శనాలనే గాక, ఇటు ప్రాచ్యపాశ్చాత్య కావ్యాలను కావ్యానుశాసనాలను ఆవపోసనపట్టి, కావ్య మీమాంస రససిద్ధాంతాలను నిగ్గుతేల్చి, మమ్మటుడు పొరుగింటివాడన్నట్లు భాసిల్లి, శ్రీ తాపీ ధర్మారావు 'హృదయోల్లాసం'పై, డా॥ పాటిబండ్ల మాధవరాయ శర్మ ''మహాభారతంలో ఛందోశిల్పం''పై సమగ్రంగా, సాధికారంగా బృహత్సమీక్షల (ఈ రెండు సమీక్షలు కృష్ణరావుగారి 'నవతోరణం'లో ప్రచురితమయ్యాయి. వీటిని రెండు డాక్టరేట్ పట్టానికి సరిపోయే వ్యాసాలనవచ్చు. తాపీవారు జి.వి.కె. విమర్శకు కై మోడ్పులర్పించారు) ను చేసిన కవితాతత్త్వజ్ఞులా ఈయన?

ఆయనను గురించి నాలో ఆలోచనలు ఇలా పరుగులు తీస్తున్న సమయంలో యాదృచ్ఛికంగా హితశ్రీ, జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి అక్కడకు రావడం జరిగింది. వారి పాదధ్వనితో ఆయన ఈ లోకంలోకి వచ్చారు. అప్పటివరకు నేను అలాగే నిలబడి ఉన్నాను. వారు నా రాకను గమనించనూ లేదు, నా ఉనికిని గుర్తించనూ లేదు. '' ఏమిటీ విశేషం? ముగ్గురు ఒకే మాట కూడబలుక్కొని వచ్చారు'' అన్నారాయన.

''యాదృచ్ఛికం. మేము ముగ్గురం కలిసి రాలేదు'' అని చెప్పాము. అప్పుడు 
కూర్చోమని మాకు ఆయన ఆసనాలు చూపించారు. పిచ్చాపాటీ కబుర్లు ఆరంభమయ్యాయి. మధ్యలో ''మన ఈ యాదృచ్ఛిక సమావేశాన్ని ఎందుకు సాహిత్యగోష్ఠిగా మార్చగూడదు?'' అని నేను ప్రతిపాదించాను. అందరూ తలలూపారు. మీరాక యాదృచ్ఛికమైనా, మీ ప్రతిపాదన పూర్వనిర్ణీతమే నన్నమాట; అయితే కానివ్వండి అన్నారు జి.వి.కె. '' ఏమండీ! కృష్ణరావుగారూ! మీ ఉద్దేశంలో అసలు రచయిత ఎందుకు వ్రాస్తాడు? వ్రాయడానికి అతనిని ప్రేరేపించేది ఏది? శ్రీ శాస్త్రి గోష్ఠి ప్రారంభించారు. ''సార్వత్రికంగా అందరిని ఏ ఒకటి ప్రేరేపిస్తుందని చెప్పలేము. ఒకటి ఒకరిని ప్రేరేపిస్తే, మరొకరిని మరొకటి ప్రేరేపిస్తుంది. మొత్తంమీద ఎవరికైన 'అనుభవం' ముఖ్యం. అనన్యమైన ఒక అనుభవాన్ని రచయిత పొందినప్పుడు అది రచయితను వ్రాయసంకల్పింప జేస్తుంది. కాని రచయితైన వాడు ఈ అనుభవాన్ని యథాతథంగా చిత్రించడు. అవ్యక్తస్వప్న విషయం (Latend dream content) నుంచి వ్యక్తస్వప్నం (Manifest dream) ఎలా రూపొందుతుందో అదే 'వైచిత్రి'తో రచయిత అనుభవం నుంచి రచన ఉత్పత్తిల్లుతుంది.

''ఆత్మాభివ్యక్తీకరణ లాలస రచనకు దోహదం అవుతుంది. రచయిత తన వైయక్తిక పరిమితులను అధిగమించి అనుభవాన్ని సాధారణీకరణం చేస్తాడు. ఆత్మాభివ్యక్తీకరణేచ్ఛ

ఎందుకు కలుగుతుంది? అది ఉద్బోధకము. పరిచ్ఛిన్నమైన, వ్యక్తిగతమైన జీవితాన్ని దాటి అపరిచ్ఛిన్నమైన సార్వజనీనతను చేరవలెననే తపన రచనకు మూలహేతువు. ఆత్మ సాత్కృతి గావించుకోవలెననే దాహం రచనకు కారణం.''

''అయితే మీ రచనకు ప్రధానప్రేరకశక్తి ఏదో చెప్పుతారా?'' అడిగారు శాస్త్రిగారు.

''నాకు ప్రేరకమైనవి కొన్ని ఉన్నాయి సమాజం సమస్యాగ్రస్తం. దానిని పరిష్కరించాలని ప్రతివాడు ఆలోచిస్తాడు. అయితే ఈ ఆలోచించేవారిలో ఎక్కువమంది, పరుల ఆలోచనావిధానాలను, వారి ఊతపదాలను పదే పదే ఆలకించడం వల్ల, గానుగెద్దు గాడిలో పడి, అవి తమ స్వంతాలే అని భ్రాంతిలో పడతారు. ఈ గానుగెద్దు ఒరవడి (Cliche) నుంచి, భ్రాంతినుంచి అటువంటివారిని మేల్కొలపాలని నా ఆవేదన. ఈ భావనే నా రచనకు ప్రేరకం.''

'సాహిత్యానికి ధర్మానికి తేడా ఏమిటంటారు?' హితశ్రీగారు ప్రశ్నించి, కుతూహలాన్ని మాలో రేకెత్తించారు. అంతే! జి.వి.కే. ఏదో ఊహాలోకాన్నుంచి అన్నారు–



'లోకంకోసం ఏడిస్తే అది కవిత్వం, తనకోసం ఏడిస్తే అది స్వార్థం, తనకోసం లోకంకోసం ఏడిస్తే అది ధర్మం, రెండింటికోసం ఏడ్చినట్లు నటిస్తే అది రాజకీయం.'

''కళ కళ కోసమే అంటారుగదా, దానిపై మీ అభిప్రాయం?'' అడిగాను నేను చర్చను మలుపుతిప్పుతూ.

'' ఈ సిద్ధాంతాన్ని తాత్త్వికంగా మొట్టమొదట ప్రతిపాదించినవాడు క్రోచె. 'జీవితం వేరు, కళ వేరు' అని భావించిన కొందరు క్రోచె సిద్ధాంతాన్ని అపార్థం చేసుకొని విపరీత వ్యాఖ్యానాలు చేశారు. నాకు జీవితం, కళ వేరు వేరు కావు. అవి రెండూ ఒకటే. జీవిత ప్రవాహానికి (సంసారానికి) అద్యంతాలు లేవు. అది సాపేక్షం. అనంతసంసారాన్ని అర్థం చేసుకోవడానికి 'మరొకటి' కావాలి గదా. పైగా అది వైయక్తికమూ కాదు. ఆద్యంత సహితమై, నిరపేక్షమై, స్వప్రకాశమై తృప్తినిచ్చే 'జీవితశకల'మే కళ.

''సాహిత్యం సమాజానికి దర్పణం కావాలంటారా?''

''సాహిత్యం సమాజానికి ప్రతిబింబమూ కాదు, అనుకరణమూ కాదు. అది ఇంద్ర జాలమూ కాదు. ' ఇలా ఉంటుంది, ఇలా ఉండదు', అని చెప్పడానికి వీలు లేనిది.'

''సాహిత్యం సమాజాన్ని మలుస్తుందటారా?'' శ్రీ శాస్త్రి అడ్డుకొన్నారు.

''జీవితపు విలువలను నిర్దేశించి వెలుగు నిచ్చేది కళ. దీని పరమార్థం నిరవధిక మధురానుభూతి – పరిమితులు లేని నిర్లిప్తసుఖం – ఆనందం.''

''వర్తమాన సాహిత్యం పోకడలను గురించి మీ అభిప్రాయం?''

"This won't do" అని పెదవి విరిచారు.

''సాహిత్యవికాసంలో పత్రికల పాత్రను గురించి చెప్తారా?''

''సర్వానికి మూలం పత్రికలే. మరి సాహిత్యం మాట వేరే చెప్పవలసిన పని ఏముంది? సాహిత్యవికాసంలో, ఉత్తమసాహిత్యం రావడంలో, సాహిత్యాభిరుచిని పెంపొందించడంలో పత్రికల పాత్ర అనన్యము. ఈనాటి సాహిత్యస్థితికి మన పత్రికలే నిదర్శనం.''

''సమాజం రోజు రోజుకు సంక్లిష్ట మవుతున్నది. రచయిత అవగాహనను అది దాటి పోతోంది. అందుకని రచయిత సరైన సాహిత్యరచన చేయలేకపోతున్నాడు. మీరేమంటారు?''



'సాహిత్యం సహృదయ హృదయైకవేద్యం. సంస్కారభేదాన్ని బట్టి అనుభూతిలో తేడా లుండడం సహజం. ఒకరి అనుభూతి వేరొకని అనుభూతితో ఏకీభవించనంతమాత్రాన అది ఉత్తమ సాహిత్యం కాదనలేము. తెలుపును చూస్తున్నప్పుడు దాని ధవళిమ అందరికీ ఏకరీతిలో గోచర మవుతుందని చెప్పలేము. అందుకని దానిని తెలుపు కాదని అనలేము. A nation gets the literature it deserves.'

'మన సమాజనం సరిగానే ఉందంటారా? అంటే మన సమాజాన్ని ఏ విలువలు నిర్దేశిస్తున్నవంటారు?'

''నైతికవిలువలు పూర్తిగ పడిపోయాయి. నీతి లోపించిన జాతికి గతి, మోక్షం లేదు. త్యాగం లేని నైతిక విలువలు లేవు. స్వాతంత్ర్యం పేరుతో వెర్రిమొర్రి వేషాలు వేయడం జరుగుతోంది. ఇల్లాలు, కేవలం తన స్వాతంత్ర్యమే పరమార్థ మనుకొంటే, మగని మేలు, బిడ్డల మేలు కుంటుపడడమే కాక, తన మేలుకు గూడ చేటు వాటిల్లుతుంది. ఈనాటికి మన విలువలు ఏమైనా శేషించి ఉంటే, అవి రామాయణ, భారతాదులచే దిద్దబడ్డవే''.

మీ రచనలలో మీరు దర్శింపజేసిన జీవితార్థం ఏమిటి? అని చివరిగ ప్రశ్నించాను.

'జీవితాన్ని సమగ్రంగా చిత్రించామని ఎవరూ చెప్పలేరు. జీవితం అపారం. దానికి చెలియలికట్ట వేయడం ఎవరి తరం? ఒక ఒడ్డును చూపి, అది సాగరమో సరోవరమో చెబుతాము. అప్పటికప్పుడు ఆయా పరిస్థితులలో కలిగిన అనుభూతుల మీద ఆధారపడి వ్రాయడం జరుగుతుంది. నా రచనలలో నేను చెప్పదలచుకొంది ఒక్కటే; మనిషి సహకార, సానుభూతులలో జీవించాలి. 'దృష్టిలేక సృష్టిలేదు.' 'మంచి చెడుగులు లేక కవిత్వం లేదు.' మాటల గారడీలో పడి, వాటికి బానిసలమై స్వతంత్రంగా ఆలోచించలేకపోతున్నాము. అలా అయిపోయి గూడ ఇంక మనం స్వతంత్రంగా విచారం సాగిస్తున్నామనే ఆత్మవంచనకు లోనవుతున్నాము. ఈ వంచన నుంచి విముక్తుల్ని చేయడం రచయిత ధర్మం. దీనికోసం ప్రయత్నించాను.''

''చివరి ప్రశ్నండి. మీరు ఆయాసంతోగూడ ఇంత ఓపికగ, దీర్ఘంగ సమాధానాలిచ్చారు. మరొక అవకాశం లభిస్తే, మీరు ఇదేరకం జీవితాన్ని తిరిగి కొనసాగించాలని కోరుకొంటున్నారా?''

"With no regrets"

# వ్యక్తిచేతన

రచన: హితశ్రీ

తెలుగు సాహిత్యంలో వ్యక్తిని గురించీ, వ్యక్తి కర్తవ్యాన్ని గురించీ, సమగ్ర వ్యక్తిత్వ పూర్ణోదయాన్ని గురించీ తీవ్ర జిజ్ఞాసను రేకెత్తించిన ఏకైక రచయిత డాక్టర్ జి.వి. కృష్ణరావుగారు. కృష్ణరావు గారి జీవితాన్ని, సాహిత్యాన్ని పరిశీలిస్తే మానవుడి స్వాతంత్ర్యానికి సంబంధించిన ఒక తాత్విక దృక్పథం వారి జీవితాన్నీ, సాహిత్యాన్ని కూడా ప్రబలంగా ప్రభావితం చేసిందని స్పష్టమవుతుంది.

కృష్ణరావు గారిని ఉగ్రూతలూపి, ఊపిరాడకుండా చేసిన ప్రధాన భావన వ్యక్తి చేతన. వ్యక్తి సామాజిక జీవి, ఆర్థికజీవి, రాజకీయ జీవి, సంస్కృతిక శక్తులు మానవుడిని ఎలా శాసిస్తున్నాయి? వీటిని మానవుడు ఎలా ఎదుర్కొంటున్నాడు? సీసాల్లో ద్రవంగా మారిపోతున్నాడా? పర్వత శిఖరంలా నిలబడుతున్నాడా? మబ్బుల్ని చెదరగొట్టే ప్రభంజనమవుతున్నాడా? పిట్టలా ఎగిరి పోతున్నాడా? గుడే పదిలమనుకుంటున్నాడా? అడవిలో మానవుతున్నాడా? గిరి గీసుకుకూర్చుంటున్నాడా? అసలు మానవుడు ఎలా ప్రవర్తించాలి? మానవుడి స్వభావం ఏమిటి? అతని లక్షణం ఏమిటి? కర్తవ్యం ఏమిటి? 287

ప్రేరణలకి స్పందించటం తప్ప వేరే మానవ స్వభావం అనేదేం లేదని ఒకవాదం. మానవుడు పరిస్థితుల వారసుడు, పరిస్థితులని బట్టి ఒక వ్యక్తి దొంగ కావచ్చు, ఋషి కావచ్చు అని ప్రవర్తనవాదం అంటుంది. తత్త్వశాస్త్ర, రసాయనిక శక్తులవల్ల జీవితం నిర్ణయమవుతుంది. విశ్వమంతా అంతే. ఇంకా కారణాన్ననుసరించి మనిషి జంతువులా యాంత్రికంగా ప్రవర్తించటమే. కాని స్వేచ్ఛాచరణకి అవకాశంలేదు. ఆదర్శవాదం కూడా మానవుడి స్వేచ్ఛాభీష్టాలని సర్వమానవ శ్రేయానికి లోబరిచింది. ఆమనవులంటే ఒక సర్వసాధారణ దైవాంశపంచుకొన్న వాళ్లు కనుక ఏ మానవుడి స్వేచ్ఛ అయినా సర్వ మానవ శ్రేయోసాధనకి పరిమితం. లక్ష్యవాదం, లేదా సాధనవాదం వస్తువుల భావన వాటి ఫలితాల భావనకంటె వేరు కాదనీ, అనుకొన్న లక్ష్యం ఏ సాధన సాధిస్తే అదే సత్యమనీ అంటున్నది. ప్రతికూల వాతావరణాన్ని మానవుడు అనుకూలంగా మలచుకొంటాడనీ, స్వేచ్ఛాయుత వాతావరణంలో సమాలోచన సత్ఫలితాలనిస్తుందనీ లక్ష్యవాదులు నమ్మకం. ఇక అస్తితత్త్వ వాదం తక్షణానుభవమే మానవుడి లక్ష్యమనీ, తద్వారా మాత్రమే నిజమైన అస్తిత్వాన్ని అనుభూతి పొందుతాడనీ, ఇలాంటి అనుభూతి పూర్తిగా ఆత్మాశ్రయ స్థితిలోనే

జరుగుతుందనీ, ఈస్థితిలో తనని ఏకాకిగా తెలుసుకోటమే నిజమైన స్వేచ్ఛ, ఇదే అన్ని నైతిక విలువలకీ ఆధారం. అసలు మానవుడే విశ్వానికి కేంద్రం. మిగతావన్నీ అతనికి అనుబంధించినవి. మానవ వ్యక్తి ప్రధాన లక్షణం ఏ బంధాలులేని స్వేచ్ఛ. సమాజం మానవ వ్యక్తికోసం ఉన్నది కాని అతను సమాజం కోసం కాదు అంటారు. అస్తిత్వవాదులు. వ్యక్తిని కాక వర్గాలని మాత్రమే గుర్తిస్తూ మార్క్సిజం మానవుడిని కేవలం ఆర్థిక దృష్టితోనే అర్థం చేసుకొంటుంది.

ఇలా మానవుడిని గురించీ, అతని స్వాభావాన్ని, ప్రవర్తనని, అస్తిత్వాన్ని, స్వేచ్ఛని గురించీ వివిధాభిప్రాయాలున్నాయి. వ్యాఖ్యానాలున్నాయి. వీటి బాగోగుల్ని యుక్తియుక్తంగా చర్చించటం ఆలోచనా పరుల కర్తవ్యం. అనుభవాలకి స్పందించి, అంతఃస్ఫూర్తి పొంది, ఆ వెలుగులో ఒక తాత్త్విక దృక్పథంతో మానవుడి స్థితిని గురించీ మానవవ్యక్తి కర్తవ్యాన్ని గురించీ తాను దర్శించిన సత్యాన్ని కళాత్మకంగా నిజాయితీతో ప్రదర్శించటం రచయిత బాధ్యత, కర్తవ్యం.

డాక్టర్ జి.వి. కృష్ణరావుగారు సృజనాత్మక రచయితగా ఈ బాధ్యతను అపూర్వంగా నిర్వర్తించిన విషయాన్ని దిఙ్మాత్రంగా ప్రస్తావించటమే ఈ వ్యాసం ఉద్దేశం.

288 కృష్ణరావుగారు మొదటినుంచీ రాజకీయాలకి తీవ్రంగానే స్పందించారు. మొదట్లో మార్క్సిజం ప్రభావానికి లోనయ్యారు. ఆదృక్పథంతో కొన్ని రచనలు కూడా చేశారు. ఆ తరువాత ఆనాటి మేధావుల్ని ఆకర్షించిన ఎం. ఎన్.రాయ్ రాడికల్ డెమోక్రటిక్ పార్టీ వీరిని ఆకర్షించింది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత రాయ్ చెప్పినట్లు ప్రపంచ ప్రజాస్వామ్యం ఫాసిస్ట్ రాజ్యాలను ఓడించటంలో భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రసాదించాలి. ఆ సందర్భంలో రాడికల్ డెమొక్రటిక్ పార్టీ డెహ్రాడూన్‌లో ఏర్పాటు చేసిన రాజకీయ మహాసభకి కృష్ణరావు గారు హాజరయ్యారు. అది తన జీవితంలో ఒక పెద్ద మలుపు అని కృష్ణరావు గారు ''నా సాహిత్య యాత్ర'' అనే వ్యాసంలో ఉదహరించారు. ఆ సమావేశంలో ఎం. ఎన్. రాయ్ రాజకీయ పక్షాలు అధికార కాంక్షతో మానవ స్వాతంత్ర్యాన్ని ఎలా భక్షిస్తాయో వివరించాడు. కమ్యూనిజాన్ని ప్రతిపాదించే నవ్యమానవ వాదాన్ని నిరూపించాడు. కృష్ణరావు గారికి అదంతా యుక్తియుక్తంగానే కనిపించి దిగ్భ్రాంతి కలిగింది. ఈ సంగతి తను ఎందుకు ముందుగానే ఆలోచించలేదు? ''నాయకులు చెప్పే ప్రతి మాటకూ తల ఆడించటమేనా నా పని? గంగిరెద్దుకూ నాకూ తేడా ఏమిటి?'' అని వ్యథచెందారు. స్వతంత్ర విచారానికి తాత్త్విక చింతన ఆవశ్యకమని భావించి ప్రాచ్యపాశ్చాత్య తత్త్వశాస్త్రాల్ని మథించారు. ప్లేటో ఆదర్శవాదం, కాంట్ పరతత్త్వ వాదం,

ద్యూయిగా లక్ష్యవాదం, సార్త్ర్ అస్తిత్వవాదం, ఆర్యనాగార్జునుడి శూన్యవాదం కృష్ణరావుగారి ఆలోచనల్ని ప్రబలంగా కదిలించినట్లు తోస్తుంది. అయితే కృష్ణరావుగారు చివరి దాకా తమ భావాల్లోనూ, నిజసన్నివేశాల్లోనూ స్వతంత్రులుగానే ఉండిపోయారు. ఏ విషమ పరిస్థితిలోనూ తను నమ్మిన విలువల్ని త్యజించలేదు. ఏ భయానికీ, ఏ లోభానికి వ్యక్తిత్వం తలవంచలేదు.

జీవితానుభవాలూ, తాత్త్విక చింతనా కృష్ణరావుగారి భావప్రపంచంలో కలిగించిన తీవ్ర సంచలనం వారిలో వ్యక్తి చేతనని ప్రజ్వరిల్లచేసింది. వారి కీర్తి పతాకాన్ని రెపరెప లాడించే ''కీలుబొమ్మలు'', ''పాపికొండలు'' నవలల్లో, ''బొమ్మ ఏడ్చింది'' నాటకంలో స్పష్టంగా, ''ఆదర్శశిఖరాలు'' నాటికా సంపుటిలోని నాటికల్లో స్పష్టాస్పష్టంగా గోచరించేది వ్యక్తి భావనే, వ్యక్తి ప్రాధాన్యతే, వ్యక్తి దృఢీకరణావశ్యకతే వ్యక్తిలో వ్యక్తిచేతనని ఉద్దీపింప చేసి, వ్యక్తి ధర్మాన్ని సుప్రతిష్ఠితం చెయ్యటమే కృష్ణరావు గారి సాహిత్యంలో ప్రధానాంశంగా పరిశీలకులకి వెల్లడవుతుంది. ''ధర్మమనేది కేవలం కర్మక్షేత్రానికి సంబంధించినది. మానవుని పరమార్థకంగా స్వీకరించి ఆత్మనాశనానికి పాల్పడక వివేకంతో తనకు తానుగా అంతఃకరణం నిశ్చయించిన కర్మ ధర్మం'' అని, ''రాజకీయాలు - రచనలు'' అనే వ్యాసంలో కృష్ణరావుగారే నిర్వచించారు. ప్రతికూల శక్తులకి తల ఒగ్గకుండా తన మనసుకి ధర్మమని తోచిన కర్మని ఆచరించి, మానవుడు వ్యక్తిగా తన స్వాతంత్ర్యాన్నీ ఉనికినీ నిలబెట్టుకోవాలని కృష్ణరావుగారి సందేశం. 289

ఈ సందేశాన్ని ''కీలుబొమ్మలు'' నవల మనకి ధ్వన్యాత్మకంగా స్ఫురింపచేస్తుంది. స్వాతంత్ర్యం అంటే ఏమిటి? మానవుడు అస్వతంత్రుడు ఎందుకవుతున్నాడు? ఏ శక్తులు అతన్ని శాసిస్తున్నాయి? వ్యక్తుల కర్తవ్యం ఏమిటి? ఇలాంటి ప్రశ్నలకి సమాధానాలు వెతకటమే ''కీలు బొమ్మలు'' నవల లక్ష్యం. ఇందులో పాత్రలు ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక పరిస్థితులకి క్రమక్రమంగా కీలుబొమ్మలై ప్రవర్తిస్తాయి. అంతఃకరణ బోధల్ని పెడచెవిని పెట్టి, తమ ప్రవర్తనని సమర్థించే బలమైన హేతువుల్ని వెతుక్కుంటాయి. అంతఃకరణని తెలిసీ తెలియకుండా వంచించి అసత్యాన్ని సత్యంగా భ్రమించే స్థితికి వస్తాయి. ఎప్పటికప్పుడు పరిస్థితుల్ని చెయ్యి జారనీయకుండా నివారించగలిగే స్థితిలో ఉండి కూడా, తమ వ్యక్తిత్వాన్ని దృఢంగా నిలబెట్టుకునే స్థైర్యం లేక పరిస్థితులకి క్రమంగా కీలుబొమ్మలై పోతాయి. ఈ పరిస్థితి చేజేతులా తెచ్చుకొన్నదే. మానవుడు స్వతంత్రుడు, అతను స్వాతంత్ర్యాన్ని కోల్పోతే అది ట్రాజెడి; ఆ స్థితికి తానే కారణం అనే కళాత్మక హెచ్చరికే ''కీలు బొమ్మలు'' నవల . అంతేకాని మానవుడు పరిస్థితుల కీలుబొమ్మ

అని నిరూపించటం కాదు. వ్యక్తి చేతనని తట్టి మేల్కొల్పి మానవుడికి తన కర్తవ్యాన్ని ప్రేమంగా జ్ఞాపకం చెయ్యటమే ''కీలుబొమ్మలు'' ధ్యేయం.

ఈ నవల ఇతివృత్తం ఓ గ్రామంలోని మోతుబరి రైతు పుల్లయ్య, యువ పారిశ్రామికవేత్త చంద్రశేఖరం కేంద్రాలుగా ఆ గ్రామంలో కొందరి వ్యక్తుల చుట్టూ తిరుగుతూ వాళ్ళని వాళ్ళ వ్యక్తిధర్మాన్ని విస్మరింపచేసి కీలుబొమ్మలుగా ఆడించి గ్రామంలో సంక్షోభం సృష్టించే ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక శక్తుల విలయ తాండవాన్ని బహిర్గతం చేస్తుంది. స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో గ్రామంలో కాగితాలు మిల్లు స్థాపించిన చంద్రశేఖరంకి అయిదు వేల రూపాయల ఋణానికి పుల్లయ్య అడ్డుంటాడు. లాభాలు లేక కాగితాల మిల్లు మూలబడి చంద్రశేఖరం చిక్కుల్లో పడతాడు. ఈ స్థితిలో పుల్లయ్య అతనికి అడ్డుండ లేదనే అబద్ధం ప్రచారమవుతుంది. అబద్ధం ఆడాలనే ఉద్దేశం ఏ మాత్రం లేకపోయినా, అతని ఉపేక్షవల్ల పరిస్థితి విషమించి, ఆ అబద్ధాన్ని ఎదుర్కొంటే కలిగే పరిణామాలకి భయపడి, ఏవేవో హేతువులతో తనని సమర్థించుకొంటూ చివరికి చంద్రశేఖర్ మీద ఫోర్జరీ కేసు బనాయించే స్థితికి పుల్లయ్య దిగజారి పోతాడు. ఇది గ్రామంలో కక్షలకి ఆజ్యం పోస్తుంది. ఇళ్ళూ వాములూ పరశురామ ప్రీతి అవుతాయి. కక్షలకి, కసికి కీలుబొమ్మలైన మోతుబరి ఆసామి పుల్లయ్య, హరిజనాశ్రమ సంస్థాపకురాలు అమ్మాయమ్మల జోక్యంతో ఊళ్ళో మలబార్ స్పెషల్ పోలీసు దళం దిగి ప్రజల ధన మాన ప్రాణాలకి హాని వాటిల్లి గ్రామం సంక్షోభానికి గురి అవుతుంది. పుల్లయ్య భార్య లక్ష్మమ్మ, పట్నంలో చదువుకొంటున్న అతని కుమార్తె సీత, పట్నంలో ఏ మూలో తత్త్వశాస్త్రం చదువుతూ సత్యాన్వేషణలో నిమగ్నుడైన సదుద్దేశాలుగల అతనికుమారుడు రామారావు, పుల్లయ్య బీద గుమాస్తా సత్య నారాయణ, ఆదర్శభావాలున్న డాక్టర్ వాసుదేవ శాస్త్రి ఏదో దశలో స్పష్టాస్పష్టంగా నైనా నిజం తెలుస్తున్నప్పటికీ తర్కవితర్కాలతో భ్రమలు సృష్టించుకొని అచేతనలో రక్షణ వలయాలు ఏర్పచుకొని కర్తవ్య విముఖులవుతారు. చంద్రశేఖరం పుల్లయ్య దౌష్ట్యంలో తన బలహీనతల్ని కప్పిపుచ్చుకొంటూ పతనానికి చేరువైతాడే కాని పరిస్థితులకి ధైర్యంగా ఎదురొడ్డి నిలబడలేక పోతాడు. ఆదర్శవంతుడైన డాక్టర్ కూడా. విధివశాత్తూ జరిగిన సంఘటన నెపంగా గ్రామం విడిచి పరిస్థితుల్నించి పరారీ చిత్తగిస్తాడు. చివరికి చంద్రశేఖరంకి జైలుశిక్ష పడుతుంది. పుల్లయ్యకి సన్మానం జరుగుతుంది. అధర్మం జయిస్తుంది. పుల్లయ్య గుమస్తా ఉన్మాదియై రాత్రి లైబ్రరీ అరుగుమీద చేరి ''యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతి'' ''శ్లోకం పఠిస్తుండడంతో నవల ముగుస్తుంది.

జి.వి.కృష్ణరావు

ఈ శ్లోకంతో నవల ముగించటంలో అర్థం ఎవరో ఎప్పుడో అవతరించి ఉద్ధరిస్తారని కాదు. వ్యక్తిచేతనతో మానవుడు తన సామర్థ్యాన్ని గుర్తించి, అంతఃకరణానుసారంగా కర్తవ్యోన్ముఖుడై, తన ధర్మాన్ని నెరవేర్చి, తన జీవితాన్ని శ్రేయోదాయకంగా తానే నిర్మించుకోవాలని ధ్వని; కృష్ణరావు గారికి మానవుడిపట్ల ఆ విశ్వాసం ఉంది.

''పాపి కొండలు'' నవలలోని కొన్ని ప్రధాన పాత్రలు మనకి ఆ విశ్వాసం కలిగిస్తాయి. సుడి గుండాలతో నిండిన గోదావరిలో పాపికొండల మధ్యనించి ప్రయాణించాలంటే ఎంతో మెలకువ, నేర్పు, స్థైర్యం కావాలి. లేకపోతే నౌక తునాతునకలవుతుంది. జీవితంలో అధికారమూ అంతే. ఏ మరితే రాజకీయ సుడిగుండాలు మానవుడిని భ్రష్టుణ్ణి చేస్తాయి. ఇదే ''పాపికొండలు'' నవల సందేశం. ''స్వతంత్ర భావోన్మేషం, హేతుబద్ధ ఆలోచన – ఇవే ఈ నవలకు లక్ష్యాలు'' అధికారం ఎందుకో నిర్ణయించుకొని, అధికార సంపాదనలో రాజకీయ సుడిగుండాలు రేపి, అధికార దుర్వినియోగానికి పాల్పడుతూ ధర్మారావు అనే యువకుడు వ్యక్తి చేతననీ, స్వాతంత్ర్యాన్నీ, హేతువునీ క్రమంగా కోల్పోయి, విలువలకి తిలోదకాలిచ్చి భ్రష్టుడయే వైనమే ఈ నవల ఇతివృత్తం. రాజకీయ నాయకులు స్వార్థంతో మానవ జీవన స్రవంతిలో ఎలా సుడిగుండాలు రేపి, తమ జీవితాన్ని, ఇతరుల జీవితాల్ని ఎంత భయంకరంగా మార్చివేస్తున్నారో ఈ నవల కళ్ళకి కట్టినట్టు చిత్రిస్తుంది. అయితే ధర్మారావు పాత్రకి ప్రతిగా కొన్ని పాత్రల ధృవతారలై ప్రకాశిస్తూ మానవుడి విజయానికి సంకేతాలుగా నిలిచిపోతాయి. ఎటువంటి విపరీత విపత్కర పరిస్థితుల్లోనైనా తాను నమ్మిన విలువల్ని త్యజించక అచంచలంగా నిలిచిన మహాపండితుడు, వైదిక ధర్మానుష్ఠాత అయ్యన్న శాస్త్రి, కర్తవ్యపాలనం చెయ్యటమే ధర్మమని భావించే సంయమీంద్రుని వంటి మాస్టారు గురుమూర్తి, నిర్లిప్తుడు, వీతరాగి, వివేచనాశీలి హెడ్మాస్టర్ మాధవరావు, భాష్యాంత వైయాకరణుడు, ఆయుర్వేద వైద్యుడు, తన వృత్తిని డబ్బుకోసం కించపరచని స్వతంత్రుడు బసవయ్య, సాహితీ ప్రియుడు, న్యాయం ధర్మం తప్పినడవటమంటే జుగుప్స చూపే అతని కుమారుడు ఇంగ్లీషు డాక్టర్ ప్రసాద్, నిర్మల స్ఫటికమణి శారద మానవుడి స్వతంత్ర ప్రతిపత్తికి నీరాజనాలిస్తూ, విలువలకి పట్టం కట్టిమానవుడి భవిష్యత్తులో నమ్మకం కలిగిస్తారు. ''పాపికొండలు'' అసంపూర్తి నవల కావటం దురదృష్టం.

''బొమ్మ ఏడ్చింది'' నాటకం మతానికీ, విలువలకీ సంబంధించిన దార్శనిక విషయాన్నీ, నీతితో మతానికీ, ప్రభుత్వంతో మతానికీ గల సంబంధాల్నీ వెలుగులోకి తెస్తుంది. ఆర్య నాగార్జునులు బౌద్ధుడు. రాజైన గౌతమీపుత్ర శాతకర్ణి వైదిక మత పక్షపాతి.

ఈయన ఏలుబడిలో శ్రీ పర్వతం మీద బౌద్ధారామాన్ని నెలకొల్పి విద్యా బోధన, వైద్య చికిత్స చేస్తుంటారు నాగార్జునులు. మత దురభిమానంతో పరమత అసహనంతో శాతకర్ణి బౌద్ధభిక్షువులను బాధిస్తుంటాడు. ఈ సందర్భంలో ఆర్య నాగార్జునులు కులాతీతంగా, మహాకరుణ ప్రతిపాదకంగా, ధర్మ బోధకంగా హితోపదేశంగా శాతకర్ణికి ''సుహృల్లేఖ'' రాస్తారు. వ్యక్తులు విచక్షణ లేకుండా అందరిపట్ల కరుణ చూపించటమే ''మహాకరుణ'' తాత్పర్యం.కాని రాజు ఆగ్రహిస్తాడు. ఆర్య నాగార్జునులు ''ప్లాటినస్'' అనే విదేశీయుడికి మానవతతో చికిత్స చేయటం రాజుకి దేశద్రోహంగా కనిపిస్తుంది. బౌద్ధ భిక్షువుల్ని రాజ స్కంధావారాన్ని అనుసరించమని శాతకర్ణి ఆజ్ఞాపిస్తాడు. ''నిజమైన మతం ధ్యాన ప్రజ్ఞా సమ్మితం. ఈ మతంలో ఆత్మ శాసనం తప్ప బాహ్య శాసనం చెల్లరాదు'' అని నాగార్జునులు తిరస్కరిస్తారు. వారికి రాజు దేశ బహిష్కరణ శిక్ష విధిస్తాడు. విదేశీయుడైన ప్లాటినస్‌కి మరణదండన విధిస్తాడు. మత ప్రమేయం కాకూడని రాజ్యం మత ప్రమేయమై, మానవ ప్రవర్తనలో ధర్మం, న్యాయం లోపించి అధర్మం పరాకాష్ఠ చెందిన ఈ సంఘటనకి ''బొమ్మ ఏడ్చింది''. బౌద్ధుల షట్పారమితులైన శాంతి, దాన, వీర, క్షాంతి, ధ్యాన ప్రజ్ఞల ప్రతీక అయిన షట్పారమితాదేవే ఆ బొమ్మ. దీన్ని ఆర్య నాగార్జునులు బౌద్ధ మతానుయాయి అయిన రాజమాత గౌతమీ బాలశ్రీకి బహూకరిస్తారు. ''అది అలా ఏడుస్తూనే ఉంటుంది. ఆ బొమ్మ మానవుల మనస్సులలో మెదలిన నాడే లోక కళ్యాణం'' అంటూ ఆర్య నాగార్జునులు నిష్క్రమిస్తారు. వ్యక్తి భావనకీ, వ్యక్తి చేతనకీ, మానవ స్వాతంత్ర్యానికీ ఆర్య నాగార్జునులు మేరు శిఖరం.

ఇక ''ఆదర్శ శిఖరాలు'' నాటికల సంపుటి మానవుడు చైతన్యవంతుడై జీవితానికి అర్థం వెతక్కుంటూ, ఆదర్శ శిఖరాన్ని అధిరోహిస్తూ సంతరించుకొన్న అనుభవాల సంపుటి. ఇందులోని నాటికలన్నీ జీవితపు విలువల్ని ఒక క్రమంలో ఆవిష్కరిస్తాయి. విలువలకీ ఒక ఆధిక్యతాక్రమం ఏర్పరచవచ్చు. 'సత్యం, శివం, సుందరం, మతం, దైవం వంటి తాత్విక భావాలకి సంబంధించిన విలువలది మధ్య స్థానం' అయితే ఏ ''విలువ విలువదానికుంది. విలువలన్నీ ఆవశ్యకాలే. ఇది కేవలం ఆవశ్యకతల ఆదర్శాల క్రమం అనుకోవచ్చు. ఈ విలువలన్నీ అనుభూతి పొందినప్పుడే వ్యక్తి జీవితం సమగ్ర మవుతుంది. చరితార్థమవుతుంది. ''ఆదర్శ శిఖరాలు'' సంపుటిలోని నాటికల్ని ఈ క్రమంలో - అంటే ఆర్థిక విలువ ప్రాతిపదిక అయిన ''భిక్షాపాత్ర'' నాటికతో ప్రారంభించి, సత్యం శివం సుందరం వంటి అంతిమ విలువల్ని ఆవిష్కరించే '' ఆదర్శ శిఖరాలు'' నాటికతో ముగిస్తూ సంపుటీకరించి, కృష్ణరావుగారు ప్రతి మానవుడు వ్యక్తి చేతనతో స్పందించి

విలువల సమగ్రతని అనుభూతి పొంది, పూర్ణమూర్తిమంత్వ వికసింప చేసుకోవాలని ధ్వన్యాత్మకంగా సూచించారు.

ఏ వ్యక్తీమరో వ్యక్తికాడు. మరో వ్యక్తిలా ఉండడు. మరో వ్యక్తిలాగే ఆలోచించడు. మరో వ్యక్తిలాగే మాట్లాడడు. మరోవ్యక్తిలాగే ప్రవర్తించడు. మరో వ్యక్తిలాగే జీవించడు. ఇది సహజం. అందువల్ల మనిషి సహజంగా స్వతంత్రుడు. తన అంతఃకరణ ననుసరించటమే స్వాతంత్ర్యం. ఆ విధంగా ప్రవర్తించడమే కర్తవ్యం. ఈ భావంతో స్పందించటమే వ్యక్తి చైతన్యం. సీసానుసరించి ఆకృతి మారే ద్రవంలా కాక, ప్రతికూల శక్తులకి తల ఒగ్గకుండా పోరాటం జరపటమే వ్యక్తిత్వం. ఈ వ్యక్తిత్వమే మానవుడు సర్వతో ముఖ వికాసానికి నేపథ్యం. ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యాన్నీ, దర్శనాన్నీ మథించి, జీవితానుభవాల్ని కాచి వడపోసి, తాను దర్శించి, ప్రతిభావ్యుత్పత్తులతో డాక్టర్ జి.వి. కృష్ణరావుగారు రసవంతంగా తాము రచించిన ప్రధాన రచనల్లో ఆవిష్కరించిన ప్రధాన రచనల్లో ఆవిష్కరించిన సత్యం ఇదే.

# సాహిత్యవేత్తగా జి.వి.కృష్ణరావు

- నాగళ్ల గురుప్రసాదరావు

సాహిత్యవేత్త అనే సమాసంలో రెండు పదాలు వున్నాయి. మొదటి పదం సాహిత్యం, రెండవది వేత్త. వేత్త అంటే తెలిసినవాడు. అంటే జ్ఞాని అనిఅర్థం. మరి సాహిత్యం అంటే అర్థం ఏమిటి? మనదేశంలోని అలంకార శాస్త్రకారులు, పాశ్చాత్యదేశాలలోని విమర్శకులు సాహిత్యానికి నిర్వచనాలు చెప్పారు. అసలు మన అలంకార శాస్త్రాన్ని సాహిత్య శాస్త్రమని అంటారు. సాహిత్యం అనే పదానికి మేళనం అని అర్థం. ''పరస్పర సాపేక్షాణాం, తుల్యరూపాణాం యుగపథ్ ఏకక్రియా న్వయిత్వం సాహిత్యం'' అని మహాజనులు అన్నారు. పరస్పరము అపేక్షించేవి, సమానరూపంకలవి ఒకేపనిలో అన్వయం పొందటం సాహిత్యమని దీనికి అర్థం. మానవుడు రచించిన కావ్యంలో శబ్దము, అర్థము అటువంటి మేళనం పొందటం కనబడుతుంది. అంటే శబ్దార్థాలకు కావ్యంలో సాహిత్యం వుంటున్నది. అందువల్ల గౌణార్థంలో కావ్యానికి సాహిత్యమనే వ్యవహారం



రూఢికెక్కింది. శబ్దార్థాలు రెండు పరస్పరానుకూలంగా కలిసివుండే విద్య సాహిత్య విద్య అని కావ్య మీమాంసకర్త రాజశేఖరుడు అన్నారు. ఈ సాహిత్య విద్య పదిహేనో విద్యా స్థానమని, ఐదోవిద్యయని అతడు పేర్కొన్నాడు. ఆధునిక సాహిత్య సమీక్షకులు సహితము ''సుందరమైన రచనయు, సార్వజనీన ప్రయోజనముకలిగి భావనాత్మకమైన ఆహ్లాదమునిచ్చుచు కర్త యొక్క ఆత్మీయతను స్ఫురింపచేయుగ్రంథము కావ్యము. ఆ కావ్యజాలమే సాహిత్యము. ఆ సాహిత్యమొక కళ అని వక్కాణించారు. అదీగాక భారతీయాలంకారికులు సాహిత్యం గద్యపద్యరూపంగా వుంటుందని సాహిత్యాన్ని, కావ్యాన్ని పర్యాయపదాలుగా అంగీకరించారని మనంమర్చిపోకూడదు. ఈ సందర్భంలోనే మనంగుర్తుంచుకోవల్సిన ప్రధాన విషయం మరొకటి వున్నది. సాహిత్య తత్వవేత్త అంటే కావ్య తత్వవేత్త అని అర్థం. Dr. G.V. కృష్ణరావును ఈ అర్థంలోనే మనం సాహిత్యవేత్తగా దర్శింపగలుగుతాము.

ఆంధ్రదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి తెనాలి పట్టణం విస్మరింపరాని దోహదం చేసింది. Dr. G.V. కృష్ణరావు జీవితంలో నాలుగింట మూడువంతులు ఈ పట్టణంలో గడిపారు. రాజకీయ, సాంఘిక, సాహిత్య సిద్ధాంతాల సంరంభం తెనాలిలో ఎక్కువగా వుండేది. కృష్ణరావు గారి యౌవన దశలో ఈ సంరంభ భావ ప్రభావాన్ని మనం చూడవచ్చు.

అంతేకాకుండా 20వ శతాబ్ది పూర్వార్థంలో పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలు ఆంధ్రదేశంలో అధికంగా చెలామణి అయ్యాయి. ఆసిద్ధాంత వ్యామోహ ప్రవాహంలో కొట్టుకొనిపోయిన నవ్యులు భారతీయ సాహిత్య సిద్ధాంతాలను పట్టించుకోలేదు. అర్థం చేసుకోటానికి ప్రయత్నింపనూలేదు.

కృష్ణరావు గారు ఆ తెగకు చెందిన వారు కారు. వారు భారతీయ సాహిత్య శాస్త్రాన్ని పిండికొట్టినట్టుగా పరిశీలించారు. పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాల పరమార్థాన్ని కైవసం చేసుకొన్నారు. ఇంకా విశేషమేమిటంటే తాత్త్వికుడైన కృష్ణరావు మార్క్స్ సిద్ధాంతాలను, M.N.రాయ్ నవ్య మానవతా వాదాన్ని, ప్లేటో, హెగెల్, కాంట్‌ల తాత్త్విక సిద్ధాంతాలను, ఫ్రాయిడ్ స్వప్న సిద్ధాంతాలను, ఆచార్య 'నాగార్జుని' మాధ్యమిక వాదాన్ని చాలా లోతుగా అధ్యయనం చేశారు. అందువలనే కృష్ణరావుగారి సాహిత్య తత్త్వాన్వేషణ ఈ సర్వ సిద్ధాంతాల సమన్వయంతో పెనవైచుకొనిపోయింది. సాహిత్య పరమార్థ జ్ఞానం పరిపక్వమైనకొలది వారు మొదట తానే శిరోధార్యాలని చాటిన సాహిత్యసిద్ధాంతాలను తరువాత తరువాత తిరస్కరించారు. కృష్ణరావుగారి సాహిత్యనేతృత్వం సోపాన క్రమాన్ని స్ఫురింపచేస్తుంది.

శ్రీ కృష్ణరావు సాహిత్య తత్త్వాన్వేషణలో 'కావ్యజగత్తు' అనే రచన మొదటి మెట్టు. దీనిని కాశీహిందూ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేస్తున్నప్పుడు రచించారు. ఈగ్రంథం మార్క్స్ సిద్ధాంతాలనుండి జీవం పోసుకున్నట్టిది. దీనిలో, ''మానవుడు సంఘంనుండి విడివడి ఆలోచింపలేడు, సాహిత్య సృష్టిచేయలేడు'', అన్న తాత్త్వికబలంతో సాహిత్య సిద్ధాంత చర్చలు రూపుదాల్చాయి.

కృష్ణరావుగారు కళ కళకోసమే అనే వాదాన్ని త్రోసి పుచ్చారు. సింబాలిస్ట్ కవిత్వమంతా సాంకేతికమయమై చాలవరకు అర్థంకాని దైందని వారు నిర్ణయించారు. కళ అంటే ఇంద్రియాతీతజ్ఞానం అంటే వైయష్టి కానుభూతి ప్రకటన అంటే సౌందర్యం. సౌందర్యం అంటే కళ అని క్రోచె నాలుగు స్తంభాల ఆట ఆడతాడని పరిహసించారు. ఇక ప్యూచరిజం, దాజం ఆరాచక సిద్ధాంతాలకు సంబంధించిన సాహిత్య సిద్ధాంతాలు అని కృష్ణరావుగారు నిగ్గుతేల్చారు. సర్రియలిజం బోడితలకు, మోకాలికి ముడి పెట్టినట్లుగా, మార్క్స్ సిద్ధాంతానికి, ఫ్రాయిడ్ సిద్ధాంతానికి లంకెవేసిందని, అంతరాత్మకు అనుభూతిమీద పెత్తనం యిచ్చిందా అంటూ వారు ఈ అంతరాత్మను వ్యక్తిత్వం ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుతూవుంది, సాధారణీకరణం తొలగి పోతున్నది, పైగా ఈ సిద్ధాంతం కావ్య పరిమాణాన్ని తెలపటంలేదు, అని నిర్ణయించి, సర్రియలిజాన్ని తిరస్కరించారు.

కృష్ణరావుగారు కావ్య జగత్తును రచించేనాటికి కళనుగాని, కవిత్వాన్నిగాని సంఘం నుండి విడదీయటానికి వీలులేదని, మారే సమాజంతోపాటు భాషా, అనుభూతి, కావ్యము మారుతూ వస్తున్నాయని, సాంఘిక పరిణామాన్ని చారిత్రక భౌతిక సిద్ధాంతమొక్కటే వివరింపగలుగుతుందనీ అని గట్టిగా నమ్మారు. శబ్దం నశించదనే మీమాంసకుల స్ఫోట సిద్ధాంతాన్ని ఆదరించటానికి వీలులేదని బల్లగుద్ది చెప్పారు. ఫ్రాయిడ్ స్వప్న సిద్ధాంతాలకు భారతీయాలంకారికులు వివరించిన రసానుభూతికి ముడి పెట్టి, వారు, పాఠకుడు కావ్యజగత్తులో లీనా లీనావస్థను అంటే నిర్లిప్తతానుభూతిని పొందుతున్నాడని, ఈ స్థితే వేదన లన్నింటిని అణచి ఆనందంతో పరవశింప చేస్తుందని మనస్తత్వశాస్త్రాధారాలతో సిద్ధాంతీకరించారు.

''ఉత్పత్తి, సాధనాల సంబంధాలనుబట్టి సమాజం మారుతుంది. సమాజంతో సాహిత్యం, ధర్మం, నీతి మొదలైనవి మారుతాయి. ఉత్పత్తి సాధనాలు ఏ వర్గం వారిపరంలో వుంటాయో, కవిత్వం, నీతి, ధర్మం, సత్యం, భావం ఆ వర్గానికి సంబంధించినవిగానే వుంటాయి'', అనే మార్క్స్ సిద్ధాంతాలను సాధనాలుగా స్వీకరించి కృష్ణరావుగారు ఆంధ్ర సాహిత్య పరిణామాన్ని వివరించారు. ఆంగ్లేయ పరిపాలనా కాలంనాటి సామాజిక పరిణామాన్ని వెల్లడించి చివరికి వారు ''ఇప్పుడు ఏర్పడింది మధ్యతరగతి రావలసింది ప్రజాస్వామిక విప్లవం, సాహిత్యం ప్రజాస్వామిక విప్లవదోహదాన్ని కల్పిస్తూ, మధ్య తరగతి కోసం రాయబడాలి'' అని శాసించారు. కార్మికుల సంఖ్య ఆనాటికి మనదేశంలో తక్కువ అని భావించిన కృష్ణరావుగారు ''వారి జీవితాన్ని చిత్రించవచ్చును. కాని ఆదృష్టి సోషలిస్ట్ దృష్టిగా వుండటానికి వీలులేదు. కేవలం ప్రజాస్వామిక విప్లవ దృష్టిగా వుండాలి, అని అన్నారు. కావ్యజగత్తులో కృష్ణరావుగారు చారిత్రక భౌతిక సిద్ధాంతానికి, ప్రజాస్వామ్యానికి, సాహిత్యానికి, లంకె వేయాలని ప్రయత్నించారు. తదనంతరకాలంలో ఈ ధోరణిలో సాహిత్య తత్త్వాన్ని పరిశోధించటానికి వారు స్వస్తిచెప్పారు.

అక్కడి నుండి వారిసాహిత్యతత్త్వాన్వేషణలో రెండోదశ ప్రారంభమయింది. ఆదశ పరిపూర్ణంగా వారి కళాపూర్ణోదయ సిద్ధాంత ప్రబంధంలో సాక్షాత్కరిస్తుంది. కృష్ణరావుగారి సాహిత్య వేత్తృత్వంలో ఆనందవర్ధమని ధ్వని సిద్ధాంతం ప్రముఖంగా గోచరిస్తుంది. సాహిత్య సిద్ధాంతాలలో అనుల్లంఘనీయమైన దర్శనం ఏదైనా వున్నదంటే అది ధ్వన్యాలోకమే అని వారు ఒక సందర్భంలో పేర్కొన్నారు. ఫ్రాయిడ్ స్వప్న సిద్ధాంతాలు, ధ్వని సిద్ధాంతము ప్రకృతిని బట్టి ఒక కోటివే అని వారు సోదాహరణంగా వివరించారు. ఈవివరణ విధానం ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగిస్తుంది. వాస్తవానికి ఉత్తమ కావ్యంలో వాక్యార్థం ఒకటి,

విద్విలక్షణమైన వ్యంగ్యార్థం మరొకటి వుంటున్నట్లే, స్వప్నంలోకూడా వ్యక్తార్థం ఒకటి, అంతరార్థం మరొకటి ఉండును అని కృష్ణరావుగారు చెప్పారు. ఫ్రాయిడ్ చెప్పిన 'మేనిఫెస్ట్ డ్రీమ్' అంటే అభివ్యక్త స్వప్నం వాచ్యార్థంతో సమానం. అభివ్యక్త స్వప్నంలోని అంతరార్థం అంటే లేటెంట్ డ్రీమ్ కంటెంట్ కలగనే వాని జీవితాది ప్రకరణం తెలియనివానికి బోధపడదు. కావ్యంలో కూడా వాచ్యార్థం గ్రహించినంతమాత్రాన కావ్యాత్మ అర్థం కాదు. ప్రకరణం మొదలైనవి ఊహించగలిగిన సహృదయునికే అది అర్థం అవుతుంది.

కృష్ణరావుగారు రచనలను అనుభూతిని పురస్కరించుకొని నాలుగుభాగాలుగా విభజించారు. కొన్ని రచనలను కబుర్లు విన్నట్లువింటాం. శబ్దాలంకార ప్రధానమైన పద్యకవిత్వము, ఆ మూలాగ్రం చదివించటం ఒక్కటే విశేషంగా కలిగిన కథలు, నవలలూ, నాటకాలు, ఈ జాతిలో చేరతాయి. మరికొన్ని రచనల వల్ల మనశ్శైథిల్యం కలుగుతుంది. బాహ్య ప్రపంచం మరచిపోతాము. కాని తన్మయీభావం కలుగదు. తెలుగు ప్రబంధాల లోని కొన్ని ఘట్టాలు, పాఠకుల వ్యక్తిత్వాలను మరపింపకుండా చదివించే కథలు, నవలలూ, నాటకాలు ఈ కోవలోకి చేరుతాయి. ఇక మూడోజాతి రచనలు సమాధ్య వస్థను కల్పించి అహంతను లయింప చేసి, పాత్రలలో సన్నివేశాలలో వర్ణనీయార్థాలలో పాఠకుడు దాదాపుగా లీనమయ్యేటట్లు చేసి వేస్తాయి. కాళిదాసు కావ్యాలు, సంస్కృతనాటకాలు, వేలూరి శివరామశాస్త్రిగారి డిప్రెషన్ చెంబు మొదలైన కథలు ఈ తెగ క్రిందికి వస్తాయి. నాలుగో జాతిరచనలు పాఠకునకు తన్మయీభావం కలిగించి చివరకు విషయరహితమైన సమాధ్యవస్థ కలిగిస్తాయి. కవిత్రయ మహాభారతం దీనికి తార్కాణం. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో ఒక ప్రకరణలో ''శబ్దార్థశాసన జ్ఞానమాత్రేణైవనవేద్యతే, వేద్యతే సహికావ్యార్థ తత్త్వజ్ఞై రేవ కేవలమ్'' అనివక్కాణించాడు. వ్యాకరణము, నిఘంటువు గ్రహించినంతమాత్రాన కావ్యార్థం అవగతం కాదు. కావ్యతత్త్వవేత్తలకే అంటే సాహిత్యవేత్తలకే అది బోధపడుతుంది. Dr. G.V. కృష్ణరావు అటువంటి సాహిత్యవేత్త.

(ఆలిండియా రేడియో, విజయవాడ వారి సౌజన్యంతో)

# డా. జి.వి. కృష్ణరావు సాహితీ వ్యక్తిత్వం

అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

మనిషి తన చరిత్రను తాను సృష్టించుకొంటాడు. తాను సృష్టించుకొన్న ఈ చరిత్రకు వెలుపల అతడు ఏమీకాడు. అతనికి అర్థం ఉండదు, అంటే మనిషి ఎలాగో పుడతాడు, అంటే అస్తిత్వంలోకి విసరివేయబడతాడు. అలా విసరివేయబడి తరవాతే అతడు తనకు తాను అర్థం కల్పించుకొంటూ, చరిత్రను సృష్టించుకొంటూ, తనను తాను అధిగమిస్తూ, తాను ఏమిగా మారదలచుకొన్నాడో, తయారవ్వాలనుకొన్నాడో, అలా తయారయ్యే దశలో ప్రగతిస్తూ ఉంటాడు. ఏ దిశలో ప్రగమించాలి? ఏ అర్థాలు తన జీవితానికి కల్పించుకోవాలి? అనేది అతని నేపద్యం, వారసత్వం, పరిసరాలు, మనశ్రమ, పట్టుదలలపై ఆధారపడి ఉంటుంది.

అలా అస్తిత్వంలోకి 1914లో విసరివేయబడిన ఓ వ్యక్తి గవిని వెంకట కృష్ణరావు అతడు సాహితీ ఆకాశంలో తన జీవన తారను మిల మిల మెరపింపజేశాడు. తన సాహితే శిల్పాన్ని చెక్కాడు గీచాడు. ఆ గీతల క్రమాన్ని మీ ముందుంచుడమే ఈ ప్రసంగధ్యేయం.



డా. జి.వి. కృష్ణరావు తెనాలి ప్రక్కనే ఉన్న కూచిపూడిలో జన్మించినా, ఆయన జీవితంలో అధికభాగం తెనాలిలోనే గడిచింది. తెనాలి నేపధ్యాన్ని అతడు నిశ్వసించాడు. తెనాలి ఆరోజుల్లో ఒక సాహిత్య కేంద్రం. ఒక కళాకేంద్రం ఒక రాజకీయ కేంద్రం. ఒక నాటకరంగస్థలి. ఒక చైతన్య కేంద్రం. ఏ ఉద్యమం ప్రపంచంలో ఎక్కడ మొదలైనా దాని గాలి తెనాలిలో వీచేది.

కృష్ణరావుకు అటువంటి తెనాలిలో, గోపీచంద్‌తో పరిచయమేర్పడి అది స్నేహంగా పరిణమించింది. గోపీచంద్ ప్రభావంతో పాశ్చాత్య సాహిత్యం. మనోవిజ్ఞానం తలమునకలు వేశాడు జి.వి. కృష్ణరావు. ఆధునిక సాహిత్య రీతులు, విమర్శ, ప్రక్రియలను గోపీచంద్ ద్వారానే అలవర్చుకొన్నాడు. పనిలో పనిగా మార్క్స్‌ను, యమ్. యన్. రాయ్‌నీ పరిచయం చేసిందిగూడ గోపీచందే.

''అప్పటిదాక మూఢదేశభక్తిలోపడి కొట్టుక పోతున్న నేను కళ్ళు తెరచాను. నిర్దిష్ట రాజకీయ లక్ష్యం లేని నాకు కొత్త వెలుగు గోచరించింది'', అని ఆయనే చెప్పుకొన్నాడు.

తెనాలిలో అప్పుడున్నది గోపీచంద్ ఒక్కడేకాదు. చక్రపాణి, కొడవటిగంటి లాంటి దిగ్గంతులు చాలమంది ఉన్నారు. వీరంతా ఒక మందులు షాపులో కూర్చొని సాహిత్య విమర్శ చేస్తూ ఉండేవారు ఆకాలంలోనే కొన్నికథలు, ఏకాంకికలు రాశారు. ఆస్కార్ వైల్డ్ 'సలోమిని' 'సునీథ' అన్న పేరుతో అనువదించారు.

డిగ్రీ పుచ్చుకొన్న ఆయనకు ఉద్యోగవేటలో నిరాశఎదురై దారీతెన్నూ తోచని సమయంలో, ఏడు రోజులనుంచి బిక్షదొరకని వ్యాసుడు శాపజలాన్ని అందుకొని, చలితాధారుడై కంపిత కంఠంతో, ''మా భూ త్రైపూరుషి విద్యా, మా భూ త్రైపూరుషకుధానమ్, మా భూత్రై పూరుషీ భక్తిః'' అని శపించబోతున్న మూర్తి ఆయన కన్నుల ముందు నిలువెత్తుగా నిలబడింది. రెండు రోజులు అదేమూర్తి, కన్నుతెరచినా, కన్ను మూసినా. ఆ సాక్షాత్కారమే భిక్షాపాత్ర. ప్రతిపత్తిక వలదన్న ఆ భిక్షాపాత్ర 1953లో ఆంధ్ర విశ్వవిద్యాలయ రంగస్థలిమీద, ప్రయోక్త కూర్మావేణుగోపాల స్వామి, అప్పటి రిజిస్ట్రారు, నేతృత్వంలో ప్రదర్శితమైంది. 5000ల మంది దానిని తిలకించారు. ఆ తరువాత అది పదుహారు జాతీయ భాషలలోకి అనూదితమై రేడియో నాటికగా ప్రసారితమైంది. ఈ నటికలో''



'కావ్య జగత్తు'లో ఆయన భరతుని నుంచి పండితరాయలుదాక, ప్లేటో నుంచి మార్క్స్‌దాక మహామనుషుల సూక్తులను ప్రామాణికంగా ఉదహరించి, 'కావ్యవస్తు రూపం' ఎలా పరిణామం పొందుతుందో మార్క్సిస్టు దృక్పథంతో వివరించారు. ఫ్రాయిడ్ స్వప్న శిల్పాన్ని ధ్వని సిద్ధాంతంతో ముడివేశారు. తరవాత మార్క్సిస్ట్ దృక్పథంనుంచి విముక్తులయ్యారనుకోండి. ఈ 'కావ్యజగత్తు'ను M.A. వారికి ఉస్మానియా విశ్వవిద్యాలయం పాఠ్యగ్రంథంగా ప్రవేశపెట్టింది అప్పట్లో

దూర దృష్టి లేక. భారతజాతికి చాతుర్వర్ణ్యం విధించాను. రాబోయేతరాల వారికి ఈ వర్ణ ఉక్కు చట్రం నుంచి బయటపడే వీలు లేకుండా చేసాను. బీదలకు ద్రోహం చేసే కర్మ సిద్ధాంతాలను అవతారవాదాన్ని బోధించి వారిచే దాస్యం అంగీకరింపచేశాను. ఇక భారతజాతికి నిష్కృతి లేదు'' అంటూ వ్యాసుడు వాపోయాడు.

''మార్క్స్ చెప్పిందానికి తల ఊపాను. రాయ్ చెప్పిన దానికి తల ఊచాను. ఎవరు ఏది చెప్పినా, 'డు' 'డు' బసవన్నలా, తల ఊపేవనేనా? గంగిరెద్దుకు నాకూ తేడా ఏమిటి? నేనింతకాలం పేడబొమ్మలను పెట్టుకొని పూజిస్తున్నానా?'', అని ఆయన

తన్ను తాను ప్రశ్నించుకొన్నాడు. ''తద్విజిజ్ఞాసస్వ'' అన్న వాక్యం ఆయన హృదయ కుహరంలో ప్రతిధ్వనించింది. తాత్విక చింతన లేక స్వతంత్ర విచారధార పొడుమదని, గ్రహించి, తత్త్వ శాస్త్రాలను మధించాడు.

కళాపూర్ణోదయం పై ఆయన సిద్ధాంత వ్యాసాలకి డాక్టరేట్ ఇవ్వడం జరిగింది. కట్టమంచివారు అంతకు ముందే కళాపూర్ణోదయం పై కొన్ని తీర్పులు ప్రకటించారు. కట్టమంచివారి తీర్పులే తుది తీర్పులు కావని ఫ్రాయిడియన్ మనో విశ్లేషణ శాస్త్ర చికిత్సతో, కొత్త అందాలను లోతులను వెలికి తెచ్చాడు, కృష్ణరావు.

కలకాలం తెలుగులో నిలిచే నవలలు ఏవి? అనే ప్రశ్నకు, ఆ చంటి జానకి సమాధానంగా, మాలపల్లి, ఏకవీర, కీలుబొమ్మలు, చివరకు మిగిలింది, అ సమర్థుని జీవయాత్ర, అల్పజీవి ఇవి ఎల్లకాలం నిలుస్తాయని తేల్చారు.

పత్రికలన్నీ కీలుబొమ్మలను ప్రచురించ నిరాకరించాయి. తెలుగు స్వతంత్రంగాబోలు ప్రచురించింది. దీనికి తెలుగులో రెండు నాటకీకరణలు వచ్చాయి. కన్నడంలోకి అనూదితమైంది. ఈ మధ్య అంటే మూడు నాలుగు నెలల క్రితం పపెట్స్ అనే పేరుతో మాక్‌మిలన్ కంపెనీ ఆంగ్లంలో ప్రకటించింది.

స్వాతంత్ర్యం అంటే ఏమిటి? మానవుడు దానిని ఎలా కోల్పోతున్నాడు? తిరిగి
300 దానిని సాధించే మార్గమేమిటి? వ్యక్తుల కర్తవ్యం ఏమిటి? ఈ జిజ్ఞాసను రేకెత్తించడమే కీలుబొమ్మలు లక్ష్యం.

1947లో రాయ్, మార్క్సు సిద్ధాంత వైఫల్యాన్ని నిరూపించేసరికి అంతకుముందు మార్క్సు తత్వంతో ప్రభావితుడైన కృష్ణరావు సమాలోచనాశక్తికి, కొరడా దెబ్బ తగిలింది. ఇహ అక్కడనుంచి గోపీచంద్‌తో కలిసి ప్రాక్పశ్చిమ తత్త్వవేత్తల్ని ప్రశ్నించడం మొదలుపెట్టాడు. ఫలితం ప్లేటో, అరిస్టాటిల్, కాంట్, హెగెల్‌లను తెలుగులో పరిచయం చేయసంకల్పించారు. ప్లేటో, కాంట్‌లు మాత్రమే వచ్చాయి. కాలేజీలో ఉపన్యాసకులుగా పనిచేసే రోజుల్లో మాధ్యమిక వాదం మీద కుతూహలం కలిగి, అతికష్టంతో నాగార్జున కృతులను తీసుకొచ్చి అనువదించారు. అయితే అవన్నీ దొంగలపాలైనవి. నాగార్జునుని విగ్రహవ్యావర్తనిని మాత్రం తిరిగి విపుల వ్యాఖ్యతో అనువదించి, ప్రచురించారు. ఈ సమయంలోనే ప్లేటో రిపబ్లిక్‌ని ఆదర్శరాజ్యంగా సెంట్రల్ అకాడెమీ అనువదింప జేసింది.

ఆయన చివరి రచన ''బొమ్మ ఏడ్చింది.'' 1973లో వచ్చింది. ఇందులో, మతానికి రాజ్యానికి సంబంధం ఏమిటి? రాజ్యం మత విషయాలలో జోక్యం చేసుకోవచ్చా? వ్యక్తి జీవితాన్ని రాజ్యం ఏమేర ప్రభావితం చేయవచ్చు? స్వేచ్ఛ, స్వాతంత్ర్యం,

ప్రజాస్వామ్యం, లౌకికవాదం, అసమ్మతి హక్కు, విప్లవం, మహాకరుణ అంటే బుద్ధీకరుణ పై నాగార్జునాచార్యుని అభిప్రాయాలు ఏమిటి? - అనే ప్రశ్నలను అంటే ముఖ్యంగా అటువంటి విలువలను దృష్టిలో ఉంచుకొని బొమ్మ ఏడ్చింది'' అనే నాటకాన్ని రాశారు. ఇంతకు ఆ ''బొమ్మ ఎవరు? ఎందుకు ఏడ్చింది. శాంతి, దాన, వీర, క్షాంతి, ధ్యాన, ప్రజ్ఞలనే షట్పారమితులే బౌద్ధుల ఆరాధ్యదేవత అయిన షట్పారమితాదేవి: ఆషట్పారమితా దేవే ఆ బొమ్మ. ఆ ఆరు పారమితులు దేశంలో లోప్తమైనప్పుడు, వాటికి క్షోభ కలిగినప్పుడు, ఆ బొమ్మ ఏడుస్తుంది.

గౌతమీ పుత్రశాతకర్ణికి తల్లి లౌకికతత్వాన్ని బోధిస్తుంది. నాయనా, నీకేది కావాలో చెప్పు. అంతర్ముఖులకు మతం కావాలి. బహిర్ముఖులకు రాజ్యం కావాలి. రాజ్యంలో ఒకేమతం, ఒకే ఆదర్శం ఉండాలనే లేదు. మన రాజ్యం సంకుచితం కాదు. భిన్న మతాలుంటాయి. వీటన్నింటిని అణచడం సాధ్యమా? నిన్ను బౌద్ధం స్వీకరించమనడం లేదు. మత తత్వం, దురవగాహణం, రాజులుదాని జోలికి పోరాదు. ఉపేక్ష వహించాలి. ద్వేషంతగదు. ఉపేక్ష పాపంకాదు.

ఇక నాకు జి.వి.కె. తో అత్యంత సాన్నిహిత్య సంబంధం దాదాపు పాతిక సంవత్సరాలు పాటు ఉంది. ఆయనతో నేను అప్పుడప్పుడు జరిపిన సాహితీ సంభాషణలనుంచి నేను గ్రహించిన ఆయన సాహితీ తత్వాన్ని ఇప్పుడు ఆవిష్కరిస్తాను. 

ఆయన మధ్య తరగతి లేదా దిగువ మధ్య తరగతికి చెందినవాడు. ఆయన మధ్యతరగతి తత్వం పాపికొండలు, ఉదబిందువులు, కీలుబొమ్మలలో ప్రదర్శితమైంది. ఆయన ''మధ్యతరగతి నీతిని'' ''మిడిల్ క్లాస్ మొరాలిటీ''ని రాడికల్ హ్యూమనిస్టు మానకలశంతో గ్రహించి, వాటిల్లో మానవ పార్థాన్ని ప్రతిపాదించాడు.

కృష్ణరావుగారి ఉద్దేశంలో, రయితను రచనకు పురికొలిపే ప్రేరకం సార్వత్రికంగా ఏ ఒకటీకాదు. ఒకటి ఒకరిని ప్రేరేపిస్తే, వేరొకటి వేరొకరిని ప్రేరేపిస్తుంది. మొత్తంమీద రచయితకు అనుభవం ముఖ్యం. అనన్యమైన అనుభవాన్ని రచయిత పొందినప్పుడు, అది అతనిని రచనోన్ముఖుని చేస్తుంది. కాని రచయితఅయినవాడు, ఈ అనుభవాన్ని యథాతథంగా చిత్రించాడు. అవ్యక్తకాన్ని విషయం - లేటెంట్ డ్రీమ్ కంటెంట్నుంచి వ్యక్త స్వప్నం బిఫెస్ట్ డ్రీమ్ కంటెంట్ - ఎలానిష్పన్నమవుతుందో, అలా 'వైచిత్రి'తో రచయిత అనుభవం నుంచి రచన ఉప్పతిల్లుతుంది. ఆత్మాభివ్యక్తీకరణ లాలస రచనకు దోహదం చేస్తుంది. రచయిత తన వైయక్తిక పరిమితులను అధిగమించి, అనుభవాన్ని సాధారణీకరిస్తాడు. ఆత్మాభివ్యక్తీకరణేచ్ఛ ఎందుకు కలుగుతుంది? అది ఉద్బోధకం.

పరిచ్ఛిన్నమైన, వ్యక్తిగతమైన, జీవితాన్ని దాటి, పరిచ్ఛిన్నమైన సార్వజనీనతను చేరవలెననే తపన రచనకు గలహేతువు. ఆత్మ సాత్కృతి గావించుకోవాలనే దాహం రచయితకు కారణం.''

మరి ఇంతవరకు చెప్పింది అందరికీ వర్తించేదే. కాని కృష్ణరావుకు వర్తించేది ఏమిటి? ఆయనకు సమాజం సమస్యాగ్రస్తం, దానిని పరిష్కరించాలి. ఎక్కువమంది పరుల ఆలోచనా విధానాలను, వారి ఊత పదాలను, నినాదాలను వినివిని, గాను గెద్దుగాడిలో పడి, అవి తమ స్వంతాలే అని భ్రమ పడతారు. అటువంటి గానుగెద్దు ఒరవడి నుంచి భ్రాంతి నుంచి, వారిని మేల్కొల్పాలని, ఆయన ఆవేదన. ఇది ఆయన రచనకు ప్రేరకం.

సాహిత్యానికి ధర్మానికి ఆయన దృష్టిలో తేడా ఇలా ఉంటుంది. లోకం కోసం ఏడిస్తే అది కవిత్వం, తన కోసం ఏడిస్తే అది స్వార్థం, తనకోసం లోకం కోసం ఏడిస్తే అది ధర్మం, రెండింటికోసం ఏడ్చినట్లు నటిస్తే, అది రాజకీయం'

కొంతమందికి, జీవితం, కళ, వేరు, వేరు. కాని కృష్ణరావుకు అవి రెండు వేరువేరు కావు. జీవిత ప్రవాహానికి ఆద్యంతాలు లేవు. అదిసాపేక్షం. అనంతసంసారాన్ని అర్థం చేసుకోవటానికి మరొకటి' కావాలి. పైగా అది వైయక్తికంకాదు. ఆద్యంత సుసాతమై నిరపేక్షమై స్వప్రకాశమై తృప్తినిచ్చే 'జీవితశకలమే' కళ. సాహిత్యం సమాజానికి దర్పణమూకాదు, అనుకరణమూ కాదు. అది ఇంద్రజాలమూ కాదు. ''ఇలా ఉంటుంది. ఇలా ఉండదు,'' అని చెప్పడానికి వీలులేనిది. జీవితపు విలువలను నిర్దేశించి వెలుగునిచ్చేది కళ. దీని పరమార్థం నిరవధిక మధురానుభూతి – పరిమితులు లేని నిర్లిప్త సుఖం – ఆనందం.



కృష్ణరావు తన రచనల ద్వారా దర్శింపజేసిన జీవితార్థాన్ని గురించి నేను ఇలా అంటాను: జీవితాన్ని సహజంగా చిత్రించడం ఎవరికీ సాధ్యం కాదు. మనిషి, సహకార, సానుభూతులతో, బుద్ధకరుణతో జీవించాలి. 'దృష్టి లేక సృష్టి లేదు' మంచి చెడుగులు లేక కవిత్వం లేదు. మాటల గారడీలో పడి, రోకంటి పాటలను తమ స్వతంత్ర ఆలోచనలుగా ఎంచి, బానిసగా స్వతంత్ర విచారధారను మనిషి కోల్పోయి, బ్రతుకుతున్నాడు. అలాగై కూడ తాను స్వతంత్రజీవితాన్ని సాగిస్తున్నాననే భ్రమకు మనిషిలో నవుతున్నాడు. ఈ పంచన నుంచి విముక్తి కలుగచేయడం రచయిత ధర్మం. దీని కోసమే డా. జి.వి. కృష్ణరావు తన రచనా వ్యాసంగాన్ని సాగించాడు.

(ఆకాశవాణి. హైదరాబాద్ వారి సౌజన్యంతో )